# శ్రీ హరనాథ భాగవతము

## (గద్యకావ్యము)

చేబోలు చిన్మయబ్రహ్మకవి, ఎమ్. ఏ.



ప్రకాశకులు;

శ్రీ కుసుమహరనాథాశ్రమము

దువ్వాడ

# శ్రీ లక్ష్మణయతి

ప్రేమమయుడైన భగవానుడు ప్రేమకే వశుడు. ప్రేమతత్త్వాన్ని నిరూపించటమూ, వ్యాఖ్యానించటమూ, ప్రేమామృతంలో సమస్తాన్నీ కరిగించి వెయ్యటమూ, ఇదే శ్రీ కృష్ణావతార లక్ష్యం.

ఆత్మధర్మం ప్రేమ.

"యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత!

అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్"

అన్నచోట ధర్మంఅంటే ప్రేమఅనీ, అధర్మం అంటే ప్రేమకు విరుద్ధాలైన రాగద్వేషాలు అనీఅర్థం. ఆత్మధర్మమైన ప్రేమ విలుప్తమై, అసహజములూ, దుష్టములూ అయిన రాగద్వేషాలు పెచ్చుపెరిగినప్పుడు తన్నుతాను సృజించుకుంటాను – అవతరిస్తాను – అనిచెప్పాడు పరమాత్మ.

ఇక్కడ ధర్మంఅంటే ప్రేమఅనే ఎందుకు చెప్పాలి? అన్నిఅధర్మాలకూ, అకృత్యాలకూ మూలం ప్రేమయొక్క అభావమే. ప్రేమఉన్నచోట అధర్మానికీ అక్రమానికీ తావులేదు.

ప్రేమ అనితప్ప మరొకఅర్థం విమిచెప్పినా అది సాపేక్షమౌతుంది. నిరపేక్షంగా చెప్పాలంటే, ధర్మానికి ప్రేమ అన్నదే సరిఅయిన అర్థం.

ప్రేమమయుడైన భగవానుణ్ణి ప్రేమిస్తూ, ప్రేమపూర్ణులై ఉండేవారే సాధువులు. సాధుపరిత్రాణం కొరకు అన్నా, ప్రేమతత్త్వ పరివ్యాప్తికొరకు అనేఅర్థం. "వినాశాయచ దుష్కృతాం" అన్నచోటమాత్రం కొంతభ్రమకు అవకాశం ఏర్పడి, "దుష్కృత్యాలు చేసినవారిని నశింపజెయ్యటానికి" అనటంవల్ల రక్తపాతస్ఫూర్తి ఉన్నదనీ, అదిప్రేమతత్త్వానికి విరుద్ధ మనీ భావిస్తున్నారు కొంతమంది.

క్రుళ్ళిపోయి, విపత్కరంగా పరిణమించిన శరీరభాగాన్ని శస్త్రచికిత్స చేసి తొలిగించే వైద్యుని కత్తికిఅంటిన నెత్తురు రక్తపాతానికీ, ద్వేషానికీ సూచనఅయితే ఇదీఅంతే. అశుద్ధపదార్థంతో అంగీనిమలినం చేసుకున్న పసివాడు ఆ అంగీవిప్పబోతే ఏడుస్తాడు; విప్పనీయకుండా మెలికలుతిరిగిపోతాడు. బలవంతంగా ఆ అంగీనివిప్పి, వీలుచిక్కకపోతే చింపివేసి, పసివానిదేహం కడిగి, శుద్ధిచేసి, చంకకెత్తుకొనే తల్లియొక్కగాని, తండ్రియొక్కగాని చర్య ద్వేషప్రయుక్తం అనగలిగితే – ఇదీఅంతే.

శ్రీకృష్ణునిచేత సంహరింపబడింది అనుకుంటున్న ఆ శరీరమే పూతన, ఆ శరీరమే కంసుడు అనుకోనేవారు అనవలసిందిగాని, వివేకులు అనవలసిన మాటకాదు అది. కాని, అలా ఎవరూ అనరు.

శ్రీ కృష్ణావతారం పరిపూర్ణ ప్రేమావతారం.

వ్రేపల్లెలో వెలసి, వెదురుముక్క – పిల్లనగ్రోవి - తో ప్రేమామృతాన్ని వెల్లివిరియజేసి, సమస్తాన్ని ముంచెత్తిన ఆ కన్నయ్యే గౌరాంగ ప్రభువుగా, అనంతరం హరనాథప్రభువుగా అవతరించి సర్వప్రపంచాన్ని నామామృత వాహినుల్లో, ప్రేమసందేశ తరంగిణుల్లో ఓలలాడించారు. శ్రీకృష్ణుడే గౌరాంగుడు; గౌరాంగుడే హరనాథుడు -

శ్రీకృష్ణుని హ్లాదినీ శక్తి రాధ. రాధాకృష్ణులకు అభేదం. అలాగే కుసుమ హరనాథులకూ. ఏకతత్త్వం – రాధాకృష్ణ తత్త్వం-యుగళరూపంలో కుసుమ హరనాథులుగా అవతరించి, లోకాన్ని అనుగ్రహించింది. ఈయుగళమూర్తి ప్రేమామృతంలో మునిగితేలి, తామూ ప్రేమమూర్తులై, ప్రేమామృతాన్ని ప్రజాహృదయ కేదారాల్లోకి మళ్ళించే పంటకాలువల వంటివారెందరో మహానుభావులు. శ్రీ కుసుమ హరనాథ యుగళ హేలకూ, అట్టి మహాభాగవత లీలకూ పట్టిన అద్దమే " ఈ "శ్రీ హరనాథ భాగవతం." ఆ మహారాస లీలకు అద్దంపట్టగలిగిన అదృష్టశాలి శ్రీ చేబోలు చిన్మయ బ్రహ్మకవి. మధురాతి మధురమైన ఈ భాగవత రచనకు "మధురకవి" "అభినవ పోతన" శ్రీ చిన్మయబ్రహ్మకవికంటె అర్హులు ఎవరు?

జయ శ్రీ కుసుమహర

# శ్రీ హరనాథ భాగవతము

## ఉపోద్ఘాతము

వేదములను విభజించి పదునెన్మిది పురాణములనురచించి బ్రహ్మ సూత్రములను సృష్టించి వేదవ్యాసుఁడపర నారాయణుడయినాఁడు. అయినను ఆ మహాగ్రంథకర్తకు మనశ్శాంతి లేకపోయెను. నిరంతర నారాయణ స్మరణానందుఁడగు నారదుఁడీలోపమునకుఁ గారణము మనసార నోరార హరి గుణగానము చేయకపోవుటయే యనియు - తరించి లోకమును తరింపఁజేయుటకై యొకయుత్తమ గ్రంథమును వ్రాయుమని కోరెను. తానొక మహాపండితుఁడు - జ్ఞానియను భావనను మఱచి - హరి కరుణను పొందుటకై పరమార్తితో వ్యాసమునీంద్రుఁడొనర్చిన మహాభాగవతము - హరి గుణ గానకథాలవాలము. "యజ్ఞయాగాదులచే జపతపములచే నిష్ఠానియమములచే హరిని పొందుట సాధ్యముగాదనియు - కేవల ప్రేమభావముచే హరిని స్మరించుట చేతనే ఆ లీలామయుఁడు లభించును" అను పరమసత్యమును ఈ గ్రంథరాజము బోధించుచున్నది. సంస్కృత భాగవతమును తెనిఁగించి పోతన మహాకవి - మహాభక్తుడగుటచే తెలుఁగువారికి ఆధ్యాత్మికముగా సాహితీపరముగా మహోపకారము చేసినాఁడు.

భగవంతుఁడు కాలానుగుణముగా ఎన్నెన్నో అవతారము లెత్తుచుండును. శ్రీహరి మనదేశముననే పలుమాఱవతరించుట యనునది మన భాగ్యము !! కలియుగమున మహాపాపములచే క్రుంగి హీనాతిహీన జన్మలనెత్తి బాధపడు జీవులనుద్ధరించుటకై నవరసభావమూర్తి- దాక్షిణ్యమూర్తియగు కృష్ణప్రభువు పదునైదవ శతాబ్దమున గౌరాంగ ప్రభువుగా

ఇది చెరకుతో పోల్చటానికి మనసొప్పదు - అందులో రసం ఎంత ఉన్నా, పనికిమాలిన పిప్పికూడ కొంత ఉంటుంది. ఇది పకిటిబెల్లం వంటిది - మొత్తం ఆస్వాద్యమే. విడువలసిన భాగం అల్పాల్పం కూడా ఉండదు.

విషయమునకు తగిన ఉదాత్త శైలిలో నడిచింది రచన.

శ్రీహరనాథ భాగవతం రచించారు శ్రీ చిన్మయ బ్రహ్మకవి అంటే, ఆ వెనుక దువ్వాడ కుసుమహరనాథాశ్రమ నిర్వాహకులు శ్రీ పుట్టా వేంకట్రావుగారు ఉన్నారు. ఈ రచన పూర్తి అయ్యేవరకూ తాము విశ్రమించ లేదు; శ్రీ చిన్మయ బ్రహ్మకవిని విశ్రమించ నీయలేదు శ్రీ వేంకట్రావుగారు. ప్రచురణకూ వారే మూలం. అయితే ఇన్నిటికీ మూలకారణం శ్రీ కుసుమ హరనాథ యుగళమూర్తి అనుగ్రహం - ఆ అనుగ్రహంపొంది. ఈ ఉదాత్త గ్రంథ రచనకూ ప్రకటనకూ నిమిత్తమాత్రులై ఆంధ్రుల కృతజ్ఞతకు పాత్రులైన శ్రీ చిన్మయ బ్రహ్మ కవినీ, శ్రీ వేంకట్రావుగారినీ అభినందన పురస్సరంగా ఆశీర్వదిస్తున్నాం. సర్వదా ఈ గ్రంథరసాస్వాదనచేసి శ్రీ కుసుమహర యుగళమూర్తి అనుగ్రహపాత్రులౌదురుగాక - ఇతిశం.

లక్ష్మణయతి

నవద్వీపములో నవతరించినాఁడు. తాను జగదేక పండితుడైనను పాండిత్యము వలన శ్రీహరిని పొందలేమనితలచి పరమోత్కృష్టమైన మధుర హరినామమును స్మరించుచు ఆ నామామృతమును ప్రజలందఱకు పంచుటకై సన్న్యసించినాఁడు. ఆమహానామ ప్రచారకుని భక్తిప్రేమ ప్రవాహములో ఆబాల గోపాలము ఓలలాడినారు., సంసారమునుండి తరించినారు. ఆప్రభుని చైతన్యస్ఫూర్తిలో తాయిరప్పలుగూడ హరినామమొనర్చినవి.

ఆ చైతన్య ప్రభువే, వంగదేశమున సోనాముఖిలో - ప్రేమాధినాథుడఁగు ఠాకూరు హరనాథుఁడుగా నవతరించి యున్నాఁడు. ఈ సత్యమును శ్రీ హరనాథప్రభువు "From hundred years ago I Came here as Gauranga (Caitanya). Now you see me as Haranath" అను వాక్యములో ప్రపంచమునకు తెలియపఱచినాఁడు. పాపి - పుణ్యుఁడు - మూర్ఖుఁడు - పండితుఁడు - నిఱుపేద - ధనవంతుఁడు - కులహీనుఁడు - స్త్రీలు - పురుషులను విచక్షణలేకుండ అందఱిని ప్రేమించి వారి హృదయములను ప్రేమమయములొనర్చి - సంసార సమస్యలను అవలీలగాఁ బరిష్కరించుచు "మీ పాపభారములను నామూపునఁబెట్టి హాయిగా భగవన్నామము చేయుఁడు. మిమ్ములను బృందావనికితోడ్కొని పోఁగలను"ని హెచ్చరించుచు - తోడునీడగా - తల్లిగా - తండ్రిగా సర్వమై ఆదరించుచు - ఆదుకొనుచు - ప్రాపంచిక వ్యామోహములో మునిఁగి తేలువారిని తనవైపునకు త్రిప్పుకొనుచున్న శ్రీహరనాథుని అవతారము అసాధారణమైనది. దుష్టశిక్షణచేయక - వారిమనస్సులను భగవంతుని వైపునకు మఱల్చుచు - స్వల్పకాలములోనే వారిని భగవత్ప్రేమోన్మత్తులుగాఁ జేయునీప్రభుని కృప - అపారమై అఖండమై - అనిర్వచనీయమై అలరారుచున్నది. ఇట్టియవతారము మున్నెన్నడును వచ్చియుండలేదు.

ఎందరెందరో నాస్తికులు- పతితులు - దీనులు - దిక్కుమాలిన వారు - పాపులు తమ ప్రయత్నము లేకయే ఆ స్వామిచే చిత్రముగా ఆకర్షింపబడి నేఁడు మధురాతిమధురమైన ఆదర్శ జీవితములను గడుపుచున్నారు. తనవారిని తాను ఎన్నుకొనుటలో ఈ ప్రభువు చూపు లీలలు అత్యద్భుతములేకాదు .... భావనామనోజ్ఞములు - అనంతములు. ఆకాశము నందలి తారకలనైనను - ఇసుక రేణువులనైనను లెక్కింపవచ్చునేమోకాని విశ్వవ్యాప్తమై వివిధరంగ ప్రవృత్తమై - మనోబుద్ధుల కతీతమై మహామహిమాన్వితమైన హరనాథ ప్రభుని జీవితమునుగాని - లీలాకాండనుగాని హరనాథ భక్తచరిత్రమును వ్రాయబూనుట యెవ్వరికిని సాధ్యముగాని పని. జీవిత లక్ష్యమును బోధించి - కర్తవ్యమును సూచించి - జీవిత భాగస్వామిగా తనకుఁదానైకోరి మహోన్నత గోలోక ధామమునువీడి వచ్చిన యీ ప్రేమాధినాథుని గూర్చి అందఱును తెలిసికొనవలసి యున్నది. ఈ దీనదయాళుని ఆశ్రయించి యీ సంసార తాపత్రయములకు దూరమై - నామానందపీయూషమును గ్రోలుచు జన్మను తరింపఁజేసికొనవలసి యున్నది, ఏశ్రమయు లేకయే హరిని జేర్చఁగల నాయకుఁడు మన చెంగటనే యుండగా - వేతెవ్వరిని ఆశ్రయింపబనిలేదు. మంచితరుణము - మించిన దొరకదు. వాదోపవాదములకు దిగక ఈ ప్రేమరత్నాకరుని పర్యవేక్షణలో మనమందఱము నిర్భయులమై ప్రేమానందులమై జీవించఁగలము.

ఈనాఁడు భారతదేశముననేకాక - తదితర దేశములయందు - ప్రాంతములయందు సైతము హరనాథ భక్తులున్నారు. ఈ విశిష్టత ప్రభుని విశ్వప్రేమకు ప్రబలనిదర్శనము.

మాయామయమగు సంసారమున మున్గితేలుచు - దారితెలియక అల్లాడిపోవు వారికేదో రూపముగా దర్శనమిచ్చి - సంపూర్ణమైన విశ్వాస

మును భక్తిప్రేమలను గలుగఁజేసిన హరనాథుని లీలలు - లక్షోప లక్ష లున్నవి. ఒకే కాలమున - అనేక ప్రదేశాలలో లీలామాధురిని వెదజల్లు సంఘటనలను జూచినపుడు ఈ మహాప్రభుని ప్రేమఖేల - అగమ్య మనిపించును. అయినను ఈ లీలామానుష స్వరూపుని దివ్యచరిత్రమును వ్రాయుట కీర్తిప్రతిష్ఠల నార్జించుటకై కాదు. ఈ విశ్వప్రేమికుని మహో జ్జ్వల సందేశమును వాడవాడల ప్రచారము చేయుటకేయని చదువరులు గుర్తింపఁగలరు

హరనాథ ప్రభువొకచోట తనయవతారవిశేషము నిట్లుగ్గ డించినాఁడు: "This time I come with a double barrelled gun and Come to see, not rivers of blood but streams of tears of Devine love."

హ్లాదినీశక్తి స్వరూపిణి - రాధాదేవి - ప్రేమబృందావన మహారాజ్ఞియగు శ్రీ కుసుమదేవితోఁగూడ ప్రభువు మనయందఱితోఁగ్రీడింప వచ్చినాఁడు. ఆయన యవతారములో రక్తపాతములకు తావులేదు. అంతులేని ఆవేద నతో - ప్రేమాన్వేషణతో - కన్నీటి కాల్వలు భక్తులు కార్చుచుండఁగా జూచి ఆనందించునీ పాగల్ హరనాథుఁడు! మాతృశ్రీ - తనబిడ్డలకు ప్రభుని జాడ లెఱుక పఱచుటయేకాక వారికి భగవత్ప్రేమ తత్త్వమును ప్రసాదించును. శ్రీ కుసుమహర యుగళమూర్తుల యవతారము కలి యుగ పాపజీవులకు కొంగుబంగారము. తన జీవితకాలములో హరనా థుఁడు భక్తులకు వ్రాసిన లేఖలు - కేవలము కృష్ణభక్తిని - సాధక ధర్మములను బోధించుచు - విశ్వమున సత్యుత్తమ సాహిత్యముగా నిలిచినవి. వీనిని జదువువారి సందేహములు అవంతటవియే తొలఁగి పోవుచుండుట యనునది - వీనిలోని ప్రత్యేకత ॥

ప్రభుని దివ్యచరిత్రమును బెంగాలీలో ఇంగ్లీషులో తెలుఁగులో తదితరభాషలలో ఎందఱెందఱో మహానుభావులు రచించి యున్నారు.

వారి రచనలను గొంతలోఁగొంతమూచి - ఆంతరంగిక భక్తుల సలహాలను స్వీకరించి ప్రభువు నాకిచ్చిన స్వల్పానుభవముతో - ఈ గ్రంథ రాజమును రచించుటకు సాహసించితిని. మహాభాగవతమునకువలెనే దీని యందును ద్వాదశస్కంధము లుండుట సముచితమనిపించినది, ఆ బాల గోపాలము ఈ చరితామృతమును గ్రోలుటకై యీరచన సరళ వచనము ననే సాగినది.

ఒక ముఖ్యవిషయము చదువరులకు తెలుపుట నా విధ్యుక్త ధర్మమై యున్నది. పదుమూఁడేండ్ల బాలునిగా నున్నప్పుడే నన్ను ఆకర్షించి కవిగా - పండితునిగాఁ దీర్చిదిద్దుటయేకాక ఆదర్శ జీవికి వలసిన సాధన సామగ్రిని సమకూర్చిన యీ ప్రభుని కృపారసమేమని వర్ణింపఁ గలను? నా జీవితము ప్రభుని మహాలీలయని చెప్పవలసి యున్నది. ఈ మధురకవిత తన సంపూర్ణ చరిత్ర రచనకు అంకితమగుటతోపాటు - ఈ హృదయము - జీవితము - యుగళ మూర్తుల పాదపద్మాలకు సమర్పితమగు చుండుట నాభాగ్యము ।। శ్రీహరనాథ ప్రభుని దివ్యవాణిని పరికింపుఁడు.

'Krishna played with the Hindus, Chirst played with some. Buddha played with some more. Now Haranath has begun to play with people of all religions, creeds and sects in the world. "

"Narada got his siddhi from his harp. The gopees got their salvation from Sri Krishna's flute, and you will obtain your salvation from my pen."

" You will realise after I pass away what potency the Lord has kept in the name "Haranath." Love the name and then you will be happy in loving me also. "

"I only know what I am verily, do I say that it is impossible for others to know me, as well as I know myself even there are no means of knowing me."

ప్రభుని ఆంగ్లగ్రంథ రచయితలు - సాధకపురుషులు భక్తాగ్ర గణ్యులైన పూజ్యులు శ్రీ ఆకెళ్ల రామకృష్ణ శాస్త్రిగారు (రాజమండ్రి) ఎన్నెన్నో విషయములను చెప్పి ఆశీర్వదించినారు.

అన్నయ్యగా నన్ను పెద్దచేసిన - ప్రియతమ భక్తసోదరులు శ్రీ పుట్టా వెంకట్రావుగారు (కార్యదర్శి, శ్రీ కుసుమహరనాథాశ్రమము, దువ్వాడ) భక్తసోదరరత్నము శ్రీ రాయల అప్పారావుగారు (అధ్యక్షులు, శ్రీకుసుమ హరనాథ మందిరము, గుడివాడ) ఈగ్రంథమును రచింపుమని ప్రోత్సహించుటయే కాక _ అచిరకాలములో దీనిని లోకమున కందఁజేయ నున్నారు. ఈ మువ్వురికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనము లను సమర్పించు కొనుచున్నాను, మహోదాత్తమగు ప్రవేశికను వ్రాసి ఆశీర్వదించిన శ్రీలక్ష్మణయతీంద్రులకు ప్రణామములు.

రాధాస్వరూపిణీ, జగజ్జనని, దయామయి శ్రీ హరనాథ ప్రభుని ప్రేమ మురళీగాన సుధాసారస్రవంతి అయిన శ్రీ కుసుమదేవి నా కల మున నిలిచి తన దివ్యగాథను రచించుకొనును గాక !

శ్రీ కుసుమ హరనాథుల కృపామృతమును నోఁచుకొన్న భక్తు లెల్లరు ఈదివ్య చరితామృతమును ఆస్వాదించి నన్ను ఆశీర్వదింప ప్రార్థించు చున్నాను.

తే 9_6_77
రాజమండ్రి

భక్తజనచరణధూళి
భవదీయుఁడు

చేబోలు చిన్మయబ్రహ్మకవి

# ప్రకాశకుల మనవి

శ్రీ కుసుమ హరనాథుల సులభ ప్రసన్నత్వము - ప్రేమతత్త్వము యొక్క ప్రత్యేకత, నిరంతర నామస్మరణలోని ప్రాముఖ్యము లోకమునకు తెలియపఱచవలెననెడు సంకల్పముతో 'శ్రీహరనాథ భాగవతము'ను రచింపుమని మాచిన్నతమ్ముడగు చిన్మయ బ్రహ్మకవిని కోరితిమి. కోరినదే తడవుగా శ్రీ కుసుమహరుల జీవిత చరిత్రను — చక్కని యుపదేశామృతమును - మధుర లీలలను — తత్త్వమాధుర్యమును మేళవించి _ పాఠకులు మఱల మఱల చదువుచు ఆనందించు సులభశైలిలో మహాభాగవతమువలె 12 స్కంధాలుండునట్లు రచించి అచిరకాలములోనే ఈ మధురకవి మాకందజేసినాడు. ఈతనిని ఆదర్శ భక్తి ప్రేమ ప్రబోధకునిగా ఆశీర్వదింపుమని ప్రభుని మిగుల ప్రార్థించుచున్నాము. విశ్వప్రేమావతారుడగు ప్రభు హరనాథుని 112 వ జన్మదినోత్సవ శుభసమయమున ఈ గ్రంథరాజమును ఆంధ్రులకు అందజేయగల్గుట మాయదృష్టముగా యుగళమూర్తుల అపారకృపయని భావించుచున్నాము. ఈ పవిత్ర గ్రంథము పూజ్యశ్రీ లక్ష్మణయతీంద్రులవారి ప్రవేశికా రచనతో ఆంధ్రవచన సారస్వతమున శాశ్వతముగా నిలుచుననియే విశ్వసించుచున్నాము. శ్రీవారికి మాధన్యవాదములు.

అందఱును దీనిని పారాయణ గ్రంథముగా చేసికొని — యిందలి తత్త్వమును పూర్తిగా ఆకళించుకొని ఆచరణలో పెట్టి ప్రేమాధినాథుల కృపకు పాత్రులై తరింతురుగాక !

ఈ గ్రంథములు శ్రీ కుసుమహరనాథాశ్రమము దువ్వాడ, శ్రీ కుసుమ హరనాథ మందిరము గుడివాడ, శ్రీ కుసుమహరనాథాశ్రమము, విద్యానగర కోలనీ హైదరాబాదులలో దొరకును.

ఇట్లు

శ్రీ కుసుమ హరనాథాశ్రమము

దువ్వాడ

## షష్ఠ స్కంధము



## సప్తమ స్కంధము



## అష్టమ స్కంధము



## నవమ స్కంధము



## దశమ స్కంధము

## ఏకాదశ స్కంధము



## ద్వాదశ స్కంధము

జయ శ్రీ కుసుమ హర

# శ్రీ హరనాథ భాగవతము

## ప్రథమ స్కంధము

శ్రీరంజనా! భగవతీ
జైరామ్నందన! ఘనభవ సాగరతరణా!
కారుణ్యాంచిత నయనా!
భారతభవన! హరనాథ పావనచరణా!

శ్రీమంతంబైన భారతావనిలో వంగదేశము మహాను భావులకు పుట్టినిల్లు. విశిష్ట చరిత్రులగు శ్రీ రామకృష్ణ పరమహంస వివేకానందులవంటి తత్త్వవేత్తలకు, విశ్వకవి రవీంద్రునివంటి కవీంద్రులకు, భక్తులకు, విజ్ఞాన శాస్త్రవేత్త లకు పేరుకెక్కినది. ఈ ప్రదేశము పవిత్ర గంగాతీరమగుటచే మహాత్ముల కావాస భూమియైనది. ఈదేశమున బంకూరా జిల్లాలోని 'సోనాముఖి' యే కలియుగ ప్రేమమూర్తులు, కృష్ణ ప్రేమ ప్రచారకులు భక్తజనరక్షకులగు శ్రీ కుసుమ హరనాథుల జన్మస్థలము. ఈనగరము గంగానది కుపనది యగు శాలీనది దక్షిణ ప్రాంతమున గలదు. పూర్వమిచ్చట సింహములు, పెద్దపులులు, మదపుటేనుగులు సంచరించునట్టి పెద్ద యడవులుండెడివి. రైలుమార్గము వేయబడిన తరువాత

నీ ప్రాంతమంతయు సురక్షితముగా నున్నది. ఈ గ్రామమున చాల పురాతనమగు కాళికా మందిరమున్నది. త్రివేణీ సంగమ నివాసియగు 'హరగోవింద ఠాకూర'ను బ్రాహ్మణుడు ఈ యూరికివచ్చి దేవియాలయమును నిర్మించి శిలావిగ్రహ స్థాపన గావించుటయే కాక ఆ దేవతకు బంగారు మొగమునమర్చెను. స్వర్ణ ముఖి యగు దేవతగల గ్రామమగుటచే దీనికి 'స్వర్ణముఖి' 'సోనాముఖీ' అను పేరు వచ్చినది.

సోనాముఖీక్షేత్రము

ఈ గ్రామమునకు నలుప్రక్కల ముర్షిరాబాద్, బర్ద్వాన్, బంకూరా, మిడ్నపూర్, సంతాల్ పరగణాలు మల్లభూమిగా పేరొంది యుండెను. మల్లభూమి రాజుల ముఖ్యపట్టణము 'విష్ణుపురము'. దీనిని 'రాఘునాథ- ఆదిమల్లుడు' స్థాపించి యుండెను. ఇతడు రాజస్థాన నివాసికాయస్థుడు. మంచి శక్తి సామర్థ్యాలు గలవాడై ఏడవ శతాబ్దాంతమున, ఎనిమిదవ శతాబ్ద ప్రారంభమున జీవించియుండెను. విష్ణుపుర రాజులు ఢిల్లీరాజులకు అనుకూలురై యుండి వారి సహాయ సంపద నందుచుండెడివారు.

మిక్కిలి ఎత్తయిన బలమైన శరీరముగల 'కాలాపహాడ్' అనువాడు మొదట హిందువేయైనను పిమ్మట హిందూ సంఘముచే బహిష్కరింపబడి మహమ్మదీయ మతమును తీసికొనెను. అతడు హిందువులను మిక్కిలి ద్వేషించుచుండెడి

వాడు. వంగదేశ ప్రభువైన 'సులేమాన్‌ఖాన్' వద్ద గొప్ప సైన్యాధిపతిగా నుండి ఒరిస్సాపై దండయాత్ర సాగించి యా రాజునోడించుటయే కాక జగన్నాథ, బలరామ, సుభద్రా విగ్రహ ములను నాశనము గావించి చాల ధనమును కొల్లగొట్టెను. పిమ్మట కొన్నాళ్లకు ఒరిస్సారాజగు ముకుందదేవుని కుమారుడు గౌడీయ గోవిందుడు- పోగొట్టుకొనిన రాజ్యమును మెలమెల్లగా వశపఱచుకొనుటయే కాక జగన్నాథాలయమును పునరుద్ధ రించెను. విగ్రహములను చక్కగా ప్రతిష్ఠించెను. ఈసంగతి తెలిసి కాలాపహాడ్, సులేమాన్‌ఖాన్ కుమారుడగు 'దావూద్ ఖాన్' కలసి ఆలయమును చెఱచి విగ్రహాలను పాడుచేసిరి. ఈ దౌర్జన్యమును అక్బరు చక్రవర్తికి తెలియజేసి గౌడీయ గోవిం దుడు వారిపై తగిన చర్యతీసికొని "మమ్ములను రక్షింపు మ"ని ప్రార్థించెను. అక్బరు- మునీంఖానునకు గొప్ప సైన్య మిచ్చి వారిని పాఱద్రోలుమని యాజ్ఞాపించెను. ఆ సేనాధిపతి ఆ దుర్మార్గుల సైన్యములను ఓడించెను. చేయునదిలేక 'కాలా పహాడ్' 'దావూద్‌ఖాన్' విష్ణుపుర రాజైన వీరహంబీరుతో యుద్ధమునకు దిగిరి. మహావీరుడగు విష్ణుపురరాజు ధాటికోర్వ లేక 'కాలాపహాడ్' మిగిలిన సైనికులతో బంగాళమునకు పాటి పోవుచు మార్గమధ్యమున- ఆనాడు హైందవుల ప్రసిద్ధ కేంద్ర మగు 'సోనాముఖి' పైబడి- కాళీదేవాలయమును నాశనముచేసి ఆ దేవీ ముఖమునగల 1500 తులముల బంగారు రేకును అపహరించెను. ఇంతలో మునీంఖాన్ మరణించుటచేత-

అగ్బరు- తోడర్‌మల్ గౌర్నర్‌ఖాన్ జహాన్‌మున్నగు గొప్పవీరులను ఆప్రాంతమునకు పంపెను. 1576 లో వారు శత్రుసైన్యమును చెండాడిరి. దావూద్‌ఖాన్‌చంపబడెను. కాలావహాడ్ బాగుగా గాయపడెను. నాటినుండి బంగాళము మొగలు రాజ్యములో నొక భాగమయ్యెను.

1765 లో షాహె అలం చక్రవర్తి బంగాళ, బెహర, ఒరిస్సా రాష్ట్రములపై గల వ్యవహారాధికారమును ఈష్టు ఇండియా కంపెనీవారికి స్వాధీనము చేసెను. విష్ణుపురము-బర్ద్వాన్ బంగాళమునందే యుండెను. విష్ణుపుర రాజకుమారుడు మాధవసింహుడు ఆంగ్లేయుల బలమును గుర్తించక 1806 లో బంకూరాపై దండెత్తెను. కార్నవాలీసను ఆంగ్లేయుల గవర్నరు పెక్కుసేనలను పంపి - ఓడించి అతనిని బందీనొనర్చెను. ఆనాటినుండి సోనాముఖి ఆంగ్లేయుల పరిపాలనలోనికి వచ్చెను. ఈస్టిండియాకంపెనీ ప్రభుత్వపాలనలో దేశమున యుద్ధభీతిలేక శాంతినెలకొన్నది. కాని చేతిపనులు అభివృద్ధి చెందవయ్యెను. దేశీయవ్యాపారము కుంటువడెను.

సోనాముఖిలో అయిదువేలమంది నేతగాండ్రుండెడివారని తెలియుచున్నది. వరిపైరు బాగుగా పండుచుండెను. కలప, పట్టుఎక్కువగా దొరకుచుండెను. విష్ణుపురమునకు సంబంధించిన పదివేలసైన్యము ఈ గ్రామమునందే యుండెను. కంపెనీవారు మిల్లుబట్టలనే వాడవలెనని ప్రజలను నిర్బంధిం

చుటచేతను - ఆయూరిలోనే బట్టలమిల్లును పెట్టుటచేతను. లక్కను పట్టును ప్రోగుచేయుటకు ఏజెంట్లను నియోగించుట చేత క్రమముగా ప్రజలు పనులులేక పరదేశములకు వలస పోయిరి.

## గౌరాంగప్రభువు

చదువరులారా ! ఈ సందర్భమున మీకొక దివ్యావతారునిగూర్చి సంగ్రహముగా చెప్పవలసి యున్నది. నవద్వీపమున శచీజగన్నాథులకు జన్మించి - పదునాఱేండ్ల ప్రాయముననే జగదేకపండిత గౌరవమును గడించి - విష్ణుప్రియతో కొన్నాళ్ళు సంసారముచేసి దైవికముగా ఒకసారి ప్రయాగలోని గదాధరుని - దర్శించి మానవజీవిత పరమావధి కృష్ణుని పొందుటయేయని గుర్తించి -ఆస్వాని జేర్చగల సాధనమీ కలియుగమున హరినామస్మరణమని గమనించి - అహోరాత్రములు హరిసంకీర్తన గావించి కావించి సంసారమునురోసి సన్యాసియై దేశదేశాంతరములలో హరినామామృతమును పంచుచు - రాధావిరహముతో ఆనందబాష్పములతో కనుల పండువుసేయు మధురగాన నృత్యములతో విశ్వప్రేమావతారుడని ఆబాలగోపాలముచే కీర్తింపబడిన మహానుభావుడు గౌరాంగ ప్రభువు.

ఆనామప్రియుని మహిమచే తాయిరప్పలును హరిభజన మొనర్చినవి. పరిపాలకులైన మహమ్మదీయులు సైతము మాతని

ప్రేమప్రభావమున సన్మార్గులైనారు. యజ్ఞయాగాదుల వలన- కఠోరదీక్షలవలన శ్రీహరి చిక్కడనియు - హరినామమునకే చిక్కితీరునను ప్రగాఢవిశ్వాసమును ఆయన ప్రజలలో పాదు కొల్పెను.

ఆప్రభువు జగన్నాథమున నివసించుచు - తనశిష్యులైన రూపసనాతన గోస్వాములను వైష్ణవమత ప్రచారమును జేయుడనియు, కృష్ణలీలలకు ఆవాసములైన ప్రదేశముల యందు సంచరింపుడనియు, శిథిలములైన పవిత్రతీర్థములను ఉద్ధరింపుడని హెచ్చరించుచు ముందుగా బృందావనమునకు పంపియుండెను.

ప్రభువు ఆదేశానుసారము - నిష్కామ్యప్రేమతత్త్వమును, గోపికలచే ప్రదర్శింపబడిన మధురప్రేమభావమును ప్రజలకు బోధించుచు వారుకొన్నాళ్ళకు బృందావనముచేరిరి. ఆకలిదప్పులు మఱచి రాత్రింబగళ్ళు ఆకార్యక్రమములయందే నిమగ్నులై - ధనవంతుల దాతల సహాయమున పెక్కుక్షేత్రములయందు ఆలయములను కట్టించిరి. సత్రములను కట్టించిరి. కోనేరులను త్రవ్వించిరి. ఉత్తమభక్తి గ్రంథములను తాళపత్రములపై రచించిరి.

చైతన్య ప్రభునిచే వంగదేశమున వైష్ణవమత ప్రచారము చేయుటకు పంపబడిన నిత్యానందుడు-అద్వైతాచార్యుడు-

తమ ప్రచారమును సక్రమముగా నిర్వహించిరి. నామప్రేమ చైతన్యములను నలుదిక్కులకు వెదజల్లిన ఆ భక్తశేఖరులు నిజముగా బంగాళమును భక్తిమయ మొనర్చిరి. వారు తనువు చాలించిన తర్వాత విష్ణుపురము — సోనాముఖీ క్షేత్రములకు పూర్వము వైష్ణవ సంప్రదాయమునకు ప్రముఖ కేంద్రమని పేరొందిన నవద్వీపకీర్తి ప్రాప్తించినది.

ఇపుడు మీరు మఱియొక పుణ్యపురుషుని తెలిసికొన వలసి యున్నది. వారు శ్రీనివాసాచార్యగోస్వామి, గొప్ప పండితుడు. తఱచు వేదాంత భక్తితత్త్వములపై చక్కని ఉపన్యాసములిచ్చుచు ఎందఱెందఱినో ఆకర్షించుచుండెను. ఆయన ఆదర్శప్రాయమైన జీవితము - బోధలు విష్ణుపుర రాజును గూడ చకితుని గావించుటయేగాక భక్తిబద్ధునిగా జేసివైచెను. భక్తిప్రేమరసపూర్ణములైన గ్రంథములను బృందావనమున పూర్వపు గోస్వాములు వ్రాసియుండిరి. అవియన్నియు నవద్వీపమున భద్రపఱచబడెను. ఆగ్రంథ విజ్ఞానమును అంతట ప్రచారము చేయవలెనను తలంపుతో శ్రీనివాసాచార్యులు నరోత్తమఠాకూరు — శ్యామానందుడు మొదలైనవారు ఆ గ్రంథములను కట్టపెట్టెలలో నింపి బండ్లపైనుంచి తీసికొని వచ్చుచుండిరి. బండ్లు సురక్షితముగా విష్ణుపుర ప్రాంతమునకు చేరెను. ఇంతలో కొంతమంది దొంగలు వానినన్నింటిని అపహరించి పాఱిపోయిరి. ఈ సంఘటనకు హరిదాసులెల్లరు భయ

భ్రాంతులైరి. తాము తలపెట్టినపని యిట్లు భగ్నమైనందులకు ఎంతయో చింతించిరి. ఎప్పటికైనను దొరకక పోవునా? అను నాశతో వారు దినములుగడిపిరి. దొరకని పక్షమున మనముజీవించి యుండుట వలన ప్రయోజన మేమున్నదని భావించి చనిపోవుటకు సిద్ధపడిరి. ఇంతలో నొకనాడు విష్ణుపురరాజు ఆగ్రంథములన్నియు ఒక సురక్షిత ప్రదేశమున నున్నవనియు - వానిని మీరు సద్వినియోగము చేసికొనవచ్చునని చెప్పుటతో - హరిదాసులు ఆనందభరితులైరి. మహాపండితుడును భాగవతశిఖామణియగు శ్రీనివాసాచార్యులు మిక్కిలి సంతోషించెను. మహారాజు ఆయాచార్యుని ఆచార్యునిగా స్వీకరించి - ఎన్నో విధముల ఆదరించెను. అందుచే వారు విష్ణుపురముననే నివసించుటకు నిశ్చయించుకొనిరి. సమీపగ్రామమునగల రఘునాథ చక్రవర్తియను మహాత్ముని పుత్రికను శ్రీనివాసాచార్యులు పెండ్లియాడెను,

## మనోహరదాసగోస్వామి

చైతన్యుని వైష్టవ సిద్ధాంతాలను ప్రచారము గావించిన మహనీయులలో మనోహరదాసగోస్వామి ఒకరు. ఈయన త్రికాలవేత్తయని, సిద్ధపురుషుడని ప్రజలు చెప్పుకొను చుండిరి. శ్రీనివాసాచార్యులు వారిని దర్శించినపుడు ఆయన మిక్కిలి ఆనందించి "మీరు నిర్వహించు భగవత్తత్త్వ ప్రచారము సఫలము కాగలద" ని చెప్పెను.

మనోహరదాసున కెందఱో శిష్యులుండిరి. వారందఱును వైష్ణవమతమును అవలంబించియుండిరి. మనోహరుని ఆలయమువద్ద ఉత్సవములు జరుగుచుండెను. అందు ప్రజలెక్కువగా పాల్గొనుచుండిరి. ఈ గోస్వామి "సోనాముఖి ఒక యవతార పురుషునకు జన్మభూమి యగుననియు - చైతన్య ప్రభువువలె ఆయన భక్తిప్రేమలను సర్వత్ర వ్యాపింపజేయుననియు - తన్మూలముగా ఆప్రేమావతారుని కీర్తి దశదిశల నంటున"ని ప్రజలకు హెచ్చరించు చుండెను. కొన్నాళ్ళకాయన తీర్థయాత్రకై పోవుచు రాజపుత్ర స్థానములోని జయపూరులో క్రీ.శ. 1595లో దేహమునుచాలించెను. విష్ణుపురరాజగు వీరహంబీరు మనోహరదాస గోస్వామిపేర నొక సమాధి మందిరమును నిర్మింపజేసెను. నేటికిని అచటఅర్చనలు జరుగుచునేయున్నవి. ప్రతిసంవత్సరము శ్రీరామనవమి నాడీచోట గొప్పయుత్సవము జరుగును. బంగాళములోని పలుప్రాంతములనుండి జనులు వచ్చి యీ యుత్సవములో పాల్గొనుచుండుట పరిపాటి.

ప్రసిద్ధ వైష్ణవాచార్యుడగు మనోహరదాస గోస్వామి సూచించిన లీలామానుష విగ్రహుడు- ఆదర్శగృహస్థు- పతితపావనుడు- నామప్రియుడు- సర్వమత సమన్వయవాది- బహులీలావినోది- నిరాడంబరుడు- భక్తరక్షకు డెవరోకాదు శ్రీహరనాథ ప్రభువే!! ఆయన ప్రపంచమున పలుతెగలలో స్త్రీపురుషలలో దేశ విదేశాలలో చేసిన-చేయుచున్న-చేయనున్న ప్రేమఖేల ఎంతటివారును వర్ణింపజాలరు. భగవంతునియెడమైత్రీబంధ

మును పెంచి - అతడే జీవిత లక్ష్యమని బోధించి - ఒడుదొడు కులు గల జీవితములో తోడునీడగా నుండుచు - భగవన్నామ ములోనే మధురక్షణములను గడుపుడని హెచ్చరించు దీన దయాళుని పవిత్ర చరిత్రమే శ్రీ హరనాథ భాగవతము.

శ్రీ హరనాథావతారము - అద్వైతాచార్య నిత్యానంద గౌరాంగుల సమ్మేళనావతారమని చెప్పవచ్చును. ఈ విషయము చక్కగా పరిశీలించినచో తెలియనగును. అద్వైతునివలె ఈయన ఉత్తమబోధల నందజేయును. నిత్యానందునివలె అను చరుల సందేహాలను పోగొట్టును. గౌరాంగునివలె ఇతరులపాప భారాలను బాధలను తీసికొని-వారిని నిశ్చింతులను జేయుటయే కాక ప్రారబ్ధకర్మల ప్రతిబంధకము లేకుండ భక్తిజీవనులగు టకు తగిన శిక్షణయిచ్చి — హృదయాలను ప్రేమమయము లొనర్చుచుండును.

## కృష్ణ గౌరాంగ హరనాథులు

గౌరాంగప్రభువు ప్రారంభించి విడిచిపెట్టిన బృందావన లీలను — హరనాథుడు కొనసాగించెను. కృష్ణుఁడొకడయ్యును గోపికలందఱిలోను తానై కనిపించుచు నృత్యగానములచే వారిని మురిపించెను. గౌరాంగుడు రాధావిరహముతో తన్ను మఱచి — అంతట ప్రాణేశ్వరుని వెదకుచు — అతనిని తృప్తి పఱచుటకై నృత్యసంకీర్తగానములను ప్రదర్శించెను. హర నాథుడు — నామస్మరణ గావించు నాంతరంగిక భక్తుల హృద

యాలలో పలువిధములుగా దర్శనమిచ్చి ఆనందపఱచెను. కృష్ణుడు మురళీగానముచే గోగోపగోపికలను సంతోషపెట్టగా, గౌరాంగుడు భగవదార్తిభరితమైన కన్నీటితోను కరస్పర్శ తోను-మధురనృత్య సంకీర్తనలచేత భక్తుల నలరింపగా హర నాథుడు తన లేఖినిచే యావత్ప్రపంచమును ప్రేమభావముచే నుఱ్ఱూతలూగునట్లుచేసెను. జీవుడు - ప్రియురాలుగాను పరమే శ్వరుడు ప్రాణేశ్వరుడుగా సాగు ప్రేమమయ మధురఖేలయే రాసక్రీడ. రసమను శబ్దము పరబ్రహ్మమునకే అన్వయించును. (రసోవైబ్రహ్మ). ఆ పురుషోత్తముని పొందగలిగిన జీవితమే జీవితము. అదేలక్ష్యముతో సాగించు రాసక్రీడయే శ్రీహరనా థుని అవతారమని పాఠకులు మున్ముందు గ్రహింపగలరు.

## హరనాథుని వంశవృక్షము

హరనాథుడు పుట్టిన పవిత్రవంశము బంధోపాధ్యాయ లేక బెనర్జీ వంశము. 'శాండిల్య భక్తిసూత్రముల'ను రచించిన శాండిల్యుడే ఈవంశమునకు మూల పురుషుడు. ఈవంశములో నొకడైన 'కలివ్యాసుడు' ఏడవ శతాబ్దియందు జీవించియుండెను. వ్యాసునివలె వేదశాస్త్రము లెఱిగిన వాడగుటచే ఈతనికి ఈబిరద నామము వచ్చియుండును. 'చతుర్వేది' యను నీతని బిరుదమీ విషయమును ఋజువుచేయుచున్నది. కలి వ్యాసుని ముని మనుమడగు 'క్షితీశుడు' వేదశాస్త్ర పండితుడును యజ్ఞయాగాది క్రతువిధానము తెలిసినవాడునై యుండెను. ఈయన రాఢదేశ

మహారాజయిన జయంతాదిశూరుని ఆహ్వానమున లక్ష్మణపూరు వచ్చి క్రీ. శ. 752లో పుత్రకామేష్టిని కొంతమంది యను చరుల సహాయముతో పూర్తిచేసి స్వదేశమునకు పోయెను. కాని బంధువు లాతనిని గౌరవింపక పోవుటయేకాక మాట్లాడరైరి. బంధుత్వమును త్రెంచుకొనిరి. స్వదేశము విడిచి విదేశములో క్రతువు చేయుట వలన మతమును గోలుపోయినట్లు నిర్ణయించిరి. చేయునదిలేక వీరు రాఢదేశమునకు రాగా రాజెంతో ఆదరించి వ్యవసాయము చేసికొనుటకు భూమినిచ్చెను. క్షితీశుని కుమారుడు 'భట్టనారాయణుడు'. ఈయనకు పదునాలుమంది కుమారులు. రాజు వీరి కుటుంబముయొక్క అభివృద్ధికి సంతసించి ఒక్కొక్కరి కొక్కొక్క గ్రామము చొప్పున పదునాలుగిచ్చెను. భట్టనారాయణుని పెద్దకుమారుడగు వరాహుడు బండిలేక బండీఘాట్ గ్రామమున నివసించుచుండెను. ఈ గ్రామము బీహారు జిల్లాలో 'కానా' నదీ తీరముననున్నది. ఈయన మతబోధకుడు (ఉపాధ్యాయుడు). వీరి వృత్తి నామమే చివరకు వంశనామమైనది. వరాహుని కుటుంబము వృద్ధిచెందెను. ఈతని పిమ్మట ఇరువదవ తరమువాడు గోపీనాథుడు. ఇతనిని 'బాబాఋషి' 'మౌనస్వామి' యని పిలిచెడివారు. మూగయైనను మిక్కిలి తెలివిగలవాడై యుండెను. ఈయనకు నల్గురు కుమారులు. 'బాబాఋషి' ఇల్లు విడచి భయంకర మృగముల మధ్య నుండెడివాడు. అవియేమియు నీతనికి హాని కలిగింపకుండెను. ఈ ఋషి రెండవ కుమారుడు రామేశ్వరుడు. ఈయన

పిమ్మట పన్నెండవ తరమువాడే మన హరనాథుడు. తరతరాల నుండి భగవద్భక్తి సాధనగల పుణ్యపురుషులకు నెలవైన బంధోపాధ్యాయ వంశముననే విశ్వప్రేమావతారుడుదయించినాడు. పాల సంద్రముననే కదా పూర్ణచంద్రుడుదయించును!

కనకలతాదేవి - శ్యామసుందరుడు

పాఠకులారా ! శ్యామసుందరుని కుమారునిగా వాత్సల్యరసముతో లాలించి పోషించి తరువాతి జన్మమున శ్రీహరనాథునకు తల్లియైన 'కనకలతాదేవి' యను భక్తురాలి చరిత్రమును మీరిపుడు తెలిసికొనగలరు.

సోనాముఖికి ఇరువది మైళ్ళదూరమున 'జాంబుని' అనుగ్రామమున "కనకలత - లక్ష్మణముఖర్జీ" దంపతులు నివసించుచుండిరి. వారు స్వంతముగా ఆలయమును కట్టించి - అందు రాధాకృష్ణమూర్తులను ప్రతిష్ఠించి నిరంతరము ఆరాధించెడివారు. భర్తగతించినపిమ్మట ఆమెయే పరమభక్తిప్రేమలతో శ్యామసుందరుని కన్నబిడ్డగా భావించి సేవచేయుచుండెను. స్వామియు ఆయమ్మ భక్తిభావమునకు తగినట్లు చిత్రవిచిత్రలీలలను జూపించుచుండెను. ఆభక్తురాలు 'నిస్తారిణి' 'అభయ' అను పుత్రికలకు వివాహము చేసెను. వారు అత్తవారింఢ్లయందే యుండిరి. శ్యామసుందరుడు అందరికి నొక ప్రతిమవలె కనిపించుచున్నను - ఆయమకు సజీవగోపాలుని వలె కనిపించుచుండును - ఒడిలోనిద్రపోవుచుండును, ఆయమ

ప్రశ్నలకు బదులుచెప్పుచుండును. అంతలో ఏడ్పించును. అల్లంతలోనే నవ్వించును. ప్రసాదమారగించును. ఒకొక్కక్క ప్పుడు ఆతల్లిచేసిన పదార్థములలోని లోటుపాటులనుగూర్చి ముచ్చటించుచుండును. కడకామెకు శ్యామసుందరుడే లోక మాయెను. ఆప్రభువును ఒక్కక్షణమేని విడువక - మఱవక అతనితోడిదే జీవితమను గట్టినమ్మికతో ఆయమ్మ జీవించు చుండెను. అచట శ్యామసుందరుడు ప్రదర్శించులీలలను కను లారచూచిన నాస్తికులెందఱో భక్తిసంపన్నులగు చుండిరి. ఆయమ్మ చేతితోపెట్టిన ప్రసాదమును స్వీకరించినవారు ఆరోగ్యవంతులగుచుండిరి. మఱియొక చిత్రమేమన ఆప్రసాద మును ఎన్నివేలమందికి పెట్టినను తఱుగక అక్షయమగుచుం డెను. ఈమహిమచేత ప్రజలు తండోపతండములుగా వచ్చి శ్యాముని ప్రసాదమును స్వీకరించుచుండిరి. క్రమముగా ఆ గ్రామమొక తీర్థయాత్రాస్థలమయ్యెను. ఒక దినమున ఆ భక్తనారీమణి భక్తులందఱిని వరుసగా కూర్చుండబెట్టి ప్రసాద మును వడ్డించుచుండెను, ఇంతలో గాలిపాటున ఆయమమేలి ముసుగు తొలగిపోయినది. అదేసమయమున పుత్రిక 'అభయ' అల్లుడు "దీననాథగోస్వామి" ఆసమీపమునకు వచ్చుచుండిరి. వంగదేశస్త్రీలు తలపైని ముసుగులేకుండ అల్లుండ్ర ఎదుటికిరారు. తనకు జరిగిన అవమానమునకు ఆతల్లి లోలోపల సిగ్గుపడుచు ఎంతయో చింతించుచుండెను. ఇట్టితరుణములో రెండుచిన్నారి చేతులు ఆమెతలపైని మేలిముసుగును సవరించి అంతర్ధాన

మయ్యెను. ఆరమణీయదృశ్యమును చూచినప్రజలు ఆశ్చర్య సంభ్రమానందముల నోలలాడజొచ్చిరి. కనకలతకు కల్గిన భక్తిప్రమోదములకు మేరలేకుండెను. పిమ్మట చేతులు కడుగు కొనవలెనని ఆమె పుష్కరిణి సమీపమునకు వెళ్ళెను. కాని తిరిగిరాలేదు. పరధ్యానముతో మడుగులో పడిపోయెనని కొందరు అనుకొనిరి. మఱికొందఱు సంసారబంధములను త్రెంచివేసి కృష్ణుడే గోలోకధామమునకు ఆభక్తురాలిని గొంపోయెనని చెప్పు కొనిరి. ఆపుష్కరిణి నాలుగువైపుల వెదకిరి. కాని యామె తనువు కనిపించదయ్యెను. ఆనాటిరాత్రి సోనాముఖియందే నివాసమేర్పఱచుకొన్న కనకలత మనుమడగు (అభయ కుమారుడు) యజ్ఞేశ్వరబెనర్జీ స్వప్నమున శ్యామసుందరుడు సాక్షాత్కరించి "నాయనా! మీయవ్వను నాధామమునకు చేర్చితిని, ఆమెకై మీరు విచారింపవలదు, ఆభక్తమణిచే ఆరాధింపబడిన రాధాకృష్ణ విగ్రహములనుతెచ్చి సోనాముఖిలో ప్రతిష్ఠింపుము" అనియాజ్ఞాపించెను. అతడు మఱునాడులేచి జాంబునివెళ్ళిచూచి జరిగిన సంఘటనను తెలిసికొని - ఆ నాడే ఆవిగ్రహములను సోనాముఖికితెచ్చి అచట ప్రతిష్ఠించెను. యజ్ఞేశ్వరుని పిమ్మట అతని వంశీయులు రాధాశ్యామసుందరులను అర్చించుచుండుటయేగాక, కృష్ణానుగ్రహమును బడసిన కనకలతాదేవిని మహానుభావురాలని ఆరాధించుచు వచ్చిరి. శ్రీహరనాథుడు యజ్ఞేశ్వరునకు ఆఱవతరమువాడు. కనకలతకు 200 సం॥రముల తరువాత బెనర్జీవంశీయుల

సంఖ్య చాల పెరిగెను. ఆయా కుటుంబముల వారు రాధాశ్యాముల పూజార్హత "మాకుకలదు - మాకుకలదు" అని తమలో తాము కలహింపజొచ్చిరి! కొన్ని కుటుంబములవారు మాత్రమే పూజించుచు - ఇతరులను దరిదాపులకు చేరనిచ్చెడివారుకారు. ఆవిధముగా చాలకాలము పూజార్హతనుపోగొట్టుకొన్న వారిలోమన హరనాథుని తాతగారగు శ్రీకాంతబెనర్జీగారొకరు. ఆయన వంశపారంపర్యమగు పూజార్హతను సంపాదించుటకై న్యాయ స్థానమున పోరాడి - కొన్ని సంవత్సరముల తరువాత గెలు పొందెను. అది 1805 మే మాసము - ఆనాడే ఆతని రెండవ భార్యయగు 'ఆదరమణి' కొక కుమారుడు జన్మించెను. ఆ బాలునకు "జయరాముడ"ని నామకరణము జరిగెను.

శ్రీకాంతునకు మొదటి భార్యయగు భద్రకాళితో 1773 సం॥రమున వివాహమయ్యెను. ఈమె-భర్త మెత్తని స్వభావము గలవాడగుటచే-పెంకెతనముగలదై యుండెను, ఈమెకు హంసే శ్వరుడు, విశ్వంభరుడు, రామదయాళుడు జగన్నాథుడు అను కుమారులును మందాకిని యను పుత్రికయును సంతానము. శ్రీకాంతుడు ఆదరమణిని పెండ్లియాడుటయనునది దైవికఘట్ట ముగా తోచుచున్నది. శ్రీకాంతుడు ఒకసారి పట్టుపురుగుల పెంప కము చూచుటకు "బేలియాకా" వెళ్ళి అచట కొన్ని రోజులు మేనమామ యింటనుండెను. మేనమామ కూతురగు ఆదర మణికి ఒకరోజు అర్ధరాత్రి సమయమున పెండ్లి ఏర్పాట్లన్నియు జరిగెను. ఏకారణము చేతనో మగపెండ్లివారు ఆమెను విడిచి

వెళ్ళిరి. పెండ్లి కుమార్తె అన్నగారగు రామతరణముఖర్జీ మిగి లిన కుటుంబ సభ్యులు - కలిగిన అవమానమునకు తట్టుకోలేక ప్రాణత్యాగము చేయుటకు సిద్ధపడిరి. అట్టి ప్రమాద పరిస్థితిలో గ్రామస్థుల సహకారముతో శ్రీకాంతుడు తన నలుబది రెండవ యేట ఆమెను వివాహమాడెను. వివాహానంతరము వచ్చిన భర్తను సవతిని భద్రకాళి లోకాచార ప్రకారము ఆదరించెను ఆదరమణి అమాయకురాలు - యోగ్యురాలు. ఆ కారణమున. పెద్దభార్య అనేక శ్రమలను పెట్టుచుండెను. అయినను ఆమె అట్లే భరించెడిది. ఎంతసహనము, వినయముగల్గి సకల సపర్యలు చేయుచున్నను కనికరింపక భద్రకాళి పసిబాలు డగు జయరామునితో ఆదరమణిని ఇంటినుండి వెడలగొట్టెను సవతికి మగపిల్లవాడు కలుగుట పెద్దభార్యకు దుస్సహమని పించెను. ఈ సంఘటన కనులారచూచిన శ్రీకాంతుడు గయ్యాళియైన భద్రకాళి సమీపమున నుంచినచో భార్యా పుత్రుల మనుగడ సాగనేరదని నిశ్చయించుకొన్నవాడై 1806 లో వారిరువురిని బేలియాకా పంపివైచెను.

జయరాము డచట పాఠశాలలో ప్రవేశించెను. సంస్కృ తమును నేర్చుకొనెను. పిమ్మట శ్రీ మహాభాగవతము-భగవద్గీత మొదలైన పవిత్ర గ్రంథములను చదివి మంచి జ్ఞానమును సంపాదించెను. దీనికితోడు కలకత్తాలో నున్నప్పుడు ఈస్టిం డియా కంపెనీ నౌకరుల పరియముతో కొంత ఇంగ్లీషును గూడ నేర్చెను.

జయరాముడు ఊహవచ్చినది మొదలు తమ తాతగారింట నున్న దామోదరసాల గ్రామమునకు నిత్యము భక్తిశ్రద్ధలతో పూజ చేయుచుండెను. ఆ పూజ క్రమబద్ధముగాలేకుండెను. ఒక్కొక్కప్పుడు చాలసేపందే నిమగ్నుడై యుండెడివాడు. కొన్నాళ్ళ తరువాత ఆతడు హఠాత్తుగా కన్నులు మూయగానే తన్మయత్వస్థితివచ్చి - పదినిముసములలో బాహ్యజగత్తునకు వచ్చెడివాడు. మఱికొన్నాళ్ళకు ఎడతెఱపిలేని ధ్యానావస్థలో నుండుట గ్రహించి - ఇటుపైన వీనినట్లే సాగనిచ్చినచో ప్రపంచమునకే దూరము కాగలదను దృష్టితో పెద్దవారు ఆపూజ చేయవలదని వారించిరి. జయరాముడు సహజమగు భక్తి శ్రద్ధలు గలవాడగుటచే పూజను మానుట కిష్టపడలేదు. అయిన నేమి చేయగలడు? పెద్దవారెట్లు చెప్పిన అట్లు చేయవలసినదే!! భగవత్పూజను విడచుటకంటె ఆత్మహత్య చేసికొనుటయే మంచిదని యతడనుకొనెను.

ఆ యభిప్రాయముతోనే ఆబాలుడు సమీపమునగల అడవికిపోయెను. ఆసమయమున తెలిసిన ఒకానొకవ్యక్తి కనబడి "నాయనా! ఎందులకీ సాహసము? దామోదరసాల గ్రామమును పూజింతువుగానిలే!! ఆత్మహత్యకూడద"ని మందలించి యింటికి తీసికొని వచ్చెను. దైవపూజ విషయమై ప్రాణములైనను పోగొట్టుకొనుటకు సిద్ధపడిన జయరాముని అటుపైన తల్లిగాని తదితరులుగాని పూజవలదని చెప్పరైరి. యథాప్రకారము పూజచేసికొనుచున్నప్పుడు 1817లో ఒకసాధువు

కనిపించి అభయమిచ్చుచు. "వత్సా! నీభక్తి వలన శిలలోని దేవుడు మేల్కొన్నాడు. నీగత జన్మలన్నియు నేనెఱుగుదును. నీవు పవిత్రుడవు. పరమేశ్వరుడు నీకుమారుడు కానున్నాడు. భవబంధములనుండి విముక్తుడవు కాగలవు. కృష్ణుడు నీవెంటనే యున్నాడ"ని హెచ్చరించెను. ఈసంఘటన జరిగిన తరువాత ఎందరెందరో భక్తులు-సాధువులు జయరాముని దగ్గఱకు వచ్చుచుండిరి. మఱునటి సంవత్సర మొకసారి శ్రీకాంతుడు-భార్యను కుమారుని చూచుటకై బేలియాకా వచ్చెను. జయరామున కపుడు పదుమూడేళ్లు. అపుడొక జ్యోతిష్కుడు రాగా జయరాముని హస్తరేఖలను చూడుడని కోరెను. అప్పుడతడు "ఇతడే నీయుత్తమ పుత్రుడు. ఇతనికి నల్గురు కుమారులు ఇద్ద అమ్మాయిలు కలిగెదరు. అందొకడు విశ్వరక్షకుడై లోకముచే పూజింపబడున"ని చెప్పెను. ఆమాటలాలించిన జయరాముడు సిగ్గుపడి "ఈమాటలు నిజమగునా? అసలు వివాహమే చేసి కొననిచో సంతానముండదు గదా!" అని భావించుటయేకాదు - ఈ ఆలోచనతోనే ఆతడు ముప్పదవ సంవత్సరము వఱకు వివాహమాడనేలేదు. 1819 లో ఆదరమణి పుట్టింటనే మరణించినది. 1820 లో శ్రీకాంతుడు సోనాముఖిలో దివంగతుడాయెను. తాతగారింటనున్న జయరామునకీ వార్త తెలుపనేలేదు. రామతనుముఖర్జీయను బంధువీ సంగతి తెలిసి ఆబాలుని సోనాముఖికి తీసికొనివెళ్ళి తండ్రి శ్రాద్ధవిధులలో పాల్గొనగలడని చెప్పెను. సవతితల్లి, సవతి సోదరులందులకు అంగీకరింపరైరి

ఆపిల్లవాని పక్షము వహించి గ్రామస్థులు ఎన్నో విధములుగా చెప్పిరి. అయినను వారు వినలేదు. జయరాముని దైన్యస్థితిని జూచిన నఫరచంద్రబెనర్జి యను శ్రీమంతుడు దూరపుబంధువు జాలిగొని అతనిని తనయింటికి తీసికొని వెళ్ళి తండ్రి శ్రాద్ధమును వైభవముగా జరిపించెను. పిమ్మట ఆయుదారుని పెంపకములోనే పెరిగెను. 1821లో లక్కవ్యాపారములో నెలకు 8 రూపాయల గుమస్తాగా కలకత్తాలోని నఫరచంద్రుని వ్యాపారమున నియోగింపబడెను. జయరాముడు మిక్కిలి జాగరూకతతో ప్రవర్తించుచు తన విధ్యుక్తధర్మమును నిర్వహించుచుండెను. స్వల్పకాలములోనే జయరాముని వలన వ్యాపారములో కలిసి వచ్చెను. అదృష్టదేవత అతనిని కటాక్షించెను. ఇపుడు జయరాముడు ముప్పదేండ్ల వాడు. క్రమముగా అతడు ధనము విరివిగా సంపాదించి స్వతంత్రుడాయెను. వివాహము తన స్వేచ్ఛను పాడుచేయునని తలంచెడువాడు. అభివృద్ధిలోనికి వచ్చిన తరువాత కూడ నఫరచంద్రుడు జయరాముని యందు ప్రత్యేకాభిమానమును చూపించుచుండెడివాడు. ఆసమయముననే పిత్రార్జితమగు స్థలమును జయరాముడు నవతి యన్నదమ్ములనుండి స్వాధీనపఱచుకొనెను. ఆబ్రహ్మచారి 1833లో సోనాముఖి దుర్గాష్టమికి వచ్చినపుడు సైతము కొందఱు బంధుమిత్రులు అతని వివాహ విషయమై ప్రయత్నించిరి. కాని అతడేమాత్రము చలింపలేదు.

కలకత్తా చేరిన తరువాత జయరాముడు మశూచివచ్చి మంచము పట్టెను. మశూచి తీవ్రమయ్యెను. మాట్లాడుటకు కూడ వీలులేకపోయెను. అయిదారురోజులు తీవ్ర జ్వరముతో పడియుండెను. ఇరుగుపొరుగువారు తెలిసినవారు మశూచి భయంకరమైన అంటురోగమని - దగ్గరకు వెళ్లటమే ప్రమాదమని తలచి అతనిని కనీసము పలుకరించుటకైనను వచ్చుట మానిరి. ఇట్లు ఏడురోజులు అన్నపానములు లేక 'నా' అనువారు లేక ఆగదియం దొంటరిగా మూల్గుచు మూల్గుచుండెను. ఎనిమిదవ రోజున అతనికి విపరీతమైన దాహము గల్గెను. ఆ రోజట్లే గడచెను. తొమ్మిదవరోజున ఒక ఆయుర్వేద వైద్యుడు ఆగదిలో ప్రవేశించి చూడగా జయరాముడు ప్రక్కనుండి లేవలేని స్థితిలోనుండెను. ఆసమయమున ఎవరైనను వత్తురని వైద్యుడాశించెను. ఆయంటువ్యాధివలన ప్రమాదము గల్గునను భయముచే తన గ్రామస్థులుగాని - నౌకర్లుగాని అతని దరిదాపులకైనను చేరరైరి. ఆసాయంకాల మొకడు గదిలోనికి దీపమును తెచ్చిపెట్టి - జయరాముడు మరణావస్థలో నున్నట్లు భావించి తలుపులుమూసి పరుగుపరుగున పాఱిపోయెను. అట్టి భయంకర స్థితిలో అతడు "నేనే పెండ్లియాడి యున్నచో భార్యాపుత్రులు ఈ సమయమున సపర్యచేయుచు విడనాడకుండ నుండెడి వారుగదా!!" యని తనలోతాను వాపోయెను వివాహమాడకపోవుట తప్పైయైనదనియు - ఒకవేళ బ్రతికి బయటపడినచో తప్పక వివాహ మాడవలెనని నిర్ణయించుకొనెను

వైద్యుడిచ్చిన సలహాప్రకారము పాలు - మంచినీటిని సేవించు చుండెను. క్రమముగా రెండవవారములో అతని అనారోగ్యము నిమ్మళించెను. ఒంటరితనము వలన గల్గిన బాధను గ్రహించిన యా తరుణవయస్కుడు వధువునన్వేషింప మొదలుపెట్టెను.

బర్ద్వాన్ మహారాజా ఆస్థానపండితుడైన ఉమాశంకర తర్కాలంకార్ అను మహాపండితుని వంశమునకు చెందిన కార్తీకచంద్ర చక్రవర్తికి భగవతీ సుందరీదేవియను పుత్రిక యుండెను. ఆమె జన్మస్థలము సోనాముఖియే యగుటచే ఆమె గుణగణములను గూర్చి చాలమంది బంధువులు జయరామునకు చెప్పుచుండిరి. ఆసమయముననే అతడు సోనాముఖిలో తన వాటాస్థలమున మూడు తాటాకు ఇండ్లను ఒక పశువులశాలను కట్టించెను. అవి యీనాటికిని తగు సంరక్షణలో నున్నవి

1834 లో బీమ్లాహారిణియనునామె నిస్సహాయురాలై ఉదారుడైన జయరాముని ఆశ్రయమిమ్మని కోరెను. ఆమె తండ్రియొక దొంగలముఠాకు నాయకుడు, భర్తకూడ దొంగయే!! ఈస్టిండియా కంపెనీపోలీసులు ఆగుంపును చంపివేసి- ఈమెను దయదలచి విడిచిపెట్టిరి. ఈసంగతి యంతయు తెలిసిన జయరాముడు ఆమె దైన్యస్థితిని గుర్తించి - అస్పృశ్యురాలయినను లెక్కింపక ఆమెను తనయిండ్లకు కాపలాదారుగా నియోగించి తాను కలకత్తా వెళ్ళెను. నెలకు రూపాయిపావలా జీతమేపుచ్చుకొనుచు ఆమె నమ్మినబంటని నిరూపించుకొనెను

ఎంతయెత్తైనచెట్లనైనను ఆమె ఎక్కఁగలదై యుండెను. రాత్రి సమయమున వచ్చుదొంగలను చేతిదుడ్డుకఱ్ఱతో తఱిమికొట్టు చుండెను.

శ్యామసుందర భక్తురాలు - గుణవతి అయిన భగవతీ దేవిని జయరాముడు 1836లో వివాహమాడెను. కార్తీకచంద్రుడు పూర్వాచారపరాయణుడు.. సోనాముఖి గ్రామాధికారి. అతనికి తగిన యిల్లాలు ఠాకూరురాణి. భక్తదంపతులగు వారు భగవతీజయరాముల వివాహమును అతి వైభవముగా జరిపించిరి. కనకలతాదేవియే - భగవతీదేవిగా జన్మించినదని ఆ యూరివారందఱినమ్మిక. జాతిరత్నము - బంగారము గలసి చక్కని భూషణమైనట్లు భగవతీజయరాముల నవ్యసమాగమము శ్రీహరనాథభాగవత మహావృక్షమునకు ప్రథమ స్కంధమైనది.

నీతత్త్వమెన్న దరమా ?
ధాతకయిన., నీకృపావిధానము విశ్వ
ఖ్యాతంబై, పతితావన
మై తన్మయమై విశిష్టమైచెలువారున్.

## గద్యము

ఇది శ్రీమత్కుసుమహరవరప్రసాదిత మధురకవితా విభూషిత, భాషా విజ్ఞాత, వినయవిఖ్యాత, విశ్వబ్రాహ్మణాన్వయ సంజాత, ఆదిత్య బ్రహ్మర్షి గోత్రపరిపూత, ప్రణవసూత్రవినీత, శ్రీనారాయణాంబా సత్యనారాయణా చార్య ప్రథమ సుత చిన్మయబ్రహ్మకవి ప్రణీతంబైన శ్రీహరనాథ భాగవత మందలి ప్రథమస్కంధము.

---

# శ్రీహరనాథ భాగవతము
## ద్వితీయ స్కంధము

శ్రీమన్నామ! చరిత్రో
ద్దామా! భక్తాభిరామ! స్తవనీయపరం
ధామ! కుసుమలావణ్యా
రామ! బెనర్జీకులాబ్ధిరంజితసోమా!

గున్నమామిడి తోటలలో కోయిలకంఠము మనోహరముగా వినిపించుచుండెను. ప్రతిలతయు ప్రతివృక్షము ప్రతిజీవియు నూతనోత్సాహముతో నవయౌవనము మొలకెత్తినయట్లు కనిపించుచుండెను. చక్కనిపూలతోటలును పెంపెక్కినఫలవృక్షములు గ్రామపరిసరములలో ఒక క్రొత్తశోభను గలుగజేయుచుండగా-మఱియొక వైపున విశాలమైన వరిపొలములు - వానిప్రక్కనే పాఱు పంటకాలువలు చూడ ముచ్చటగొలుపుచుండెను. అదెట్టి యలౌకికమైన శక్తి అచట ఆవరించియున్నదో కాని - ఏ ప్రదేశమును పరికించినను - ఏదృశ్యమును తిలకించినను - అవియన్నియు దివ్యాతిదివ్యములై మనోహరములై తోచును. నిజముగ సోనాముఖి కొలది భవనములతోను - అధికపర్ణకుటీరములతో విరాజిల్లుచుండుటయేగాక - ఇదియొక. దివ్యక్షేత్రమా! యనదగిన భావనారమ్యమై- యొప్పుచుండెను

భోజనము పెట్టుచుండు" మని యాదేశించెను. ఆమె యట్లే చేయుచుండగా 1860లో కమలాదేవియను పుత్రిక జన్మించెను. ఈమె పిమ్మట బంకూరా జిలాలోని సుషూనియా వాసియగు ఉమాపదముఖర్జీని పెండ్లియాడెను. అయిదుగురు కుమారులామెకు కల్గిరి. హరనాథుడనిన ఈమెకు ఎనలేని ప్రేమ. హరనాథుని కీర్తి విశేషములను చూచి ఈమె యెంతో సంబర పడుచుండెడిది.

క్రీ. శ. 1863 లో శివనారాయణ లేక శివనాథబంధోపాధ్యాయుడు జన్మించెను. ఇతడు హరనాథుని మిక్కిలి ప్రేమించుటయేకాక ఉన్నత విద్యను చెప్పించెను. ఈయన భార్య 'గోలాప సుందరి'. వీరికి "వినోదిని" యను కుమార్తెయు, "గోకుల్", "నకుల్" అను కుమారులు గల్గిరి.

ఈ శివనాథుడు జన్మించుటకు పూర్వమొక సంఘటన జరిగెను. జయరాముడు మొదటినుండియు విష్ణుభక్తుడే!! మంచి నమ్రత కలవాడేయైనను పూర్ణచంద్రునిలో చిన్న కళంకమున్న యట్లు శివుడు – కాళి – మొదలైన యితర దైవములన్న అతడు ఏవగించుకొనెడివాడు.

ఒకరాత్రి అతని స్వప్నమున నొక సాధుపురుషుడు కనిపించి "జయరామా ! శివకేశవ భేదము కూడదు. శ్యామ సుందరునితోపాటు శివుని గూడ నర్చింపుము. అట్లు చేయ

నిచో పెక్కుజన్మములనెత్తి కష్టపడవలసి యుండున"ని మందలించెను. ఆ స్వప్నమును — సాధుపురుషుని మంద లింపును జయరాముడు బాగుగా విమర్శించి చూచెను. తన తప్పు తనకు తెలిసెను. జ్ఞానోదయ మయ్యెను. స్థితిమంతుడైన యాతడొక సంవత్సరములోనే సోనాముఖిలో శివాలయమును గట్టించెను. కొలది కాలమునకే కల్గిన కుమారునకు శివనారా యణుడను పేరు పెట్టెను.

క్రీ. శ. 1864 నాటికి ఆలయ నిర్మాణము పూర్తి యగుటయు — శివలింగ ప్రతిష్ఠ చేయవలసిన కాలము వచ్చెను, అప్పటికి భగవతి గర్భవతి. గర్భవతియగు భార్యతో కలసి ప్రతిష్ఠ చేయవచ్చునా? కూడదా? అను సంశయముపై పండితులు వాదోపవాదములు చేయుచుండిరి. కొన్నిగంటలు చర్చయైన తరువాత పండితులు జయరాముని ఆమెతోకూడి లింగప్రతిష్ఠ చేయరాదని సిద్ధాంతీకరించిరి.

ఇంటిలోనున్న భగవతికి ఈ విషయము తెలిసెను. వెంటనే ఆమె మొగమెఱ్ఱబాఱెను. శరీరము కంపించి పోయెను. తటాలున లేచివచ్చి అనేక శాస్త్రాధారములను చూపి గర్భవతి యగు నిల్లాలితో మతవిషయికమగు కార్యక్రమములలో యజ మాని పాల్గొనవచ్చుననియు - ఈనిషేధము తగదని హెచ్చ రించి పిమ్మట తెలివిదప్పి పడిపోయెను. ఆమె శాస్త్రీయమైన గంభీరవాణిని ఆలకించిన పండితులు ఆశ్చర్యచకితులై పోయిరి.

ఒక స్త్రీసహజమగు మానాభిమానములను లజ్జను లెక్క-సేయక అట్లు వాదించుట అసామాన్య కృత్యమనియు ఒకానొక దైవశక్తి ఆమెయందు ప్రవేశించి యిట్లు సంభాషించెన"ని వారు భావించిరి. జయరాముని సతీయుక్తముగా శివలింగ ప్రతిష్ఠను గావింపుమని చెప్పిరి. ఈ సందర్భములో నొక విశిష్టతను గూర్చి చెప్పవలసి యున్నది. సామాన్య గృహస్థుగా నున్నను జయరాముడు పరమ భక్తశిఖామణి. అతనికి తగిన యోగ్యత - పాతివ్రత్యము - భక్తిప్రేమలుగల సహధర్మచారిణి - భగవతీదేవియను విషయమును పాఠకులు గ్రహించియే యుందురు. ఇట్టి పవిత్ర దంపతులు తొలిజన్మమున పరమేశ్వరుని కుమారునిగా పొందవలెనని పరితపించిరి. ఆ కారణమువనే - విశ్వప్రేమావతారుని కడుపార కని పెంచి లాలించి పాలింపగల సుకృతము వీరికేదక్కినది. కౌసల్యా దశరథులకు యశోదా నందులకు శబీజగన్నాథులకు గల్గిన మహాభాగ్యమీ దంపతులకు కల్గినది. జాంబునీ భక్తురాలుగా శ్యామునకు చవులూర నారగింప జేసిన కనకలతా దేవియే భగవతీరము సుందరీదేవియని భక్తులు గుర్తించియే యుందురు. రత్నాకర జాతిరత్నాలకు నెలవు గదా ! !

వసంతము సమీపించగనే ప్రకృతి సుందరి - ఒకవినూతన పరిణామముతో సొబగులీనుచుండును. లతలు ఒయ్యారముగా పిల్లగాలుల కదలికలకు నూగిసలాడుచు ప్రాణేశ్వరుని పొందుటకై పరితపించు నారీమణులవలె పెద్దవృక్షములను అల్లి

బిల్లిగా నల్లుకొని కౌగిలించుకొనుచుండెను. వికసించిన పూవులు ఉషాంగుననురాగ మకరందమును వచ్చి ఆస్వాదింప భ్రమర ములను మౌనముద్రతో - విస్ఫారిన కలువకన్నులతో పిలుచు చుండును. సరోవర తీరమును జేరనున్న మగువల యడుగు జాడలనుబట్టి కలహంసలు పయనించుచుండును. మ్రోడులు సైతము కాలప్రభావమున ఎట్టివారైనను క్రొత్తతీరుల సందికొన గలరనునట్లు చిగిరించుచుండును. చుక్కలు — నిండుచంద మామ — చకోరములు - మందమలయ పవనములు - వివిధా కృతులను వహించు మేఘములు - దూరతీరాల కనిపించు జలాశయవనీ పర్వతశిఖర మధుర దృశ్యములన్నియు - జన్మ జన్మలలో భర్తయై పరమానంద వీచికలను దేల్చిన మధురక్షణ ములను జ్ఞప్తికి దెచ్చుచుండును. రాధాదేవి నిష్కళంకమైన అనురాగభావన - ఆరాధన ప్రకృతి బోధించుచున్నదా ? యను నట్లు - ఏ పక్షులను జూచినను - ఏ యరవిందములను కను గొనినను - ఏ సెలయేళ్ల సరసినను స్ఫురించుచుండును. నిజ మాలోచించినచో మహాప్రకృతియే జీవులకు గురువను సత్యము నిశ్చయమనిపించు చుండును, కారుచీకటులు పూర్వజన్మార్జిత పాపములవలె, పండువెన్నెల - ఆసుకృతమువలె తోనును. మొత్తముమీద వసంత శోభతోపాటు జయరాముని గృహలక్ష్మి సుందరీదేవి అసామాన్య వ్యక్తిత్వపు వెలుగులు నలుదెసలకు వ్యాపించెను. ఈసారియైనను నందనందనుడు తమయింట పుట్టి తేదీయగ్ర చిన్నారి పొన్నారి చేష్టలతో విహరించునా ? యని లోలోన నాదంపతులనుకొనుచుండిరి. ఒకనాడొక సన్యాసి -

పెద్దగడ్డముతో పొడవైన జడలతో - శరీరమంతట విభూతి రేఖలతో - రుద్రాక్షమాలికలతో - కాషాయాంబరముతో - దివ్య తేజస్సుతో భగవతీదేవి యున్న యింటిలోనికి ప్రవేశించుచు "అమ్మా! నేను మీయింటికి అతిథినైతి న"నెను. ఆసమయ మున జయరాముడు కలకత్తాలోనే యుండెను. మగవారింట లేని సమయమున ఈ జడదారి యింతసాహసముగా ఇంటిలోనికి వచ్చుటయా ? యని సందేహించి ఆయనతో "అయ్యా! తాము శివాలయములో నుండుడు. మా పరిచారకులు మీకాహార మును సిద్ధముచేయగలర"ని చెప్పి ఆ భక్తురాలు అతనికి ఆలయ మున బసయేర్పాటుచేసి "మీకేమియాహారము కావలయున"ని ప్రశ్నింపగా "నీచేతులతో చేసిన పదార్థములేవియైనను భుజిం తును. అమ్మా! యీ పగటిపూట చేసిన పప్పు కూరలుకూడ వడ్డింపుమ" నెను. సుందరీదేవి మధ్యాహ్నపు వంటకములను పెట్టుటకు మొదట భయపడి యెట్టకేలకు ఆయన కోరినప్రకార మన్నియు నారగింపజేసెను. పిమ్మట ఆయన అందే నిద్రించెను. తెల్లవారిన తరువాత ఆయనను చూచుటకై యాతల్లి శివాలయ మునకు వెళ్ళెను. కాని అందేమూలను సాధువులేకుండుట గమ నించెను. ఆమెశరీరము వడవడ వణకెను. భయము - అందో ళన - ఆశ్చర్యము లొక్కసారి హృదయమున ఆవరించెను. అతడొక మహానుభావుడై యుండునని ఆమెభావించెను.

ఆనాటిరాత్రి కలకత్తాలో నున్న జయరాముని స్వప్న మున ఆసాధువు కనిపించి "జయరామా! నీవీయవలసిన ఆతిథ్య

మును మాయమ్మ మిక్కిలి ప్రేమతో నాకిచ్చినది. నేనెంతయు సంతోషించుటయే కాదు. గొప్పయానందమును గల్గించుచు ఇటుపైన మాయింటనే యుండెద"నెను. ఆ సంఘటన విచిత్రముగా తోచి అతడును మఱునాటి యుదయముననే సోనాముఖివచ్చి సతీమణితో "నిన్నటి రోజున ఒకసాధువు మనయింటికి వచ్చెనా?" అని యడుగగా భగవతి జరిగిన వృత్తాంతము నంతయు వివరించెను, జయరాముడు తనయనుభవమును గూడ చెప్పెను. ఇరువురును పరమేశ్వరుని అనుగ్రహ మెట్లుండునో యని భావించుచుండిరి. ఆ సాధువు గృహమునకు వచ్చిన తొమ్మిది మాసములకు భగవతీ సుందరీదేవి స్వస్తిశ్రీ క్రోధిసంవత్సర - ఆషాఢశుద్ధ అష్టమి శనివారము ప్రాతఃకాలమున గం 5- 45 ని॥ లకు హస్తానక్షత్ర యుక్త మిధున లగ్నమున అనగా తే1-7-1865దీని శ్రీహరనాథ చంద్రుని ప్రసవించెను. ఆషాఢ మాసమగుటచే ఆకాశము కాఱుమబ్బులతో నిండియుండెను. భోరున వర్షము పడుచుండెను. మెఱపులతో నుఱుములు అతిభయంకరముగా ప్రళయకాలము సమీపించినట్లు ఘోషించుచుండెను. ప్రజలు నిద్రించుచు - ఆ శబ్దమునకు భయకంపితులై ఉన్నచోటనేయుండి ప్రాణములను అఱచేతబెట్టుకొని యుండిరి. పురిటిగదిలో నొక యద్భుత సంఘటన జరిగెను. ప్రసవ వేదనపడు భగవతి సహాయమునకై కొందఱు స్త్రీలు అచ్చటికి వచ్చిరి. కాని అంతలో పెద్దమెఱపు తళుక్కున మెఱయుటచే ఆవిద్యుత్కాంతిచే వారికన్నులు మూతలు పడెను.

అదే సమయమున "హరిబోల్ హరిబోల్" అను మధుర శబ్దము ఆకసమంటునట్లు వినబడు చుండెను. శిశు రోదనము విన్పించిన తోడనే ఆ స్త్రీలు కనులు విప్పిచూచిరి. సుఖప్రసవమైనట్లు వారూహించిరి. రాగద్వేషములతో — ఈర్ష్య — అహంకారములతో మానవత్వమునే మఱచి — భగవత్ప్రేమను విడనాడి సంచరించు ప్రజలలో విశ్వ ప్రేమను — జనింపచేసి జగత్తునొక కుటుంబముగా చేయు టకై అవతరించిన మన హరగోపాలుని జననస్థితి యిట్టిదియని చదువరులు గుర్తింతురుగాక !

చైతన్య ప్రభువునుగూర్చి మీరు కొంత తెలిసికొనియే యున్నారు. ప్రేమరసప్రపూర్ణుడగు కృష్ణుని యవతారములలో మొదటిది గౌరాంగావతారము, రెండవది శ్రీహరనాథావతారము. ఆయన సన్న్యాసి. ఈయన గృహస్థు. అతడు రాధావిరహ ముతో కృష్ణునారాధించినాడు. ప్రభుసన్నిధికి చేరవలెనన్న హరి కీర్తనమే మార్గమని బోధించినాడు. ఈయన పాపాత్ములే తన సర్వస్వమని భావించినవాడు, కలియుగముననెట్టి వారైనను భగవత్సంకీర్తనమున పవిత్రులు కాగలరు. ఆయన అందఱకు చాలసన్నిహితుడు. జీవితేశ్వరుడు, అతడు ప్రేమాస్పదుడు కాని భయంకరుడు కాడని హెచ్చరించినాడు. హెచ్చరించుట యేగాదు వారిని ఆపత్సముద్రములనుండి ఉద్ధరించి వారికి నవ్యజీవితములను ప్రసాదించినాడు.

రామకృష్ణచైతన్యులు కొందఱు కొందఱితోనే క్రీడించినారు. ఇక హరనాథుడో!! భిన్న భిన్నమతములవారితో తెగలవారితో దేశవిదేశ భక్తులతో స్త్రీపురుషులతో క్రీడించినాడు. ఈ విషయమును మున్ముందు చదువరులు తెలిసికొనగలరు.

గౌరాంగప్రభువు అవతరించినపుడు కూడ హరనాథుని జననకాలమున జరిగిన సంఘటనలు ఏర్పడియుండెను. చైతన్యుని జననకాలమున చంద్రగ్రహణము. హరనాథుని జననకాలమున భూకంపము, ఈరెండు సమయములలోను ప్రజలు "హరిబోల్ హరిబోల్" అని ఆర్తితో గొంతెత్తిగానము చేసిరి. ఈరీతిగా అవతారపురుషుల - జననకాలములయందిట్టి మహాద్భుతసంఘటనలు జరుగుచుండుట పరిపాటి !!

ఈ పరిస్థితులను ముందుజరిగిన సాధుసందర్శనము మొదలైనలీలలను జూచి భగవతీజయరాములు తమకుగల్గిన బాలుడు మహాపురుషుడగునేమో! యని తలపోసిరి. ఏభావన గల దంపతులకు అట్టిసంతానమే కల్గుచుండును. ప్రేమానురాగములుగల స్వజనము గుర్తింపలేక పోయినను - విశాల విశ్వము ఆసంతాన సౌభాగ్యమును గుర్తింపగలదు., జోహారులందీయగలదు. జయజయనాదములతో సంకీర్తనలు గావించును. తరువాత కొన్ని దశాబ్దములకు హరనాథుడు - కృష్ణచైతన్యప్రభువుల సంపూర్ణావతారమని భక్తులు సంస్తుతించినారు.

పదునొకండవ దినమున జయరాముడు బాలునకు నామకరణోత్సవమేర్పాటు చేసెను. మహాపండితులు - వేదాంత

లానాటిసభలో పాల్గొనిరి. విద్వాంసులు జ్ఞాన—కర్మ — యోగ ములనుగూర్చి గంభీరముగా నుపన్యసించిరి. ఆనాటి సభకు 'కృష్ణదాసు' అధ్యక్షతవహించెను. హఠాత్తుగా జయరామ దంపతులకు పూర్వము కనిపించిన సాధుపురుషుడు కూడ ఆసభకు వచ్చెను. ఆయన లేచి భక్తి — పరమాత్మకృప — భగవన్నామమును గూర్చి "కృష్ణనామము దివ్యౌషధము." ఇతరములగు నౌషధములు శరీరవ్యాధులను మాత్రమే కుదుర్చును. భగవన్నామము మనోవ్యాధులను కుదుర్చుటలో అమోఘమైనది. అది భక్తులను పునీతము చేయుటయే కాక శాంతికినిలయమైన బృందావనమును చేర్చును. భగవన్నామము — భగవంతుడు ఒకటేయను దృఢవిశ్వాస మేర్పడినపుడు సంసారదుఃఖము లంతరించగలవు.

శ్రీకృష్ణనామస్మరణచేత జీవితశేషమును సార్థకము చేసికొనవలెను. నామస్మరణవలన కలుగు ఆనందమునకు శివత్వము బ్రహ్మత్వము కూడ సరిగావు.

కృష్ణుని సేవించి అతనిని పొందుటయే మనుష్యుని జీవితలక్ష్యము. సర్వము మనకిచ్చునట్టి ఆప్రభునియందే ప్రేమానురాగములు కల్గియుండుటయే భక్తి.

తాను భగవత్సేవకుడనను మాట మఱచినప్పుడు మనుష్యుని మహామాయ ఆవేశించును. భగవన్నామ మెచట జరుగునో మాయ ఒక్కక్షణమైనను అచట నిలువజాలదు.

నామస్మరణ - హరిగుణగానములే అన్నిటికి మూలము. శివుని ఆనందమునకు, నారదుని ముక్తికి - శుకదేవుని గొప్ప తనమునకిదియే కారణము, నామస్మరణ వలన ప్రేమజనించును. ప్రేమ ప్రేమాధినాథుని జేర్చును" అని గంభీరోపన్యాసము చేసెను. ఆవచనామృతమును ద్రావిన వారందఱును భక్తిపర వశులైరి. తరువాత రెండురోజులును పండితసభలు జరిగెను. ఆబాలునిజీవితము దివ్యప్రేమమయము కాగలదని అందఱు భావించిరి.

ఆనాడు ప్రకృతి మంద మలయ పవనములతో - నానా పుష్ప సుగంధములతో చాల ప్రసన్నముగా నుండెను. నలు దెసలు ప్రశాంతముగా నుండెను. శివకేశవులకు అభేదమని సూచించు సుమధురమైన 'హ ర నా థ' నామము తల్లిదండ్రుల నోటినుండి పైకివచ్చినదో లేదో - అప్రయత్నముగా బంధు మిత్రులు ఆనామము నుచ్చరించి నూత్నానందమును అనుభ వించిరి. వారితోపాటు ఆ నామగానమునకు సిద్ధమైనట్లు పరిసర తరువులపై వసించు కీరశారికాది పక్షులు అవ్యక్త సంగీతము నాలపించినవి.

ముద్దుల బాబునకు మురిపెముతో స్నానము చేయించి కాటుక బుగ్గ చుక్కబెట్టి - ఆ చేరడేసి కన్నులు - నిండు జాబిల్లివంటి మొగము, విద్యుద్దీపములవంటి నేత్రములు - నిగ నిగ లాడు బంగారు మేనుచూచి - తల్లి దృష్టిదోషము తగులు నేమోయని కొంతసేపు కన్నులు మూసికొనును. ఏ కీడును

కలుగకుండుటకై పలువేల్పులకు మ్రొక్కులు చెల్లించును. పాలిచ్చుచు - పసిబాలుని యుంగరములవంటి ముంగురులను నిమురుచు, అతడు తన శ్యాముడేయని మురిసిపోవును. ఈరీతిగా పాలిచ్చి - లాలించి పోషింపగల భాగ్యము కృష్ణుడు తనకిచ్చి నందులకు యశోదా శచీదేవులవలె సంతోషభరిత యగును. కొంత సేపటికి బాబును ఊయలలో పరుండబెట్టి-ఆనందాశ్రువులు చెక్కిళ్ళపై జాలువారుచుండగా జోలపాటలు పాడుచు - ఈ మాయా ప్రపంచమునే మఱచిపోవును. అహో!! అట్టి మాతృత్వమును నోచుకొన్న భగవతి పుణ్యము ఎన్నిజన్మల తపః ఫలమోకదా!! అపుడపుడు అందాల తనయునెత్తుకొని జయరాముడు దివ్యభావనలతో ముద్దుపెట్టుకొనుచు - జిలిబిలి పిలుపులతో నాతనిని పిలుచుచు - జన్మసఫలమైనట్లు ఎంచెడివాడు. తఱచు హరనాథుడు ఏడ్చుచుండెడివాడు, తల్లి యెన్నివిధములుగా నూరుకొనబెట్టినను - అతడూరుకొనక యట్లే యేడ్చుచుండుటచూచి తల్లి ఒకసారి భగవన్నామము నుచ్చరించెను. ఆ వింతశిశువు ఏడ్పుమాని బోసినోట చిఱునగవులు గ్రుమ్మరించుచు - కేరింతలుకొట్టుట ప్రారంభించెను. నాడు మొదలు సుందరీదేవి యాబాలుడేడ్చునపుడెల్ల భగవత్సంకీర్తన చేసెడిది. నెలలపిల్లవాడైనను- సుందరి కొడుకు చిత్రవిచిత్రములైన చేష్టలు చేయుచున్నాడని యిరుగు పొరుగునగల అమ్మలక్కలు వచ్చి యా శిశువును తదేకదృష్టితో పరికించెడువారు. ఆమూర్తిలో ఏమిమాహాత్మ్యము సమ్మోహనశక్తి యుండెనో

కాని అందఱాతనిని మాటిమాటికెత్తుకొని తనివిదీర ముద్దిడు కొనుచుండిరి. ఆడించుచు - ఏడ్పించుచు - ఊరించుచు నీలోక మునే మఱచిపోయెడివారు. ఆపసిబాలుడుగూడ వారికి చేతు లందిచ్చెడివాడు. ప్రతిదినము ఆయింటికి ఆడువారు వచ్చు చుండెడివారు.

అది యొకరాత్రి సమయము. అంతట నిశ్శబ్దము తాండవించుచుండెను. అంచఱు నిద్రపోవుచుండిరి. బాలహార నాథుడు మంచముపై హాయిగా నిద్రపోవుచుండెను. ఆసమ యమున భగవతీదేవి చెవులకు మురళీనాదము వినిపించెను. ఆ మృదుమనోహరగానము అంతరాంతరములలోని సంస్కార మును మేల్కొలుపుచున్నట్లుండెను. ఎక్కడినుండి ఆశబ్దము వచ్చుచున్నదో తెలిసికొనగోరి ఆయమ్మ గదినలువైపుల - బయట గాలించెను. ఆకమ్మనినాదము తనకుమారుని మంచము నుండియే వచ్చుచున్నట్లు గ్రహించెను. ఉన్నకొలది ఆశబ్దము అతిశ్రావ్యముగా - నెమ్మదిగా వినిపించుచునే యుండెను. ఏమియునెఱుంగని వానివలె మనహారగోపాలుడు చిఱునవ్వులు మాత్రమువెదజల్లుచు నిదురపోవుచుండెను. ఆదృశ్యమును గాంచిన భగవతికి ఆతడు మురళీధరుడే!! యనిపించెను. మఱి యొకసారి తెల్లవారుజామున పడకగదిలో కృష్ణుని పొగడుచు పాడెడు స్త్రీలకంఠములు వినిపించెను భగవతి - యన్నివైపుల వెదకెను. ఎవ్వరును కనిపించరైరి. ఒకవాడు వినిపించిన మురళీగానము - ఈనాడు వినిపించిన స్త్రీమధురమనోజ్ఞ గాన

ములను తలచి ఆయమ్మ యిదంతయు కృష్ణలీలయే యగునని విశ్వసించెను. ఆస్వామికి తనయందుగల ప్రేమాదరములకు మురిసిపోయెను

22రోజుల ప్రాయముగల హరనాథుడు తల్లితో శివాలయమునకు రావలెనని యేడ్చుచు మారాముచేసెను. ఎట్టకేలకు భగవతి ఆరోజున ఆలయమునకు తోడ్కొనిపోయెను. ప్రతిదిన మట్లే తనతో శివాలయమునకు రాదలచిన ఆకుమారుని గుడిలోనికి తీసికొని వచ్చెడిది. మొత్తముమీద దినమున కొక్కసారియైనను ఆశిశువు ఆలయమునకు పోవుటయనునది నిత్యకృత్యమయ్యెను. హరనాథుడేనాడును ఆలయమున మలమూత్రవిసర్జనచేసి యెఱుగడు. క్రమముగా తల్లితోపాటు తానును కులదైవతములైన శివశ్యామసుందరులకు సాష్టాంగముగా నమస్కరించెడివాడు. సోనాముఖిలోని మనోహరదాస సమాధి కడను ఆతడు జీవితాంతమువఱకట్లే నమస్కరించెడివాడు.

తల్లి శైశవదశలో నున్న హరనాథునిఒంటికి అవనూనె రాచియెండలో నుంచెడిది. కొంతసేపటికిఆ శిశువు శరీరముపైకి చీమలు ఉడుతలెక్కి విలాసముగా ఆడుకొనుచుండెడివి.

ఒకసారి భగవతి శ్యామసుందరుని పూజించుచుండెను. ఎక్కడినుండి వచ్చెనోకాని హరుడు నెమ్మదిగా ఆమె ప్రక్కకు చేరి పూజలో నిమగ్నుడయ్యెను. తల్లిఒకసారి కనులు తెఱచి చూడగా ఒకానొక దివ్యకాంతి ఆలయమందంతటనావరించినట్లు

అగుపించెను. శ్యాముని దయాదాక్షిణ్యములే అట్లు కాంతిమంతమై ప్రకాశించెనని యనుకొనెనేకాని తనబిడ్డ మూర్తినుండియే అట్టి తేజస్సు వచ్చుచున్నట్లు గ్రహింపలేకపోయెను.

హరనాథు డిపుడు ఆఱునెలల బాలుడు, తల్లి యతని నెత్తుకొనియుండగా నొక విషసర్పము ఎలుకను పట్టెను. దానిని పట్టుకొనుటకై పాములవానిని పిలిచిరి. అతడు దానిని మంత్రించి పిలిచెను. అదివెంటనేవచ్చి నిలిచెను. తల్లిచేతులలోనున్న మన హరుడు దానివంక చూచుచునే యుండెను. చిత్రమేమనగా నా పాము హరనాథు డెటువైపున్న - అటువైపే ఏకాగ్రతగా చూచుచుండెను. అది యేమిచేయునోయని తల్లి మిక్కిలి భయపడెను. ఈ దృశ్యమునుజూచి అందఱు ఆశ్చర్యపడిరి. పిల్లవానిలో నేదో మహిమ యుండియుండునని భావించిరి. ఆ మంత్రగాడు "దీనిని నేను పట్టజాల న'ని చెప్పి అటనుండి వెడలిపోయెను. తరువాత కొన్నిరోజులకు ఆబాలునకు అన్నప్రాశన మహోత్సవము జరిగెను. ఆనాడు మాయాశిశువగు హరుడు "గీతగోవింద" పుస్తకమును పట్టుకొనెను. పండితులు మునుముందీతడు గొప్పవేదాంతి యగునని యూహించిరి. ప్రాక్పశ్చిమముల నేకముగావించి - విశ్వప్రేమానుబంధముచే సదుపదేశములచే సర్వమతములకు సమన్వయము చేయగల్గునని మానవు లెట్లు గ్రహింపగలరు? హరనాథు డిపుడు ఏడాది బాలుడు. ముంజేతులతో ప్రాకుచు నెమ్మదిగా సమీపమునగల చెఱువుదగ్గఱకు వచ్చుచుండెను. 'గురుచరణనున్న'

అను నతడు ఈ బాలుని కాళ్ళకు త్రాడుగట్టి పైకివెళ్ళకుండ చూచెడివాడు. కాని హరుడు ప్రాకుచువచ్చి, పావురాలను — కాకులను-కోతులను తనతో మూరీలను తినుటకె పిలుచుచుండెడివాడు. పక్షులు - కుక్కలు - కోతులు మొదలైనవివచ్చి హరనాథునితో ఆడుకొనుచుండుట చూచి తల్లి మిగిలినవారు ఆశ్చర్యపడెడివారు.

ఆ శిశువునకు తెలియని విషయమనునది లేకుండెను. ఎక్కడ ఏదిదాచినను - దానినవలీలగా చూడగల నేర్పుతనిలో నుండెను. తల్లిదండ్రులు - పెద్దలు ఈతనికి దివ్యదృష్టి యున్నదనుకొనుచుండిరి. రెండేండ్ల వాడుగా నున్న హరుడు తల్లి దండ్రులు పూజాతత్పరులై యున్నపుడు - సమీపమునకువచ్చి నిలువబడి మిక్కిలి వినయముతో తలవంచి చేతులు జోడించి యుండెడివాడు!! రెండేండ్ల బాలుడెక్కడ? పెద్దవారితోపాటు దైవసన్నిధిని బద్ధాంజలియగుటెక్కడ? ఎంత మహోన్నత స్థితి!! ఆహా ! పూవుపుట్టగనే తావిపుట్టునుగదా! !

తల్లి రెండుమూడేండ్లప్రాయముగల హరుని చక్కగా అలంకరించి మెడలో బంగారుగొలుసువేసి మురిసిపోయెడిది. ఒకనాడాగొలుసు వేసికొన్న తమ్ముని కమల - తనయింటి దగ్గఅగానున్నశశి భూషణముఖర్జీ యింటికెదురుగా తీసికొనివచ్చి పిల్లలతో ఆడుకొను చుండెను. శశిభూషణముఖర్జీ హరగోపాలుని మెడలోని గొలుసును దొంగిలించెను. కాని బాలుని స్పృశించినది మొదలు ఆతని హృదయములో నొకవిధమైన

ఆవేదన బయలుదేరెను. చిట్టచివఱకు చేసినతప్పు తెలిసికొని - పశ్చాత్తాపముతో తిరిగి ఆగొలుసును బాలుని మెడలోవేయవలె నని అనుకొనెను. కాని యింతలో భగవతీదేవి కుమారుని వెద కుచు వచ్చుటచే చేయునదిలేక ఆగొలుసు నొకముఱికి కుండీలో పాఱవైచెను. తల్లి-పిల్లవానిని తీసికొని వెళ్ళుటకువచ్చి మెడలో గొలుసులేకపోవుటచూచి గొలుసులేదని అడుగగా బాలుడు అచట నున్న కుండీవైపునకే చేతివ్రేలితో చూపుచుండెను. తల్లి ఆ సంగతి గమనించి ముఱికికుండీని వెదకి చూడగా అందు గొలుసుకనిపించెను. తల్లిఅచ్చెరువందెను., బాలుని అసా ధారణశక్తికి శశిభూషణముఖర్జీ చకితుడై "అమ్మా! నేనుపాపిని. అదేమిచిత్రమోకాని - యీతనిని తాకినది మొదలు నాహృద యము తపించిపోవుచున్నది. చోరశిఖామణినగు నన్నుబాగు పఱచుటకే ఈ సంఘటన జరిగినది. ఇతడు సామాన్యబాలుడు గాడు. హృదయములను మార్చగల హృదయేశ్వరుడు" అని వలవలఏడ్చుచు బాలుని పాదములపై పడపోయెను. తల్లియం దులకంగీకరింపక గొలుసు లభించినందులకు ఆనందించుచు బాలునింటికి తీసికొని పోయెను. "నా కొడుకు మహానుభావుడా! దైవమా" అని కొంతసేపు తల్లియాలోచించెను. "కాదు, కాదు. ఇతడు నాముద్దులబాబు" అని మఱల మాయావరణములో మునిగిపోయెను. హరనాథుడు తఱచు నోరులేని జంతువులతో ఆడుచుపాడుచుండెడివాడు. సోనాముఖికి సుమారు 25 మైళ్ళ దూరములోనున్న దుర్గాలయమువద్ద ప్రతిసంవత్సరము ఉత్స

వము జరుగుచుండెను. దానిని జూచుటకై భగవతీజయరాములు వెళ్ళిరి. వెంటహరనాథుడుండెను. ఆయేడాది చాలమంది యాత్రికులు వచ్చిరి. స్నానముచేయుటకై యొకేయొక చెఱువుండెను. అది యాత్రికుల జనసమ్మర్ధముచే కలుషితమయ్యెను. అది మండువేసవి, ప్రజలు స్నానపానములకు చాలకటకటపడుచుండిరి. ఆలయావరణలో నొకచోట పాడువడిన పాతాళగంగయుండెను. ఆ విచిత్రబాలుడు ఆపాతాళగంగగల గొట్టమును చేతితో తాకెనోలేదో ఉవ్వెత్తుగా స్వచ్ఛమగు జలమతివేగముగా బయటికి వచ్చెను. ఆ ప్రవాహము నిర్విరామముగా పాఱుచుండెను. ప్రజలందఱు ఆనందించిరి. తల్లిదండ్రులకు గల్గిన ఆనందస్థితి ఊహాతీతము !! ఒకసారి భగవతీసుందరీదేవి, సోదరికమలయు బాలుని పరీక్షింపదలచిరి. తాళాలగుత్తిని కార్తీకచంద్రునింట దాచియుంచి "తాళాలగుత్తిపోయినది" అనియింటిలో ననుచుండిరి. ఆమాటలువిన్న హరనాథుడు వెంటనే తాతగారింటికివెళ్ళి దానినితెచ్చి తల్లికిచ్చెను.

చాలమంది బంధువులు - మిత్రులు మన హరగోపాలుని దివ్యదృష్టిని పరీక్షించెడివారు. అందఱినన్నివిధముల సంతృప్తిపఱచెడివాడు. దీనిని బట్టిచూడ మానవాతీతమైన శక్తి మనకథానాయకునియందు బాల్యమాది కలదని పాఠకులు గ్రహింపగలరు, క్రి. శ. 1868లో కమల - ఉమాపదముఖోపాధ్యాయులకు వివాహము జరిగెను.

ఒకసారి జయరాముడు కలకత్తాకు పయనమయ్యెను. హఠాత్తుగా హరనాథునకు జ్వరమువచ్చెను. అందుచేత అతడు ప్రయాణముమానుకొనెను. రెండవసారికూడ అట్లే జరిగెను. మొత్తముమీద కన్నుమూసినను - తెఱచినను జయరాము నకు హరనాథుడే జ్ఞప్తికి వచ్చుచుండెను. అతడే తన ప్రాణధనమని పించుచుండెను. అతనిని విడిచి బ్రతుకలేననెడు స్థితిలో జయ రాముడు చివఱిక్షణములను గడుపుచువచ్చెను. తనజీవితమంత వఱకు లాభదాయకముగను - సంతృప్తికరముగా నుండుటచే ధైర్యమందుచు నుండెను. ఇట్లుండగా జయరాముడు రోగగ్రస్థు డాయెను. ఎన్నిమందులు వాడినను, ప్రయోజనము లేకుండెను. చివఱిక్షణములలో భగవతిని దగఱకు పిలిచి "ప్రాణప్రదు డైన హరనాథుని బహు జాగ్రత్తగా చూడుము, నామనస్సం తయు ఈతనియందే లగ్నమైయున్నది. ఎట్టిపరిస్థితులలోను ఈతనిని శిక్షింపకు మ"ని హెచ్చరించెను.

ఇంతలో నొక దివ్యవాణి "జయరామా ! నీవునిజముగా ధన్యుడవు. పురుషోత్తముడు నీదగఱనే యున్నాడు. ఈలోక మును ప్రశాంతముగా విడచుటకు సిద్ధముగా నుండు మ"ని విని పించెను. సేవాపరాయణయగు భార్యను ఇద్దఱు కుమారు లను పుత్రికను ప్రాణసమానముగా భావించెడి జయరాముడు అవసానదశ సమీపించినట్లు గ్రహించెను, మధురప్రేమ పాశ ములచే తనవైపు మిక్కిలి ఆకర్షించు హరగోపాలుని యందు

మనోబుద్ధులను సమర్పించి పుష్యమాసములోని ఏకాదశినాడు 1867 లో గోలోకధామము చేరుకొనెను.

జయరాముని యనంతరము సౌశీల్యవతి - వ్యవహార దక్షురాలైన భగవతి కుటుంబభారమును వహించుటయేకాక కుటుంబములోనివారు కొన్నిచిక్కులు తెచ్చిపెట్టుచున్నను లక్క వ్యాపారమును మిక్కిలి సమర్థతతో 17 సంవత్సరాలు నిర్వహించెను. ఎవరిమాట యెట్లున్నను హరనాథుడుమాత్రము మాతృదేవతలోని ఋజువర్తనము - మంచితనమును తెలిసి నిత్యము మిక్కిలి భక్తిశ్రద్ధలు ఆమెయెడ కల్గియుండెడినాడు. "తల్లియాశీర్వాదము పొందినవాడు కష్టమనునది యెఱుగక సుఖించును. తల్లిసంతోషించి తనబిడ్డను దీవించినట్లయిన - ఆబిడ్డకీలోకములో లోటుండదు. అట్టివారు జీవితమును శాంతి సంతోషములతో గడపుటయేగాక కృష్ణచరణసన్నిధిని పొంద గలరు. తల్గినిఏడ్పించు వారెంతటి భాగ్యవంతులైనను విద్యా వంతులైనను స్వల్పకాలములో అన్నియు పోగొట్టుకొందురు" అను హరనాథుని సూక్తులవలన ఆతనికి తల్లియెడగల భక్తి గౌరవములు తేటతెల్లముకాగలవు.

పాఠకులారా! జీవితాంతమువఱకు హరనాథుడు అట్టి భావనగల్గియుండుటయేకాక తల్లిసేవకై యానందమునకై వివాహితుడయినట్లు మున్ముందు తెలిసికొనగలరు. తల్లిని గౌర వించుటలోను - తదితరస్త్రీలయందును - జంతుజాలములలోని

మాతృత్వమునెడ ఆయనకుగల దృష్టి లోకమునకు ఆదర్శ ప్రాయమైనది.

ఒకనాటిరాత్రి యిరుగుపొరుగు వారింటిలోపడి కొంత సొత్తును దొంగిలించి యొకదొంగ పోవుచుండుట గమనించి మన బాల హరుడు మంచముపై నుండి "రాధాగోవింద" అని బిగ్గఅగా నుచ్చరించెను. ఆపలుకుబడిలో నేమిశక్తియుండెనో కాని ఆపలుకులు ఆచోరుని హృదయమున ములుకులుగా ప్రవేశించెను. తాను చేసినది నీచమైన పనియని యతడు గుర్తించినవాడై లోలోను పరితపించుచు - కన్నీరుగార్చుచు - చెప్పరాని ఆవేదనను అనుభవించుచు ''ఈతడు భగవంతుడయి యుండును'' అని నిశ్చయించి అతడెంతోసేపు అట్లుండలేక పోయెను. ఒకానొకయాత్రితో నతడు భగవతీదేవి పాదములపై బడి తనగతచరిత్రను విన్నవించి తానొక మహాపాపిన''ని వాపోయెను. ఈసంఘటనను చూచిన యాతల్లి లీలామానుష బాలకుడైన కుమారుని దివ్యత్వమును లోదలచు కొనుచు మిన్నందికొనెను. గాలికి చెట్లపైనుండి క్రిందికి పడిపోయిన పక్షిపిల్లలను - పిల్లలు బాధించకుండ హరనాథుడు వానిని రక్షించుచు - ఒక్కొక్కపుడు చెట్లపైకెక్కి వానిని గూండ్లకు చేర్చెడివాడు.

హరగోపాలున కిపుడైదేండ్లు. అదియొక వెన్నెలరాత్రి. రమారమి తొమ్మిదిగంటల సమయము. పినతండ్రిగారియిల్లు

కొంచెముదూరము. మధ్యచాల చెట్లు పొదలుండెను. తిరిగివచ్చు నపుడు శివనాథుడు హరనాథుడునెమ్మదిగా నడచివచ్చుచుండిరి. శివనాథునివెనుక మిక్కిలి పొడవైనవాడును - పెద్దగడ్డముగల వాడు-కౌపీనధారి- ఇనుపదండమును ధరించిన యొక మహాపురుషుడు ఒకచెఱువు ప్రక్కగా వచ్చుచుండెను ఆతనిమొగము చందమామవలె తెల్లని చల్లని కాంతులను వెదజల్లుచుండెను. శివనాథుడతనినిజూచి భయభ్రాంతుడై అచట నిలువజాలక రివ్వున ఇంటిలోనికి ప్రవేశించెను. కాని పసిబాలుడగు హరనాథుడేమాత్రము చలింపక అతనిని జూచుచు ''ఇచటికేల వచ్చితివ"ని ప్రశ్నింపగా నతడు ''మీరిరువురినిజూచి దీవింప వచ్చితిన'' నెను. మహాపురుషుని గౌరవించుటకై హరగోపాలుడు అతని పాదములంటి నమస్కరింపబోయెను. కాని అతడందులకంగీకరింపక దూరముగాపోయి చెంతనేకల చెఱువునీటిపై నుండి నడచిపోవుచు నదృశ్యమయ్యెను. కొలని ప్రక్కనే కుటీరమునగల 'ప్రసన్నమాయి' ఆసంభాషణవిని యెవరోయనివచ్చి ఒంటరిగానున్న హరనాథుని "నీవెవరితోమాట్లాడు చుంటివ"ని యడిగెను. మావంటవాడగు ద్వారకానాథుడు సాధువేషముతో నన్ను భయపెట్టవచ్చెన"ని చెప్పెను. చనిపోయిన వంటవాడు దయ్యమై పిల్లవానిని భయపెట్ట వచ్చెనని తలచి ఆమె వెంటనే హరునెత్తుకొని భగవతీదేవి కీవిషయమంతయుచెప్పి యప్పగించెను. ఈమహాపురుషుడు హరనాథుని జీవితమున మూడు సార్లు దర్శనమిచ్చి యుండెను. మహాపురుషులకు సైతము

ఆశ్రయింపదగినవాడు హరనాథుడని మీరు కొంచెమూహిం చియే యుందురు. ఐదేండ్లబాలుడెక్కడ? మహాపురుష డెక్కడ? - ఋన్నుంది లీలావినోదియద్భుత విచిత్రలీలలను చవిచూడగలరు.

## హరనాథుని సంకీర్తన

హరనాథుని మాటలనువిని కొందఱు బాలురు తీరిక సమయములలో హరినామమును చేయుచుండిరి. అపుడపుడు హరనాథుడున్న సంకీర్తనలలో పాల్గొనుచుండిరి. కృష్ణునివలె అభినయించు హరనాథుని ఆకృతికి కమ్మని కంఠమునకు వశులైకొందఱు నామానందమున ఓలలాడుచుండిరి. కొందఱు తల్లిదండ్రులు భజనలోపడి తమపిల్లలు పనికిమాలినవారైపోవు చున్నారని వారిని కఠినముగా శిక్షించుచుండిరి, జగదీశ్వరుడా ప్రకారముగా కుమారుడయిన ఉపేంద్రుని దండించెను. ఈసం గతి తెలిసిన హరనాథుడు ఆమఱునాడు ఏదో విధముగా ఆబాలుని తల్లిని ఒప్పించి వారియింట భజన ఏర్పాటు చేయించెను.

ఆరాత్రి హరనాథుడు గోపాలునివలె చక్కగా నలంక రించుకొనెను. నంకీర్తన ప్రారంభమయ్యెను. చాలమంది స్త్రీ పురుషులు గుమిగూడిరి. హరనాథుని నోటినుండి వెలువడుపాట- అంతరంగములలో దాగియున్న భావాలను బయటకుప్రకుమ్మ రించువెన్నెలతేటవలెనుండెను ఆపాటలో.

"పాపులకాపాడు పరమేశ్వరుడవు
ఏపాటి ప్రతిఫలమిమ్మనబోవు
చిఱునవ్వులంజిల్కి మురిపెమ్ముగూర్చు
దొర! నిస్సహాయుని మొఱ వినవోయి
హరికృష్ణ హరికృష్ణ హరికృష్ణ కృష్ణ!
హరికృష్ణ హరికృష్ణ హరికృష్ణ కృష్ణ"

అనుభావముండెను. జగదీశ్వరుడా పాటను వినుచు నాయాభావములను గూర్చి యాలోచించుచు హరనాథునివంక తదేకదృష్టితో చూచుచుండెను. ఇంతలో హరనాథుని నుండియొక దివ్యమైన తేజస్సు బయల్వెడలి నాల్గువైపుల వ్యాపించుచుండెను. నృత్యము చేయుచున్న హరునిచుట్టు ఎందఱెందఱో అందమైన బాలురు పాడుచు నృత్యముచేయుచుండుట కనుగొనెను. ఆశబ్దము జగదీశ్వరుని హృదయమును భేదించెను. అతనిలో గూడుకట్టుకొనిన అహంభావము పటాపంచలైపోయెను. అతడు తెలివిదప్పి "హరనాథ్ హరనాథ్" అని కేకలుపెట్టుచు నేలపై కొరిగెను. కొంతసేపటికి తెలివిదెచ్చుకొని మున్నెన్నడు తాను అనుభవించని ఆనందానుభూతిని అందజేసిన హరనాథుని తనివిదీరముద్దాడెను. జగదీశ్వరునివలె చాలమంది తల్లిదండ్రులిట్టి యెన్నో అనుభవములను—లీలలను చూచి హరనాథుడొక దైవాంశసంభూతుడని భావించెడివారు.

ఏయవతారమునను ప్రదర్శింపని లీలలు - అద్భుత సంఘటనలను హరనాథుడు మాత్రమే ప్రదర్శించెను. ఇవియనం

ఖ్యాకములుగా నున్నవి. వానినన్నిటిని చెప్పబూనినచో నవి
యన్నియు నొక మహాగ్రంథమగును. మఱికొన్ని అనిర్వచ
నీయములు., అనూహ్యములై యున్నవి. మహాసంశయము -
వితండవాదము - మూర్ఖత్వముగల మానవులను ఉద్ధరించుటకై
యీాయన యీాయనంతలీలలను ప్రదర్శించుచుండును. ఈలీలా
పరంపరల తరువాతనే వ్యక్తులు విశ్వాసముగల వారగుదురు.

“కులము - మతము - వానిసిద్ధాంతములకు నేనుఅతీతు
డను - విశ్వప్రేమయే నాసహజలక్షణము” అను విషయ
మును ఈయన చిన్నతనముననే లోకమునకు వెల్లడి చేసి
యుండెను. పశుపక్ష్యాదులకు తినుబండారములనుబెట్టి-యవితిను
చుండగా ఆనందించును. పెంపుడు కుక్కకు తాను అన్నమును
దినుచు ముద్దపెట్టుచుండును. ఆచేతితోనే భుజించును. అస్పృ
శ్యురాలని అందరిచేత ఈసడింపబడు బీబ్లీ హారిణిని హర
నాథుడెంతో ప్రేమతో చూచెడివాడు. ఒక్కొకసారి ఆమెయే
అన్నము తినిపించవలెనని పట్టుబట్టెడువాడు. అమెచంకనెక్కి
ముచ్చటపడెడువాడు. ఆమె యవసానదశలో మన బాలహర
నాథుడు ఎంతయో సేవగావించెను. అస్పృశ్యతా నివారణమున
కానాడే హరనాథుడు ప్రారంభోత్సవము చేసినట్లనిపించును.
గురుచరణమన్న అనునతడొక సేవకుడు. అన్నిముఖ్యక్షేత్రము
లను దర్శించిన ధన్యజీవి. తానుచూచిన యాత్రావిశేషములనుహర
నాథునకు ప్రీతిగాచెప్పెడువాడు. అతనియెడ తానెంతో గౌరవ
ప్రేమలను జూపెడువాడు. ప్రాణప్రయాణ సమయమున సేవ

చేయుటయేకాక అతని మనస్సునకు సుఖసంతోషములను సమకూర్చెను. అతడు నిశ్చింతగా హరగోపాలుని సన్నిధినే ప్రాణములను విడిచినపుణ్యశాలి.

కుసుమకుమారీదేవి జననము

అన్నియుగములలో కలియుగము పాపములకు ఆలవాలమైనది. శారీరకమైన సుఖసంతోషాలను పొందవలెననియే ప్రజలు ప్రయత్నింతురుగాని., శరీరమునిచ్చి - సర్వసుఖసంపదలను సమకూర్చిన జీవితేశ్వరుని మఱచిపోవు చుందురు. మానవ జన్మ కృష్ణుని పొందుటకే మనకీయబడినది. ఈవిషయమును మఱచుటయే అజ్ఞానము, అదియే మహామాయ. దానినుండి ముక్తులముకావలెనన్న - దయామయియగు మహాప్రకృతి కటాక్షము కావలెను. భయంకరమగు సంసారబంధములనుండి విడుదలకావలెనన్నను - ఆతల్లి యనుగ్రహము కావలెను. మనోబుద్ధులు కృష్ణునియందు ప్రసరింపవలెనన్నను ఆరాధాదేవి దయ కావలెను. మాయాంధకారమున మునిగి కర్తవ్యమును మఱచి వ్యర్థజీవితమును గడపు బిడ్డలను మేల్కొల్పి - మందలించి - బుజ్జగించి వారిని శ్రీకృష్ణ చరణ సన్నిధికి గొంపోగల శక్తి - పరాశక్తికూడ ఆమెయే!! ఆ దివ్య శక్తి - జగదంబ చల్లనిచూపులచేతనే బ్రహ్మాదులు తమ పనులను నెఱవేర్చు కొనుచుందురు. పరమపురుషుడు ఆమహాపకృతి సహకారసంపదలతోనే సంసారబద్ధజీవులను ముక్తు

లను జేయుచుండును. ఆమెయే ప్రేమానందనిలయమగు రాస మండలిలో జీవులను ప్రవేశింపజేయును. ఆప్రకృతి అంతగొప్పది. నిజముచెప్పవలెనన్న లక్ష్మి—సీత—సరస్వతి—దుర్గ—పార్వతీరూపములన్నియు నామెయే! సచ్చిదానందస్వరూపిణియై యీజగన్నాటకమును ఆమెయే రక్షిగట్టించును, పెంచును, నశింపజేయును

అట్టిప్రేమమయియొక్క సంపూర్ణసహకారమును హరనాథుడు తీసికొనదలచినాడు, జీవితభాగస్వామినిగా - దీనజన పాలినిగా - భక్తజన కల్పవల్లిగా - అఖండ కృపారస వర్షిణిగా మనహృదయాలలో హరనాథనామ ప్రేమమురళీ గానామృత ధారలను వెదచల్లునమృతమూర్తియగు కుసుమకుమారీదేవిని గూర్చి చదువరులిపుడు తెలిసికోగలరు.

పవిత్రక్షేత్రమగు సోనాముఖిలోనే కందర్ప సుందరుడను బ్రాహ్మణసత్తముడు నివసించుచుండెను. అతని భార్యామణి చంద్రావళీదేవి. భగవతీసుందరి యింటికి వీరియిల్లొక మైలు దూరమున నుండెను. భగవతీ చంద్రావళులిద్దఱు మంచి స్నేహితురాండ్రు. ఒకరియింటికి మఱియొకరు తఱచువెళ్ళుచు-వచ్చుచుండెడివారు. వారి స్నేహానురాగములు లోకోత్తరములైనవి. చంద్రావళి చాలకాలమునకు గర్భవతియైనది.

చంద్రావళి సుఖప్రసవముకాక ఒకటి రెండురోజులు మిక్కిలి బాధపడుచుండెను. తాను బ్రతుకనని నిరాశచెంది ఆమె బంధుమిత్రులకు కబురంపెను. వారువచ్చి యామెను చూచిపోవుచుండిరి. ఈపరిస్థితి తెలిసికొనిన భగవతీదేవి

వెంటనే అక్కడికివచ్చెను. బదికిపోవలసిన బాలహరనాథుడు, కమలతోకలసి తల్లివెంట వచ్చెను. భగవతి - గదిలోనికి ప్రవేశించినతోడనే చంద్రావళి - ఊరటచెందెను. తరువాత కొన్ని క్షణములలో చంద్రకళాకాంతులతో నొకయాడుపిల్ల జనిమ్రంచెను. ఆశుభదినము 1870 డిశంబరు 14వ తేదీ. పుట్టిన శిశువు కనువిప్పక - ఏడువకుండెను. ఆడువారందఱును ఆ కసికందును చూడముచ్చట పడుచుండిరి. ఇంతలో ఆ ప్రక్కనే కూర్చున్న హరగోపాలుడా శిశువును జూచెను. ఆ బాలునిచూపు ప్రసరించెనోలేదో బాలసూర్యరశ్మి సోకిన ఉదయ కమలమువలె - ఆయందాలబాల మొగము చిఱునవ్వులతో వికసించినది. హరనాథుని ముఖమండలము నూత్నానురాగకాంతి పుంజములతో నిండిపోయినది. వారిరువురును ఒకరినొకరు చూచుకొన్నారు. ఆచూపులో ఎన్నిజన్మల యనుబంధమున్నదో యెవరికి తెలియును ? భగవతికి ఈసంఘటన ఆశ్చర్యమును కలుగజేసినది. కాని వారు ఆదర్శదంపతులైన తరువాత ఆ తొలిచూపులోని దివ్యత్వము - ఆత్మీయత — లోకము గుర్తించినది.

హరనాథుడు రెండేండ్ల బాలుడుగానున్నపుడు చంద్రావళి భగవతీదేవితో మాటలసందర్భమున తనకు ఆడుపిల్ల కలిగిన పక్షమున తప్పక హరనాథునకు చేసికొనవలెనని కోరెను. ఆమాటకు భగవతి సంతోషించి అట్లేయని అంగీకరించెను. వారిమైత్రీబంధమట్టిది.

హరనాథుని విద్యాభ్యాసము :-

1870 లో అయిదవయేట హరనాథునకు అక్షరాభ్యాసము జరిగెను. అపుడు గురువు శాస్త్రనిహితమైన అక్షరములను చెప్పగా బాలహరుడు తనకు 'రాధాకృష్ణ' నామమును చెప్పుడని కోరెను. గురువాతని యభిలాషకు మురిసిపోయెను. అన్న శివనాథునితో కలసి చదువుచు - ఆడుచు పాడుచుండెడివాడు. మన హరగోపాలుని వినయవిధేయతలు - గ్రహణశక్తి అసాధారణమైనవి. అవి ప్రధానోపాధ్యాయుడైన తారాచంద్ర సర్కారు నాకర్షించినవి. బుద్ధికి బృహస్పతిగా తోచు నీబాలునకు సంస్కృత పండితుడగు నా యుపాధ్యాయుడు భాగవతాది గ్రంథములలోని అనేక ముఖ్యవిషయములను అపుడపుడు బోధించెడివాడు. ఆవిషయ పరిజ్ఞానముతో హరనాథుడు పండిత సభలకు వెళ్లి ఆధ్యాత్మిక విషయములను గ్రహించెడివాడు. ఒక్కొక్కప్పుడు పండితులకు స్ఫురింపని విషయములను తటాలున చెప్పుటచే హరనాథుడు అందరి ప్రశంసలకు పాత్రుడగుచుండెడివాడు. విద్యార్థియగు హరనాథునివాక్కు - మృదుమధురమై యెట్టివారినైనను వశపఱచు కొనగలదై యుండెను. సోనాముఖి - మలేరియా - ఇన్ఫ్లూయింజా వంటి అంటువ్యాధులున్నచోటు. అందుచే ఈయనగూడ బాల్యమున నిట్టి వ్యాధులను అనుభవించినవాడే!! వయసుగడచిన కొలది ఆతని దేహము బలిష్ఠము కాజొచ్చెను. బాగుగా ఆలోచించి చూచినచో చిన్ననాటినుండియు అనుభవించిన వ్యాధులన్నియు

తనవిగాక తనకుతానై ఇతరులనుండి తీసికొన్నవే !! అటులనే ఈయన ఇతరుల పాపభారములను పరమప్రీతితో భరించుట యను మహోదార కార్యక్రమమును చేపట్టినాడు. అది యీ యవతారములోని ప్రధానాంశము. యోగ్యులను అయోగ్యులను సైతము కోరి తనవారినిగా చేసికొని క్రీడించిన అఖండ లీలా మాధురీ వైభవమును మునుముందు పాఠకులు చవిజూడగలరు. మిగిలిన యవతారములన్నియు దుష్టశిక్షణ చేయుటకే వచ్చినవి. ఈప్రేమావతారము ప్రత్యేకముగా పాపుల దీనులకొఱకే వచ్చినది. సంసార రోగబాధితులు - నాస్తికులైనవారికి సైతము భగవన్నామరుచిని తెలియజేసి వారిహృదయాలను ప్రేమ మయము లొనర్చి ఉత్తమ భక్తమణులుగా తీర్చిదిద్దిన హర నాథుని యవతారము సర్వోత్కృష్టమైనదని గ్రహింపగలరు. లోకోద్ధరణకై రామకృష్ణాదులు గురుసన్నిధిని విద్యనభ్యసించిరి. గురువే జీవితమార్గదర్శకుడు- పరబ్రహ్మమని చాటినారు. అట్లే హరనాథుడుకూడ అన్న శివనాథునితో ప్రాథమిక పాఠశాలలో గురువులచెంత చదివెను. అంత చిన్నతనములో కూడ మంచిశీలము - పరోపకారపరాయణత - వినయ విధేయతలు ఆయనకు సహజాలంకారములుగా నుండెను. తనయీడువారి నందఱి నొకచోట చేర్చి హరినామసంకీర్తన చేయుటకై ఈ బాలుడు 'హరిసభ' ను నెలకొల్పెను. 1873 లో హరగోపాలునకు ఉపనయనము (బ్రహ్మోపదేశము) జరిగెను. ఆసమయమున హరుడు "ఉపనయన" సంస్కారములోని ఆంతర్యమును చెప్పగా విని బంధుమిత్రులు విస్మితులైరి.

తరువాత కొంతకాలము ఉమాకాంత తర్కాలంకారుని వద్ద వేదశాస్త్రములను అభ్యసించెను. వేదాంతశాస్త్రములోని లోతుపాతులను సులభముగా గుర్తించెను. ఉత్తములగు నుపాధ్యాయుల బోధనచే హరనాథుడు జీవితసారమును గ్రహించెను. విషయమును నిర్ణయించుటలోను - వాదప్రతివాదములలో నెగ్గుటలోను-ఒకరికి మనసిచ్చి వారిమనస్సులను ఇట్టేదోచుకొనుటలో బాలహరనాథుడు అగ్రగణ్యుడని ఆనాడే యందరూహించిరి. ప్రాథమికపాఠశాలలో చదువునపుడొక రోజున ఇద్దఱుపాధ్యాయులతోను మఱికొంతమంది బాలురతో కలసి హరుడు సోనాముఖికి 4 మైళ్ళదూరమునగల 'ధనసిమ్లా' గ్రామమునకు వెళ్ళెను. అక్కడ జరిగిన కోడిపందెములను . పొట్టేళ్ళపోరాటములను చూచిన తర్వాత అందఱు తిరిగి వచ్చుచుండిరి. వారికి ఎదురైన యొకమనిషి దగ్గఱగా నొకపెద్దపులి ఆవును చంపితినుచున్నదని - రొప్పుచు రోజుచు చెప్పెను. ఆమాట వినగానే ఉపాధ్యాయులు - పిల్లలు భయపడి దూరముగాపాఱిపోయిరి. కాని హరనాథుడేమాత్రము చలింపక గొడుగువిప్పి దానికిచూపెను. తోడనే ఆపులి పలాయనమయ్యెను. హరగోపాలుని ధైర్యసాహసములకు - మహిమాతిశయమునకు అందఱు ఆశ్చర్యపడిరి. ప్రాణదాతవద్ద ఏజీవియైనను జోహారు చేయవలసినదే కదా !!

M. E. స్కూలులో నాలుగేండ్లుచదివి - విష్ణుపురమునకు సమీపముననున్న 'కూచియాకోలులో' రాధావల్లభ

హైస్కూలులో ప్రవేశించెను. శివనాథుడు చదువుచాలించెను. మిక్కిలిశ్రద్ధతో హరనాథుడు చదివి 1885లో కలకత్తా విశ్వ విద్యాలయమువారి ప్రవేశపరీక్షలో నుత్తీర్ణుడయ్యెను.

"కోచియాకోలు" వైష్ణవమత కేంద్రము. తఱచు అచట రామాయణ, భారత, భాగవత-భగవద్గీతోపన్యాసములు జరుగు చుండెను. భక్తిప్రేమలను బోధించు నాటకములు అచట ప్రద ర్శింపబడు చుండెను. భజనలు జరుగుచుండెను. హరనాథుడు వానిలో పాల్గొనుచు భవిష్యత్కార్యక్రమమునకు కావలసిన జ్ఞానమును సేకరించుచుండెను. ఆయూరిలో యొక యిల్లు కాలి పోవుచుండగా హరుడు కొందఱు బాలురతో కలసి యార్పి వైచెను. పరులకు ఉపకారము ఏసమయమందైనను చేయుటకై హరుడు సిద్ధముగా నుండెడివాడు. ఆరోజులలో వంగదేశమున కూడ బాల్యవివాహములు చేయుట ఆచారమై యుండెను. ఒకపిల్ల వానికి ఒక్కరిద్దఱు బాలికలను పెండ్లిచేయుట జరుగుచుండెను. భగవతీదేవి శివనాథునకు 'గులాబ్ సుందరి' అను కన్యను వివాహము చేసెను. మంచియోగ్యత, ఉత్తమ వంశీయత, గల హరనాథునకు "మేము పిల్లనిత్తుము; మేము పిల్లనిత్తు మ"ని చాలమంది బంధువులు పెద్దకట్నముల నిచ్చుటకు సిద్ధపడిరి. కాని భగవతీదేవి చంద్రావళి కిచ్చిన మాటప్రకారము కుసుమ హరనాథులకు వివాహము నిశ్చయించెను. కుసుమదేవికి తొమ్మిదేండ్లు, హరునకు పదునాల్గేండ్లు. పెద్దయింటివారితో ముఖ్యముగా ప్రాణమిత్రురాలైన భగవతి కుమారునితో తమ

పుత్రికకు వివాహము జరుగుచున్నందులకు చంద్రావళి కంద ర్పుల ఆనందమునకు మేరలేకుండెను. గుణవతి - ప్రాణ మిత్రురాలైన చంద్రావళి తనయతో తనకుమారునకు పెండ్లి యగుచున్నందులకు భగవతి పరమానందమున నుప్పొంగు చుండెను.

1879 జనవరి 29న (మాఘశుద్ధ రథసప్తమి) కుసుమ హరనాథులకు కల్యాణము అతివైభవముగా జరిగెను. అత్తవారు హరనాథునకు వందరూపాయలు - బంగా రుటుంగరమును కట్నమిచ్చిరి. కుసుమదేవికి బంగారు గాజులును - కాళ్ళకు వెండివస్తువు లీయబడెను. ఈడుజోడు - సోయగము సౌజన్యముగల నవవధూవరుల పెండ్లివేడుకను సోనాముఖీవాసులు కనులారతనివోవ తిల కించిరి. వారికి రాధాకృష్ణులవలె, సీతారాములవలె, విష్ణు ప్రియా గౌరాంగులవలె వారు కనిపించిరి. సూక్ష్మ శరీరము లతో బ్రహ్మాది దేవతలు ఆ పరిణయ దృశ్యమును వీక్షించిరి; అభినందించిరి. గంధర్వులు గానము - అప్సరసలు నాట్యము చేసి తమకా కళలబ్బినందులకు చరితార్థత గలిగినట్లు మురిసి పోయిరి. లోకోత్తర విశ్వప్రేమను - ఆదర్శ గృహధర్మ మును ప్రపంచమున కందీయనున్న యీ యుగళమూర్తుల వివాహమహోత్సవ భాగ్యమబ్బినందులకు 'సోనాముఖి' సంతోష తరంగ డోలల నోలలాడుటయేకాదు., నిజమైన బృందావనము తానైనట్లు పరవశించినది. మాఘమాసము ఫలపుష్పమాధుర్య

సౌరభములతో గంగాతరంగ శీకరసిక్త మందమలయ పవనములతో ఆదిమదంపతులను అర్చించినది. అనురూప సౌందర్య సౌశీల్యరాసులు-త్యాగధనులు ప్రేమాధినాథులగు వారిపెండ్లియే పెండ్లియను భావనతో కాబోలు ప్రకృతి సుందరి - నిండు హృదయముతో ప్రసన్న వదనముతో -చారుదరహాసవిలాసములతో - వన్యవిహగీ గీతాలాపములతో - భ్రమర ప్రణవారావములతో - శీతల చంద్రజ్యోత్స్నలతో వారి నారాధించినది., పులకించినది.

"అన్ని యాశ్రమములలోను గృహస్థాశ్రమము శ్రేష్ఠమైనది. మనసు పరిపక్వము కాకుండ స్వీకరించు సన్న్యాసము వలన ప్రమాదమేకాని ప్రమోదములేదు. భగవంతు డొసగిన యౌవన విద్యాధనములను మాధవార్పిత మొనర్చి - తాము నిమిత్త మాత్రులమని తలచుచు - మాయనంటనీయక మధుర భగవన్నామమును నిరంతరము స్మరించుచు - వీలయినంత వఱకు దీనులకు పేదలకు సహాయపడుచు గడుపగల జీవితమే జగత్కల్యాణమును గల్గించును, హరిని పొందుటయే మానవ ధర్మము. ఆ ధర్మయుక్తమైన దీక్షతో అర్థకామములను అనుభవించవలెనేకాని పశుపక్ష్యాదులవలె కేవలము భోగ లాలసులు కారాదు. ఈ ప్రపంచము తాత్కాలికముగా నుండుటకు నుపయోగపడు ' సత్రము' గా భావింపబడవలెను. కృష్ణార్పిత చిత్తులు జీవన్ముక్తులు. మీదు మిక్కిలి హరినామామృత పానమత్తులు నిజమైన ఆనందమనుభవింపగలరు. సంసారులు

భగవన్నామముతోనే ప్రభుని కృపను పొందవచ్చును, సందేహము లేదు'' అను పరమసత్యమును ఆచరించి చూపుటకే హరనాథుడు - సామాన్య మానవునిగా ఆదర్శగృహస్థుగా - విశ్వకుటుంబిగా - ప్రేమమూర్తిగా భాసిల్లగలనను భావనతో కంకణము గట్టుకొనెను. విశ్వజననియగు కుసుమదేవి - హరనాథుని అర్ధాంగలక్ష్మియై తనపాత్రను పోషించుటకై సిద్ధపడెను.

కూచియాకోలులో పాఠశాల విడిచినతరువాత సహచరులందఱును హరనాథుని ఆడుకొనుటకురమ్మని పిలుచుచుండిరి. కొంత సేపు ఆడినట్లుఆడి ఇకనాడుటకిష్టములేక కన్నులనుండి బాష్పములను గార్చుచు హరుడు ఒంటరిగా నుండిపోయెడివాడు. మిత్రులందఱతని చుట్టునుగుమిగూడి "నీవేలమాతోకలసి యాటలాడవు?" అనిప్రశ్నించెడివారు. అపుడు హరగోపాలుడు ఆర్ద్రహృదయముతో- భక్త్యావేశముతో ''నాయనుగు మిత్రులారా! మనమున్న దైన్యస్థితిని తలచుకొనుచు విచారించుచున్నాను. అమూల్యమైన కాలమును ఆటపాటలలో గడపుచున్నాము. ఈసమయమును హరిని స్మరించుటలో గడుపగల్గిన మనకెంతో లాభముకల్గును. ఆటపాటలలో మనము ఆహరినే భజించవచ్చున"నెను.

ఆ మాటలనువిని యొకబాలుడు ''హరనాథా? ఆడుకొనునప్పుడు చెప్పరాని యానందముకల్గునుగాని ఎప్పుడు హరి సంకీర్తన చేయుటవలన విసుగుపుట్టదా? అని ప్రశ్నించెను.

హర :— ఆటలాడుటవలన కల్గుఆనందము తాత్కాలికమైనది. నామస్మరణవలన కలుగునట్టి యానందము శాశ్వత మైనది. భక్తితో హరినామమును చేయుచున్నకొలది కృష్ణుడు మనకు ప్రాణమిత్రుడగును. లేగదూడ వెంట వాత్సల్యముతో పోవునావువలె ఆయన మనలను అంటి యుండును. మనలను ఆపదలనుండి కాపాడుటయే కాక — కోరినకోర్కెలనెల్ల ప్రసాదించును. అటువంటి మిత్రుని తప్పక సంపాదించ వలసియున్నది.

మఱియొకబాలుడు "హరా! నీవు గోపాలుని ఎపుడైనను చూచితివా? నీవతనిని చూడనిపక్షమున నంతచక్కగా వర్ణింపలేవు గదా! అతడేలాగున నుండును?

హర :- అతనిని నేనుచూచితిని. అతనిరూపము వర్ణనాతీతమైనది. మనము నామమెంత ఎక్కువగా చేసిన అంత ఎక్కువగా ఆయన మనలను ప్రేమించును. నిజము చెప్పుచున్నాను. గోపాలుడు నాకు రోజు కనిపించుచుండును. మీరునామము నిత్యము చేసినచో ఆయన తప్పక కనిపించును. నామమును చేయుటయనగా ప్రభువును పిలుచుటయే !! ఏమిత్రుడైనను పిలువకుండ వచ్చునా?

బాలు :- పిలువకుండ నెవ్వరునురారు. నీవుచెప్పిన సంగతి తెలిసినది. నామముచేయుట యనగా భగవంతుని పిలుచుటయే యన్నమాట, మంచిమాట చెప్పితివి. కాని హరినామములోని గొప్పతనమును నీవు చెప్పగా విన గోరెదము.

హ :- నెచ్చెలులారా ! హరి - హరినామము చేసినవారికి వశ మగును. వేలసంవత్సరములు జపతపములు గావించిన వారికి లభ్యుడుకాని కృష్ణుడు నామసాధకులగు భక్తులకు సులభముగా చిక్కును. నామమువలన మనకు అపరిమితమైన ఆనందము కల్గును. నిజమైన ఆర్తితో - భక్తితో మధురనామమును చేసినచో ఆ నామప్రియుడు మనచెంతనే చక్కగానాట్యము చేయుచుండును. అతని యాట చాల అద్భుతమైనది. చూచినవారెవ్వరును దానిని వర్ణింపలేరు,, మఱవలేరు.

బా ;- హరా ! మనము ఎన్నాళ్లలో ఆయనను చూడగలమో చెప్పు.

హ :- ఆమాట మీరెత్తకుడు. మనమెంత ఆవేదనతో ఆసక్తితో నామమును చేయుదుమో దానినిబట్టియే అతడు కనబడును. సంకీర్తనచేయుటయే మనధర్మము. కరుణించుట ఆతనిధర్మము. ఏదోసమయమున ఆయన తప్పక కనబడితీరును. విశ్వాసము కల్గినపుడు ఏకార్యమైనను సఫలీకృతమగును. భగవన్నామముపట్ల విశ్వాసముండవలెను. అది ఉన్నతస్థాయికి తీసికొని పోగలదు.

బా ;- హరనాథా ! అట్లయిన మేమీనాటినుండియు నీతో భజన చేసెదము. సంకీర్తన యెట్లు చేయవలయునో మాకు చెప్పుము. వినుటకెక్కువ కుతూహలమగుచున్నది.

హర :- మిత్రులారా ! భజనచేయుటకు ఇష్టపడినందులకు నాకు సంతోషమగుచున్నది. నేనిపుడొక పాటపాడెదను. మీరును చేతులలో చేతులుకలుపుచు నన్ను అనుసరింపుడని "రాధేగోవింద రాధేగోపాల" యని హరనాథుడు గొంతెత్తి పాడనారంభించెను. ఆగొంతులోని అవ్యక్తమాధుర్యము — అతివినమ్రతతో కూడిన ఆర్తి వారి హృదయములను వెంటనే వశపఱచుకొనెను. కొన్నిక్షణములలో వారందఱును అతనిని అనుసరించిరి. మాటలతో చెప్పుటకు వీలుగాని ఆనందమును వారనుభవించిరి. నాడుమొదలు ఆబాలురంఱును హరనాథుని సహచరులైఎక్కడ సంకీర్తన జరిగినను-అక్కడికివచ్చి అందు పాల్గొనెడివారు. హరనాథుని అద్భుత నృత్యగానములు ఊరూర సమ్మోహనములై ప్రజల మన్ననల నందికొన్నవి. అందు ముఖ్యముగా తల్లులకు హరనాథుడనిన బాలగోపాలుడనియెడు భావన స్థిరపడెను.

హరనాథుడనిన ప్రజలలో అంత మంచి యభిప్రాయముండుటకు 'హరిత్తరుడ'ను వేదాంతి మిక్కిలి ఈర్ష్యపడెను. అతడు మతసంబంధమైన గ్రంథములను చదివినవాడు. సమయోచితముగా కొన్ని ప్రమాణవాక్యములను చూపి కూచియాకోలు ప్రజలను ఆకొట్టుకొనుచుండుటయేకాక పూర్వాచార సంప్రదాయములను పరిరక్షించుటకై సిద్ధపడెడి

వాడు. హరనాథుని సంకీర్తనా బృందములో కొందరు హరి జనులు కూడనున్నారన్న సంగతి ఆయనకు తెలిసెను. వెంటనే అతడు కోపోద్దీపితుడై "పవిత్రమగు దేవాలయములు అస్పృశ్యులచే మలినమైపోవుటయా? అక్షరజ్ఞానములేని యీ కుఱ్ఱకుంకలకింత యాగడమా? హిందూమతము ధ్వంసమైపోయినది. ఇంతకు ఆహరనాథుని ఆటకట్టించక పోయిన-మతమునకు ముప్పుతప్పదు. మావంటివారమందఱము తలలు వంచుకోవలసి వచ్చున''ని భావించి వెంటనే హరిత్తరుడు భగవతీ సుందరికి హరనాథుని సంకీర్తనను నిరసించుచు జాబు వ్రాసెను. హరుడు సోనాముఖికి వచ్చినపుడు తల్లి యీవిషయమును ప్రస్తావించెను. అపుడు హరగోపాలుడు "అమ్మా! హరిత్తరుని మాటలను నమ్మకుము. మాసంకీర్తనమును హరిజనులు చాల దూరమునుండి వినుచుందురు. అంతమాత్రమున కల్గిన ప్రమాదమేమిటోనాకు తెలియుటలేదు. నీవువలదన్నచో నిటుపైన సంకీర్తనలో పాల్గొనన"నెను. భగవతీదేవి "నాయనా! నీవిటుపైన మనయింటిలోనే సంకీర్తనచేసి కొనుట మంచిద''ని హెచ్చరించెను. తల్లిమాటను ఏనాడును జవదాటని హరనాథుడు తరువాత సంకీర్తనలో పాల్గొనలేదు.

కొన్నాళ్లకు శివరాత్రి వచ్చెను. ఆనాడు దేవాలయమున సంకీర్తనజరుపవలెననియు అందు హరనాథుని నృత్యగానము లుండితీరవలెనని నిశ్చయించుకొని మిత్రులు యెట్టకేలకు భగ

వతీదేవి యనుమతిని పొందిరి. సంకీర్తన మంచి ఉచ్చస్థాయిలో జరుగుచుండెను. లెక్కకుమీఱిన తల్లులు—భక్తులందు పాల్గొనిరి. హరనాథుడు రెండుచేతులు పైకెత్తి దీనవదనముతో - అశ్రుధారాసిక్తనేత్రాలతో - శ్రావ్యమగు కంఠముతో - మధుర మనోజ్ఞమగు నృత్యమును చేయుచుండెను. భూమ్యాకాశముల నడుమ చల్లనిగాలిలో నామానందము పొంగిపొఱలు చున్నట్లుండెను. చెట్టుచేమలు - ఱాలురప్పలు నామమును జేయుచున్నట్లనిపించెను. తల్లులందఱు బృందావన కృష్ణునివలె భావించుచు - తెప్పపడినచో మంచియవకాశమును పోగొట్టుకొన్న వారమగుదుమని విచారించుచుండిరి. హరిజనులు దూరమునుండి నామదాహముతో ఒడలుమఱచి అందఱితోకలసి భజనచేయలేని తమ దురదృష్టమునకు దుఃఖించుచుండిరి. ఇంతలో హరిత్తరుడు ఆసంగతి యంతయు తెలిసి - వచ్చెను. అతడును హరనాథుని వైఖరిని ఆపాదమస్తకము పరికించుచుండెను. అప్రయత్నముగా అతనిమనస్సు హరినామ డోలలలో నూగిసలాడెను, చేతులొకచోచేరెను. తాళమువేయ నారంభించెను. తనకు తెలియనిస్థితిలో ఉన్మత్తుడై గంతులిడ నారంభించెను. కొంతసేపటికి ఒడలుతెలియక నేలపైపడెను. తెలివివచ్చిన తరువాత హరిత్తరుడు నిరుత్తరుడయ్యెను. అపుడు హరనాథుడు "నాయనా? నామము ప్రేమనే జనింపజేయును. నీవలె ప్రేమభరితచిత్తులైన వారికి వర్ణవిచక్షణ - భేదభావము లేమాత్రముండబోవని నీవు అనుభవముచే గ్రహించియుందువు.

శ్రీకృష్ణుని కటాక్షము ప్రేమహృదయము గలవారిమీదనే ప్రసరించునుగాని భౌతికవాదులమీద ప్రసరింపనేరదు" అని ముద్దుగా బోధించెను.

ఎటఁజూచిన నీలీలయె,
ఎటనైననిన్ని కటాక్షమే తనరారున్
పటుతర నామాసక్తిన్
ఘటియించి బ్రదుకున వెలుఁగు గల్పింపఁగదే!

## గద్యము

ఇది శ్రీమత్కుసుమహర వరప్రసాదిత మధురకవితా విభూషిత, భాషావిజ్ఞాత, వినయవిఖ్యాత, విశ్వబ్రాహ్మణాన్వయసంజాత, ఆదిత్య బ్రహ్మర్షి గోత్రపరిపూత, ప్రణవమాత్రవినీత, శ్రీనారాయణాంబా సత్యనారాయణాచార్య ప్రథమసుత, చిన్మయబ్రహ్మకవి ప్రణీతంబైన శ్రీహరనాథ భాగవతమందలి ద్వితీయస్కంధము.

జ య శ్రీ కు సు మ హ ర

# శ్రీహరనాథ భాగవతము

## తృతీయ స్కంధము

శ్రీ గోలోక నివాసీ !
వాగీశ్వరవినుత వైభవ విలాసి ! మహా
యోగోద్భాసీ ! విశ్రుత
భాగవత ప్రవచన ప్రభావోల్లాసీ !

బాల్యమే జీవితసౌధమునకు పునాది. అందు విద్యార్థిదశ పరమోత్కృష్టమైనది. విద్యాభ్యాసకాలమున ఏర్పడిన భావములు - పూర్వజన్మ సంస్కారముతో మేళవింపబడి సాంగత్య విశేషముచేత ఒకానొక స్థిరరూపమైన వ్యక్తిత్వమును కలుగజేయును. పండితుల వలన విన్న విషయజ్ఞానము - భక్తులసాంగత్యము వలన భగవద్భక్తి - నిత్యము ఏకాంతములో నామజపము - సంకీర్తన - పరమార్తితో చేయుటవలన అనిర్వచనీయమైన ఆధ్యాత్మిక భావన - జీవితము భగవదర్పితము కావలెనను పట్టుదల - హరనాథునిలో కాపురము చేయసాగెను.

చిన్నతనముననే తాను స్థాపించిన 'హరిసభ' లో అవధూత నాంది. అనంత - శశిభూషణ బంధోపాధ్యాయులు మొదలైనవారు సభ్యులుగానుండి హరిగుణగాన సంకీర్తనాదులలో పాల్గొనుచుండిరి. అవకాశము దొరకినపుడెల్ల సహచరులకు

బుడిబుడి మాటలలో "మనుష్యుడు శ్రీకృష్ణుని చూడలేదు. కాని కృష్ణనామము ఎప్పుడును అతనిదగ్గఱనే యుండును. సర్వ సంపదల కన్న నిజమైన ఆనందమును - శాంతినీయగల కృష్ణ నామమును మనసా, వాచా, కర్మణా ఆశ్రయముగాచేసికొందుము గాక ! ఎవరు కృష్ణనామమును తనదిగా చేసికొనగలడో అతనికి కృష్ణుడన్నివిధాల సహకారి కాగలడు. తనవాడేయగును. నామ మను సాధనమున్నవారు మనుష్యులుగా నున్నను - పశుపక్ష్యా దులుగా నున్నను తప్పక ఏదోయొకనాడు కృష్ణుని చూడ గలరు. బృందావనములోని ఆకులు - కొమ్మలు - రెమ్మలు - పువ్వులు - చెట్లుచేమలు - కడకు గడ్డిపరకలు సైతము కృష్ణా !! కృష్ణా !! యని స్మరించుచు - పరవశించి పోవుచున్నవి. కన్నీరు గార్చుచున్నవి. ఆనందముతో - ఆ క్రీడావినోదితో ఆడుచు పాడుచున్నవి. ఆనందము కానలెననుకొన్నవారు నామ మును ఎన్నడును వదలిపెట్టరు. ఈనామము కలియుగమున శ్రీహరిచే ప్రసాదింపబడిన దివ్యమంత్రము" అని ప్రేమావేశ ముతో బోధించును. నామము చేయనివారిదగ్గఱకు వెళ్లి బ్రతి మాలి నామమును చేయుడని ప్రార్థించును. హరికృప అమోఘ మైనదని నిరూపించుటకు అనేక కృష్ణలీలలను జెప్పును. ఈ హరినామ ప్రచారములో హరగోపాలుడు రాత్రి పగలనక - ఎండ వానయనక - ఆకలి దప్పులనక - విధి విరామములు లేక నిష్ఠానియమములులేక సదా కృషి చేయుచుండెడివాడు. ఒక్కడు - కూర్చుండినపుడు గంటలుకొలది వెక్కివెక్కి

యేడ్చుచు - మాటలతో చెప్పుటకు వీలుగాని ఆర్తితో కుమిలి పోవుచుండును. కృష్ణ సందర్శనమునకై - కృపకై యువ్విళు లూరుచుండును.

చైతన్యుడు భక్తునివలె జీవించుటకు ఉబలాట పడెను. మన హరనాథుడట్లుగాక తాను భక్తుడనను విషయము ఎవ్వ రికి తెలియనీయకుండ - అతిగుప్తముగా నామసంకీర్తనాదులు చేయుచుండును. ఆడంబరాదులు ఆయనకు కిట్టవు. మడి - మైల విషయములు అంత పట్టింపులేదు. ఏపరిస్థితిలోనున్నను అమూల్యమైన నామమును మఱవరాదనియే ఆయన దృఢ విశ్వాసము. నామసాధకులకు సాధ్యము కానిదేమియు లేదని ఆతని నిశ్చయము. సాంఘికముగా మనిషికి మనిషికి మధ్య భేదములున్నను - హరినామము విషయములో - సాధనలో హరిప్రేమలో భేదములులేవు. బాగుగా చదువుకొని భగవంతుని మఱచి భోగలాలసుడైన పండితునికన్న పాదరక్షలను కుట్టుచు బ్రతుకు హరిజనుడు గొప్పవాడు. కృష్ణుని సంతోషపెట్టగలది ఆర్తితోగూడిన భగవన్నామసాధనయే!! ఈసాధన సర్వమతము లలో సర్వసామాన్యముగా ప్రధానముగా చెప్పబడినది. ఎటు వంటి నిష్ఠలు - ఆడంబరములు - వైభవములుగల పూజలు - యజ్ఞయాగాదులైనను - అవి భగవన్నామ సంకీర్తనము లేక సార్థకముకావు - అను నాకాంక్ష ఆతనిలో తాండవమాడు చుండెను.

ఇరుగు పొరుగు వారు - గ్రామస్థులు - ఎవరైనను "మాయింట సంకీర్తనము చేయుడ" ని యనినంతనే హరిసభ భక్తబృందమును వెంటబెట్టుకొని హరగోపాలుడు వెళ్ళెడివాడు. వారికి నాయకమణియై క్రమబద్ధమైన కార్యక్రమములు నెఱవేర్చుచుండును. ఒకసారి 'కృష్ణ' వేషమును ధరించును. మఱియొకసారి "రాధావేషము"ను దాల్చును. ఆ యింటివారందఱు మనగోపాలుని ఆయా యభినయ విశేషములను చూపినపుడు- కమ్మగా హృదయములు పల్లవించునట్లు గొంతెత్తి పాడునపుడు నేత్రపద్మములనుండి ఆనందాశ్రువులను రాల్చునపుడు - కొన్ని యద్భుత లీలలను చూపినపుడు - తాము బృందావనములో "రాధాకుంజము" లోనో 'కృష్ణకుంజము' లోనో యున్నట్లు భావించెడివారు. ఈలోకమునే మఱచిపోయెడివారు. వ్రేపల్లెలోని వారు-గోపికలు కృష్ణమురళీ గానమునకు ఏరీతిగా సమ్మోహితులైనారో మనమెఱుగము కాని బాలహరనాథుని సంకీర్తనమున ఆ బాలగోపాలము బృందావనానందమును అనుభవించుచు ఇట్లే కలకాలము సాగిపోయిన బాగుండునని యనుకొనెడివారు.

## బాలహరనాథుని పరపాప భారవహనము

ఒకరోజున హరనాథుడు ప్రక్కనేయున్న యూరికి వెళ్ళి వచ్చుచుండగా నొకచోట నొక చిన్నిగుడిసెలోనుండి "శివా ! శివా ! మహాదేవా" అను నార్తనాదములు విన్పించు

చుండెను. అతని కంఠధ్వని ఇతరుల సహాయమును కోరు చున్నట్లు తోచెను. వెంటనే హరుడా గుడిసెలోనికి ప్రవేశించి ఆరోగి ప్రక్కనే కూర్చుండి కమ్మగా పలుకరించి "తాతా ! విచారింపకుము. అన్ని కష్టములను - బాధలను పోగొట్టగల దొక్క భగవన్నామమే ! భయపడకుము" అని ఓదార్చుచు ఆతని గుండెను వీపును నిమిరెను. అతడు దగ్గుచునే యుండెను. ఇంతలో కొంతమంది ఊరిలోనివారక్కడకువచ్చి "హరనాథా !! యితడొక క్షయరోగి. ఈతని వ్యాధి నీకును వ్యాపించగలదు. రారా" అని హెచ్చరింపగా హరుడు "స్నేహితులారా! ఈతనికి ఆరోగ్యము కలుగనిదే నేను రాను. మీరు ఇతనికేల సహాయపడరు? మానవులకు సహాయపడని భక్తుల మ్రొక్కులను దేవుడంగీకరింపడ" నెను. ఇంతలో దగ్గు తగ్గి అతడు హాయిగా నిద్రపోయెను. హరుడింటికి చేరెను. ఈ సంగతి తల్లికి తోడిపిల్లలు చెప్పిరి. పిమ్మట దగ్గుతో-అజీర్ణ ముతో హరుడు బాధపడజొచ్చెను. అందులకు తల్లి యెంతయో ఆందోళన పడెను.

ఆ రోగి - రోగము నిమ్మళించుటచే తనకృతజ్ఞతను తెలుపుటకై సోనాముఖివచ్చి శివనారాయణుని భగవతిని కల సెను. తనవలననే హరనాథుడు అనారోగ్యవంతుడైనాడని వారు మందలించుచుండగా హరనాథుడక్కడికివచ్చి "అమ్మా! యితడు గొప్పభక్తుడు. ఇతని దగ్గఱ కొన్ని క్షణములే యుంటిని. ఇతని తప్పేమియులేదు. నాకునేనే యీతాత గుడిసె

లోనికి వెళ్ళితిని. నాకేమి? నేను బాగుగనే యున్నా న"నెను. ఇంతలో ఆ ముసలివాడు కన్నీరు గార్చుచు తానుతెచ్చిన పటికి బెల్లము హరునకు మిక్కిలి ప్రేమతో నీయగా హర గోపాలుడత్యాదరముతో తినెను. అన్నయు తల్లియు విను చుండగా ఆతాత "మీబాబు మానవబాలుడుకాడు. ఇతడు ప్రేమాధినాథుని ప్రతిబింబము. నిజము"అని చెప్పెను. ఆమా టలను వారంతగా పట్టించుకొనలేదు. ఈ సంఘటనవలన హరనాథుడుచిన్నతనము నుండియు ఆర్తుల పాపుల దీనుల బాధలను స్వీకరించుచు కాపాడుచున్నట్లు వెల్లడి యగును. హరనాథుడీరీతిగా కాపాడిన లీలలు అసంఖ్యాకముగా నున్నవి.

హరనాథుడు ఆటపాటలలో అగ్రగణ్యుడుగా నుండెను. ఒకరోజున కొంతమందిబాలురతో కూచియాకోలాకు మూడుమైళ్ళ దూరముననున్న యొకయూరు సంకీర్తనచేయుటకై హర నాథుడు వెళ్ళెను. తిరిగి వచ్చునపుడు మార్గమధ్యమునగల చిట్ట డవిలో "దాహము-దాహమ"ని బాలురు పరితపించసాగిరి. అది ఎండకాలమగుటచే నోరెండిపోవుచుండెను. నాలుక పిడుచ కట్టుచుండెను. పిల్లలు నోరెత్తిమాట్లాడలేక సంజ్ఞమాత్రమే చేయు చున్నవిషాదకరపరిస్థితిలో నొకవిచిత్రమైనసంఘటన జరిగెను. వెనుదిరిగి చూచుసరికి ఒకచెట్టు పండ్లతోనుండుటచూచి వారు మిక్కిలిఆనందించిరి. వెంటనే ఫలములను భుజించి తృప్తి చెందిరి. హరనాథుడేమియునెఱుగని వానివలె తాను సంతో షించుచు 'ఇదియంతయుకృష్ణునిదయ'అనెను. చదువరులారా!

అన్ని లీలలకు తానే కారకుడైయుండి-ఏమియు తెలియనట్లునటించు హరనాథుడు - ఇట్లే తనలీలామాధురి కృష్ణప్రభావము వలన కలిగినట్లు మొదటినుండి చెప్పుచుండుట గమనించియే యుందురు. పొరపాటున హరనాథుని సామాన్యుడని భావింపకుందురుగాక!

ఒకసారి హరనాథుడు కూచియాకోలునుండి మాచ్‌డోబా వెళ్ళుచున్నపుడు ఒకచెట్టుపైనుండి యొకభూతము నేలపై కుటికి "నీవెవ్వరవు" అని ప్రశ్నించెను. హరనాథుడు తనపేరును చెప్పెను. ఆమాటలను విన్నతోడనే ఆదయ్యము చేతులు జోడించి "స్వామీ! నీవా! నాదేవుడవు. ఇన్నాళ్ళెక్కడదాగినావు. నీదర్శనమునకే యెదురు చూచుచున్నాను" అని భక్తి వినయములు పెనుగొన నమస్కరించి అతనిని తన భుజస్కంధములపై నిడుకొని మాచ్‌డోబా తీసికొనివెళ్ళెను. ప్రభుని స్మర్శతగిలిన ఆభూతము పరితప్తురాలై పవిత్రమయ్యెను. చరణధూళిచే నొకఱాయి నాతియగుట యొకవింత!! శరీర స్మర్శచే మహాభూతము పాపములనుండి దూరమై తరించుట మఱియొకవింత !!

హరనాథుడు కేవలము పాపాత్ముల కొఱకే వచ్చినాడు. వారిహృదయములను మార్చి ధన్యులను చేయుటచేతనే కృపావతారుడైనాడు. హరనాథుని ప్రేమసామ్రాజ్యమును ఈరీతిగా పునీతులైన అదృష్టవంతులే పాలించుచున్నారు. ఎట్టివారైనను

హరనాథుని ఆశ్రయింపవచ్చును; సుఖింపవచ్చును; తరింప వచ్చును.

హరనాథుని నృత్యముచూచిన తల్లులు - గోపాలుడే చిట్టిపాదములతో ముద్దులొలుకు మురిపెములతో నాట్యమాడు చున్నట్లు భావింతురు. ఏమి మత్తుమందును చల్లెడువాడో కాని భజనలోనున్నవారు కొందఱు ఏడ్చుచుందురు. మఱికొందఱు ముసిముసి నవ్వులను వెదజల్లుచుందురు. కొందఱు 'హరిబోల్ హరిబోల్ అనుచు నుద్వేగముతో లేచి 'తెయ్య'ని గంతులిడు చుందురు. కొందఱిది యంతయు నటన - వినోదమను చుందురు. కొంతసేపటికి అట్టివారుకూడ నప్రయత్నముగా తాళమువేయుచు - అడుగులలో అడుగులు వైచుచుందురు. పరుసవేది సోకిన యినుముకూడ పదాఱువన్నె బంగారమయి పోవునట్లు ఆయనదృష్టి - స్పర్శ - దర్శనము - సంభాషణము - సంకీర్తనము నోచుకొన్నవారెట్టి వారైనను ప్రేమానందసాగర మున తేలిపోవుచుండుటయనునది పరిపాటియయ్యెను. కొందఱు కన్నులు మూసికొనియుండగా వారికి మనోహర దృశ్యములు అగుపించుట చేతనే యేమో పిచ్చివారివలె పలవించు చుందురు. ఎంతట ఇంటిపనులు చక్కబెట్టుకొని హరనాథుని సంకీర్తనకు పోవుదమా ! యని ఆడువారు తలచుచుందురు. ఒకరికంటె మఱియొకరు ముందుగా వెళ్ళవలెనని తమకము వహింతురు. ఒకవనజాక్షి "ఇంతటి జగదేకసుందరుని గన్న భగవతి యెంత అదృష్టవంతురాలో కదా" యనుచుండగా మఱియొక సుదతి

"చెల్లీ! యీ ముద్దులయ్య ఆడుచు పాడుచున్నప్పుడు నాకు మురళీరవము వినిపించెనుసుమా! నీవువింటివటే" యనగా మఱియొక సుందరి "ఓసీ! మృగాక్షీ! అతనిని చూచినది మొదలు హృదయమున ఆ చక్కనయ్యముద్ర కనుపాపలలో - హృదయమున తారాడుచున్నదే!! వలదనుకొన్నను మనస్సటు వైపునకే పరువెత్తెనే" యనగా మఱియొకయమ్మ "గోపాలుని కెన్ని విద్యలున్నవో యన్నియు నీతనికిచెల్లును. ఈతనిని చూడని కన్నులు కన్నులుగావు. ఇతనిని కొనియాడని నోరు నోరుకాదు. తనువుతనువుకాదు. అల్లదే! శ్యాముడు మనలను పిలుచుచున్నాడు. ముస్తాబులు చాలించి యున్నదున్నట్లు ఇక బయలుదేఱుడ"ని హెచ్చరించు చుందురు. హరనాథుడు అడుగు పెట్టిన చోటెల్ల నిత్యకల్యాణము పచ్చతోరణముగా, బృందావన సీమగా ఆనంద నందనవనముగా మాఱిపోవు చుండును. ఆ సంకీర్తనలలో పాల్గొన్నవారెంత భాగ్యవంతులోకదా"!!

"కుసుమహరనాథులు. కులగురువగు క్షితికాంతస్వామి వద్ద మంత్రోపదేశమును పొందిరి. ఇట్లుకొన్ని వసంతములు గడచినవి. హరనాథుడు 1886లో బర్ద్వాన్‌రాజా కాలేజీలో ఎఫ్. ఏ. లో ప్రవేశించి ఆపరీక్షయందు ఉత్తీర్ణుడయ్యెను. ఈ కాలములోనే చిన్నతనమున కనిపించిన మహాపురుషుడు హరనాథునకు సంకీర్తనచేయు భక్తబృందములో కనిపించెను. ఆబృందములో నిత్యానందుడు కనిపించెను. ఆదృశ్యమును కనులారా చూచిన హరనాథునిలో నొకఅద్భుతమైన పరిణామము

కలిగెను. ఆమధురక్షణముల నుండి హరనాథుడు ఇంతకు పూర్వమువలె అందఱితో కలిపియుండుట మానెను. ఈప్రాపంచికసుఖభోగములన్నియు నీటిబుడగలవలె చంచలములైనవి, ఈశరీరమేనాడో మట్టిపాలుగాకతప్పదు. ఆసంగతి తెలిసియుండియు నీమాయలోపడనేల? విలువైన కాలమును ఆ స్వామిని పొందుటకే ధారపోయవలసినదే" యనుభావములతో తన్మయత్వముతో ఒంటరిగా నుండిపోయెడివాడు. ఆతనికి చదువనిన అనురక్తి తగ్గజొచ్చెను. హరిచింతనమున నాసక్తి హెచ్చెను.

భర్తయనంతరము సుమారు 17 సంవత్సరములు - భగవతీసుందరీదేవి కలకత్తాలోని లక్కవ్యాపారమును చాల సమర్థతతో నిర్వహించినది. పరిసరాలలో విరివిగా లక్క దొరకకపోవుటచేత, కలకత్తాలోనున్న గుమాస్తా ద్రవ్యమును అపహరించి యెక్కడికో వెళ్ళిపోవుటచేత,- శివనారాయణునకు వ్యాపారమందు ఆసక్తిలేకపోవుటచేత - హరనాథుడు కళాశాలవిద్యార్థిగానుండుటచేత ఆమె వ్యాపారమను చాలించెను.

వేసవిసెలవులకు హరనాథుడు సోనాముఖి వచ్చెను. ఒకమధ్యాహ్నము నిద్రపోవుచు నొకమంచి కలగనెను. అది తనయవతార విశిష్టతను - కర్తవ్యమును సూచించుచున్నట్లుండెను. తన్ను స్వర్గములోనికి ఎవ్వరో తీసికొనివెళ్ళినారట !! ఆసభలో త్రిమూర్తులు, దుర్గ, సరస్వతి, లక్ష్మి మొదలైన దేవతలందఱు వారి వారి ఆసనములపై కూర్చొనియుండిరి.

నాటిసభకు వాగ్దేవి అధ్యక్షత వహించియుండెను. హరనాథుడు ఆసభలో కాలుపెట్టినతోడనే అందఱును గౌరవసూచకముగా లేచి నిలువబడిరి.

భారతీదేవి "ఈసభకు హరనాథుని ఆగమనమొక క్రొత్త శోభను - ఆనందమును తెచ్చిపెట్టినది. మహాదేవుని సహస్ర నామ స్తోత్రమును మన హరనాథుడు అతిమధుర శ్రావ్యకంఠ మున గానముచేసిన తరువాతనే సభ ప్రారంభము కాగల ద"నెను. వెంటనే బ్రహ్మదేవుడామాటను సంతోషముతో సమర్థిం చెను. ఆమాట సభవారికి ఎంతోమోదమును గూర్చెను. హరనా థుడు వారికోరికప్రకారమా స్తోత్రము చేయుచుండెను. ఆస్తోత్ర మును మిక్కిలి శ్రద్ధతో భగవతి వినుచుండెను. హరనాథుని భౌతికశరీరము పడకటింటియందే యుండెను. నిద్రనుండి లేచిన తరువాత తల్లి "నీవిపుడు చేసిన శివస్తోత్రమును శివా లయమున గానముచేయు మ"నెను. హరనాథుడు తనకువచ్చిన కలను జెప్పుచు నేనిపుడు పాడలేన''ని బదులు చెప్పెను. నిజ మునకా స్తోత్రము అతనికితెలియదు. కానిశివస్తోత్రమును మఱు నాడు శివాలయమున హరనాథుడు గానముచేయగా తల్లి మిగి లిన వారందఱు ఆనంద కందళితాంతరంగులైరి. ఆసమయ ముననే హరనాథుడు "నేనన్న దేవతలందఱికి చాలఇష్టము. సమయోచితముగా నామాటను వారు శిరసావహింతుర"ని యొకవిశిష్టమైన ఆవేశమున చెప్పెను. చదువరులారా! ఈ స్వప్నములోని వృత్తాంతమువలన హరనాథుడెవ్వరో

ఊహించుకో గలరు. ఒకయావేశముతో పలికిన గంభీరవాణి ఎవ్వరిదో గమనింపగలరు.

1887 లో 'ఇందుమతి' అను ప్రథమపుత్త్రిక జన్మిం చెను. ఆ సంవత్సరమే కలకత్తా మెట్రోపొలిటన్ కాలేజీలో బి. ఏ. చదువుటకై హరనాథుడు ప్రవేశించెను. ఆ చదువు రెండేండ్లు. ఆకాలమునందు అతడేదో చదివెను. కాని సంపూర్ణమైన శ్రద్ధ దానియందతడు చూపలేదు. తినుచున్నను వినుచున్నను - మాట్లాడుచున్నను ఏమిచేయుచున్నను అతని మనస్సు హరినామ గుణగానములయందే లగ్నమైయుండెను. ఇంతకుపూర్వము బంధుమిత్త్రాదు లందఱితో ఎంతో కలసి మెలసి యుండెడు హరనాథుడు ఇపుడెవ్వరితోను మాట్లాడుట లేదు. పలుకరించినను సమాధాన మిచ్చుటలేదు. ఈ విచిత్ర పరిణామమునకు అందఱు ఆందోళన చెందిరి. ఈ సమయ మున హరుడు భాగ్యవతచంద్ర మిత్రకు "మిత్రమా! మూడు సార్లు బి. ఏ పరీక్షకు కూర్చున్నను ఉత్తీర్ణుడను కాలేకపోయి తిని. లక్షసార్లువ్రాసినను నేనాపరీక్షయందు కృతార్థుడనుకాలేను గూడ. దానికికారణము ఈ ప్రాపంచిక విషయములేవియును నాకుప్రీతిని కల్గింపకుండుటయే! ఈప్రపంచమంతయుమాయగా తోచెను. ఏదిసత్యమో శివమో సుందరమో ఆ పదార్థమునందే నాదృష్టియుండెను. ఆసమయమున నేను అనుభవించిన ఆనం దము వర్ణనాతీతమైనది. నేటి ప్రేమసంధ్యారుణకాంతు లింత మధురముగా నుండుటయేమి?" అనియొక లేఖ వ్రాసియుండెను.

తరువాత బి. ఏ. పరీక్షకు హాజరగు సమయమున మునుపున్నచోటినుండి వారణాసిఘోష్ వీదిలోనికి హరనాథుడు తనబసకు మార్చెను. పేరుకు మాత్రము కాలేజీలో చదువు చున్నాడన్నమాటయేకాని ఆతనిస్థితిలో ఏవిధమైన మార్పు లేకుండుటను మిత్రుడగు రాధాగోవిందవిశ్వాస్ గ్రహించెను. అతడు ఎన్నోవిధములుగా చెప్పిచూచెను. ప్రయోజనములేక పోయెను. న్యాయశాస్త్రమును చదువు విద్యార్థి ఖుదీరామదాసు హరనాథుని స్థితినొక కంట కనిపెట్టుంచునే యుండెను. హర నాథుడొకరోజున సమాధిస్థితిలో నుండి క్రమముగా మూర్ఛిల్లుట అతడు కనులార చూచెను. "ఇతడొక మహాపురుషుడు. మిగిలిన జీవితమును ఈతనితో గడుపవలెన"ని విశ్చయించుకొనెను. ఈతనిస్థితి కలకత్తాలో చాలమందికి తెలిసెను. హరనాథుడు 'కాలేజీలోసైతమొక శిలావిగ్రహమువలె కూర్చుండును. ఎవ రేమిచేయుచున్నది, మాట్లాడుచున్నది అతనికక్కఱలేకుండెను. ఒంటరిగా నున్నప్పుడుకూడ నట్లెయుండెడివాడు. ఆప్తమిత్రు లతో ఒకటిరెండుమాటలాడి తాను ధ్యానమార్గమునందే యుండుట అతని నిత్యజీవితమయ్యెను. ఒకవిశేషమిచట తెలుపవలసి యున్నది. హరుడు ఒకపండో - పాలో ఆహారముగా తీసి కొనెడువాడు. తాను బసచేసినచోట నున్నయొకసేవకుడు మన హరనాథునిచూచి 'రాధాకృష్ణ! రాధాకృష్ణ! యని గంటలు కొలది ఉచ్చైస్స్వరమున నామస్మరణచేసెడివాడు. అతనికి ఈయన రాధాకృష్ణునిగా కనిపించెనేమో !!

కాలేజీలో స్మృతితప్పిన హరనాథుని కొందఱు మిత్రులు జాగరూకతతో కనిపెట్టుచుండిరి.

అపుడపుడు శవమును జూచినపుడు హరనాథునిలో "మనుష్యులు మరణించక పూర్వము నిర్విరామముగా తాప త్రయపడు చుందురు. చనిపోయిన తర్వాత ఆయాతన - ఆవేదన కనిపించదు, నిశ్శబ్దత - ప్రశాంతతయే వ్యాపించి యుండును. మరణించునపుడు గాని మరణించిన తర్వాతగాని తనకు గల్గిన అనుభూతిని ఎవరు చెప్పగలరు? నిజముచెప్ప వలెనన్న జీవి మరణానంతమునందే శాంతిమయస్థితిని పొందు చున్నట్లు తోచును. ఆస్థితిలో ఆతనికి ఏవిధమైన భయాం దోళనలుండవు. వర్ణనాతీతమైన ఆనందమును జీవి అపుడే పొందును." అను భావపరంపరలు ఉప్పొంగుచుండెను.

ఒకసారి తరగతిలో నున్నపుడు విద్యార్థుల యభివృద్ధిని గూర్చి ఉపన్యాసకులు చెప్పుచుండగా హరనాథుని పేరు వచ్చెను. ఆసమయమున హరుడు సమాధియందుండెను. మిత్రుడగు రాధాగోవిందుడు ప్రక్కనే యుండెను. తెలివి వచ్చిన తరువాత విషయమేమియని మిత్రునడిగి జరిగినసంగతి తెలిసి తన ప్రవర్తనను మన్నింపుడని హరనాథుడు ఉపాధ్యా యుని కోరెను.

చదువు విషయమై సుందరీదేవి ప్రశ్నించినపుడు హరనాథుడు "అమ్మా! ఎందుచేతనోకాని నాదృష్టి యీ

ప్రపంచమున ఈషణ్మాత్రములేదు. శాశ్వతుడైన కృష్ణుని వైపునకే నామనస్సు - బుద్ధి పరుగెత్తికొని పోవుచున్నవి. నా స్థితిని నేను ఆలోచించుకొనుచున్నపుడు మయూర సింహము వలె శ్యాముడగు సుందరుడు లీలగా పలుకరించినట్లనిపించును" అని సమాధాన మిచ్చెను. తల్లి హరనాథుడు ప్రయోజకుడగు నని యోచించిన యాశలేమగునా? యని లోలోపల చింతించు చుండెను.

కలకత్తాలో చదువునపుడు హరుడు సన్యాసులు - వేదాంతులు - బైరాగులున్నచోటికి వెళ్ళెడివాడు. వారిని కలసి యనేక విషయములను తెలిసికొనెడివాడు. ఒక్కొక్కపుడు వారితో కలసి సంకీర్తన చేయుచుండును.

మిగిలిన సమయమున పాఠ్యగ్రంథములను చదువక భగవద్గీత - రామాయణము - భాగవతము-చైతన్య చరితా మృతము మున్నగు మతగ్రంథములను చండీదాసు, జయదేవుడు నరోత్తమదాసు ఠాకూరు రచించిన గీతములను మాటిమాటికి చదువుచు - అందలి భావములను మననము చేసికొనుచు అనిర్వచనీయమైన ఆనందమనుభవించుచుండెను.

చదువులు - పదవులు - సంసార సుఖముల వలన నిజమైనఆనందము లభించదు. ఏదోయొకనాడు సత్రమువంటి యీ జగత్తును విడిచి యెవ్వరైనను వెళ్ళవలసి యుండును. ఒక్క భగవన్నామ స్మరణమే యిహపర జీవితములను

తరింపజేయగలదు. ఆనామము వలననే భగవత్ప్రేమ జనించును. తన్మూలముగా బ్రహ్మాదిదేవతలకు లభ్యముగాని అఖండ ప్రేమానందము లభించును. కృష్ణుడు మన ప్రాణ మిత్రు డగును. ఆయన సహకారముతో జీవిత రథము నడువ వలసిన మార్గములోనే నడువగలదు. ఎట్టివారైనను నాదగ్గఱకు రావచ్చును. మీపాపభారములు నామూపున పెట్టుడు. మిమ్ము లను బృందావనికి కొంపోగలను అని విశ్వసందేశమీయగల ప్రేమమూర్తి పొట్టను పోషించు చదువులపై-ఆడంబరములపై దృష్టి సారించునా?

హరనాథుని జీవిత లక్ష్యమేమిటో చదువరులు గ్రహిం తురు గాక !

నీ శరణాగతులము, కుసు
మేశా ! మాహృదయములఁ జరించుచు, భక్త్యా
వేశమ్మున నీకై లవ
కేశము తపియింపనిమ్ము ! లీలామూర్తీ !

## గద్యము

ఇది శ్రీమత్కుసుమహరవరప్రసాదిత మధురకవితా విభూషిత, భాషా విజ్ఞాత, వినయవిఖ్యాత, విశ్వబ్రాహ్మణాన్వయ సంజాత, ఆదిత్య బ్రహ్మర్షి గోత్రపరిపూత, ప్రణవసూత్రవినీత, శ్రీనారాయణాంబా సత్యనారాయణా చార్య ప్రథమసుత చిన్మయబ్రహ్మకవి ప్రణీతంబైన శ్రీహరనాథ భాగవత మందలి తృతీయస్కంధము.

---

జ య శ్రీ కు సు మ హ ర

# శ్రీ హ ర నా థ భా గ వ త ము

## చ తు ర్థ స్కం ధ ము

శ్రీ హరి సేవాప్రియ ! శు
భా హావ సూక్తి నిలయ ! కరుణాలయ! గో
పీహిత భావోదయ ! సు
శ్రీహరనాథాహ్వయా ! విచిత్రాభ్యుదయా !

చతుర్విధ పురుషార్థములలో నాలుగవది మోక్షము. వేదశాస్త్ర పురాణేతి హాసములన్నియు మానవులకు ఇహపరములను గూర్చియే చెప్పుచుండును. అసలునుబట్టి వడ్డీవచ్చునట్లు ఇహ జీవితమున గల సుకృత దుష్కృతములను బట్టి పరలోకమున ఉత్తమ నీచస్థితులు గల్గుచుండును. అందుచే మొదట వ్యక్తి జీవితమును జాగ్రత్తగా పెద్దలమాట ప్రకారము నడుపగల్గినచో పరమార్థమైన మోక్షము అదంతటదియే ప్రాప్తించును. మోక్షమును వేదాంతులు పలువిధములుగా వర్ణించి యున్నారు. తాపత్రయాభీలమైన చావుపుట్టుకలు గల సంసారమునుండి విముక్తియే మోక్షమని తెలియనగును. వేదము ఈ విషయమున గృహస్థులకు చక్కని హితోపదేశము చేసియున్నది. విదేశ విద్యానాగరికతలకు లోబడినవారందరు ఈ విశేషాంశములను గుర్తింపకయే పేరునకు మాత్రము సంసారము చేయుచున్నారు.

సూర్యరశ్మిచే భూమియందలి జలమంతయు ఆవిరియై కడకు మేఘములగును. చల్లనిగాలి తగులుటచే అవివర్షించును. జలాశయములు, కాలువలు, నదులు పొంగిపొరలును. ప్రకృతిలోని యీ రహస్యమును బాగుగా పరిశీలించిన ఎక్కడినుండి జలము వచ్చినదో అక్కడికే పోవునట్లే సృష్టింపబడిన జీవులు-చివరకు సృష్టికర్తనే చేరవలసి యున్నది. దానినే పెద్దలు ధర్మమని యందురు, ధర్మశబ్దమునకు 'తన్ను ఉద్ధరించునది' యనునర్థమీసమీక్షకు సరిపోవుచున్నది. నవయౌవన విలాసినియగు పడతి వివాహబంధముచే భర్తనుపొంది అతనితో కలసి ధర్మయుక్తమైన దృష్టితో అర్థకామములను (ధనము-కోరికలను) అనుభవించి మోక్షమందికొనుచున్నది.

తనజన్మకు - ప్రజ్ఞకు — జన్మమునకు కారకుడైన పరమేశ్వరుని పొందుటయే ధర్మము. అదియే మానవజీవిత లక్ష్యము. అందుచేతనే మహాభాగవతము "మాధవార్పితముగా మనని మానవుసిరి వనదుర్గ చంద్రికా వైభవంబు" అని ఘోషించుచున్నది.

చదువరులారా !

జీవితమున ప్రధానమైనది - ధర్మార్జన. దానికే హరనాథుడు కళాశాలా విద్యనుగూడ లక్ష్యపెట్టక అహోరాత్రములు సాగించు ఏకాంతసేవ మన అందరికి ఆదర్శప్రాయమైనదని వేరుగా వ్రాయనవసరములేదు.

పరమశివుని అవతారమని చెప్పబడు 'భూతానంద స్వామి' ప్రతిసాయంకాలము కలకత్తాలోని ప్రసన్నకుమార ఠాకూరుఘాటులో నివసించుచుండెడివాడు. హరనాథుడక్కడికి వెళ్ళగానే ఆయన ఎంతో ప్రేమతోరమ్మని తన ప్రక్కనే కూర్చుండుమనువాడు. ఆస్వామి తన ఫోటోను కొందఱికి మాత్రమే యిచ్చెడువాడు. అతని యనుమతిలేక పుచ్చుకొన్న వారికి ఆయద్దమున స్వామి ఫొటోకు బదులు నల్లనిమచ్చలు కనిపించెడివి ఈవ్యవహారమంతయు గమనించిన హరనాథుడు "ఈతడొక సిద్ధపురుషుడు. తానెంతో శ్రమపడి ఆర్జించినశక్తిని పేరుప్రతిష్ఠలకై యుపయోగించు కొనుచున్నాడు. ఎంతయవివేకము !! ఈతని భక్తులు ఈతనిని కొన్నియేళ్ళు ఆరాధించిన ఆరాధించవచ్చును .... తరువాత నామరూపములు లేకుండ పోవును" అని ప్రజల యెదుట చెప్పెను.

ఎవరు నిజమైన సన్న్యాసులో ఎవరువైష్ణవులో - భక్తులో హరనాథుడతి సూక్ష్మముగా గ్రహించువాడనుటకీ సన్నివేశము తెలియజేయును ఒకరోజున హరనాథుడు మిత్రులగు రాధికాప్రసాద్, రాధాగోవింద విశ్వాసులతో కలసి విహారమునకై వెళ్ళెను. మిత్రులకు ముందుగానడచుచున్న హరుడు దైవికమగు నావేశమున మున్గియుండెను. శరీరము మాత్రము నడచుచుండెను. ఆసమయమున నతడొకమసీదున ప్రవేశించెను. స్నేహితులతనివెంటనే యుండిరి. అక్కడ 'ఇబ్రహీము'ను

నొకయువకుడు 'సమాజు' చేయుచుండెను. అతనియెదుటనిలువ బడగనే అతనికి అల్లాదర్శనమయ్యెను. అతని కన్నులనుండి బాష్పములు చెక్కిళ్ళపైనుండి క్రిందికి రాలుచుండెను. ఆస్థితిలో హరుడాయువకుని గాఢముగా కౌగిలించుకొనెను. ఇబ్రహీము వెంటనే 'అల్లాఅల్లా'యని పరమానందమున కీర్తించుచు నృత్యము గావించెను. మసీదునుండి హరనాథుడు బయటికివచ్చిగంగాతీరమున చేరెను. ముస్లిము సోదరుడు వెంటనేయుండెను. ఆతీరమున భూతానందస్వామి బండ్లకొలది యాహారమును అందఱు చూచుచుండ భుజించుచుండెను. ప్రజలు మిక్కిలి ఆశ్చర్యముతోఆదృశ్యమును జూచుచుండిరి. హరనాథుడు అందఱు వినుచుండగా "నాయనలారా ! యీస్వామి తన అమూల్యమైన తపశ్శక్తిని పనికిమాలిన వానికై వెచ్చించి తన కర్తవ్యమునకు దూరమైపోవుచున్నాడు. మానవజన్మ యీశ్వరుని సేవకే యీయబడినది. మనప్రజ్ఞాపాటవాలు ధనధాన్యాలు భగవదర్పితాలు కావలసియుండగా - ఇతడు ఆడంబరాలన్న మిక్కిలి మోజు చూపించుప్రజలను ఆకట్టుకొనుచున్నాడు. ఇవియన్నియు క్షుద్ర విద్యలు, హరిప్రేమను పొందగల్గుటయే బ్రహ్మవిద్య" యని ముద్దుగామందలించెను.

తక్కువకాలములో అమూల్యమైన ఉపదేశరత్నములను అందజేసిన హరనాథుని దివ్యశక్తికందఱు విస్మితులైరి. క్రొత్తగా ఆకర్షింపబడిన యిబ్రహీము ఆపలుకులకు ప్రభా

వితు డయ్యేను. తరువాత తరువాత ఆ ముస్లిముభక్తుడు కల కత్తాలో "అల్లా - యితర దైవము లేకచే" "అన్నిమతముల సారాంశమొకచే" "ప్రేమాధినాథుని పొందుటయే మనలక్ష్యము" అను భావములతో సమాజమున చక్కని సమన్వయము చేయ సాగెను. హరనాథునకు జాబులు వ్రాయునవుడు ఇబ్రహీము "శ్రీహరనాథుని రూపములోనున్న పరమాత్మకు" అని సంబో ధించెడువాడు. గాలి, నీరు సర్వజీవుల సొత్తయి యున్నవి. అవి కొందఱివే యనుకొనుట పొరపాటు. భగవంతునిదృష్టిలో అందఱు సమానమే! అయినను ఆసంతానములో ఎవ్వరు యోగ్యులో – నిష్కాములో – సేవాపరాయణులో - త్యాగులో - వారు ఆయనకు పరమప్రీతి పాత్రులు. ఈసత్యమును – విశాల ప్రేమపథమును ప్రపంచమునకు తెలియజేయుటకై అవతరించి నాడన్న సంగతిని ముందు పాఠకులు గుర్తింపగలరు.

బి. ఏ పరీక్షకై యిక చదువుట మాని హరనాథుడు సోనాముఖి చేరుకొనెను. చిన్నతనములో నల్గురు అంత రంగిక మిత్రులతో ప్రారంభించిన 'హరిసభ' ను తిరిగి చక్కని పద్ధతిలో నడుపవలెనని నిశ్చయించు కొనెను. వారు అయిదుగురు 1890 లో గ్రామముననే కల 'బరనీపర' లోని సాగర మఠాశ్రమమున సంకీర్తనా దులు జరుపనారంభించిరి. ఇది మన హరనాథుని యింటికి చేరు వనే యుండెను. భగవంతునియందు ఆర్తిగల వారిద్దఱుముగ్గు రున్న చాలును. ఆ సంకీర్తనము నిజముగా మంచి ఆనంద

మును గల్గించును. ఈసంగతిని గుర్తించిన వీరు ఇతరసభ్యు లకై ప్రయత్నింపలేదు. వీరందఱును హరికృప ఎట్లయినను పొంది తీరవలెనను పట్టుదల కృషి - గలవారు. ప్రేమరసపు ముద్దయగు మన హరనాథునితో కలసిమెలసి భగవద్భజనలో పాల్గొన్న మిత్రులెంత ధన్యులోకదా! వారుచైతన్యుని అంత రంగికులై యుందురు. పదాఱువన్నె బంగారము మణులతోనే కలసి భూషణ మగునుగదా!!

ప్రతిదినమును రాత్రి వారుకొంతసేపు సంకీర్తన గావిం తురు. మిగిలిన కాలములో అనేక మత సమస్యలనుగూర్చి వేదాంతమును గూర్చి మాట్లాడుకొనుచుందురు. ఆసమయమున చైతన్య మంగళము, కృష్ణలీలామృతము, గోవిందదాసు, జ్ఞానదాసు, సర్వోత్తమదాసు మొదలైనవారు రచించిన కీర్తనల లోని భావములు చర్చకువచ్చెడివి. జయదేవుని అష్టపదులలోని మధుర భక్తిభరితమైన విషయములు మననము చేయబడెడివి. నామమను పునాదిపై ఆధ్యాత్మిక సాధనకు వలసిన అనేకవిష యముల పరిజ్ఞానముతో సహకారముతో వారు భక్తిసౌధమును కట్టనారంభించిరి. తమసంకీర్తనను గూర్చి యితరులు పొగడు చున్నారా? లేదా? యను వ్యామోహము వారికిలేకుండెను. నామమాధుర్యమెప్పుడు లభించును? ఆస్వామి మనమొఱను ఎపుడువినును! ఆ మధురమురళీరవము ఎపుడు వినిపించును? ఆ దయామయుడు హఠాత్తుగావచ్చి కౌగిలించుకొనునా? అను భావములతో వారు ఒకరినిమించి మఱియొకరు కన్నులను మూసి

కొని భావనానేత్రములతో అంతర్యామిని అన్వేషించు చుందురు. ఆసందర్భములో ఎవరైనను అడ్డుతగిలినచో వారికి ప్రాణము పోయినంత పనియయ్యేడిది. ఒకడు మృదంగమును మఱి యొకడు తాళమును ఇంకొకడు మఱొకవాద్యమును ప్రేమో న్మత్తులై వాయించుచుందురు. ఒకరిద్దఱు నృత్యముచేయుచున్న మఱికొంతమంది పాడుచుందురు.

మఱియొకరు భావావేశముతో నామమును వినుచుందురు. ఎవరికేది యిష్టమో ఆరీతిగా ఆనందించుచుందురు. మొత్తము మీద తమమనస్సులను నామసూత్రముచే బంధించి ఎప్పటికైనను ఆనామ ప్రియుని చేరుకోవలెననియే వారి ఆకాంక్ష !! ఎదుట జనసమూహము లేకపోవుటవలన వారికి ప్రాపంచికదృష్టి లేనే లేదు. హృదయమందలి వినయ సహనభావగాంభీర్యములనెడు ప్రేమసౌందర్యమును కుప్పబోసి దానిని అనుభవించుటకు దయచేయుమన్నట్లు — నీవులేని యీ జీవితము నిస్సారమని మండుటెడారియని - నీరాకకై వేయికన్నులతోఎదురు తెన్నులు చూచుచున్నామని - జీవితసాయంసంధ్య క్షణములో మటు మాయమై అంధకారబంధురమై పోయినది; దిక్కెవరునులేరు జీవితేశ్వరుడవగు నీవు నాచెంగట లేకపోవుటచే ప్రకృతి నన్ను చూచి పరిహసించుచున్నట్లు కనిపించుచున్నది. స్వామీ! యీ హృదయ కుసుమ కల్యాణమంటపమునకు విచ్చేయుమను" భావనలతో ఎవరికివారు హృదయమందిరమున మార్మ్రోగు నామ

తపస్సుతో ఉత్సూత లాగుచుందురు. ప్రభువును పొందవలెనను నార్తితప్ప మఱియొక ఆర్తి వారికిలేదు. సర్వేంద్రియములు అతి భక్తప్రియున కర్పితములై పోయినవి. చంచలమైన మనస్సును సైతము ఆయనకు శరణాగతితో సమర్పించిరి. తాము నిమిత్త మాత్రులుగా నాను సాధకులై పోయిరి. ఆ సమయమున వారి యంతర్నేత్రముల ఎదుట రకరకాలైన పూదోటలు — నదులు - సరస్సులు - పర్వతాగ్రములు - ఇసుకతిన్నెలు - గోబృందము- కుంజములు — మయూరములు — కనిపించును-అవి యన్నియు తమ ప్రాణేశ్వరునివేయని మురిసిపోవుచుందురు.

ఈ సమయముననే అనురాగి గోకులానంద బాబాజీ అను వైష్ణవ భక్తాగ్రగణ్యుడు సోనాముఖివచ్చి హరనాథుని అతని అనుచరుల భక్తిప్రేమలకు అచ్చెరువందెను. హరనాథుని కోరికపై సాగర మఠాశ్రమమున నతడు చాలకాలముండెను.

హరనాథుడు బి. ఏ. లో నుత్తీర్ణుడై పెద్దయుద్యోగియై కుటుంబగౌరవమును కాపాడునని తల్లియు అన్నగారనుకొనిరి. రెండవసారికూడ పరీక్ష తప్పినందులకు వారెంతయో చింతించిరి. కుటుంబభారమధికమై పోయినందులకు లోలోన బాధపడసాగిరి.

మూడవసారి పరీక్షకై కలకత్తా వెళ్ళినపుడు మిత్రుడగు 'రామచంద్రముఖర్జీ' చాల దగ్గువ్యాధితో బాధపడుచుండెను. అప్పుడు హరనాథుడు "మధురాతిమధురమైన కృష్ణనామమును

చేసినచో నీయనారోగ్యము పోవుటయేకాక గొప్ప ఆనందము కల్గున" ని చెప్పెను. అతడా మాటలను పట్టించుకొనలేదు. అతనిస్థితి మఱింత భయంకరమయ్యెను. అపుడు హరనాథుని మాట ప్రకారము కృష్ణనామమును పట్టుదలతో రాత్రింబగళ్ళు చేసెను. మంచి ఆరోగ్యముతోపాటు మాటలతో చెప్పుటకు వీలుకాని సంతోషమును పొందెను. కాని ఆతని రోగము హరనాథునకు అంకురించెను. తన ప్రాణరక్షకుడగు మిత్రుడా రీతిగా బాధపడుచున్నందులకు చింతించుచుండగా హరనాథుడు "మిత్రమా! ఈ రోగమువలన నేనంత బాధపడుటలేదు. నన్ను ప్రేమించువారికై నాపడుశ్రమకూడ ఆనందదాయకమే" అని బదులు చెప్పెను. ముఖర్జీ హరనాథుని తత్త్వమెంత ప్రేమమయమో? ఎంత త్యాగభరితమో? ఎంత ఆసాధారణమో యనియెంచి కృతజ్ఞతను వెల్లడించెను.

నానాటికా రోగము హరనాథుని కృశింపజేసెను. తల్లి యడిగినను ఏమియు చెప్పక తన రక్షణభారమును కృష్ణుని యందుంచెను. తల్లిగదిలో నొకనాటిరాత్రి నిద్రపోవుచుండగా నొక అందాల పసిబాలుడు కమ్మని చిఱునవ్వులను గ్రుమ్మరించుచు హరనాథుని గుండెపై ప్రాకుచుండెను. అతనిని చూచుచుండెనేకాని తనకేదో మైకము గ్రమ్మినట్లుండెను. తన ప్రాణాలకు ప్రాణమైన బాలగోపాలుడు దర్శనమిచ్చుచున్నట్లనిపించెను. తరువాత తనచిన్నారి హస్తమును హరుని నోటిలోనికి పోనిచ్చి ఒకరక్తపు ముద్దను వెలికిదీసెను. మల్లెపూవువంటి

ప్రక్క నెత్తురు మడుగయ్యెను. తర్వాత ఆ బృందావన గోపా లుడు అదృశ్యమయ్యెను. అంతవఱకు బాధించుచున్న దగ్గు — అంతర్జ్వరము పటాపంచలై పోయెను. కుమారునకు స్వస్థత కల్గినందులకు తల్లియానందించెను. ప్రక్కరక్తపు మడుగైనందు లకు ఆశ్చర్యపడెను. విశ్వకల్యాణమునకై ప్రేమామృతమును పంచనున్న హరనాథుని గోపాలుడు వేయికన్నులతో రక్షించు చున్నట్లు - ఈ చరిత్రలో మీరు గమనించుచునే యుందురు. మానవ మాత్రులు ఇతరుల రోగములను బాధలను భరించి వారిని సుఖపెట్టగలరా? అది యొక్క భగవంతునికే సాధ్య మగును.

1890 ఏప్రియలు 23 వ తేదీని అనుకూలచంద్ర బెనర్జీ జన్మించెను.

ఒకనాటిరాత్రి నిద్రపోవుచున్న హరనాథుని గదినుండి అపూర్వమైన కాంతి పుంజములు నాల్గువైపులకు ప్రసరించు చుండుటచూచి భగవతీదేవి భయభ్రాంతురాలై "హరనాథ్ !! హరనాథ్" అని బిగ్గఱగా నఱచెను. తటాలున లేచిన హరుడు ...మ్మను జేరదీసి "అమ్మా! నీకెందులకీ భయము? భక్తమణి ...గు నిన్ను దర్శించుటకై దేవతలు వచ్చియుందురు. నీవాశ్చర్య ...డవలసినదిలేదు" అని తన దివ్యత్వమును కప్పిపుచ్చి మఱల తల్లిని మాయాలోకమున ముంచెను. ఇట్టి ఘట్టము లెన్నెన్నో యున్నవి. గ్రంథవిస్తరభీతిచే వానిసన్నిటిని వివరింపలేకున్నాము.

ఒకసంవత్సరము ఇంటియందేయుండి తల్లిప్రోద్బల ముతో హరనాథుడు కలకత్తా పరీక్షచదువునకై వచ్చెను. చదువన్న తనకేమాత్రమిష్టములేకుండెను. రాత్రింబగళ్ళు ఒంటరిగా గదిలో నుండెడివాడు. ప్రక్కయంతయు కన్నీటికాలువలచే తడిసిపోయెడిది. శరీరమొకజాయివలె గంటలకొలది దివ్యసమాధిలో పరవశమై యుండెడిది. స్నేహితులెవ్వరైనను "ఏమిటి యీస్థితి?" అన్నపుడు "ఈస్థితియేనాకు ఒకానొక ఆనందమును కలుగజేయుచున్నది. మీప్రేమయే నన్నీలోకమున జీవింపజేయుచున్నది" అనెడివాడు.

తఱచు సాధుపురుషులున్నచోట సాయంకాలము హరనాథుడు తప్పక యుండెడివాడు. పూరీనుండి తిరిగివచ్చిన భూతానందస్వామిజీ గంగలోస్నానమాడి ప్రసన్నకుమార ఘాటులోనుండెడివాడు. హరనాథుడు ప్రతిదినమాతని చెంగటనే కూర్చుండెడివాడు. స్వామీజీ హరనాథునితోకలసి యుండుట కెంతో సంతోషించెడివాడు.

అదియొక సాయంసంధ్య. పక్షులు కిలాకిలారావములు చేయుచు గూండ్లకు చేరుచుండెను. గోవులు లేగదూడలతో యజమానుల యిండ్లకు చేరుచుండెను. మానవుల ఆశలవలె చుక్కలు ఆకాశమండలమున వ్యాపించెను. చందమామ ప్రవాసమేగిన భర్త - సతీమణులను చూడవచ్చినట్లు నవానురాగ రేఖల తొంగిచూచుచుండెను. హరనాథుడు నడచుచుండెను.

బాల్యమున బర్ద్వాన్‌కళాశాలలో కనిపించిన మహాపురుషుడు ముందుకు నడచుచుండెను. హరుడు నడకను హెచ్చింపగా నతడును హెచ్చించెను. పరుగెత్తిన పరుగెత్తుచుండెను. అలసి సొలసి హరనాథుడొకచోట నిలువగానే ఆయన దగ్గఱగావచ్చి "ఇంద్రజాలవిద్యలను ప్రదర్శించు వారిచెంత నీవుండుట మంచిది కాదు. కృష్ణసేవలోనే నీఅమూల్యమైన కాలమును గడుపుమ"ని హెచ్చరించెను. ఆమాటలలోని అంతర్యమును గ్రహించిన హరనాథుడు ఆనాటినుండి భూతానందుని చూచుటయేమానెను.

మూడవసారి కూడ హరనాథుడు పరీక్షతప్పెను. అందులకు తల్లియు నన్నయు చాల చింతించుటయేకాక హరనాథుని ప్రవర్తనయెడ అసంతృప్తి వహించిరి. ఎవరి బాధ్యతలు వారు నిర్వర్తించుటయే మంచిదను సభిప్రాయమునకు తల్లివచ్చెను. శివనారాయణుడుకూడ అదే భావమును తెలియజేసెను. సంసార భారము అధికమయ్యెను. అందుచే హరనాథుడు సోనాముఖిలోని జూబిలీహైస్కూలులో సహాయోపాధ్యాయుడుగా ప్రవేశించెను. సహాధ్యాయుడుగు రసికలాల్‌డే అందొక ఉపాధ్యాయుడు. అతని కృషివలన నాయుద్యోగము వచ్చెను. ఆయుద్యోగమును హరనాథుడు 1892 సెప్టెంబరు వఱకు చేసెను. ఉపాధ్యాయవృత్తి నొకవైపుచేయుచు మిత్రులతో హరిసభాకార్యక్రమములను సర్వజాతులకు అందుబాటుగా నుండునట్లు ఏర్పాటుచేయుచుండెడివాడు. ఈసంకీర్తనలనిన శివనారాయణునకేమాత్రము నచ్చకుండెను. సోనాముఖిలోనే యుండిన పక్ష

మున నితడు హరికీర్తనమును విడువడను దృష్టితో శివనారాయణుడు తమ్మునికి ప్రభుత్వోద్యోగమిప్పించవలెనని ప్రయత్నించుచుండెను.

ఈసమయముననే యొకకుమారుడు - పుత్త్రిక జన్మించిరి. అంతవఱకు తమకు ఆస్తియేమియున్నదో - సంసారమెట్లు నడచుచున్నదో హరనాథుడు పట్టించుకొనకుండెను. తమ్ముని భజనలు - స్వభావము అన్నగారికి ద్వేషమును పుట్టించుచుండెను. నిరుద్యోగియగు హరనాథుడు 'హరిసభ' వార్షికోత్సవములో పాల్గొని చాలప్రొద్దుపోయిన తరువాత ఇంటికివచ్చెను. భగవతీదేవి, శివనారాయణుడు, కుసుమదేవి హరనాథుని రాకకై ఎదురు చూచుచుండిరి. ఇంతలో హరనాథుడు రాగానే అన్న "నీవ్యవహారము బాగుగాలేదు. భజనలు గిజనలు మనకు అన్నము పెట్టునా ? నీవు చిన్నవాడవుమాత్రము కావు. సంసారమును పట్టించుకోని నీనడవడి గొప్పదనుకొంటివా?" అనికోపముగా గద్దించెను. ఆమాటలకు హరనాథుడు మృదుమధుర స్వరముతో "అన్నయ్యా ! నీవు సంసారమునుగూర్చి యెంతో తాపత్రయ పడుచున్నావన్నమాట నిజము. మాతృదేవత యొడిలోని బిడ్డలమైన మనకు ఆయమ్మయే కావలసిన అన్నవస్త్రముల నీయగలదు" అనెను. ఆమాటలకు మఱింతకోపించి శివనారాయణుడు "నీ పెద్దకబురులకేమిగాని యొకమాటవిను. రేపు ఏదోయొక యుద్యోగమును సంపాదించకుండ ఇంటిలో అడుగు పెట్టుటకు వీలులేదు. నీకిచటభోజనము పెట్టుటకెవ్వ

రును సిద్ధముగాలేర''ని తీవ్రముగాపల్కెను. హరనాథుడు "గోపాలుని యిచ్ఛప్రకార మంతయు జరుగున"ని గదిలోనికి ప్రవేశించెను. అన్నగారిమాటలకు అతడేమాత్రమును కోపగించు కొనలేదు. ఆరాత్రి భోజనముచేయుట మానెను. తల్లియు, కుసుమదేవియు "భోజనముచేయుమ"ని బ్రతిమాలిరి. అతడు భోజనము చేయకున్న తాము భుజింపమని చెప్పిరి. అట్లన్నను హరనాథుడు చలింపక 'అమ్మా! నాకై మీరు బాధపడవలదు. ఉద్యోగము దొరకువఱకు నేనుఅన్నమునే ముట్టను. రేపటి యుదయ మేమిజరుగునో మీరే చూడగలర" నెను. భగవతియు కుసుమాంబ యేడ్వ నారంభించిరి. ఆ నిశీథమున వారి యేడ్పులు దుస్సహమయ్యెను. కొంతసేపయిన తరువాత ఒక వ్యక్తి హరనాథుని అయోధ్యలో ఉపాధ్యాయునిగా నియోగించిన యుత్తరువును తెచ్చి యిచ్చెను.

ఈసంగతితెలిసి అన్న — తల్లి - భార్య మిగిలిన వారందఱును సంతోషించిరి. హరనాథుడు అయోధ్యలో గణితోపాధ్యాయుడుగా పాఠశాలలో ప్రవేశించెను. ఈసంగతితెలిసి బి. యల్. చదివి గవర్నమెంటు హైస్కూలు హెడ్మాష్టరుగా పని చేయుచున్న హరనాథుని సహపాఠి ఖుదీరామదాసు ఆ యుద్యోగమునకు రాజీనామాయిచ్చి - హరనాథుడు పనిచేయు ప్రయివేటు స్కూలులోచేరెను. తరువాత అతడు హెడ్మాష్టరుగా పనిచేసెను. హరనాథుడు గొప్పవైష్ణవుడు. అతని సాంగత్య

మునకై గవర్నమెంటు ఉద్యోగమునే విడిచినాడన్నచో - హరనాథుని ఆకర్షణ - యోగ్యత యెట్టిదో ఖుదీరాముని భక్తి తాత్పర్యములెట్టివో పాఠకులూహింపగలరు.

సూర్యరశ్మికి పద్మమేకదా! వికసించును.

బర్ద్వాన్ కళాశాలలో ఖుదీరాముడు హరనాథుడు ఇద్దఱు సహాధ్యాయులు. మిత్రునినుండి అంకురించిన కృష్ణభక్తిచే ఖుదీరాముడు ప్రాపంచిక లాభకారియగు పెద్దయుద్యోగమునుకూడ త్రోసిపుచ్చి చిన్నపాఠశాలలో ప్రవేశించెను. ఆధ్యాత్మికచింతన - నిష్కామము - భూతదయగల సాధుపురుషులెక్కడో కాని దొరకరుగదా! వారిసాంగత్యము వలననే హరికృపాధనములభించును. ఈరహస్యమెఱిగిన ఖుదీరాముడు హరనాథుని ఊహలలో ఊహయై - మాటలలో మాటయై - చేతలలో చేతయై అయోధ్యలోనే గడుపుచుండెను. ఆ బడిలోనితోటలో నాకవృక్షమును మాలతీ-కామినీలతలు అల్లుకొనుటచే పొదరిల్లేర్పడెను. ఆపూపొదరింటిలో వసంతపువెన్నెలరాత్రులలో శరత్కాలపు చంద్రికలలో ఆమిత్రులిరువురు మధురహరినామమును భావయుక్తముగా స్మరించుచుందురు. ఆ తోటవారికి బృందావనముగా తోచును. ఆవెన్నెలరాత్రిలో ప్రేమమయియగు రాధకృష్ణారాధనకై అభిసారికగావచ్చునన్న తపనతో వారు నిరీక్షింతురు. ఎంతకురాలేదని కృష్ణుడువచ్చినట్లు భావింతురు. రాధాకృష్ణుల సరససల్లాపములు వారికి వినిపించును.

ఆభావములలోని సహజమాధుర్యమును వారు సూర్యోదయము వఱకాస్వాదించుచు ఒడలుమఱచిపోవుదురు. రెండుమాటలలో చెప్పవలెనన్న ఆమిత్రులిద్దఱు రాధాకృష్ణతత్త్వమును మన నముచేయుటకాదు, అందువారిరువురును తాదాత్మ్యము చెంది పోవుదురు. అట్టిదివ్యమైన భవ్యమైన మైత్రియేకదా! మైత్రి !! భగవదన్వేషణలో ఋదీరామునివలె తోడ్పడగలవారేకదా! దైవికమిత్రులు!!

వారికి గంటలు క్షణములవలె గడచిపోవును. భావనా నేత్రములతో రాధాకృష్ణులను దర్శించి - అంతలోనే మాయమై నారని విచారింతురు. వారి ఆవేదన - ప్రార్థన - గీతాలాపము ప్రాపంచిక జీవులకేమి తెలియును? వారు ఒకరిని విడిచి మఱియొకరు ఏకాంతముగా నుండెడివారు కారు.

మహేశ్చంద్ర విశ్వాస్ జన్మస్థలము మూంకరు. అది సోనాముఖికి కొన్నిమైళ్ళదూరమున గలదు,అతడు కాశ్మీరులో ధర్మార్థశాఖ సూపరింటెండెంటుగా పనిచేయుచు సెలవుమీద బంధువులను చూచుటకు సోనాముఖి వచ్చెను. అతనిభార్యయు, భగవతీదేవియు బాల్యస్నేహితురాండ్రు. మాటలసందర్భ మున శివనాథుడు తమ్ముని కృష్ణభక్తినిగూర్చి చెప్పుచు - చోటుమాఱినచో మార్పురావచ్చునని అతనికి తెలిపెను. హరనా థుడు కాశ్మీరువెళ్లుట కంగీకరించెను. హరనాథుడు ధరఖాస్తు పెట్టెను.

ప్రాణమిత్రుడగు ఖుదీరామునకు ముందేర్పడబోవు వియోగమును గూర్చి లీలగాచెప్పెను, అందులకత డెంతగానో దుఃఖించెను, ఆక్రందనము చేసెను. హృదయ సంబంధమైన మైత్రి హృదయమునే భేదించునుగదా ! అపుడతడు "హర నాథా! నీవియోగము అతిదుస్సహము. నన్నునీవువిడిచి దూర ముగా వెళ్ళినను హృదయమునందే యుండగలవు. ఈజన్మ యందు కాకపోయినను - మఱుజన్మలో నైనను నిన్నుతప్పక కలసికొనగలను. మనకృష్ణప్రభువు మనమైత్రిని జన్మజన్మల నిట్లే కొనసాగింపవలెనని ప్రార్థింతు న''నెను.

వారిరువురి సహవాసమిట్లు ఆఱుమాసాలు గడచెను. ఒకరోజున స్నానము చేయుచుండగా నొక రిజిష్టర్డుకవరు హర నాథునకు వచ్చెను. దానిని విప్పిచూడగా దివాన్ జానకీప్రసాద్ తనకు కాశ్మీరులో నుద్యోగమిచ్చినట్లు తెలిసికొనెను. కృష్ణుని అనుగ్రహము వర్ణనాతీతమైనది గదా! యని భావించి సోనా ముఖివచ్చి యీవార్త నందఱకు తెలియజేసెను. అందఱును ఆనందాబ్ధి నోలలాడిరి. అపుడపుడు తన్నుమని కఠినముగా కోపించినందులకు శివనాథుడు వగచెను. ఆమఱునాడే హరనా థుడు కాశ్మీరు పోవుటకు నిశ్చయించుకొనెను. ప్రాణసమానుడైన కుమారుడు కంటికి దూరమైపోవుచున్నందులకు తల్లిచెప్పరాని దుఃఖమున మునిగిపోయినది. ఏమన్నను మాఱుమాటాడని తమ్ముడు - దూరదేశము వెళ్లుచున్నందులకు శివుడు హరనా థుని సందిటబట్టి వెక్కివెక్కి యేడ్చెను.

చిన్ననాటి మిత్రులు - హరిసభ భక్తులు - బంధువులు అందరును స్వగ్రామమువిడిచి హరనాథుడు కాశ్మీరు వెళ్ళిపోవు చున్నందులకు విచారమును వెల్లడించిరి. అందరికన్న మిన్నగా కుసుమదేవి లోలోపల విలపించినది. కాని భర్తనిర్ణయమునకు అనుసారముగా గంభీరవదనయై యుండెను. అపుడు హర నాథుడు "తల్లీ! దైవనిర్ణయమును మనము తలదాల్చవలసినదే! మనమందరము కృష్ణుని చేతిలోని కీలుబొమ్మలము. ఆతని సంకల్పమే నెరవేరును. అన్నయ్యా! మీరెవ్వరును విచారింపబని లేదు"అనెను ఆమాటలను వినలేక వినుచున్నతల్లిపైటకొంగుతో కన్నీటిని తుడుచుకొనుచు "నాయనా! నీభార్యను నీతోతీసికొని వెళ్ళుము. ఆమెనీకు సహచారిణిగా నుండగలద" నెను. హర నాథుడు "ప్రియమైన జననీ !! నీవుబాలవృద్ధురాలవైనావు. ఈమె నీసేవ చేయుచు నిక్కడనే యుండును. నీకు జ్ఞాపకమున్నదో లేదో పెళ్ళికి తరలివెళ్ళునపుడు నీ సేవచేయుటకై యొక యువ తిని తీసికొని వచ్చుటకు వెళ్ళుచున్నానని చెప్పితిని. నేను లేని సమయమున ఈమె సర్వసదుపాయములు నీకు చేయగలద" ని బదులు చెప్పెను. కుమారుని మాతృభక్తి పరాయణములగు మాటలకు తల్లియొడ లొక్కసారి జలదరించెను. కుసుమదేవి పతియాజ్ఞకు బద్ధురాలయినట్లు మందహాసరోచిస్సులతో పలుక రించుచు తలవంచెను. ఆహా ! హరనాథుని మాతృభక్తి యెంత విశిష్టమైనది !! కుసుమతల్లి సేవాతత్పరతలు - పతిప్రేమలెంత గొప్పవో ఊహించుకొనవలసిదేకాని వ్రాయనలవిగాదు.ఒంటరిగా హరుడు కాశ్మీరువెళ్ళుచున్నాడనువార్త గ్రామమంతట విద్యుల్లత వలె వ్యాపించెను. ఆబాలగోపాలము ఆవేదనతో హరనాథుని చూచుటకు వచ్చిరి. అందుకొందరు అతనిని కుమారునిగను,

మఱికొందఱు సోదరునిగను మిత్రునిగను, ఆప్తునిగను, బంధువుగను భావించుచు - అతని యెడబాటునకు గొల్లున పలవించిరి. అందు అన్నివర్గములవారు, ఉన్నవారు, లేని వారున్నారు. ఇంతమందిని ఇంతగాఢముగా ఆకర్షింపగలవా డెవ్వడై యుండును? ఆయారీతుల వారికినచ్చజెప్పుచు — వారి ప్రేమాదరములను మఱవలేక తానును కంటతడిబెట్టుకొనుచు - కొంతసేపటికి ధైర్యము తెచ్చుకొనెను. మిత్రులు ఉత్సాహ ముతో కృష్ణనామమును కీర్తించిరి.

ఆశుభవాతావరణములో తల్లి అన్నపాదపద్మములకెఱగి హరనాథుడు ఏకాంతముగా కాంతకు కొన్ని విశేషములుచెప్పి- త్వరలోనే రాగలనని హెచ్చరించెను. ప్రయాణమగుచున్న బాలభక్తమిత్రునిజూచి హరిసభ భక్తమిత్రులు జాలిగొలుపు నట్లు నిశ్చేతనులైరి. వారిని జూచిన హరుడు “ఈ ప్రపంచములో రాజు - ఫకీరు - బిచ్చగాడు అందఱును అశాంతితోనే జీవించు చున్నారు. శ్రీకృష్ణుని పాదపద్మాలను ఆశ్రయించినవారు మాత్రము దావానలమధ్యమున స్వాదుమధుర జలధారలను ఆస్వాదించుచున్నారు. పరీక్షాస్థలమైన యీలోకమున ఎంతటి వాడైనను భయపడితీరవలసినదే !! ఎవ్వడును జీవితమంతయు సుఖవంతముగా గడపుకొనలేడు. దీనినే మాయాలీలయని యం దురు. ఎలుకనుపట్టిన పిల్లి కొంతసేపుదానిని వదలిపెట్టి దానితో ఆడుచుండును. ఆసమయమున ఎలుకస్వేచ్ఛను పొందినట్లు ఆనందించును. కాని పిల్లి పూర్వముకన్న తీవ్రముగా దాని మీద పడుటతో దానికి ప్రాణములమీదితీపి దూరమైపోవును. ఈవిధముగానే మాయ - జీవులతో చిత్రముగా క్రీడించుచుం

డును. శ్రీకృష్ణుని పాదములను మాయ సమీపించలేదు. ప్రభుని రక్షణములో నున్నవారిని అది బాధింపదలచినచో - అదియే తిరిగి బాధింపబడును, నాహృదయ మిత్రులారా! మీకు గట్టిగాచెప్పుచున్నాను. ఆకృష్ణుని పాదారవిందములే పరమాశ్రయముగాచేసికొని జీవింపుడు. మాయను మీరెన్నివిధాలుగా భక్తిశ్రద్ధలతో సేవించినను మీకెట్టి విముక్తియుండదు. దానిని మనమెంత ఆశ్రయించినను జాలివహింపదు. సరికదా! సమయముచూచి కాటువేసి - కృష్ణుని ఆశ్రయమునకు దూరము చేయగలదు. నిజమైన సుఖము కావలెననుకొనినచో కృష్ణనామమును మఱవకుడు. మిమ్ములను నేనెన్నడును మఱవజాలను" అని భక్తిప్రేమభావ గంభీరముగా పల్కెను. మిత్రులు "రాధే గోవింద రాధేగోవింద" అని జయజయనాదములు చేసిరి. మాధవమధురనామమును తలచుకొనుచు హరనాథుడు కాశీపురమునకు ప్రయాణమయ్యెను.

దీనులు, లౌకికచింతా
ధీనులు నీభక్తులయిన తీరుంగనినన్
మానసముప్పొంగుఁగదా!
నీ నిరుపమకృప గణింప నేర్తుమె! తండ్రీ!

## గద్యము

ఇది శ్రీమత్కుసుమహరవరప్రసాదిత మధురకవితావిభూషిత, భాషావిజ్ఞాత, వినయవిఖ్యాత, విశ్వబ్రహ్మణాన్వయసంజాత, ఆదిత్యబ్రహ్మర్షిగోత్రపరిపూత, ప్రణవసూత్రవినీత, శ్రీనారాయణాంబా సత్యనారాయణాచార్యప్రథమసుత, చిన్మయబ్రహ్మకవి ప్రణీతంబైన శ్రీహరనాథ భాగవత మండలి చతుర్థస్కంధము.

జయ శ్రీ కసుమహర

# శ్రీ హరనాథభాగవతము

## పంచమస్కంధము

శ్రీయటలు విహరించ
శాయత తేజోనిధి ! హృదయానందనిధీ !
శ్రీయుతనిధి ! బంధోపా
ధ్యాయకలానిధి ! పవిత్రతత్త్వాంబునిధీ !

సర్వజ్ఞుడైన భగవంతుడు నిర్గుణుడైనను - భక్తులతో క్రీడించుటకై సాకారుడగుచుండును. ఏ సమయమునకేది తన సంతానమునకు వలయునో ఆయనకు తెలిసినట్లితరులకు తెలియదు. మానవుని శక్తియుక్తులు చాల పరిమితములైనవి. అట్టివని తెలిసియు మాయాప్రభావముచే తామే సర్వాధికుల మని గర్వపడుచుందురు. ఇతరుల సుఖమునకై పాటుపడక తమయిల్లు వాకిలి-సంసారమును పోషించుటకై ప్రాకులాడెదరు. ఇట్టి కలియుగ జీవులకు గమ్యమేమిటో తెలియజేయుటయే కాక, వారిభారములను తానేవహించి-తోడునీడయై ప్రేమానందము నందజేయుటకే శ్రీహరి హరనాథాకృతిని ధరించెను. నిమిత్తమాత్రముగా విద్యాభ్యాసము చేసెనేకాని - చిన్ననాటినుండి అనేక పతితులను - పాపులను - దీనులను కాపాడుచు వచ్చినాడు. నామసంకీర్తనాదులే తరుణోపాయమని

బోధించుటకై సాధకుడుగా తానింతవఱకు జీవితమును గడ పెను. కాశ్మీరువెళ్లుచు భక్తమిత్రులకు భగవన్నామము - భక్తి అను వానిని గూర్చియే హెచ్చరించెను. హరనాథుని దృష్టి యంతయు ఉత్తమోత్తమమైన కృష్ణభక్తియందే లగ్నమై యుండెను. ఆసాధనను మఱింత వృద్ధిచేయుటకును - పశు పక్ష్యాదుల యందును దివ్యత్వమును దర్శించుటకును — ఆధ్యా త్మిక సాధనను ఏకాంతమున నిర్విరామముగా సాగించుటకే కాశ్మీరమున నుద్యోగిగా నియమింప బడినట్లూహింపవచ్చును.

చదువరులారా! ఎన్నోవేలయేండ్లు ఘోరతపమును చేసి నను కానరాని శ్రీహరి - మనకన్నుల యెదుట తాండవమాడు చున్నాడు. దీనికి మూలకారణము హరనాథుని కృపాకటాక్షమే! ఈ స్కంధమున విశ్వోన్నతమైన హరనాథ తత్త్వవ్యాప్తిని మీరు పరికింపగలరు. చదివినకొలది మన జన్మ తరించును. ఇంతకన్న కావలసినదేమున్నది ?

1 అది వర్షాకాలమగుటచేత జీలమునది యుప్పొంగు చుండెను. హరనాథుడు రావల్పిండివఱకు రైలునందే ప్రయాణముచేసెను. కాశ్మీరు కు ముఖ్యపట్టణము శ్రీనగరము. దానిని చేరవలెనన్న రోడ్డుమార్గమున టాంగాపై పోవలెను. అవియన్నియు జలమయమై యుండుటచే టాంగాలపై వెళ్లుటకు వీలుగాకుండెను. జీలమునదిపైన కోహలావద్ద వంతెనయుం డెను. అదియును కూలిపోయెను. వార్తాసౌకర్యములు లేవయ్యెను,

రావల్పిండి నుండి కోహలాకు 70 మైళ్లు. కోహలానుండి శ్రీనగరమునకు 125 మైళ్ళు. రావల్పిండిలో నొక వారము రోజులుండి కాళీదేవి పూజారిసహాయమున గుఱ్ఱముపై కోహలా చేరెను. కాని జీలము నదీప్రవాహము ఉద్ధృతముగా నుండెను. అందుచే 2, 3 రోజులు పోష్టుమాస్టరు గారింటిలో నుండవలసి వచ్చెను. క్రొత్తవాడయ్యును హరనాథుడు- ఆయనచే ఆద రింపబడుట - తన అద్భుత శక్తియే కారణము. సామాను లచటనే యుంచి ప్రభుత్వపుటింజనీయరుగారు ఏర్పాటుచేసిన త్రాటిపై తొట్టెను నడుపుటకు ప్రయత్నింపగా దానిపైవెళ్ళుట కెవ్వరును సాహసింపరైరి. అట్టిసమయమున దానిద్వారా ఆవలి గట్టు హరనాథుడు నిర్భయముగా చేరెను. చేరినతోడనే వేగ ముగా రమ్మని యెవరో పిలిచినట్లయి - ఆమెట్టపైభాగమును చేరుకొనగానే ముందున్న మెట్టకొనభాగము నదిలోకూలిపోయెను. దానిపైకూర్చుండిన యిద్దఱు మనుష్యులు ప్రవాహమునకు బలియైపోయిరి. బుద్ధిచే ఆలోచింపలేని - మాటలచే వివరింప లేని ఒకానొక అద్భుతశక్తి హరనాథుని కంటికిరెప్పగా కాచు చున్నట్లు మనము తెలిసికొనగలము.

కట్టుగుడ్డలతో-ఏ సహాయములేక చాలరాత్రికి శ్రీనగర మును హరుడు చేరెను. ఏమి చేయుటకు వీలులేక నదీతీర మునగల యొక పడవలో నిద్రపోయెను.

మఱునాడు ధర్మార్థశాఖమంత్రియగు రాయబహద్దరు జయంతీ ప్రసాదును కలసెను. తొలిచూపులోనే హరనాథుని

కోమలదేహము ఎట్టి వారినైనను ఇట్టే ఆకట్టుకొనగల కృపా రసమయ నేత్రాంబుజములు, సౌందర్యమొలుక బోయు అంగ సౌష్ఠవము—విశాలమైన ఫాలభాగము—ఆతనిని ఆకర్షించెను. ఆ ప్రథమ పరిచయమాతనిని చిరకాల మిత్రునిగా జేసెను. తనకుద్యోగ మిచ్చిన మహేశ్చంద్ర విశ్వాసునకు హర నాథుడు తన కృతజ్ఞతలు చెప్పగా "ఇందులో తన ప్రమేయము లేదనియు - సిద్ధ కైలాసనాథుని కటాక్షమైయుండున"నెను. ఆయన ధర్మార్థశాఖలో అసిస్టెంటు సూపరింటెండెంటుగా హరనాథుని నియమించెను. హిమాచలమునగల క్షీరభవాని-అమరనాథమువంటి పుణ్యతీర్థములకు పోయెడి యాత్రికులకు వలసిన సౌకర్యములను ఏర్పాటుచేయుటయే హరనాథుని యుద్యోగము!! ఆయన మనస్తత్త్వమునకు తగిన యుద్యోగము నిచ్చి భగవంతుడు నిజముగా అవ్యాజకృపానిధియను బిరుద మును సార్థకము చేసికొన్నాడు.

పాశ్చాత్యదేశమందు మధ్యధరాసముద్రతీరము నీల పర్వత శిఖరాగ్రములతో—సుందరవన నికుంజములతో—బాల సూర్యోదయములతో నతిరమణీయముగానున్నట్లే కాశ్మీర ప్రకృతికూడ మనోహరముగానుండును. రెండుదేశములను దర్శించిన 'యంగ్ హజబెండ్' అను చరిత్రకారుడీ కాశ్మీ రమే సర్వోత్కృష్ట సుందర సీమయని వర్ణించినాడు. జీలము నది కిరువైపుల నున్నతమైన మంచుకొండలు—పచ్చని పంట

పొలములు—అందమైన యుద్యాన వనములు చూచుటకెంతో యింపుగానుండును. జీలము నదిపైన రాత్రింబగళ్లు ఎన్నో పడవలు వచ్చుచు-పోవుచుండును. నౌకాయానము ఆ సుందర ప్రదేశమున కనుల పండువుగానుండును. అందు లభించు పువ్వులు - పండ్లు - ఆకులు లోకోత్తరసుందరములు—మధుర ములై యుండును. అందు స్త్రీలు మిక్కిలి అందముగా నుందురు. కవుల ఆలంకారికరచనకు ఉదాహరణప్రాయ మైన కాశ్మీరమును-తనయుద్యోగస్థలముగా నిర్ణయించుకొన్న ప్రభుని ప్రకృతి సౌందర్యప్రీతి యెట్టిదో యూహింపగలము.

కాశ్మీరవాతావరణము మన హరనాథునకెంతో సంతోష మును గలిగించెను. మీదుమిక్కిలి తనకులభించిన వృత్తి - ధార్మికమైనదగుటచే అపరిమితానందముతో మహాత్ములను - మునీశ్వరులను - మసీదులలోని మహమ్మదీయ వేదాంతులను దర్శించెడువాడు. ప్రభుత్వధనముతో వారిని సేవింపగల భాగ్యమబ్బినందుఃకు మురిసిపోయెడివాడు. సాధుసేవా సంద ర్శనమునకై అనేక పుణ్యతీర్థములను సేవించియుండెను. మాయామయమగు లోకమును చూడనొల్లక అరణ్యసీమలలో ఘోరతపస్సుగావించు పుణ్యపురుషులను కనులార చూచుటయే కాక చెవులార వారిసూక్తులను విని - వారి నిష్కల్మష నిష్కామ్యజీవనవిధానములను అరసి జన్మతరించినట్లు భావిం చెడువాడు.

నమీపారణ్యమున సాయంసమయముల యందు పులులు - సింహములు - ఎలుగుబంట్లు విషసర్పములు మున్నగు క్రూరమృగములు తిరుగాడుచోట గంటలకొలది హరనాథుడు సమాధిస్థితుడై యుండెడినాడు. కాని అవియేవియు నతనికెట్టి హానిని కలిగించెడివికావు. మీదుమిక్కిలి పరిచయము - బంధుత్వమున్నవానివలె ఆయనతో ఆడుచు పాడుచు చెంతనే నిర్భయముగా నివసించెడివి. ఒకవిషసర్పము ధ్యానస్థితియందున్నపుడు అతని శరీరమును చుట్టివేసినది. జనుల సందడి వినబడగానే అదినెమ్మదిగా క్రిందికి ప్రాకుచుపొదలలో ప్రవేశించినది.ఇట్టి అద్భుతసంఘటనలను చూచినవారు - తెలిసినవారు ఆయన అసాధారణవ్యక్తియనియు మహాపురుషడని భావించుటయేకాదు.. గౌరవించెడి వారు.

క్రమముగా హరనాథుని మిత్రులసంఖ్య హెచ్చుచుండెను. ఆయనకుదగ్గరగా నున్నవారు-ఆఫీసులో పనిచేయువారు అతనితోకలసి యున్నంత సేపు శాంతిని అనుభవించువారు. అట్టి యవకాశమెపుడు దొరకునా? యని వారుతపించిపోవుచుండిరి. ఆతని సాంగత్యమున వారికి భగవంతుడే జ్ఞప్తికి వచ్చుచుండెను. వారంతగా తన్నుగౌరవించుచున్నను - ఏమాత్రము తాను వారికన్న గొప్పవాడననికాని గురువుననికాని యెన్నడును భావించలేదు. అట్టిభావన స్వప్నమునందైనను ఆయనకు లేదు.

మంత్రియగు జయంతీప్రసాదు ముఖ్యమైన కాగితము లను చూడవలసిన యవసరమేర్పడుటచే హరనాథుడున్న గృహమునకు వచ్చెను. గదిలో ప్రవేశించి చూడగా నాల్గువైపుల దేదీప్యమానమగు తేజస్సు ప్రకాశించుచుండెను. హరనాథుడు ఆ కాంతిరేఖల నడుమ పద్మాసనస్థుడై ధ్యాననిమగ్నుడై యుండెను. ఆ కాంతిపుంజములు దైవికములుగా తోచుచుండెను. ఆయన గది నాల్గువైపుల పరికించెను. మఱియొకసారి ఆ తేజోమయమండలమును చూచుచుండగా జయంతీ ప్రసాదునకు పూర్ణచంద్రునివంటి మొగముతో, శోభామయములగు మూడుకన్నులతో ధగధగలాడు నొకదేవి కనిపించెను. ఆ తేజస్సంతయు ఆయమ్మ దేహమునుండి ప్రసరించుచుండెను-హరనాథుని ధ్యానమునకు భంగము కలిగింపక బయట నొక గంటసేపు నిరీక్షించుచుండెను. గదినుండి లేచి వచ్చిన హరనాథుని ఏమియు నడుగక తాళపుచెవులకై వచ్చితినని చెప్పి వానిని తీసికొనిపోయెను. అనాటి దృశ్యమును తిలకించిన మంత్రియగు జయంతీప్రసాదునకు హరనాథుడన్న అమితగౌరవ మేర్పడెను. ఆఫీసునకు హరనాథు డెపుడు వచ్చినను - ఎంతసేపుండినను ఎవ్వరు అతనిని ప్రశ్నించెడువారుకారు.

చలికాలమున కాశ్మీరులో విపరీతమైన చలియుండును. అందుచే ఉష్ణప్రదేశమగు జమ్మూనకు కార్యాలయము లన్నియు తరలింపబడుచుండెను. హరనాథుడు తన బసను జమ్మూనకు

మార్చెను. జమ్మూవెళ్ళు మార్గముననే రావల్పిండి యుండెను. తనకు పూర్వమిత్రుడును కాళీదేనిపూజారియగు కాళీచరణ భట్టాచార్యుని వలన అక్కడగల బెంగాలీ ఉద్యోగులతో పరచయమేర్పడెను.

ఎక్కువకాలము హరనాథుడు రావల్పిండిలో శశిభూషణ ఛటోపాధ్యాయునియింట నివసించెడివాడు. ఈ గృహయజమాని తర్వాతతర్వాత హరనాథునికి ప్రాణమిత్రుడగుటయేకాక "హరడాథుడుండగా వేఱుగా స్వర్గమెందులకు?" అని భావించెడివాడు. గోపాల్‌దాస్, డా. నాగేంద్రనాథదత్తు, విరోధ్ బిహారీబోసు బరాదకాంత ఛటోపాధ్యాయుడు మున్నగువారు చాల పరిచితులైరి. ప్రతిఆదివారము డా. నాగేంద్రదత్తు మహాశయునింట మఱల 'హరిసభ' స్థాపింపబడినది. ఆనాడు కమ్మని కంఠముతో కృష్ణసంకీర్తనముచేయు హరనాథుని వైఖరికి చాలమంది ఆకర్షితులయ్యెడివారు. కృష్ణుని సేవచేయుటకే మనమీలోకమునకు వచ్చితిమను భావనతో చెప్పు కృష్ణ లీలలు - భక్తిప్రేమరసమయఘట్టములు ఆత్మీయులలో నొక ప్రత్యేకముద్రను వేసినవి.

హరనాథుని రాకతో ఆయూరిలోని 'హరిసభ' ఉదయ కమలమువలె వికసించి సహజానురాగకాంతులను వెదచల్లు చుండును.

సుమారు 1896 రో హరనాథుడు అమరనాథమును దర్శించెను. ఆక్షేత్రము ఆకాశద్వారముననున్నది. హిమమయ

మైన శివలింగము పార్వతి - కుమారస్వామి మూర్తులుండును. దానిని భారతీయులు స్వర్గధామమని భావించుచుందురు. మహా భారతములో స్వర్గారోహణ పర్వములో ధర్మరాజు కుక్కను తనతోపాటు స్వర్గమునకు తీసికొనివెళ్ళుటకై పట్టుబట్టెను. ఆతని భూతదయాపరత్వమునకు మెచ్చి కుక్కరూపములో నున్న యమధర్మరాజు-కుమారుని "అందఱియందును దివ్యత్వ మును దర్శించగల మహాత్ముడవైన నీవు నాపుత్రుడగుట నాయదృష్టమ"నెను. ధర్మరాజు అధిరోహించిన స్వర్గధామ మిదియని మనవారి నమ్మకము. ఈక్షేత్ర సందర్శనము సంవత్సరమున కొకసారియే జరుగును. యాత్రికులు ఆ గుహలో దిగంబరులుగా ప్రవేశించవలసి యుండును. పెక్కు వేలమంది సాధుపురుషులతో 15 రోజులు హిమాచలమున ప్రయాణముచేసి అచ్చటికి చేరవలసి యుండును. కూలీలక్కడ ఎవ్వరునుండరు. ఎవరికివారే తమ బరువులను మోయవలసి యుండును. ఈయాత్రాసందర్శమున ప్రభువు రసికలాక్ దేకు లేఖ వ్రాయుచు "ఇది అద్భుతమైన అపూర్వమైన అమోఘ మైన క్షేత్రసందర్శనము. దైవమువేఱు దైవనిర్ణయమువేఱు. అన్నికష్టనిష్ఠూర్యములకు లోనైన వారికి సహనమే చక్కని మిత్రుడు. వీలయినంతవఱకు బాధితుల బాధలను మాటల చేత పనులచేత తగ్గించుటకై ప్రయత్నించుట మంచిది. అన్నా ర్తుల నొక కంటకనిపెట్టుచుండుట మఱవకుము" అని తెలియ జేసెను.

హరనాథుడు సురక్షితముగా అమరనాథమునుండి తిరిగి వచ్చెను. రావల్పిండిలో హరనాథుడు రానపుడుకూడ 'హరి సభ' కార్యక్రమములు జరుగుచుండెను. కాని హరనాథుడున్న పుడు వారు అనుభవించునానందము కలిగెడిది కాదు. హరుడు కీర్తనము మధురముగా చేయుచు భావవివశుడై నృత్యము చేయుచుండెడివాడు. ఆభావయుక్తమైన గానము – నృత్యము – మృధు మధుర భాషణ – బ్రాహ్మణ శూద్రవిచక్షణ లేకుండ అందఱితో కలసిమెలసియుండు తీరులు చాలమందిని ఆకర్షిం చుటయేకాదు, ఆయనను చూడవలెననియెడు తపనతో లేఖలు వ్రాయుచుండెడివారు.

డా. నాగేంద్రనాథుడు – ప్రభాకరబాబు – హ ర నా థు డొక వేషగాడు – నటుడు అని విమర్శించెడివారు. కాని ఆయన చనవుగా అందఱిలో తానొకడుగా తిరుగుట తినుట భజన చేయుట మొదలైనవానినిజూచి యితడెవరై యుండునా యని అబ్బురపడెడువారు.

ఎన్నెన్నో పుణ్యక్షేత్రములను దర్శించుటకు వెళ్ళు చున్నను – ఎన్నెన్ని కార్యభారములున్నను హరనాథుడు జన్మ స్థలమగు సోనాముఖిని కుటుంబమును మఱచిపోలేదు. కొన్ని రోజులు సెలవుతీసికొని సోనాముఖివచ్చెను. ప్రయాణములో కాశ్మీరరాజగురువగు సిద్ధకైలాసనాథ మహారాజుతో పరిచయ

మేర్పడుటయు - మహాశాస్త్రవేత్త - వైద్యశాస్త్రనిధియగు వాయన హరనాథుని మిక్కిలి ఆదరాభిమానములతో చూచెను. దూర దేశమేగి - తిరిగి యింటికివచ్చిన కుమారుని తల్లి చూచిఆనంద పరవశురాలయ్యెను. శివనాథుడు తమ్ముని గ్రుచ్చికౌగిలించు కొనెను. శ్రీహరుని కటాక్షామృతవృష్టిచే కుసుమదేవి హృదయకు వలయమొక్కసారి విప్పారెను. ఆ మధురక్షణములు ఆయా దర్శదంపతుల దివ్యసమాగమముచే చరితార్థములైనవి. బంధు మిత్రు లెందఱోవచ్చి హరుని పలుకరింపసాగిరి. కొన్ని రోజు లుండి హరనాథుడు కాశ్మీరు చేరెను. ఉదయగిరియందున్న పుడు సూర్యుడు శీతలకిరణ ప్రసారము చేయును. ఆకాశ మధ్యమునయున్నపుడు ఆవీక్షణములతి తీవ్రమై యాకర్షించును. అట్లే హరనాథుడు స్వగ్రామమున నున్నపుడు తన యవతార క్రీడను కొంతయే ప్రదర్శించెను. కాశ్మీరునకువెళ్ళిన తర్వాత తన ప్రేమాకర్షణముచే పఱతావులలోని ప్రేమహృదయులు హరనాథునకు సన్నిహితులైరి. వారిపిలుపందుకొని అచ్చటికి వెళ్ళి తిరిగివచ్చి సోనాముఖిలో రెండువారములు మాత్రమే యుండెను. ఆసంవత్సర మనగా 1895 లో నాల్గవ సంతా మగు 'రాయమతి' జన్మించెను. ఆకాలముననే అటల్‌బిహారీ నాందీతో హరనాథునకు పరిచయ మేర్పడెను. ఈ మహనీయుడే హరనాథుని కృపావతార తత్త్వమును ప్రపంచమున కందజేసి యుండెను.

చదువరులారా !

మిత్రుల రోగములను - బాధలను హరనాథుడు భరించు చుండుననుటకు తార్కాణమగు చిన్నసన్నివేశమును మీరు తెలిసికొనవలసి యున్నది.

సంశయాస్పదుడైన డాక్టరు నాగేంద్రనాథుడు - రావల్పిం డిలో గోపాలదాసు ఇంటిలో చిన్నగదిలో కూర్చున్న హర నాథునిచూచి 'మీరీవేళ వెళ్ళలేదా?' అని అడిగెను. హరుడు "లేదు నాకు జ్వరముగా నున్నది. డాక్టర్లుగదా ! నానాడిని పరి శీలింపుడ"ని ని కోరెను. డాక్టరు నాడీపరీక్షచేసి "నిజముగా జ్వరమే ఈవేళ మీరేమియు తినకూడద"నెను. అపుడు ప్రభువు "మిత్రమా ! మీరూహించిన జ్వరముకాదిది. ఒకఆప్తుడు టైఫాయిడ్‌తో బాధపడుచు-నీవే నాభారమని నామీద నాధార పడినాడు. ఈ యుత్తరము అతడు వ్రాసినదే!! అతని జ్వరము నన్నావేశించినది. రెండు మూడు రోజుల తర్వాత విడిచి పెట్టును" అనిచెప్పి ఆలేఖను అతనికి చూపెను. దానిని చదివి విషయమును గ్రహించెను. ఆయార్తుని అభ్యర్థన ఫలితముగా హరనాథునకు జ్వరము వచ్చినట్లూహించెను, రెన్నాళ్ళకు ఆజ్వ రము పోయినది. హరనాథుడు మామూలుగానే యున్నాడు. మంచి వైద్యజ్ఞానముగల నాగేంద్రనాథుడు హరనాథుని మానవాతీత మైన శక్తిని అపుడు గుర్తించుటయేకాదు. జ్వరముతగ్గి ఆరోగ్య ముగానున్న ఆమిత్రునినుండి జాబునుగూడచూచి అతడు సంభ్రమాశ్చర్యానందములలో నోలలాడెను.

తనవారిని తానై యెన్నుకొని - వారిమనస్సునకు పరివర్తనము కలిగించి - శాశ్వతమిత్రుడగు కృష్ణునినామముతోను - తత్త్వముతోను - పరిచయము గలుగజేసి - వారిని ఉత్తమోత్తమ భక్తులుగా తీర్చిదిద్దుటయను ప్రత్యేకక్రీడ హరనాథుని అవతారములో ప్రధానమైన విషయము. ఈసంఘటన యితరావతారములలో కనిపించదు. పాపులన్నను - పతితులన్నను - దీనులన్నను - నిఱుపేదలన్నను - అనాథులన్నను ఎంతప్రేమయో ముమ్ముందు ఆయన - దగ్గఱకు ఆకర్షించిన కొందఱు భక్తుల చరిత్రల నుండిమీరు గ్రహింపగలరు. అర్హత యున్నను లేకపోయినను-గుణమున్నను లేకపోయినను వారితో సంబంధము పెట్టుకొని - వారికి సంసారమునసేర్పడు పెక్కుసమస్యలను - కష్టములను చిత్రముగా తొలగించి - రక్షించిన తీరులు - లీలలు వర్ణనాతీతములు. ఆయన కృపకు పాత్రులైన వారందఱు "తాము నిమిత్తమాత్రులమనియు - అంతయు ప్రభుని యిచ్ఛానుసారమే జరుగున"ని భావింతురు. తమసర్వస్వము ప్రభువేయను భావన కల్గియుందురు. ఇంతటి గొప్పసంస్కారమును కలుగజేసినవాడు హరనాథుడేయని తెలిసికొన వలసియున్నది.

అటలు బీహారునాందీ

బీహారీనాందీతో పరిచయము కలిగించుకొనవలెనని ప్రభువు తలచెను. తఱచు సోనాముఖి వచ్చినపుడెల్ల హత్రస్

జంక్షనులోదిగి బృందావనమునకు వెళ్ళెడివాడు. ఒకసారి హర నాథుడు 'హాత్రస్' జంక్షనునకు వచ్చునరికి-తాను వెళ్ళవలసిన రైలు వెళ్లిపోయినది. రాత్రియగుచుండెను. చాలదూరము ప్రయాణము చేసివచ్చుటచే శరీరము బాగుగా డస్సిపోయెను. కట్టుకొనినబట్టలు బాగుగా మాసియుండెను. కానియాతని పలుకులలో అమృత మొలుకుచుండెను. ఆసంభాషణ-రాత్రి గం 8ల నుండి గం 2 ల వఱకు కొనసాగుచునే యుండెను. మధురమైన భక్తి జీవిత వైభవమునుగూర్చి-కృష్ణునిగూర్చి చైతన్యప్రభుని గూర్చి చెప్పువిషయములు ప్రయాణికులను మంత్రముగ్ధులను గావించుచుండెను. వారు తామెక్కడనున్నామో? యన్నసంగతినే మఱచిపోయినారన్నచో - ఆప్రసంగమెంత ఆకర్షణీయముగా నుండెనో యూహించుకొనవచ్చును. యథాలాపముగా వచ్చిన నాందీమహాశయుడు "ప్రయాణికుల నొకచో మందగా చేర్చినావేమయ్యా!" అని కఠినముగా పల్కెను. కాని హరనాథుని దీన వదనము - వినయము - ఉదాత్తభావ గంభీరవచనములను పరికించిన తరువాత "నేనుపొరపాటు పడితిని. ఇతడొక మహాత్ముడై యుండును. ఇంతటివానిని తగురీతిగా గౌరవింపలేక పోయితినే!!" అనిలోపల చింతించెను. ఇంతలో వచ్చిన బండిలో హరుడు బృందావనము చేరెను. తిరుగుప్రయాణములో హాత్రస్ జంక్షనులోదిగి అక్కడినుండి 'పానాఘర్' వెళ్ళదలచి టిక్కెటు గుమాస్తాను అడుగగా అతడు "8 గంటలకుగాని ఆబండి రాదు - అంతవఱకు వేచియుండుమ"ని చెప్పెను. హరుడు

"బండి ఏసమయమునకు వచ్చినను మంచిదే ! అయినను నాకు పానాఘర్' పోవుటకొాక టిక్కెట్టిమ్మ" ని కోరెను.

గుమాస్తా విసిగిపోయి హరనాథునిమాట లక్ష్యపెట్టక "పిచ్చివాడుతప్ప రైలులేని సమయమున టిక్కెట్టుకావలెనని అడుగరు" అని ఆగదినుండి బయటికి వెడలిపోయెను. ఇంతలో బృందావన ప్రయాణికుల ఒత్తిడిచే నొకప్రత్యేకమైన రైలువచ్చు చున్నద"ను టెలిగ్రాము వచ్చెను. ఆసంగతి తెలిసిన టిక్కెటు గుమాస్తా 'నాందీ' ఆశ్చర్యపడినవాడై ప్లాటుఫారము మీద నటునిటు పచారుచేయుచున్న హరనాథుని సమీపిం చెను. వెంటనే హరనాథుడు "ఈతమాషా నేనుచేసినదే !!" అనెను. ఆమాటలాలించినతోడనే అంతకుపూర్వము "ఒక రాత్రి దైవతత్త్వమును గూర్చి ప్రసంగించిన మహానుభావుడే యీయన" అని తలంచి అతని పాదపద్మములపైబడి నమ స్కరించెను. మనప్రభువును ఆఫీసుగదిలోనికి తీసికొనివచ్చి పానాఘర్' టిక్కెట్టిచ్చెను. ఆస్వల్పసమయములో హరనా థుడు నాందీజీవితవిశేషములను - కుటుంబపరిస్థితులను గూర్చి యున్నదున్నట్లు చెప్పెను. పిమ్మట హరనాథుడు "నాందీనీవు చాలకాలమునుండి మలేరియా జ్వరముతో బాధపడుచున్నావు గదా!! మధుర కృష్ణకృష్ణనామమును 6 వారములుచేసిన ఆ బాధనయమగున"ని హెచ్చరించెను. ఆమాటలనువిన్న నాందీ దిగ్భ్రాంతుడయ్యెను. ఆయన త్రికాలజ్ఞతకు నమోవాకములను సమర్పించుచు "బాబా! మాయింటికివచ్చి మమ్ము పావనులను

జేయుమ"ని కోరగా ప్రభువు ''నాయనా! నేనిపుడు జన్మస్థల మగు సోనాముఖి వెళ్ళుచున్నాను. సెలవయిన తర్వాత కాశ్మీరు వెళ్ళు సందర్భమున మీయింటికి వచ్చెదన''నెను. ఇంతలో బండివచ్చెను. నాందీ ఎంతోగౌరవాదరములతో ప్రభువునందు కూర్చుండబెట్టెను బండికదలుచుండగా ''బీహారునాందీ! సమ యమువచ్చినప్పుడు నేనెవరో తెలిసికోగలవు. అనారోగ్య ముచే బాధపడు నీభార్య త్వరలోనే సుఖముగా నుండున"నెను. తదేక దృష్టితో చూచుచున్ననాందీకి ఆమాటలు అద్భుతములుగా తోచెను. ఈసాధుపురుషునితో జరిగిన సమాగమమొక మధుర స్వప్నమనిపించెను. "నాపేరతనికెట్లు తెలిపినది? నాభార్య అనా రోగ్యముచే బాధపడుచునదన్న సంగతి ఆయన యెట్లుచెప్ప గలిగెను?'' అని ఆలోచింపదొడగెను. నాందీ యీసంగతియం తయు భార్యకుచెప్పెను. ఆమె ''తనకొకసాధువు కలలోకన బడి తన్ను చాలకాలమునుండి బాధించువ్యాధి త్వరలో నయము కాగలద"ని చెప్పినట్లు భర్తకుచెప్పెను. వాస్తవికముగా భార్యకు స్వప్నములో హరనాథసాధు సందర్శనము కల్గినందులకు నాందీ ఎంతో సంతోషించెను. సాధుదర్శనమైన నాటినుండి అతనిభార్య ఆరోగ్యములో తనమనస్సులో మంచిమార్పు వచ్చెను. ఈయద్భుతసంఘటనలచే సంపూర్ణముగా ప్రభావితు డైన నాందీ - తనశరీరాత్మలను ప్రభువునకర్పించుటయేకాక, హరనాథుని దివ్యలేఖలను సంగ్రహించి వానినొకగ్రంథముగా రూపొందించి హరనాథతత్త్వసందేశ మందజేసిన మొదటి

భక్తాగ్రగణ్యుడు - ధన్యజీవనుడీ మహాశయుడే!! కృష్ణ తత్త్వమును అర్జునునివలె, చైతన్యప్రభుని దివ్యత్వమును అద్వైతాచార్యులవలె, ఏసుక్రీస్తు మహామహిమను సెంటుపాల్ వలె అటల్‌బిహారీ నాందీ హరనాథుని కృపావతార విశేషములను తెలియజేసి లోకమునకు మహోపకారమొనర్చెను.

పాఠకమహాశయులారా! హరనాథుడు తనయాంతరంగికభక్తులను ఎంతచిత్రముగా ఆకర్షించునో గమనింపుడు.

సోనాముఖిలో తల్లి, అన్న, సతీసుతులతో కొంత కాలము గడపి అపుడపుడు పిలుచు దూరప్రాంతపు బంధుమిత్రులను చూచుచు—ఎట్టకేలకు హరనాథుడు హత్రస్ జంక్షను మీదుగా నొకడే కాశ్మీరు బయలుదేఱెను. రెండు నెలల క్రిందట బిహారినాందీకిచ్చిన వాగ్దానప్రకారము ఒక రోజున నాందీ దంపతులను చూడవచ్చెను. నాందీ భార్య శారీమాదేవి చాలయోగ్యురాలు. ఆమెకు గతజన్మలలో తానర్చించిన గౌరాంగదేవుడే యీయన "అనుభావన కుదురుకొనెను. ప్రభునిరాక ఆ దంపతులకు బ్రహ్మానందమును గూర్చెను. శ్రోత్రియబ్రాహ్మణ కుటుంబమునకు చెందిన హరనాథునకు ప్రక్కనేయున్న బ్రాహ్మణుల యింటిలో భోజనము ఏర్పాటు చేసిరి. వారియింటనే భుజింతునని ప్రభువుచెప్పె ను-కాని వారందులకు అంగీకరింపలేదు. మధ్యాహ్నసమయమున నొక బ్రాహ్మణవితంతువు చక్కగా హరునకు భోజనముపెట్టెను. ఆమె కొక

అందమైన కూతురుండెను. విషయలోలుడైన భర్త ఆమెను విడిచిపెట్టెను. ఆమె సుందరాకారుడగు హరనాథుని చూచి లోలోపల మోహించెను. కాని తన యభిప్రాయమును వ్యక్త పఱచలేదు. భోజనానంతరము తిరిగివచ్చిన ప్రభువునుజూచి శారీమా "బాబా! భోజనము నీకునచ్చినదా?" అని అడుగగా "పవిత్రమైన ప్రేమతో పెట్టబడని పదార్థము లెంత గొప్పవైన నేమి? మీ యింటికి వచ్చితిని. మీ చేతులతో పెట్టినవే నాకు ప్రీతి కరముగా నుండును. అట్లుగానిచో నన్ను వెళ్ళిపొమ్మనుట మంచిద"నెను. శారీమా "నాయనా? నీవు ఉత్తమ బ్రాహ్మణు డవు. మేమో శూద్రులము. నాచేతి వంటకము నీకు పనికి వచ్చునా? అను భయముచే అట్లు చేయలేక పోయితిని' అనగా ప్రభువు" అమ్మా! హృదయమను కులము గావలెను గాని శరీర సంబంధమైన కులముతో పనియేమున్నది? ఇటుపైన నే నెక్కడకు వెళ్ళను. లేని పక్షమున వెళ్ళిపోయెదన'' నెను. శారీమా "అదికాదు బాబా! ఈరోజున మఱియొక బ్రాహ్మణుల యింటితో భోజనమేర్పాటు చేసెదము'' అనగా హరనాథుడు "తల్లీ! నిజము చెప్పుచున్నాను. విను. ఇతరుల దృష్టిలో నేను బ్రాహ్మణుడనేకాని భక్తులకు మాత్రముకాదు. ఇంతకన్న మాఱు మాట చెప్పవలద''ని హెచ్చరించెను. చిట్టచివఱకు శారీమా "బాబా! ఈ వేళకుమాత్రము ఆమెయింట భుజింపుము. అట్లుకానిచో ఆమె బాధపడును" అనెను. ప్రభువామెమాటలకు అంగీకరించెను.

రాత్రి భోజనమునకు హరథునాథు ఆమెయింటికి వెళ్ళవలసివచ్చెను. అటులు ఆఫీసునకు-వెళ్ళెను. ఆపూట ఆయమ్మ పుత్రిక వంట చేసెను. భోజనమునకు హరనాథుడు వచ్చుటతోడనే ఆమె ప్రభువుతో వచ్చిన సేవకుని పంపివైచెను. తల్లినేదో వస్తువునకై అంగడికి పంపి-ఒక చక్కని ఆసనమును కూర్చుండుటకు సిద్ధపఱచెను. హరనాథుటచట కూర్చుండగా ఆమెవచ్చి కౌగిలింపబోయెను. కాని ఆచోట సదాశివుని సుందరప్రతిమ యుండెను. ఆసుందరి ఆ విచిత్ర సంఘటనకు నంచలించి-మూర్ఛిల్లెను. పిమ్మట ఆమెతల్లి విషయమును శారీమాకు చెప్పెను. ఆ సందర్భమున హరనాథుడు తనకీ విషయము తెలియదనియు-ఆ పరిస్థితిలో వచ్చుట కన్న గత్యంతరము లేదనియు-ఇంతకు ఆమె తల్లి భక్తురాలగుటచేత రక్షింపబడి నది అని గంభీరముగా వచించెను.

ఈరీతిగా ప్రభునివలన పశ్చాత్తప్తురాలైన ఆ యువతిని తరువాత భర్తవచ్చి తోడ్కొనిపోయెను. ఆమె బ్రతుకు కుదుట పడెను. హరనాథుని కృపా కటాక్షముచే ఆయమ్మ ప్రభువును ఇష్టదైవముగా నమ్మి ఆ మధురనామమును స్మరించుచు జీవిత శేషమును భక్తురాలుగా గడిపి ధన్యురాలయ్యెను. చూచితిరా!! పతితురాలు కావలసిన ఆ యభాగ్యురాలికి ఇహపరములు రెండును ప్రసాదించిన మన ప్రభుని పతితపావనదీక్షా దక్షతలు అనిర్వచనీయములు గదా!!

శారీమా దంపతులయింట భుజించి-వారినానంద పఱచి 1895 లో ప్రభువు కాశ్మీరు చేరుకొనెను.

ఇదే సమయమున మఱియొక యద్భుత లీలను తెలిసి కొనగలరు.

కిరోద్ చంద్రనాందీ రంగూను పోష్టు ఆఫీసులో పార్శిల్ గుమాస్తాగా పనిచేయుచుండెడివాడు. ఇతడే నాడును హరనాథుని గూర్చి వినియుండలేదు. ఈ లీల జరిగినపుడు ముప్పదేండ్ల ప్రాయముగల హరనాథుడు శ్రీనగరమునందే యుండెను. కిరోద్ అందరికి సహాయపడు స్వభావముగల వాడు. అతడు తెలిసినవారికి పార్శిళ్ళనీయగా-అందుకొందఱు ఆ డబ్బీయక మోసగించిరి. కొన్నాళ్ళ తర్వాత సుమారు రు 1000 లు తాను ఆఫీసునకు కట్టవలసిన దుస్థితి సంభవించెను. అదే సమయమున వారి ఆఫీసును తనిఖీ చేయుదురను వార్తవినవచ్చెను. తెలిసిన వారినందఱిని డబ్బిమ్మని అడుగగా వారు తమకేమియు తెలియదని చెప్పిరి. పాపము !! కిరోద్ చాల పేదవాడు. ఆ ధనమును చెల్లించనచో తన బ్రతుకునకే ప్రమాదము వాటిల్లును. లోకమంతయు నతనికి అంధకారబంధురముగా తోచుటయేకాక యీ మోసపు లోకమును నమ్మరాదను దృఢనిశ్చయము గల్గెను. ఆ డబ్బును కట్టగల ధైర్యములేక అతడొక సాయంకాలము 'ఐరావతి' నదియొద్దున గల స్టీమరుపై నిలువబడి-పెద్దబండను త్రాటితో నడుమునకు

కట్టుకొని నదిలో పడుటకు సిద్ధపడెను. అంతలో "నాందీ! నదిలో పడవలదు" అను ఒక మృదుమధురవాణి వినిపించెను. ఇంతలో నొక బాల సన్న్యాసి పెదవులపై చిఱునవ్వులు తాండవించు చుండగా కనిపించెను. వెంటనే కిరోద్ అతని పాదములపై బడి "స్వామీ! ఈ లోకమును వీడుటకు పూర్వమే నన్ను కాపాడుము"నెను. అపుడు బాలయతి "నాయనా! భయపడకుము. రేపు సాయంకాలము టపా విప్పి చూడుము" అని చెప్పి అంతర్ధానమయ్యెను. అతడు సాయంకాలము టపా విప్పిచూడగా రెండు రు 500లు పెల్లిగ్రాము మనియార్డర్లు ఒక అజ్ఞాత వ్యక్తి తనకు పంపియుండుట చూచి అనిర్వచనీయమైన ఆనందమును పొందెను. ఈ విచిత్ర సంఘటన 1895 నవంబరు మొదటివారములో జరిగెను. పిమ్మట నతడు భారతదేశము వచ్చి B. N. R. రైల్వేలో స్టేటనుమాష్టరుగా పనిచేసెను. మిద్నపూరులో నున్నపుడు హరనాథుడు ఈతని ఆతిథ్యమును స్వీకరించెను. ఆసందర్భన ఈయన తన ప్రగాఢ కృతజ్ఞతలను సమర్పించి జీవితమంతయు ప్రభుభక్తునిగా గడపెను.

నాస్తికులను సైతము భక్తులనుగా జేయుటలో ప్రభువు ప్రదర్శించిన మఱియొక లీలను పరిశీలింపుడు.

ఒకనాడు దివాన్ జానకీ ప్రసాదుగారు కొంతమంది మిత్రులు డాకాసరస్సుపై బోటు ప్రయాణము చేయుచుండిరి. వారిలో హరనాథుడు కూడ నుండెను, అందులోనివారు 'దేవు

డున్నాడా' అను సమస్యపై చర్చించు కొనసాగిరి. అందొకడు దేవుడు లేనేలేడని వితండవాదము చేసెను. ఇంతలో ఆకాశము మేఘావృతమయ్యెను. ఉరుములు - మెరుపులు మెండయ్యెను. ఒక పెద్ద తుపాను వచ్చెను. బోటు తరంగాలపై అటునిటు ఒరిగి పోసాగెను. అందఱును బోటు మునిగిపోవుననియే తలచిరి, దేవుడు లేడని వాదించిన వ్యక్తి నిరుత్సాహుడై "హరనాథా! ఈ ప్రమాదమునుండి కాపాడుమ''నెను. "ఈ విషమ పరిస్థితిలో భగవంతుడు తప్ప మఱియెవ్వరు మనలను కాపాడగలరు?" అని యొకసారి హరనాథుడు ఆకాశమువైపు చూచెను. తత్క్షణమే తుఫాను అలజడితగ్గెను. సరస్సు ప్రశాంతమయ్యెను. అందఱును సురక్షితముగా తీరమునకు చేరిరి. దేవుడు లేడనిన నాస్తికుడు నాడుమొదలు మంచి భక్తుడయ్యెను.

హరనాథుడు కాశ్మీరమున చిన్నయద్దె యింటిలో నొక సేవకుని సహాయముతో వంటచేసికొనుచు జీవించెను. అర్ధాంగి యగు కుసుమదేవిని తల్లిసేవకై సోనాముఖియందే యుంచెను. చాలకాలము అరణ్యములలో ఆయన పశుపక్ష్యాదులతో క్రీడించుచు వాని ప్రేమను అనుభవించెడివాడు.

చలికాలమంతయు జమ్మూలో గడపి తిరిగి శ్రీనగరమునకు వచ్చునపుడు ఒక విచిత్రమైనపరిణామ మేర్పడినది. హరనాథుడు జమ్మూనుండి రావల్పిండివఱకు రైలుపైవచ్చి తర్వాత

టాంగాపై 196 మైళ్లలోనున్న శ్రీనగరము ప్రయాణము చేయుచుండెను. తనతోపాటు కొందఱు గుమాస్తాలు టాంగాలో వచ్చుచుండిరి. 80 మైళ్ళు వచ్చినతరువాత హఠాత్తుగా హరనాథుడు మూర్ఛిల్లెను. అతని నాడీస్పందనము తగ్గుచుండెను. టాంగాలు ఆగు 'గౌరజాని' యనుచోట హరనాథుని మంచముపై పరుండబెట్టిరి. అది మధ్యాహ్నము గం. 3 ల సమయము. శ్వాస చాలవఱకు క్షీణించెను. ప్రయాణికులు ఏమి చేయుటకు తోచక కొంతసేపు సందిగ్ధావస్థలోపడిరి. కొందఱు దహన సంస్కారమునకై ప్రయత్నించు చుండిరి. మఱి కొందఱు ఆయనప్రభుత్వోద్యోగి కనుక ఈ విషయమును తంతి ద్వారా తెలియజేసి - వారి సలహాప్రకారము చేయవచ్చునను నభిప్రాయమునకు వచ్చిరి. తంతిపంపిన సమయమునకు కాఱు చీకటులు నలుదెసల గ్రమ్ముకొనెను. తంతికి ప్రత్యుత్తరము మఱునాడు గాని రాదు. అంతవఱకు వేచియుండవలసి యున్నదని ప్రయాణికులు - గుమాస్తాలు అచ్చట నిలువక తప్పలేదు. వారున్న ప్రదేశము అరణ్యమగుటచేత ఆ మృతదేహమును నక్కలు మొదలైన అడవిజంతువులు తాకకుండుటకై ఒకరి తరువాత మఱియొకరు మేలుకొనియుండిరి.

హరనాథుని శరీరము మృతిచెందినట్లుండెను. కాని ఆత్మ-శరీరమును విడువలేదు. రాత్రి ఒంటిగంటయయ్యెను. అపుడొక అద్భుతమైన- వర్ణనీయమైన దృశ్యమును హరనాథుడు

చూచెను. తూర్పుదిగ్భాగ యందొక కాంతిమంతమైన మెఱపు మెఱసినది. ఆతేజస్సులో భూమికి - ఆకాశమునకొక నిచ్చెన వేయబడిన యట్లుండెను. సోనాముఖిలో చెఱువునొద్ద కనబడిన మహాపురుషుడు నిచ్చెనపైనుండి దిగివచ్చి హరనాథుని దగ్గఱకు వచ్చెను. అపుడు మహాపురుషునకు హరనాథునకు ఈరీతిగా సంభాషణ జరిగెను.

మహా :- హరనాథా! నీవు చనిపోయితివి సుమా !

హర :- ఈమాట నాకు చెప్పనక్కఱలేదు. నేను మరణించితి నన్నమాట నిజము. నాకే కోరికలునులేవు. కాని మాతల్లి కన్నులయెదుట ఈదేహమును విడచియుండిన నొక తృప్తి యుండెడిది .... అయినను నాకాచింతలేదు. ఈ కోరిక నెఱవేరుటకు మఱల జన్మనెత్తవలెనను తలంపు కూడలేదు.

మహా :- హరా! యీశరీరమును విడిచివచ్చి చూతువుగాని రమ్ము.

- పిమ్మట హరనాథునకు కనిపించిన దృశ్యమును ఈ రీతిగా వివరించుచు "నేను ఆశరీరమునుండి లేచిరాగానే - యీ ప్రపంచమంతయు విచిత్రముగా తోచెను. శరీరమునందలి అంతర్భాగము లన్నియు అద్దమున కనబడినట్లు కనిపించు చుండెను. నాకెదురుగానొక గుట్టయుండెను. దానిఅవతల ఏము

న్నది అంతయు కనబడుచుండెను. అట్లు చూడగల్గుచున్నందు లకు నాకెంతో ఆశ్చర్యము కలిగెను. ఒకచెట్టును చూచినపుడు దానివ్రేళ్ళు భూమియందు ప్రాకియుండుట- ఆచెట్టు ఆవ్రేళ్ళ ద్వారా ఆహారమును తీసికొనుచుండుట - తల్లికడుపు లోని శిశువు - ఆహారమును తీసికొనుటయును దృశ్యమును చూడ గల్గితిని. పిమ్మట ఆమహాపురుషుడు శరీరములోని ప్రత్యవయవ మును స్పృశించుటచే శరీరము 64 ముక్కలయ్యెను అత డొక్కొక్క ముక్కను చేతిలోనికి తీసికొని పిండి అందలి అపరి శుద్ధ పదార్థమును తీసివేసి వానిని యథాస్థానమున అమర్చు చున్నట్లనిపించెను. కాని అందులో మూడుముక్కలు కనిపించ వయ్యెను. అపుడు నేను అతనితో "లోపించిన ముక్కలకైవెదక నేల ? అవిలేకున్నను మాతల్లినన్ను గుర్తుపట్టును" అనియంటివి ఆమహాపురుషుడు ఆగుట్టలోని పార్థివపదార్థముతో మూడుభాగ ములను నింపి - తనహస్తస్పర్శచే ముందున్నట్లు అమర్చి యథార్థమైన దేహమును సిద్ధపఱచి ఆశరీరములోనికి నన్ను ప్రవేశపెట్టెను" అని ఆంతరంగిక భక్తులకు చెప్పియున్నాడు.

ఈదృశ్యములోని ఆంతర్యమును చెప్పుమని ప్రభువును కోరినపుడు కొందఱితో హరనాథుడు "నాజీవితమొక మహా సమస్యయైనది. నేనేమి అనుకొందునో - చేయుదునో నాకు తెలియదు. నాద్వారాఎవ్వరో చేయించుచున్నట్లనిపించును. నా కిటువంటి ఆనందము కల్గుచున్నను - అదియంతయు నాప్రభుని

కృపయనియే మీరు గ్రహింతురుగాక! నన్ను గుఱించి ఆలో చింపకుడు. కాని నన్ను మఱచిపోకుడు." అని హెచ్చరించెను. మఱికొంతమంది భక్తులతో "మాతృగర్భజనితుడైన హరనాథు డానాడే మరణించినాడు. మీరుచూచుచున్న యీహరనాథు నకును-భగవంతునకు - ఏమాత్రము భేదములేదని గుర్తింపు డ"ని బోధించెను.

మహాపురుషుడు హరనాథుని శరీరమును 64 భాగము లుగా విభజించుట - అనువిషయమును ఏవైద్యశాస్త్రమూకూడ వివరించలేదు. కాని యీపరివర్తనము జరిగిన తర్వాత - హరునిశరీరము సువర్ణచ్ఛాయతో ప్రకాశింప నారంభించెను. లుప్తమైన మూడవయవములను పార్థివపదార్థముతో జతపఱ చుట-మన యాలోచనకు అతీతమైన విషయము. ఆతని శరీర మున కొన్ని మచ్చలు క్రొత్తగా ఏర్పడుటకిదియే కారణము కావచ్చును.

అక్కడ నిర్జనప్రదేశమున చనిపోయినాడనుకొనుచున్న ప్రయాణికులకు సహచరులకీ దృశ్యముగాని మాటలుగాని తెలి యనే తెలియవుగదా!! ఒంటిగంట తరువాత అతనిశరీరములో కదలికను చూచి ఒకడు అందఱిని మేల్కొల్పెను. కొంతసేప టికి సుఖనిద్రనుండి లేచినవానివలె హరుడులేచి కూర్చుండి "దాహమ"నుటయు వారు వేడిటీనిచ్చిరి. తెల్లవారిన తర్వాత టాంగావారు ఆయన దయ్యమైనాడని భయపడిరి. తన్నుతదేక

దృష్టితోచూచు ముగ్గురి భావమును గ్రహించి ఆయన - పదాలువన్నె బంగారుచాయగల శరీరమును చూచుకొనెను. హరనాథుడంతయు కృష్ణుని ప్రసాదమని భావించెను. హరనాథుని పునరాగమనముచే అందఱును ఆనందించిరి. పెక్కుమంది శిష్యులుగల 'ఋషిపీర్' అనునొక సాధుసత్తముడు - హరనాథుడు గంటలకొలది భగవద్విషయములను గూర్చి మాట్లాడు కొనుచుండెడివారు. అయస్కాంతము - దూరముగా నున్న ఇనుపముక్కను ఆకర్షించునట్లే హరనాథుడు కాశ్మీరమునందేయుండి పలుప్రాంతాలలోని వారిని నిరుపమానప్రేమాకర్షణములచే తనవైపునకు త్రిప్పుకొను చుండెడివాడు. సర్వాత్ముడైన భగవంతుడు చేయదలచినచో - ఒక గులకఱాయి మహామేరువుకాదా? మహామేరువు గులకఱాయికాదా? విషము అమృతము కాదా? అమృతము విషము కాదా? అందుచేతనే పరమ నాస్తికులు - బహువ్యసనాసక్తులు-దుర్మార్గులు - గర్వోన్మత్తులు- ఎందఱెందఱో ప్రబల కృపా ప్రభావముచే హరనాథునకు ఆశ్రితులగుచుండిరి.

శ్రీహరనాథుడొకవైపు ఉద్యోగధర్మమును నిర్వర్తించుచు - మఱియొకవైపు నోరులేని పశుపక్ష్యాదులతో స్నేహమున నెఱపుచు ఏకాంతమున ప్రాణేశ్వరునకై పరితపించుచు దేశమునాల్గుమూలల తన్ను పిలుచునార్తులను ఆదుకొనుచు సూర్యుడొక్కడేయైనను అందఱకెంతోమంది సూర్యులవలె కనిపించునట్లే - మనప్రభువు ఆయా మతస్థులకు ఆయాభక్త

లకు - ఆయారూపములతో - భావములతో దర్శనమిచ్చుచు - మాట్లాడుచు - స్పృశించుచు జరిపిన లీలలు వేలు - వంద లున్నవి. వానినన్నిటిని వివరింపవలెనన్న ఆలీలాకాండయొక మహాగ్రంథమగును.

ప్రభువు శతపరంపరలుగా భక్తులకు లేఖలను వ్రాయు చుండెడివాడు. ఆలేఖలు - భక్తులకు జీవితమార్గ దర్శకములుగా నుండుటయేకాక ఆత్మోన్నతికి ఆశాజ్యోతులుగా భారతసాహి త్యలోకమున శాశ్వతముగ వెలుగొందుచున్నవి. పాఠక సోదరులారా! వాని విశిష్టత చాలయున్నది. తరువాతి స్కంధ మున వానినిగూర్చి తెలిసికొన గలరు.

పలికెడిది భాగవతమఁట !
పలికించెడువాఁడు కుసుమవల్లభుఁడఁట! నేఁ
బలికిన ధన్యతయగునఁట !
పలుగాథలవేల ? దీనిఁబఠియింపవలెన్

## గద్యము

ఇది శ్రీమత్కుసుమహర వరప్రసాదిత మధురకవితా విభూషిత, గాపావిజ్ఞాత, వినయవిఖ్యాత, విశ్వబ్రాహ్మణాన్వయసంజాత, ఆదిత్య బ్రహ్మర్షి గోత్రపరిపూత, ప్రణవసూత్రవినీత, శ్రీనారాయణాంబా సత్యనారా యణాచార్య ప్రథమసుత, చిన్మయబ్రహ్మకవి ప్రణీతంబైన శ్రీహరనాథ భాగవతమందలి పంచమస్కంధము.

---

జ య శ్రీ కు సు మ హ ర

# శ్రీ హ ర నా థ భా గ వ త ము

## ష ష్ఠ స్కం ధ ము

శ్రీ నారాయణ ! గౌరాం
గా ! నిత్యానంద ! శివ ! సమస్తాధీశా !
దీనావన ! భక్తహితా !
సోనాముఖ్యబ్ధి పూర్ణ సురుచిరచంద్రా !

జ్ఞానమూర్తియగు కృష్ణుడు అర్జునునకు చేసిన హితోప దేశము భగవద్గీతయైనది. పదునెన్మిది శీర్షికలతో అధ్యాయము లన్నియు ఇహపర సాధనములుగా నున్నవి. ఒక్కనరుని బాగునకై చెప్పబడినను భగవద్గీత నరులందఱికి పరమ ప్రమాణమైనది. పరమాదర్శమైనది. భగవంతునిచే గానము చేయబడిన వగుటచే ఆ వాక్యములన్నియు ఆత్మ విశ్వాసమును ప్రజలలో పాదుకొల్పుచున్నవి. త్రిమతములవారు దీనిని తమ మతములకు అనుగుణముగా సమన్వయ పఱచుకొనుచున్నారు. ప్రపంచమతము మానవతావాదము. అట్టి ఉదాత్తమైన భావ పరంపరలతో నిండియుండుటచే గీత విశ్వజనీనమైనది. ఏ దేశమునగల ఆధ్యాత్మిక వేత్తయైనను దానిని సమాలోచించి విశ్వమతమును దృఢపఱచుట జరుగును. అందుచేతనే 'త్రిలోకి

పూతా గీతా' అని గీతను సర్వజనులు ప్రశంసించుచున్నారు. ఆరాధించుచున్నారు.

హిందువులకు గీత-నీతిశాస్త్రము-వేదాంతశాస్త్రము-ఇహ పరతారకమైన యోగశాస్త్రముకూడ. ఈ మహాగ్రంథము వేద శాస్త్ర పురాణేతి హాసాదులలో సారభూతమైయున్న ధర్మమును సంరక్షించుటలో అగ్రగణ్యమై యున్నది. ఎవరిసంస్కారము నకు తగినట్లు ఇది బోధించును. దాని ప్రకారము నడచు కొన్నచో పరమశాంతి మనలను వరించును. ఈసంగతి భార తీయులందఱకు తెలిసినదే !!

కాలము మాఱుచున్నది. ప్రజల మనస్తత్త్వము మాఱు చున్నది. భాషలుమాఱుచున్నవి. భాషణలోని తీరులు మాఱు చున్నవి. ఇంతో అంతో సంస్కృతజ్ఞానము గలిగి-గురుసేవ చేయగల్గిన వారికి మాత్రమే గీతార్థము కొంతలో కొంత తెలిసి నట్లుండును. నేను సంపూర్ణముగా 'గీతార్థము' నెఱుగుదుననుట మహా సముద్రమును రెండు చేతులతో ఈది అవతలియొడ్డునకు చేరుట వంటిదేయగును. పండితులకు గ్రంథజ్ఞానమునకేమి లోపము? ఆచరణచేయుట యనునదియే కష్టము. ఉపదేశము లందఱు చేయుదురు. దానిని తు. చ. తప్పక ఆచరించువారు మాత్రమే తక్కువ. చెప్పునట్టి విషయము చిన్నదైనను పెద్ద దైనను అది హృదయమున ముందు ప్రవేశించవలెను. అట్లు ప్రవేశపెట్టగల శక్తి మానవోత్తములకు కొంతమందికుండును. హృదయమున ప్రవేశపెట్టుటయే కాదు - పంకిల హృదయ

మును సంపూర్ణముగా మార్చి అందు అఖండమైన భగవత్ప్రే మను నింపగలవాడు భగవంతు డొక్కడే యని గ్రహింప వలసియున్నది. కాళీదేవిని ఎన్నోఏండ్లు పూజించి పూజించి సిద్ధిపొందిన మహనీయునకు జగజ్జనని దర్శనమిచ్చి "నాయనా? నీకేమి కావలెను" అని పుత్త్రవాత్సల్యమున నడిగినది. ఆ మాటలను వినిన సిద్ధుడు "అమ్మా! నీదయవలన సర్వశాస్త్ర విశేషములు తెలిసినవి. దేనిలోను శాంతిలేదని గుర్తింపగల్గి తిని. భగవత్ప్రేమలో నిజమైన ఆనందమున్నదని పెద్దలందురు. ఆ ప్రేమను నీవు ప్రసాదింపవా?" అని కోరినాడు. అందు లకు దుర్గాదేవి "కుమారా! కొన్నిశక్తులు కొంతమందికే యుండును. నేను కొన్ని శక్తులీయగలను. కాని అమూల్య మైన భావనాతీతమైన అనిర్వచనీయమైన భగవత్ప్రేమను నేనీయజాలను. ఈ సమీపముననే ఒక దొరవలె కనిపించు మహాత్ముడే నీకు దానిని ఈయగలడు పొమ్మ''నెను. కొన్నా ళ్ళకు ఆ తాపసి కాశ్మీరమున నివసించు హరనాథుని దర్శిం చెను. ఒక్కక్షణములో ఆ సాధువు మనస్సులోని ఆవేదన గ్రహించెను. మధురమంజులమైన మందహాసమును ప్రసరింప జేసెను. పిమ్మట దగ్గఱగా లాగుకొని గట్టిగా కౌగిలించుకొనెను. ఆ గాఢాలింగనములో ఆచూపులో ఆ చిఱునవ్వులో ఏమి మహత్తున్నదోకాని అతడు వెక్కి వెక్కి యేడ్వనారంభించెను. జన్మజన్మలలోని పాపపుంజములను తలచుకొనుచు పరితపించ సాగెను. ఝంఝామారుతము కన్న తీవ్రమగు నొకానొక

దివ్యావేశము అతని హృదయమునను ప్పొంగెను. పసిపాపవలె నమాయకుడై నిర్మల ప్రేమానంద వీచికలలో తేలినాడు. తాను అనుభవించు నానందమును చెప్పలేకపోయెను. చిరకాలము నుండి కోరుకొనుచున్న-దేవతలెవ్వరును ఈయలేని భగవత్ప్రేమను పొందినాడు. సిద్ధపురుషులు- ఇంద్రజాలములు చూపగలరు-ధనరాసులను కురిపించగలరు. కాని భగవత్ప్రేమను లవలేశమీయలేరు. ఆసాధుసత్తముడు హరనాథుని ప్రేమాధినాథునిగా ప్రస్తుతించినాడు. ఉపదేశములు లేవు, మంత్రములు లేవు; దీక్షానియమములు లేవు; పూజల ఆడంబరములులేవు- ఒక్కచూపుతో హృదయడోలనూపగల యీయన యెవ్వరై యుండునో మున్ముందు మీరు తెలిసికొనగలరు.

రాముడు కృష్ణుడు దుష్టులను శిక్షించినారు. శిష్టులనురక్షించినారు. ఆప్రకారముగా కఠినముగా శిక్షించుటకు హరనాథుడు రాలేదు. సంసార వ్యామోహముచే కఠిన కర్కశపాషాణములైన మానవహృదయములను కరగించి అందు భగవత్ప్రేమామృతమును నిక్షేపించుటకే-కన్నీరుకార్పించుటకేమధురభావతరంగములలోనోలలాడించుటకే ఆయనమహోన్నతధామమును విడనాడి మనతో నాడుకొనుటకే వచ్చినాడు. వర్ణభేదము - గుణవిచక్షణ ఈయనకులేదు. నీకునచ్చిన దేవుని స్మరింపుమనును. మాయనంటని సాధుసత్తముల సేవచేయగోరును. అన్నవస్త్రాలు లేక అష్టకష్టాలకులోనై పరితపించు దీనజీవులు ఈయనకు పరమాప్తులు. తెలిసియు తెలియకచేసిన మహాపాపభూతములచే నలిగి

పోవు నభాగ్యజీవులు ఈయనకు బంధువులు సంసారసముద్రమున క్షణక్షణము చెలరేగు ప్రమాదభరితములైన జలవిప్లవాలలో మున్గితేలు దురదృష్టవంతులు ఈయనకు ప్రాణమిత్రులు. నిజము చెప్పవలెనన్న ఏప్రత్యేకత - గొప్పతనము ప్రతిఫలము కోరక మన యానందమునకై - ఔన్నత్యమునకై - మన కుటుంబ క్షేమమునకై - ప్రతిక్షణము అల్లాడిపోవు శ్రేయోఽభిలాషి యీయనయే!! ప్రపంచమును మూడుచెఱువుల నీళ్లు త్రాగించు మహామాయనుకూడ తనచెప్పుచేతలలో నుంచుకొని- అంతులేని ప్రేమమాధుర్యమును మనకు తనివోన చవిచూపుటకే యీ దయామయుడు వచ్చినాడు. ఆయన క్రీగంటిచూపు నోచుకొన్నవారు ధన్యులు !! గణ్యులు !! ఆకృపావతారుని ఆశ్రయము లభించుట - చరితార్థత తారసిల్లుటయే !! ఈభగవానుని సూక్తులు వెలలేని అనర్ఘరత్నములై మనలను తరింపజేయుచున్నవి.

ఒక దివ్యప్రకాశము చీకటిప్రదేశములను సైతము వెలుగుతోనింపినట్లు ఈయన కాశ్మీరున నుద్యోగము చేయుచు - దేశదేశాంతరములలోని వారితో నుత్తరప్రత్యుత్తరములు జరిపెడువాడు. ఇతరులు వ్రాసినలేఖకీయన తప్పక జవాబిచ్చెడువాడు. ఆజాబులలోను తన్నొక పిచ్చివానినిగానే వ్రాసికొనునుగాని ఎక్కడను ఇంద్రుడను - చంద్రుడను పెద్దపెద్ద విశిష్టతలు - చెప్పుకొనలేదు. ఎదుటివాని హృదయమును అతివిచిత్రముగా మనోహరముగా ఆకర్షించుటలో ఈయన భక్తులను నంబో

ధించిన తీరుచూచినచో విశదముకాగలదు. ఆపిలుపులో భక్తుల తలపులున్నట్లు ఆతలపులలో వారి జీవితధ్యేయము ఆనంద మున్నట్లు - గ్రహింప వచ్చును.

భగవద్గీత - ప్రబలదుఃఖ హేతువైన సంసారమును ద్వేషించుచు - పాఠకులను సచ్చిదానందుడగు పరమేశ్వరుని వైపునకే మఱల్చుచుండును. దానివి అందఱు అర్థముచేసికొన లేరు. అర్థసమన్వయమెఱిగినవారు క్రియాశూరులు కాలేకపోవు చుండుట మనమెఱుగుదుము. ఇక హరనాథుని భగవద్గీత యనునది వేఱుగాలేదు. అది సంస్కృతభాషలోలేదు. కాని యావత్ప్రపంచ ములోని ఆప్తులకు హరనాథుడు వ్రాసినలేఖావళి - అమృతోప మానమగు భాషలోనున్నది. అనేక సుధాబిందుధారాప్రవాహ మగు భాగీరథిని భూమికితెచ్చిన భగీరథునివలె హరనాథుని ప్రేమామృత గంగాలహరిని ప్రజలకందజేసినవాడు అటల్ బిహారీ నాందీమహాశయుడు. చిన్నమాటలలో మహోన్నతమైన భావము. భావభావాంతరాలలో జన్మజన్మలలోని రహస్యవిచా రము -కర్తవ్యప్రబోధము -కృష్ణోన్ముఖములైన వర్ణనలు - సం సార జీవితములోని మధురిమలు-దానివెనుక దాగియున్న ఘోర మనస్తాపవేదనా పరంపరలు - మున్నగునవి పరికించినపుడు- ఈలేఖకుడు ఎవ్వరైయుండునా? యను ప్రశ్న జనింపక మానదు. వేదశాస్త్రాదుల విషయప్రసక్తి ఇందులేపోయినను తత్సారమాధుర్యము - ఉత్తమజీవితసారమ్యము - దివ్యవాణీ

విహారము - భగవన్నామ ప్రాశస్త్యప్రకటనము - నిర్వ్యాజ కృపాలహరీసంగమ సౌఖ్యములు - ఇందుమాటిమాటికి మన లను పలుకరించుటయేకాదు. సమాదరంచి ఆస్వాదింప నాహ్వానించుచుండును.

ఈ లేఖలలో మఱియొక ప్రత్యేకత యున్నది. ఎవరు వీనిని జాగ్రత్తగా చదువుచుందురో వారి సందేహములను అవి పటాపంచలగునట్లు చేయుచుండును. అనేక యాతనలకు ఆల వాలమైన సంసారములో మున్గుచు తేలుచుండు జీవికి శాంతి సామాన్యముగా శూన్యము. అట్టి వారికి ఈ లేఖాపఠనము - అమృతపానమువంటిదని చెప్పవచ్చును. మహాపండితులు - మహామాంత్రికులు — మహాసిద్ధులు - ఆచార్యపురుషులు చెప్ప లేని అనేక గోప్యవిశేషములిందిమిడి యుండుట గమనింప దగియున్నది.

కేవల వినోద విలాస భోగలాలసమగు సాహిత్యము సాహిత్యముగాదు.. ఏదివాస్తవమో — ఏది నిత్యమో - ఏది శుభ ప్రదమో — ఏది సర్వోత్కృష్టసుందరమో అట్టి పరమాత్మవైపు నకు మనోబుద్ధులను మఱలింప గల్గునది - తత్సంబంధమైన ఆనందమును అందీయగలదే ఉత్తమ సాహిత్యము. ఈమహో దాత్త భాగవతసూక్తి మకరందమును మహాకవి పోతన మహా శయుడు తన భాగవతములో

"హరినామస్తుతిసేయు కావ్యము సువర్ణాంభోజహంసావళీ
సురుచిభ్రాజితమైన మానససరస్స్ఫూర్తిన్వెలుంగొందు నా
హరినామస్తుతి లేనికావ్యము విచిత్రార్థాన్వితంబయ్యు శ్రీ
కరమైయుండదయోగ్యదుర్మలినవత్కాకోలగర్తాకృతిన్"

అని ప్రవచించి యున్నాడు. నిజము చెప్పవలెనన్న - వైష్ణవ భక్తిరస సంపన్నము - విశ్వప్రేమోదారము - హృదయానంద సాగరము అనదగిన ఈ లేఖావళినిగూర్చి హరనాథుడు వ్యంగ్యముగా

"మహతీవాద్య విశేషముచే నారదుడును, మురళీవరముచే గోపికలును; నిరంతర నామ గానానందముచే శుకదేవుడును తరించినారు. నా లేఖినీసుధలచే మీరును తరింపగలరు" అనిచెప్పినాడు.

హరనాథుని లేఖావళి - ఒక్కటేమిటి? సర్వమానవ జీవిత పరమార్థమును కథనము చేసినది. అసత్య-అశ్లీలములకే మాత్రమును అవకాశమీయలేదు. అందుచేతనే ఈ సూక్తి కదంబము వేదతుల్యమైనది.

"ఈవిశాల ప్రపంచమును రాసమండలిపై దృష్టిలేకుండ జేయు మాయాజాలమునుండి యికనేను సెలవు పుచ్చుకొందును. నీవు దయదలచి సంసారభారాలచే క్రుంగిపోవువారిని ఆరాస మండలిలో సుఖపడునట్లు నీకుగల భగవత్ప్రేమచే చేయగల్గితివి. నీమహేంద్రజాల విజ్ఞానము నేడు సార్థకమైనది. నీవంత తెలి

వైనవాడవు కావుననే ఇంద్రజాల విద్యానిధిని ఓడింపగల్గితివి. నీవు పూర్వమున్న వ్యామోహపు చూపులతో మాత్రము నన్ను ఉద్రేకపఱచబోకుము. నన్నుగట్టిగా పట్టుకొని పైకితీసికొని వెళ్ళుము. ఎడతెగని భయోత్పాతమునకు చిక్కిననేను చెప్పుటకు వీలుగాని నీరసమున నిర్జీవినై పడియుంటిని. అందుచేత ఇంత కన్న నెక్కువగా నన్నుభయపెట్టకుము. నన్నొక్కనిని మాత్రము విడిచివెళ్ళకుము. నాయభివృద్ధిని నిరోధింపవలదు. నీయద్భుతమైన వలను నాపై విసరబోకుము.

నీవు నాపై ప్రేమాతిశయమును పెంచినకొలది నీదగ్గ ఱనే పడియుందును. నాజన్మతరించునట్లు - నేనెపుడు నీమేలు మఱవవియట్లు దయతో నన్ను చూడగోరెదను. తమాషాగా ప్రాపంచిక విలాసములతో నన్ను తార్మాఱు చేయకుసుమా?

మీరందఱును ప్రపంచమునకు భూషణములవంటివారు. మీవలననే యీ సంపూర్ణ శోకమయ ప్రపంచము పరమ సంతోష నిలయముగా కనిపించుచున్నది. మీసాధన - కృషి విశేషములు క్షణము లేనిచో ఈ జగత్తే నశించిపోవును. నిన్ను తెలిసికొన్నవారు - క్రమముగా తామే దైవస్వరూపులమని తెలిసి కొందురు. ఈమాయావాతావరణమునుండి విముక్తుడనగు స్థితిని కలుగజేయుమని నేను నాశక్తికొలది ప్రార్థించుచున్నాను. నీవు ఆదివ్యధామమునకు దారిచూపనిచో ఆ దివ్యసౌందర్యమునకు దూరమై, నేను అంధుడనై కాఱుచీకటిలో పడియుందును."

చదువరులారా ! హరనాథుని లేఖారచనలోని నేర్పు చూచితిరా ? తానొక సంసారజీవియట ! అదియొక మహా సముద్రము వలె ఏమాత్రము విశ్రాంతిలేకుండ బాధించు చుండునట ! అక్కడనే బాధపడినచో లాభములేదట !! అక్కడనేయుండి కష్టములను సుఖములుగా భావింపగలవారు ఈ శోకలోకమున హాయిగా బ్రతుకును వెళ్లబుత్తురట ! భ్రాంతిలోపడిన తనకు రాసమండలిని చూపగలవాడు తనమిత్రుడట ! తనపై కనికరింపక పోయినచో తనకు అధఃపతనము తప్పదట !! తనమిత్రుడు రాసమండలికి ద్వారపాలకుడట ! అతనిసహకారముతో తాను బృందావనికి వెళ్లునట ! ఆచెలికాడు ఏమాత్రము ఆదరించక పోయినను తనకు అంధకారము తప్పదట !! ఈవాక్యములు జాగ్రత్తగా పరిశీలించినచో ఇవియన్నియు సంసారబద్ధులమైన మనకు గుణపాఠములే! హరనాథుడు మిత్రుని ఒకానొక గొప్ప వైష్ణవునిగా - భక్తసత్తమునిగా భావించినాడు. ఆయన తన యోగ్యతా విశేషములచేత భగవత్ప్రీతి సంపాదించినవాడు. రాసమండలిని పరిరక్షించు ద్వారపాలకుడు. అతనిమిత్రుడయిన తానును బృందావనికి పోగలనని వివరించినాడు. భక్తుల అనుగ్రహము — భగవదనుగ్రహమునకు సాధనము. దీనినే వైష్ణవ శరణాగతి యందురు. నిర్మోహులు - నిరాడంబరులు- నిరంతర భగవన్నామ సాధకులైనవారిని ఆశ్రయించి - కృష్ణుని ప్రీతిని సంపాదించుట - మన కర్తవ్యమని హరనాథుడు ఉపదేశించినాడు. ఈవిధముగా వ్యాఖ్యానింప దలచినచో

నీ లేఖావళీరత్నాకరమున విలువగట్టరాని యెన్నెన్నో భావ రత్నాలు లభింపగలవు.

"ప్రకృతి - జీవులకుతల్లి - గురువుకూడ. అంతియేకాదు మాయామోహిని. ఆమెఆకర్షణచే మానవులు పతితులు కాగలరు. ఆతల్లి కరుణా కటాక్షముచేత పునీతులు కాగలరు.

ఇంతకు మాయామయమైన జగత్తులో నివసించువారు - ఈమె క్రూర వీక్షణములకు గురికాకుండ నుండవలెనన్న - ఆమె మనస్తత్త్వము - పోకడ తెలిసికొనవలసి యున్నది. పాము మంత్రము తెలిసికొన్న తర్వాతనే దానిని పట్టుట మంచిది. అటులనే జగన్మోహనుడైన కృష్ణుని పొందవలెనన్న - ప్రకృతి శక్తిసంపదలను సంపూర్ణముగా అవగాహన చేసికొనవలెను. దేవీ భాగవతమున మహాప్రకృతి వర్ణన చాల విస్తారముగా చేయబడినది. అందలి విషయములు మనకు దుర్గమములుగానున్నవి. ఈనాటిసమాజ స్థితిగతులలో మున్గితేలు సామాన్యులమైన మనకును ప్రకృతియొక్క యథార్థస్వరూపమును హరనాథుడు వివరించుటలో చాలశ్రమపడినాడు. అరటిపండొలిచి పెట్టినట్లు బోధించినాడు. ప్రకృతిని వశపఱచుకొనినగాని బృందావన ప్రేమధామమున కాలుపెట్టుటకు తావులేదు. ఒక లేఖలో ఒక భక్తునకు స్వవిషయమును తెలియజేయుచు - తనధ్యేయము అపేక్షయేమిటో హరనాథుడు అత్యద్భుతముగా వివరించినాడు గమనింపుడు.

"నేను పైకి ఒక ఆడంబరమైన పురుషునివలె కనిపించుచున్నను-నాస్వభావము-చేష్టలు చాలవఱకు స్త్రీ ప్రకృతియే !! ఇదియే నాలోని చిత్రము !! అందుచేతనే నా సొంత విషయాలకన్న ఇతరుల విషయాలలో ఉక్కిరిబిక్కిరియై పోవుచుందును. నిజమునకు నా విషయమై నాకంత పట్టింపు లేదు. ఇతరుల విషయమై ఆలోచించుటలో నాకు ఏ మాత్రము తీరికలేదు. నేను హృదయమును తారుమారుచేయుచు దుఃఖమును గల్గించువానిని వినలేను. ప్రజలు కష్టములలో పడి నిరాశులై పలవించుచు హాహాకారములు చేయుచోట్లలో నేనుతప్పక యుందును. ఎవ్వరేడ్చుచున్నను నేనుచూచి సహింపలేను.

ప్రయత్నపూర్వకముగా నన్నెవరును తెలిసికొనలేరు. మీరు నా సంగతి చెప్పునపుడు దానిని అపార్థముచేసికొన్న సమయములో మీ రక్షణకు నేను సిద్ధముగానుందును. కష్టపరంపరలలోని ఆందోళనల సముద్రముననే నేను నివసించుచుందును. సముద్రమే సముద్రము. అచట సుడిగాలులు-తుపాను భీభత్సము-అలల యలజడి యుండకుండనుండునా? నా జీవిత మీలాగునే సాగిపోవుచుండును. నేను ముఖ్యముగా చెప్పునదేమనగా అట్టి పరిస్థితులలోనే నీవు నవ్వుచు-ఇతరులను కూడ నవ్వునట్లుచేయుము ఈ రీతిగా చేయగలవారీ లోకమున హాయిగా జీవింపగలరు. నీవు నాకిచ్చిన మాట ప్రకారము నీ హృదయములో నన్ను ఒక్క నీడగా దాచియుంచుము. అట్లు చేసినచో నేను కన్నుమూసినను-తెఱచినను నీవు జ్ఞప్తిలోనే యుందువు.

నాయనా! నీ ప్రేమనే నేను కోరుచున్నాను. దానిని పొందగలనా? పొందుటకు అర్హతయున్నదా? కొంచెము నన్ను నీవు కనికరించక పోయిన పక్షమున నేను గాఢాంధ కారముననే ప్రమగ్గవలసివచ్చును. నీ యాదరము నేనెట్లుపొంద గలనో తెలియజేయగోరెదను. ఈ రహస్యమును నీవు శ్రీ కృష్ణుడు తప్ప మఱెవ్వరును చెప్పలేరు. ఈ సంసార పంకి లమునుండి విముక్తుడను కాగలనా? నా బ్రతుకందులోనే సాగు చున్నది. ఇట్టి దుర్గతిలో నున్న నన్ను మఱచి పోవలదనియే కోరుచున్నాను. నీచే చక్కగా పోషింపబడు మార్గములోనే నేనును నడువదలచితిని. నీవు రాసమండలికి ద్వారపాలకుడవు. ఇక నాకేమి భయము? నేను నీతోనే అక్కడ నివసింపగలను. దొరకినచో స్వయముగా రసికశిఖామణియగు కృష్ణుని దివ్య నాట్యమును కనులార తిలకింపవచ్చును, మహాప్రకృతి యనుమతి పత్రమిచ్చుటకై మనము చాల కృషి చేయవలసియున్నది."

"ఆప్రకృతికి గురువు - ఒకప్పుడు శిష్యుడు - వేదము లకు వేదమైనవాడు కృష్ణుడే!! ప్రకృతులు యమునానదివంటివి ఆప్రవాహమునకువలెనే వీనికి వాలు - ఎదురుఉన్నవి. ప్రకృ తుల కటాక్షము పొందనివారు ఏనాడును ఎదురీదలేరు. అధో గమనమువలననే జగత్తు జీవులతో నిండియున్నది. ప్రకృతిలీల నెవరు గ్రహింపగలరు? తేల్చినను ముంచినను నిగ్రహించి నను అనుగ్రహించినను - వీనికితగినవారు ప్రకృతులే!! జీవ

రాజ్యమునకు బ్రహ్మవిష్ణుమహేశ్వరులవియే !! వారువారుచేసిన సాధనలను బట్టి అవి గోచరించుచుండును.

ప్రకృతుల ప్రభుత్వము సామాన్యమైనదికాదు. గృహ దేశస్వర్గనరక. వైకుంఠగోలోక బృందావనాధిపత్యము మాత్రమే కాదు.. ఇల్లువదలి స్మశానమును ఆశ్రయించిన మహాదేవుడు ఈ ప్రకృతులచేతిలో నుండి తప్పించుకొనలేక పోయినాడు. సామాన్యప్రాణుల మాట చెప్పవలసినదేమున్నది? ప్రకృతి శక్తులు మహత్తరమైనవి. సమస్తలోకమును వ్యామోహపెట్ట గలవి కూడ నివియే !! అవి నెమ్మది నెమ్మదిగా అష్టాంగ బంధాలను తగిలించి మనలను జడపదార్థములుగా చేయు చున్నవి. వానికెంతదయయో అంతకాఠిన్యము !!

ఈపాములతో చెలగాటమాడకుండుట మంచిది. ఒకవేళ ఆడదలచుకొన్నచో ముందు మంత్రతంత్రాలను నేర్చుకొనుట మంచిది. మనము ఆలాగున చేయక వానితో సంబంధముపెట్టు కొనుటతో ఏడ్చుచు కాలముగడుపుట తప్పుటలేదు. ఇంతశక్తి-గుణాలున్నవారు నిజముగా ధన్యులు!! బంధాలను తొలగించుట యనుమాటయటుంచి యీప్రకృతులు క్రొత్తక్రొత్తబంధాలతో మనలను బంధించుచుండును. మఱొకమాట చెప్పకుండ పెం పుడుజంతువులవలె మెడచాపుచున్నాము. వీని అనుగ్రహమును పొందుటకే మనము ఈలోకమున పుట్టుచుందుము. వానితో కలసి తిరుగుచు భ్రాంతిలోపడి వానితోసమానులమనియో

ఎక్కువవారమని భావించి చిత్రముగా ప్రవర్తించుటతో - అవి మఱవని రీతిగా దెబ్బతీయును. దానితో జీవితాంతము వానికి దాసులముకాక తప్పదు. కృష్ణదర్శనము కలుగకుండ జేయు ఆవరణ శక్తులివియే !! రెండు వైపుల వాడిగల కత్తులవంటివారు వీరు. వీరిని సంతోషింపచేయుట యెంతకష్టమో ! ఓడించుట కూడ అంతకష్టము. ప్రకృతులే రాసమండలికి ద్వారపాలకులు. కొన్ని తమాషాలుచేసి రాసమండలిని మనము మఱచిపోవునట్లు వీరు చేయుదురు. మననాదులవలన యోగీశ్వరులు కూడ శ్రీకృష్ణుని పొందలేరు. కాని యీ ప్రకృతులు మాత్రము కృష్ణుని బంధించగలరు. అందుచేతనే కృష్ణుడంతటివాడు రాధా - దుర్గాదిస్వరూపిణులైన ప్రకృతులకు జోహారులుచేసి బృందావనసౌఖ్యాలలో వోలలాడుచుండును. స్త్రీలందఱును ప్రకృతులే!! ప్రపంచమందలి ప్రతిస్త్రీ తగిన గౌరవమును పొందునుగాక! ఆడుకుక్కలు - ఆడుపిల్లులు స్త్రీశక్తిలోని యంశములుగా గౌరవించవలెను."

హరనాథుడు స్త్రీలకిచ్చిన గౌరవము అసామాన్యమైనది. ఆయన స్త్రీయంశ - యెచటనున్నను మిక్కిలి గౌరవించుమనియే కోరును. "స్త్రీలు ఎక్కడ గౌరవింపబడుదురో అచట సర్వశుభములు-సిరిసంపదలు వర్ధిల్లును" అని చెప్పు మనుధర్మశాస్త్ర సూక్తులను పోలిన యీ హరనాథుని ఉపదేశము సాధక లోకమునకు పరమప్రమాణమైనది.

హరనాథుడు నాలుగాశ్రమములయందు గృహస్థాశ్రమము సర్వశ్రేష్ఠమైనదని చెప్పుటయేకాదు, నిజమైనగృహస్థుగా

ఆయన జీవించినాడు. ప్రపంచశ్రేయస్సును రూపొందింప గల వారుదంపతులు. అనుగుణవతి - సహధర్మచారిణియగు 'భార్యాతత్త్వము' ను గూర్చి ఈయనచెప్పినది అమోఘముగా నున్నది. సంగ్రహముగా కొన్నివాక్యములివి :-

"నీభార్యను హృదయ సమానురాలని తలంపుము. నీవు నడచు నుత్తమమార్గముననే యీమెను నడిపించుటకు ప్రయత్నింపుము. నీమనస్సునకు తగినట్లు ఆమెను తీర్చిదిద్దుటయేకాక - క్రమముగా మీరిద్దఱొకరై సుఖముగానుండుడు. ఆమె ఆదర్శభార్యగా నుండునట్లు ప్రయత్నింపుము. ముందు నీభార్య యత్తమామలను సేవించుచు పిమ్మట బాధపడువారిని ఆదుకొనునట్లు చూడుము. భూతదయ, శాంతి, అనురాగమను సుగుణ భూషణములచే ఆమె కలకలలాడునట్లు చేయుము. తనపిల్లలకు తల్లియగుటలో గొప్పతనములేదు. ప్రపంచమునకే తల్లికావలసియున్నది. ఇంటి పనులను చేయుచున్నదిగదా ! యని ఆమెను ఒక విలాసవస్తువను కొనకుము. చిన్నపుచ్చకుము. విజ్ఞులు చెప్పవలెనన్న ఆమె నీ సహధర్మచారిణి. కన్నులకింపైన భార్యలెందఱైన నుండవచ్చును., కాని హృదయమునకునచ్చిన వారు చాలతక్కువ. ఆమె ఇహపరాలలో నీకుమిత్రురాలు."

వేదము భార్యను ధర్మపత్నియని గౌరవించినది. ధర్మయుక్తమైన అర్థమును (ధనమును) కామమును (కోరికలను) అనుభవించవలెను. జీవితము అర్థకామ

ములతోనే నడచును కేవలము భోగదృష్టితో వానిని అనుభవించినపుడు మోక్షవిరుద్ధమైన దుఃఖమే ప్రాప్తించును. ధర్మమను కవచముతో దంపతులిరువురు అర్థకామయుక్తమైన జీవితసమరమున జయలక్ష్మిని సంపాదింప వలసి యున్నది. అట్టి యుత్తమధర్మ సాహచర్యము గలవారే భార్యాభర్తలు !! ఈపరమార్థమును దృష్టిలోనుంచుకొని హరనాథుడు -పాశ్చాత్య నాగరికత - ప్రబలిన యీకాలమున నిజమైన భార్యాతత్త్వమును ప్రబోధించినాడు. మిగిలినమతములవారు దైవముఖమున ఆలు మగలకు పెండ్లిచేయుటయేకాక, వారిరువురు దైవప్రమాణ ముగా - ఆతనిపై నాధారపడి జీవింపవలెనని ఆజ్ఞాపించు చున్నవి. అన్నిమతములకు సమన్వయమతమైన హిందూమత మున - అట్టి ఆచారము సన్నగిల్లిపోవుచున్నది. భోగములను అనుభవించుటకు పిల్లలను కనుటకే భార్యనుపయోగించు కొను టకు అలవాటుపడిన నవనాగరికులీ యుపదేశమును పాటింప వలసియున్నది. భారతదేశము ఆధ్యాత్మికదేశము. హైందవ మతము దివ్యతత్త్వమును బోధించును. అన్నపూర్ణా గృహములో అన్నమునకు కఱవువచ్చినట్లు - దేశదేశాలకు ఆధ్యాత్మికామృత మును యుగయుగాలుగా - తరతరాలుగా పంచుచున్న మన దేశములో నట్టి యరిష్టము కలుగరాదు. భార్యాభర్తలు-భగవ న్నామ ప్రేమానందములచే నిర్మలమైన జీవితము గడుపవలెను. భార్య జన్మజన్మలలోని దైవికమిత్రురాలు. ఆమె ప్రకృతికి పతీక. ఆమెసహకార సౌజన్యములతో మానవుడు ఇహపర

ములను సాధించవలె. జీవితనాటకమున ఆమెపాత్ర భర్త పాత్రతోసమానమైనది. అందుచేత ఆమెను ఏసందర్భముల లోను చిన్నపుచ్చరాదు. భర్తఆధ్యాత్మిక గుణములచే ఆమెను అలంకరించవలెను - అనెడు మధురవాక్యములు యథార్థములై - సంపూర్ణమానవతా వాదమును సమర్థించుచున్నవి.

వేదవాణి తల్లిని "మాతృదేవోభవ" అని గౌరవించినది. తల్లిదండ్రులను - గురువులను - పెద్దలను లక్ష్యపెట్టని రోజు లివి. ఈదుష్కాలమున జీవించువారికి జ్ఞానోదయమగుటకై హరనాథుడు అందజేసిన సందేశము సముదాత్తమైనది. పరి కింపుడు.

"తల్లిదండ్రులు పైకి ప్రేమ - ఆదరమూ లేనట్లు కని పించినను పిల్లలు వారినెప్పుడు తృణీకరించరాదు. ఆరీతిగా తృణీకరించినచో గొప్పపాపము చేసినవారయ్యెదరు. గొప్ప పాపకర్మకు ఫలముగా కఠినులు - దుర్మార్గులైన తల్లిదండ్రులు కలుగుచుందురు. క్రొత్తపాపాలు తెలిసితెలిసి చేయుటెందులకు? క్రొత్తదుఃఖాలు అనుభవించుటకు విత్తనాలుచల్లుట తెలివైనపని కాదు. నేనుచెప్పునదేమనగా తల్లిదండ్రులనెప్పుడును తృణీక రించకు. రహస్యముగా మనస్సులోనైతము చిన్నపుచ్చకు. దేనివలన నీయవస్థ వచ్చినచో అటువంటి దుష్టకర్మను నిందించుకొనుము. చివరకు భగవంతుడు మీకు మేలుచేసి తీరును."

తల్లిదండ్రులు - జన్మనిచ్చినవారు. వారిది చాల ఉత్తమ స్థానము. మానవుడు వారిని దైవస్వరూపముగా భావించవలసి యున్నది. ఆతని భావనలో వాక్కులో పనులలో తల్లిదండ్రుల సేవాధర్మము తాండవించవలెను. తానొక్కడు సేవించుటయే కాక తన భార్యను ఆసేవలో నిమగ్నురాలగునట్లు చూడ వలెను. ఈవిశేషమును మనకు బోధించుటయేకాక హరనాథుడు తన మాతృదేవతయెడ జూపిన భక్తిభావమును చదువరులిది వఱకే గ్రహించియుందురు.

ముద్దుముద్దుగా కృష్ణునిగూర్చి హరనాథుడు లేఖలలో నుడివిన పలుకులెంత తేనెలొలుకుచున్నవో పరిశీలింపుడు.

"రాత్రింబగళ్ళు మనఃపూర్వకముగా కృష్ణునినామమును స్మరించుట యనునది మఱచిపోకు. అతడే యీ ప్రపంచము నకు మూలకారకుడు. నిజమైన సుఖసంతోషాలు ఎవ్వరివలనను నీకు లభింపవు. అత డొక్కనివలననే కల్గును. ఆపదలలో మునిగియున్నపుడు నీయాతనను అతనికి తెలియజేయుము. అత డొక్కడే ఎవ్వరికష్టసుఖాలయినను వినగల్గును. ఆర్తితోకూడిన మాటలవిషయమై ఆయన ప్రత్యేకశ్రద్ధ చూపును. బిగ్గఱగా మాటలాడిన మాటలను అంతగాపట్టించుకొనడనియే చెప్పవలెను. హృదయపూర్వకముగా చేయబడు ప్రార్థనలు - సంకీర్తనలు ఏనాడును వృథాకావు. నీహృదయములోని విచారమును, కోరిక లను ఆయనకు నివేదింపుము. అతడు వినునోలేదో జాగ్ర త్తగా పరిశీలింపుము. కావలసినవారికన్న నిన్నతడు ఎంతగా

ప్రేమించుచున్నది నీవే గుర్తింపగలవు. నిజము చెప్పవలెనన్న ఎవరు ఏడ్చినను ఆయన సహింపలేడు. ఒకవేళ ఆవిధముగా వినుటయే తటస్థించినచో - అతనికి తెలియకుండగనే ఆయన ఆబాధలను నివారించును. కష్టమే వచ్చినను సుఖమే వచ్చినను నీబాధ్యతను ఆయనయందుంచిననాడు - అనూహ్యమైన - అజ్ఞాతమైన - అద్భుతమైన - అద్వితీయమైన దివ్యవాక్యములను లీలలను నీవు తెలిసికోగలవు కృష్ణుడు నిన్ను అనుగ్రహించి నట్లు ఆనందించగలవు."

పాఠక సోదరులారా !

హృదయేశ్వరుడైన కృష్ణుని కృపకావలెననుకొన్నవారు ఏరీతిగా ప్రార్థనచేయవలెనో ఆయన సూచించినాడు. నిజమైన మిత్రుడాయనయేయని సహేతుకముగా బోధించినాడు. మానవు లకు ఆయనకు మించిన శ్రేయోఽభిలాషి మఱియొకడు లేనే లేడని హెచ్చరించినాడు. హృదయపూర్వకముగా చేయు ప్రార్థ నలు - సంకీర్తనాదులు తప్పనిసరిగా ఫలితము నీయగలవని - అట్లు ఆతనిని సంపూర్ణముగా నమ్మినవారి సమస్యలవంతటవియే పరిష్కరింపబడుటయేకాక, నావెంటనాప్రభువున్నాడను చక్కని విశ్వాసము - ఆనందము కల్గునని చెప్పు నీమాటలునిజముగా మనకెంత సుగమముగాను - ఆదర్శప్రాయముగా నున్నవో !! కాశ్మీరులో నున్నపుడు వివిధ మనస్తత్వాలు - పరిస్థితులకు చెందినవారికి వ్రాసినలేఖలు - హరనాథుని అపారవిశ్వప్రేమ

భరితమైన హృదయమును వెల్లడించును. వీనినన్నిటిని స్థలాభావ ముచే వివరింపలేక పోవుచున్నాము.

హరనాథునికి జరిగిన 'మహాపరిణామము'ను సోనాముఖిలోనున్న సుందరీదేవి-యొక దివ్యమైన సమాధిలోనుండి దర్శించెను. ఆ సందర్భములో కుసుమదేవి కొక జాబు వ్రాయుచు-ఆ పరివర్తనమును తెలియజేసెను. ఈ లేఖ ఒక వైపు హరనాథుని స్థితిని-మాతృశ్రీ మహోన్నత స్థితిని చాటుచున్నది. ఈ లేఖ చాల మహోత్కృష్టమైనది. పాఠకులు ఇందలి విశేషమును తప్పక అవగాహన చేసికొనగలరు.

"నీ యందమును నాలోదాచి యుంచుమని చెప్పితివి. ఆ కోరిక యెట్టిదో నేనర్థముచేసికొనలేక పోయితిని. నిజము చెప్పవలెనన్న నీవే శక్తిసౌందర్యములకు నిధివి. ఆరెండింటిని నీవు తీసికొన్నచో నేను నేనే నేను. నాయందమింతకు పూర్వము వలెనే యున్నప్పుడు నీకు చింతయేయుండదు. ఒక ముఖ్యమైన ప్రయోజనమున్నదను కొన్నచో దానిని తిరిగి యిచ్చివేయుము. ఆ ఘనత నీకేదక్కును. నీ విచ్చిన దుస్తులను ఇట్లేయుంచదలచినచో నీ సంకల్పమునకు అడ్డేమియుండును? "నిన్ను నేను హృదయాంతరాళముతో పరిగణించియుంటిన"ని నీవే చెప్పితివిగదా ఊహాతీతమైన కారణాలకు కారణమయిన నీ హృదయమును బ్రహ్మ విష్ణు మహేశ్వరులే తెలిసికొనలేక పోయినారన్నచో నావంటి సామాన్యమానవుడెట్లు తెలిసికొన గలడు? నీ యథార్థస్థితిని దాచుకొని—యీ ప్రపంచమునకు

మాయా స్వరూపమును జూపుచుందువు. దయదలచి నీవు దైవికజ్ఞానసారమును మాపై చిలికినప్పుడు మాత్రమే-మేము దానిని కొంతలో కొంత తెలిసికొనగలము. ఆ దివ్యశక్తియే-ఇంద్రజాలమై హరనాథ తత్త్వమున అద్భుత లీలలను ప్రదర్శించుచుండును."

ఇంతవఱకు కుసుమదేవియొక్క నిజతత్త్వము తెలియబడలేదు. మహాప్రకృతి స్వభావమే యట్టిది. ఆమె యేమియు నెఱుగని యబలవలె సోనాముఖీధామమున నున్నదన్నమాటయే కాని ఆయమ్మ కృపావిశేషము చేతనే హరనాథ జీవితనాటకముతోపాటు - విశ్వనాటకము నడచుచున్నదన్న సత్యమును హరనాథుడే లోకమునకు వెల్లడిచేసినాడు. అరణ్యసీమలలో ఘోరతపస్సు గావించినవారు సైతమీ మహాప్రకృతి స్థితిగతులను సంపూర్ణముగా ఆకళించుకొనలేక తప్పటడుగులు వేసినారు. వారిమాటకేమి ? బ్రహ్మాదులు సైతము తలక్రిందయినారు. కృష్ణుడంతటివాడు ఆ జగన్మోహినిచేయు మహేంద్రజాలమును తెలిసికొనలేడన్న సామాన్యులసంగతి చెప్పవలెనా? హరనాథుడు- ఆదిశక్తి- ప్రకృతిస్వరూపిణి రాధాదేవి కుసుమదేవియని వ్యంగ్యముగా గంభీరముగా సూచించినాడు. చర్మచక్షువులకు కనిపించు దృశ్యములే నిజమనుకొన్న చాలమంది గొప్ప హరనాథభక్తులు - ఆయమ్మను గ్రహింపలేక పెడదారినిబట్టిరి. కొన్నాళ్ళకా దయామయి కనికరించి తనస్థితిని తెలియజేసినపుడు వారి యజ్ఞానాంధకారము పటాపంచలైనది. జ్ఞానోదయ

మైనది. తప్పు జరిగిపోయెనని పశ్చాత్తాపపడుచు వారు పాదాక్రాంతులైనారు. చదువరులారా !! నిజముచెప్పవలెనన్న అఖండ ప్రేమాధినాథుడగు శ్రీహరనాథుని అవతార మోహనమురళీ రవములోని మధురామృతమామెయే యన్న సంగతిని మున్ముందు తెలిసికొనగలరు. ఆమె సంకల్పానుసారమే హరనాథ భాగవతసృష్టి జరుగుచున్నట్లు ఊహింపగలరు.

పునర్జన్మ వచ్చినతరువాత హరనాథుడు కొంతకాలము సెలవుపెట్టి సోనాముఖికి బయలుదేరెను. మార్గమధ్యమున గల హత్రస్ స్టేషనులోదిగి నాందీగృహమునకు వచ్చెను. ఆభక్త దంపతుల ఆనందమునకు అవధులు లేకుండెను. నల్లగానున్న ఆయన శరీరము సువర్ణచ్ఛాయతో ప్రకాశించుచుండుట గమనించి వారు సంభ్రమాశ్చర్యానందములలో తేలియాడిరి. జరిగిన పరిణామమును ఠాకూరు చెప్పగా వారు విన్నారు. ఇదంతయు తామునమ్మిన హరనాథుని లీలానాటకమని భావించినారు.

హరనాథుడు బీహారీనాందీ యింటికివచ్చినపుడు - ఇరుగు పొరుగువారి పిల్లలను తనదగ్గఱ కూర్చుండబెట్టుకొని - వారిని నవ్వించుచు తినిపించెడువాడు. ఆరోజు మధ్యాహ్నసమయమున నాందీయింటికి దగ్గఱగానున్న పొరుగువారి అబ్బాయి మూడేండ్లవాడు తప్పిపోయినాడు. తల్లిదండ్రులు ఆపిల్లవానికై చాలవెదకిరి. కాని దొరకలేదు. చిట్టచివఱకు ఆయబ్బాయిని ఠాకూరుదగ్గఱనే చూచిరి. ఠాకూరు ఆపిల్లవానిని తొడపై కూర్చుండబెట్టుకొని తినిపించు చుండెను. ఆపిల్లవాడు దగ్గ

చుండెను. చూచుటకు చాలఅసహ్యముగా నుండెను. అయినను దయామయుడగు హరనాధుడు - అసహ్యకరముగానున్నను పిల్లలను తనబిడ్డలకన్న మిన్నగా లాలించుట యనునది ఆయన విశ్వోదారమైన ప్రేమకు ప్రబల నిదర్శనము.

నాందీయింటినుండి ఠాకూరు సోనాముఖి చేరెను. కుమారునకు జరిగిన పరివర్తనమునకై తల్లి యెంతో కంగారుపడెను. ఆపరిణామము జరుగుచున్నప్పుడు దివ్యసమాధిలో ఆమె ఆ సంఘటనను చూచెను. అయినను కన్నతీపితో అడుగగా హరుడంతయు పూసగ్రుచ్చినట్లు చెప్పెను. తాను చూచినది - కొడుకు చెప్పినది ఒకటేయైనది. మీదు మిక్కిలి పుత్త్రుని శరీరము బంగారువన్నెతో ధగధగలాడుచున్నందులకు విస్మితురాలయ్యెను. తల్లికొడుకులు కొంతసేపు గాఢాలింగనమున నిరుపమాన ప్రేమభావభరితులై మౌనముద్రాంకితులై - ఆనందబాష్పసిక్తనయనాంబుజులైరి.

తెలిసినవారు కొంతమంది పండితులిది పునర్జన్మయే యనుటచే శాస్త్రానుసారము హరనాథునకు తిరిగి ఉపనయన విధి జరుపబడెను.

బాహ్యజగత్తును చూచునవి కన్నులు. జగత్తు నశించునట్లే కన్నులుకూడ నశించును. నశించని నేత్రమొకటి యున్నది. అదియే జ్ఞాననేత్రము. ఇది మానవులకేతప్ప ఇతర జీవజంతువులకులేదు. మనుష్యులకు జ్ఞాననేత్రముండును. కాని

అది ముకుళించుకొని యుండును. దానిని వికసింపజేసికొనవలె నన్న దానికొక తాళమున్నది. అదియే మంత్రము. ఆమంత్రము గాయత్రీమంత్రము. దానిని త్రిసంధ్యలయందు భక్తిశ్రద్ధలతో అనుష్ఠించినచో - మొదట బ్రహ్మవర్చస్సు - తేజస్సు - ఆయుస్సు అభివృద్ధి యగుటయేకాక నిత్యానందప్రదమగు బ్రహ్మమును చూడవచ్చును. హృదయమునయున్న పరమాత్మను దర్శింపవలె నన్న జ్ఞాననేత్రము కావలెను. తాము పరమేశ్వరుని తెలిసికొని యితరులకు తెలియజేయగల నిరాడంబరులు - నిర్మోహులే బ్రాహ్మణులు. ఈఉపనయనవిధియైన తరువాత బ్రాహ్మణ త్వము వచ్చునని - తన్మూలముగా వేదాదివిద్యలను అభ్యసించ వచ్చునని శ్రుతిప్రమాణము. పునర్జన్మ నెత్తిన హరనాథునకు లౌకికాచారప్రకారము బ్రహ్మోపదేశమైనది. ఆయనయే పర బ్రహ్మమైనను లోకసంగ్రహార్థము ఇదియంతయు నటనయే కదా !!

శివనారాయణుని కుమార్తెయగు ఇందుమతికి కాళీపాద ముఖోపాధ్యాయునకు సోనాముఖిలో తే 27-11-1896లో వివాహమయ్యెను. హరనాథుని యింటిదగ్గఱగా నొక కొబ్బరి చెట్టున్నది. ఒకసాధువు ఆదారినివెళ్ళుచు — ఎండాకాలమగు టచే దాహబాధచే ఒక కొబ్బరి కాయనిమ్మని చెట్టు యజమాని నడిగెను. అతడు "అయ్యా! ఇది తొలికాపు. ఈకాయలను మనోహర దాసాలయములో సేవకై యీయవలసియున్నది" అనెను. ఆసాధువు కోపోద్దీపితుడై "ఇదేతొలికాపు - ఇదే

చివఱికావు" అని శపించెను. ఆచెట్టు ఆశాపమువలన మ్రోడై సగము చచ్చియుండెను. చాలకాలము గడచెను. ఒక రోజున ఆమార్గమున హరనాథుడు వెళ్ళుచుండెను. ఆచెట్టుతన భావమర్మరధ్వనితో తన దైన్యస్థితిని హరనాథునకు విన్న వించుకొనెను. దీనదయాళుడైన ఠాకూరు ఆత్మశక్తిచే ఆసాధు వును అక్కడికి రప్పించెను. హరనాథుడు "అయ్యా! యీచెట్టు ఏపాపమెఱుగదు. ఒకరిమీదకోపము మఱియొకరిమీద చూపు టయా? తాము సాధువులుగదా!! కోపముండవచ్చునా? మీ కోపాగ్నిపాలైన ఈచెట్టు దుస్థితి చూచినారా?" అనియడిగెను. అతని హృదయము కరగెను. తిరిగి దానికి సాధువు పునర్జన్మ నిచ్చెను. అంతట ఠాకూరు "సాధూజీ!! అమోఘమైన మీ వాక్కును ఇటుపైన దుర్వినియోగ పఱచకుందురుగాక" అని హెచ్చరించెను.

పిమ్మట ఠాకూరు కాశ్మీరునకు వెళ్ళుచు - హాత్రసు జంక్షనులోదిగి అటల్‌బాబింటిలో ఆరాత్రి మాత్రమే విశ్రాంతి తీసికొని మఱునాడే కాశ్మీరునకు బయలుదేఱెను. యథాప్రకారము ఠాకూరు నిమిత్తమాత్రముగా ఉద్యోగమును చేయుచు - మిగిలిన కాలమంతయు సాధుసన్న్యాసులతో కలసి అధ్యాత్మికవిషయములు గూర్చి తెలిసికొనెడువాడు. ప్రసం గించెడువాడు. చిరపరిచితుడైన "ఋషిపీర్" యీయన తత్త్వ మును చక్కగా గ్రహించుటయేకాక క్రమముగా ఆడంబర మును విడనాడినాడు. నిజమైన భక్తులేదోరీతిగా హరనాథుని

దగ్గఱకువచ్చి తమకుగల సందేహములను నివృత్తి చేసికొనుచుండిరి. ఆయనలోని చైతన్యశక్తి చుట్టుప్రక్కలనున్న ఫకీరులను - పీర్లను - మొల్లాలను - సాధుసన్న్యాసులను సన్నిహితమిత్రులను గావించెను. మసీదులలో - దేవాలయాలలో ఆయన ధ్యానస్థితిలో కొంతకాలము గడపెడువాడు. స్వల్ప కాలములోనే ఈయన గొప్పతనము అంతట వ్యాపించెను.

అరణ్యములో పక్షులు - ఉడుతలు - కోతులు - మఱికొన్ని జీవజంతువులు వర్షాకాలములో తినుటకు చెట్లపైన - కలుగులలోను - గుహలలో దాచుకొన్న తిండిగింజలను దొంగిలించుటకై ముగ్గురు దొంగలు చెట్లపైకెక్కుచుండిరి. ఆరీతిగా పశుపక్ష్యాదుల ఆహారమును అపహరించెడివారు ప్రభుత్వముచే కఠినముగా శిక్షింపబడుదురు. దగ్గఱకు వెళ్లుటతో ఠాకూరును ప్రభుత్వోద్యోగిగా భావించి ఆయనను ఒక్కసారి కొండచరియలలోనికి త్రోసివేయదలచిరి. కొండలోయలన్నియు మంచుతో నిండియుండెను. హరనాథుని స్పర్శ తగిలినవెంటనే వారు ముగ్గురు విద్యుద్ఘాతము తగిలినట్లు హఠాత్తుగా కొండనుండి క్రిందికిపడిపోయిరి. వారిలోనొకడు వెంటనే మరణించెను. ఒకనికి కాళ్ళువిఱిగెను. మఱియొకడు బ్రతికెను.

కాశ్మీర అరణ్యములలో 'హరిపర్వత' మను కీకారణ్యముండెను. అందు క్రూరజంతువులు నివసించు చుండును. ఆ వనములో ప్రవేశించిన వెంటనే పక్షులువచ్చి ఆయన భుజముల

మీద ప్రాలెడివి. పాములు శరీరమును ప్రేమతో చుట్టుకొనెడివి. పెద్దపులులువచ్చి నాలుకతో నాకుచు - కాళ్ళతో దువ్వుచుండెడివి. మానవుని ప్రాణములను తీయు భయంకర జంతువులన్నియు ఆయనకు పరమమిత్రములైన వన్నచో దానికి ఆయనలోనున్న విశ్వప్రేమయే కారణము. ఆబంధమే యనేకులను ఆకర్షించినది.

"రాజర్షి" వనమాలి బహాదూర్ గొప్ప వైష్ణవభక్తుడు. ఈయన బృందావనమున నొక యాశ్రమమును నిర్మించెను. అందు రాధాకృష్ణుల సేవ చేయుచుండెడివాడు. తఱచుబృందావనమువచ్చుచు పోవుచుండెడివాడు. ఒకనాడు ఆభక్తశిఖామణికి— కృష్ణుడే హరనాథుడను విశ్వాసము దృఢముగా ఏర్పడుటయే కాక బృందావనములోని ఆశ్రమమునకు వచ్చి ఆప్రదేశమును పావనముచేయుమని కోరెను. హరనాథుడు బృందావనమున కొన్ని రోజులుండుటయేకాక ఆభక్తమణిని అనుగ్రహించెను. ఠాకూరు ఎప్పుడు బృందావనకు వెళ్ళినను - ఆవనమాలి ఆయనకు సకల మర్యాదలు ప్రేమతోచేసెడివాడు. వీరిరువురును కలసిన క్షణములెట్టివోకాని యీవనమాలి మహాశయుడు క్రమముగా హరనాథుని ముఖ్యభక్తుడాయెను.

ఒంటరిగా నుండుటచేత హరనాథుడు - సాధువులలో కలసి తిరుగుచుండుటచే అందఱును ఆయన సన్న్యాసులలో కలసిపోవు ననుకొనుచుండిరి. ఈవిషయమును మహేశబాబు తనభార్యతో చెప్పెను. ఆమె భగవతీదేవికి జాబువ్రాసెను.

కుమారుడు బైరాగి అయిపోవునేమో!! అను భయముతో "నాయనా!! నీవు గృహస్థుడవు గానేయుండుము. నీభార్యను నీ దగ్గఱకు పంపుచున్నాను." అనితల్లి కాశ్మీరునకు లేఖవ్రాసెను. 1897లో కుసుమకుమారీదేవి పిల్లలతో భర్త సన్నిధికి చేరు కొనెను. ఇన్నినాళ్ళకు తన్నుచేరవచ్చిన గృహలక్ష్మిని జూచి ఠాకూరు నవోత్సాహ సంపన్నుడయ్యెను. ఇంతవఱకు దూర తీరాలనుండి యాడించుచున్న ప్రేమశక్తి-దగ్గఱకే వచ్చెను. హృదయములొకటైన దంపతుల జీవితమే జీవితము!! గుణవతి-భర్త హృదయమెఱిగిన యర్ధాంగి లభించినవాడు-ఏ పనినైనను చక్కగా నిర్వర్తింపగల్గును. భార్యాభర్తలిరువురు ప్రణయ బంధముచే కట్టబడిన జంటపక్షులు. వారిలోని ప్రేమయే ధర్మ మును నిర్వహింపజేయును. జీవాత్మ పరమాత్మలు-ప్రకృతి పురుషులు, శబ్దార్థములు, విద్యావినయములు, సంగీత సాహి త్యములు, రాధాకృష్ణులొకచో కలసినారన్న వార్త చెవుల బడినదో లేదో పక్షికులమంతయు మనోహర కిలకిలారావము లతో స్వాగత గీతి నాలపించెను. ఆగీతికి మకుటాయమానమైన హాయలులో కోకిలమ్మలు మధురమనోజ్ఞముగా 'పల్లవి'ని పలుకరించెను. లతానికుంజములు, పరిమళ పుష్పములతో-ఒక క్రొత్త సోయగముతో విశ్వసంసారసౌభాగ్య సూచకముగా-మలయమారుత ప్రసారముచే సంచలించినవి. సంపూర్ణముగా భక్తిప్రేమలచే విప్పారిన హృదయకుసుమములోని మధుర మకరందమును గ్రోలుటకై భృంగకుమారులు ఝంకారగీతుల

నాలపించిరి. సరోవర తరంగాలలో కలహంసీహంసములు పరస్పరానురాగ లక్ష్యముతో - పరవశతతో - సంసారమును నడపు వివేకమతులైన ఆలుమగలవలె నీదులాడ జొచ్చెను. వివిధమధుర ఫలరసాస్వాదన మత్తచిత్తములైన శుకశారికలు వందిమాగధులవలె కైవారములొనర్చినవి. ఆ ఋతువు లోకక్కమైనట్లు-ఆఱవప్రాణము సమీపించినట్లు ప్రకృతిసుందరి యెవ్వరికి తెలియని ముసిముసి నవ్వుల దొంతరలను వెదచల్లినది. కుసుమహరుల నూత్న సమాగమము పతితభక్త దీనజన సముద్రమునకు పూర్ణచంద్రోదయమయ్యెను.

తల్లివి, తండ్రివి, గురుఁడవు
చల్లని హితుఁడవు, కృపారసంబును మాపైఁ
జల్లెడు పతివీ వేయని
యుల్లంబుల నమ్మియుంటిమో హరనాథా!

## గద్యము

ఇది శ్రీమత్కుసుమహరవరప్రసాదిత మధురకవితా విభూషిత, భాషా విజ్ఞాత, వినయవిఖ్యాత, విశ్వబ్రాహ్మణాన్వయ సంజాత, ఆదిత్య బ్రహ్మర్షి గోత్రపరిపూత, ప్రణవసూత్రవినీత, శ్రీనారాయణాంబా సత్యనారాయణాచార్య ప్రథమసుత చిన్మయబ్రహ్మకవి ప్రణీతంబైన శ్రీహరనాథ భాగవత మందలి షష్ఠస్కంధము.

---

జయ శ్రీ కుసుమ హర

# శ్రీ హరనాథ భాగవతము

## సప్తమ స్కంధము

శ్రీరాధా మండన! బృం
దారక వినుతచరణా! బుధజనత్రాణా!
ధీరజనోద్ధరణా! సం
సారతమస్తారణ! వికసన్నవనయనా!

విశాలాక్షియగు కుసుమదేవి భర్త నిత్యకృత్యములను పరిశీలించుచునే యుండెను. హరనాథుడు యథాప్రకారము సాధు పురుషులను దర్శించుచు - ఏకాంతముగా స్వాంతమున హరిని గూర్చి ధ్యానము - సాధు సేవా కార్య క్రమముల నిర్వర్తించుచుండెను. పతిచిత్తమెఱిగినదగుటచే కుసుమదేవి యేయే వేళలకేది యవసరమో దానిని సమకూర్చును. సతీమణి మనస్సు తనమనస్సు ఒకటేయని గుర్తించిన ఠాకూరు సరస మధురోక్తులతో — మందహాస చంద్రికలతో ఆమెను కవ్వించును; నవ్వించును. ఆమెవహించు బాధ్యతలను - ప్రదర్శించు ప్రేమానురాగాలను - వర్షించు మాధుర్యములకు అంతరాంతరాలలో ఆయన యుప్పొంగును. మెచ్చుకొనును. ఆయమ విశ్వమోహనశక్తి అసాధారణమైనదని అబ్బురపడును. అవకాశము దొరకినపుడెల్ల ఆమెను పిలిచి మృదుమధురభాషలలో కృష్ణని

అవ్యాజప్రేమనుగూర్చి - భగవన్నామ మహిమను గూర్చి - ఆదర్శదాంపత్యమును గూర్చి - ప్రేమానందమును గూర్చి ముచ్చటించుచుండును. అంతియేకాదు కొన్నియద్భుతలీలలను ఆకర్షణీయముగా చెప్పును. ఆమెయు నన్నియు శ్రద్ధగా వినును; ఏమియు తెలియని అమాయకురాలవలె ముగ్ధమోహన నేత్రకమలాలతో కృష్ణప్రేమానందోన్మత్తుడైన వల్లభుని ముఖార విందము నరసి - పారవశ్యమొరసికొని వచ్చుటచే తన్నుదాను మఱచిపోవుచుండును. పరమభక్తురాలయిన అత్తగారి సేవాఫల ముగా లభించినసుగుణములు - విశ్వప్రేమికుడగు ప్రాణేశ్వ రుని చూపులో - భావనాదీప్తిలో - కృష్ణార్పణయోగములో వసి డికి తావియబ్బినట్లు పరిమళించినవి. హరనాథుని చూడవచ్చిన సాధుసజ్జనులు - బంధుమిత్రులందఱును ఆత్మీయమైన ఆతి థ్యమునంది యానందించెడువారు. అమ్మ ఎవరికైనను శాంతి ధామమువలె కనిపించెడిది. ఆమె చల్లనిచూపులు - మాటలు - సంసారార్తులకు అమృతవృష్టి యనిపించెడిది అట్టిభార్యాభర్తల సమాగమములో నిజమైన గృహస్థాశ్రమము - పుష్పించి - ఫలించి తరించినట్లనిపించినది.

## హరనాథుని సంకీర్తనము

ఇపుడు హరిసభ రావల్పిండిలోనేకాక శ్రీ నగరము నందును నడువసాగెను. తానుకోరకయే పెక్కుమంది ఆయా సభలలో పాల్గొని నిత్యము సంకీర్తనము-ఆదివారమునాడు

గోష్ఠి జరుపుచువచ్చిరి. అనేకులు చిత్రముగా హరనాథుని వద్దకువచ్చి కష్టములను చెప్పుకొందురు. కొందఱు రోగపీడితులై తమ యాతనలను నివేదించుకొందురు. కొందఱు ఆధ్యాత్మిక లోపములను గూర్చి ముచ్చటించుచుందురు. వచ్చిన వారిని ఆయారీతుల పలుకరించుటయేకాక: వారి యాతనలను పోగొట్టును. సందియములను నివారించును. నిజము చెప్పవలెనన్న హరనాథుడు ఆశ్రితులకు-ఆర్తులకు-భక్తులకు, పాపులకు — పతితదీనజనులకు కొంగుబంగారమయ్యెను. శ్రీ నగరమున ప్రతిదినము జరుగుభజనలో హరనాథుడు నాయకమణియై కమ్మగా గొంతెత్తిపాడును. ఆ పాటలోని మాధుర్యమునకే అందఱు సమ్మోహితులగుదురు. అందలిభావాలకు తగినరీతిగా అభినయించుచు అరమోడ్పు కన్నులతో నృత్యముచేయును. ఇక చెప్పవలెనా? ఆ నృత్యముతో ప్రజలు ఒడలు మఱచిపోవుదురు. అప్రయత్నముగా అతని అడుగులలో అడుగులు వేయనారంభింతురు. కీర్తనలోని పదములను మెలమెల్లగా భావము నూహించుకొనుచు గానము చేయుచుందురు. హరనాథుడు ఏమి సమ్మోహనాస్త్రమును ప్రయోగించునోకాని-భజనలోని వారందఱు కృష్ణభక్తి మూర్తీభవించినట్లగుపింతురు. తన ఆఫీసులోని ఉద్యోగులు హరిసభలో సభ్యులైరి. శ్రీయుత జానకీ ప్రసాద్ (దివాన్, ధర్మార్థశాఖ) కూడ సభ్యులైనారు. సంకీర్తనానంతరము-వారందఱును స్వర్గధామములోని ఆనందమును మించిన ఆనందమును తాము అనుభవించుచున్నట్లు మురళీ

ధరుడు తమ యడుగులవెంట నడుగులు వైచుచు-వేణుపూది నట్లు - బృందావనముననున్నట్లు - అంతటి స్వామి మనవాడై యుండగా మనకేమి భయము? అని గుండె నిబ్బరముతో నుప్పొంగిపోవుచుందురు. ఈ క్షణము లెట్టిమధురక్షణములో యని నిర్భరానందమున తేలియాడుదురు. వారు ప్రాపంచిక సుఖదుఃఖములను సంపూర్ణముగా మఱచిపోవుదురు.

ఇది యిట్లుండగా రావల్పిండిలోని ఉద్యోగులు - తదితరులు చాలమంది ఠాకూరుచే ఆకర్షింపపడి- హరిసభాకార్యక్రమములలో పాల్గొనెడివారు. వారిలో 'రాధావల్లభసేలు' అను నాయన హరనాథునియందు మంచివిశ్వాసముంచి భజనలలో గొప్ప ఆసక్తి చూపెడువాడు. అతడచట నుద్యోగిగా నుండెను. అతని తమ్ముడు కృష్ణదాససీలునకు శ్వాసరోగమువచ్చి చాల బాధపడుచుండెను. ఎందరో డాక్టర్లు చికిత్సచేసినారు. కాని యిక లాభములేదనిచెప్పిరి. హరనాథుడు రాధావల్లభసీలుతో "మీ తమ్ముడు కృష్ణసంకీర్తన చేయుచుండినచో ఈ దారుణరోగము మాయమై పోవును. అతనికేమీ భయముండదు" అనిచెప్పెను. ఆ ప్రకారము కృష్ణదాసు - అమూల్యమైన కాలమునంతయు హరిసేవా సంకీర్తనాదులలో వినియోగించెను. ప్రాణాలనే హరించునన్న ఆదీర్ఘ భయంకర రోగము ఇక కనిపించనే లేదు.

హరనాథుడు కలియుగమొక విధముగా మహోన్నతమైనదని అభివర్ణించినాడు. ఆ ప్రత్యేకత హరినామమొకచే ! !

ఘోరతపములు - జపములు - యోగనిష్ఠలవలన దొరకని దేవ దేవుడు ఒక్క భగవన్నామము వలననే లభించగలడు. మాట లాడుచున్నను - తినుచున్నను — నిద్రపోవుచున్నను - మఱేమి చేయుచున్నను - ఆ మధురనామమును స్మరించుచు - జీవిత భారములను ఆప్రభునకే సమర్పించి - కష్టములే వచ్చినను — సుఖములేవచ్చినను అవియన్నియు ప్రభుని యిచ్ఛయేయని భావించుచుండవలెను. మొదట భగవన్నామము కటువుగా కని పించును. చేయుగా చేయగా అందు అద్వితీయమైన - అమోఘ మైన - మాధుర్యము ఆనందము లభించును. ప్రాపంచిక సుఖ ములు తేనెపూసిన కత్తులవంటివి. మనుష్యులుకూడ నిజముగా శ్రేయోఽభిలాషులుకారు. ఒక్క కృష్ణుడే నీ జీవిత సారథి. నీవు కొన్నాళ్ళు ఆ సాధనలో నిమగ్నుడవైనచో - నీ జీవిత మేరీ తిగా నడచునో పరిశీలింపగలవు. కృష్ణభక్తులే ఈలోకమున నిజ మైన చక్రవర్తులు. ఈనామశక్తి యీ జన్మనేకాక - జన్మ జన్మ లను పునీతము చేయును. హరినామము మానసికరోగములనే రూపుమాపుచుండగా - శారీరకరోగము లంతరించునని వేఱుగా చెప్పనేల? హరనాథుడు కేవలము భగవన్నామ మహిమను వెల్లడించెను. అదియే మహామంత్రమని బోధించుచు - తానే మియు నెఱుగనని - అనేక లీలలను ప్రదర్శించి గాఢమైన విశ్వాసమును పాదుకొల్పుచుండును.

కృష్ణుని తల్లిగనో తండ్రిగనో గురువుగానో మిత్రుని గావో భావించి మన కష్టసుఖాలను హృదయ పూర్వకముగా

చెప్పుమని కోరుము. ఆయనను చక్రవర్తియని - శంఖచక్రాది గదాయుధుడని - భావించి భయపడవలసిన పనిలేదు. అతడు ప్రేమాస్పదుడు. ఒకవిశేష మేమిటనగా ఆయనకు చక్రవర్తి - బిచ్చగాడు - సమానము, ఆయనదృష్టి అంతవిశాలమైనది. ఆయనప్రేమ అంత విశ్వోన్నతమైనది. నామమును చేయుట యనగా నీహృదయేశ్వరుని పిలుచుటయే!! ఆపిలుపు ఆర్తి సంపూర్ణమైనపుడు అతడునిన్ను కలసికొనకుండ నుండలేడు. నామప్రియుడైన ఆప్రభువు నీయవసరములు అడుగకుండగనే తీర్చును. జీవితమునకు ప్రమాదమును కల్గించువానిని త్రోసి పుచ్చును. ఇంతకన్న కావలసినదేముండును? సంసారము - అందలివ్యక్తులు - నిన్ను బంధించు చుందురేకాని స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను నిజమైన ఆనందమును ఈయలేరు. ఎడ తెగని ప్రేమానుబంధముచే కట్టుబడి మనోవాక్కాయ కర్మ లతో ఆప్రభుని భజింపుము. ఆదయామయుని సొత్తైన యీ జగత్తును ప్రేమించవలెను. దుర్మార్గులను ద్వేషించవకుము. వారి దౌర్జన్యమును = అయోగ్యతను మాత్రమే ద్వేషింపుము. నీవు నిజమైన నామసాధకుడ వైనచో ఈ ప్రపంచమున శత్రువులను వారే నీకుకనిపించరు. మహారాజు స్నేహములభించిన వానికి ఐహికముగా నన్నియు సిద్ధించిన సిద్ధించవచ్చును కాని ఈమహా ప్రభుని అండదండలు నీకు దొరకినపక్షమున ఇహపరములు రెండును నీవికాగలవు. హరనాథుడు క్రొత్తమతము సృష్టింప లేదు. ప్రచారకేంద్రములను - ప్రచారకులను — పత్రికలను

నెలకొల్పలేదు. గ్రంథములను రచింపలేదు, ఆడంబర రహిత
మైన ప్రేమప్రచారము — భగవన్నామము వలననే కల్గ
ననియు - ఆభగవత్ప్రేమ - బ్రహ్మత్వము రుద్రత్వము -
ఇంద్రత్వముకన్న గొప్పదని - ఆస్థితికివచ్చుటయే మానవజీవిత
పరమావధియనియు-అట్టిభాగ్యము నిజమైనభక్తుల సాంగత్యము
వలననే లభించునని బోధించెను. కులములు - మతములు
మానవ కల్పితములు జగత్కుటుంబమునకు యజమాని
కృష్ణుడు, ఆయనప్రేమాధినాథుడు. అతనిని పొందవలెనన్న
ప్రేమయేకావలెను. ప్రేమ నిష్కామ్య మైనది. కామము ప్రతి
ఫల సహితమైనది. కోరిక బంధములకు కారణము. కోరిక
లేకుండుట నిజమైనప్రేమకు లక్షణము. విశ్వమతము ప్రేమ
మతమే !! ఆయనను అందఱు భజింపవచ్చును. ఆశ్రయింప
వచ్చును. మొఱపెట్టుకోవచ్చును. అతడుఆర్తులకు కల్పవృక్షము.
పతితులకు పరమాశ్రయము. అతనినివిడచి తఱుకుబెళుకు సాం
సారిక వస్తువులను - వ్యక్తులను ఆశ్రయించినచో నీవుపూర్తిగా
చెడిపోయెదవు" అని హరనాథుడు భక్తులకు చెప్పుచుండెడి
వాడు.

అందఱిని ఆయన కృష్ణభక్తునిగా జీవింపుమని కోరును.
ఆధ్యాత్మికసాధకులకు ఉండవలసిన ధర్మములను చెవినిల్లుగట్టు
కొని చెప్పుచుండును. సాధకులకు శారీరకముగా - మానసిక
ముగావచ్చు దౌర్బల్యములు ఆయనకు తెలియును. సమయోచిత
ముగా వానిని పరిష్కరించును, పతితావస్థనుండి రక్షించును. కను

కొన్ని తల్లిదండ్రులకు-భార్యాపుత్రాదులకు బంధుమిత్రులకు లేని ప్రేమానురాగములతో—తన్నునమ్మినవారిని ఉద్ధరించును. ఇన్ని యవతారకథలను వినుచున్నాముకాని - మానవజీవకోటికై వారి శ్రేయస్సునకై ఇంతగా అహోరాత్రములు పాటుపడు మహానుభావుని అపారప్రేమామృతగాథ విన్నామా? హారనాథుని ప్రేమసాగరములో మున్గితేలుటకు అందఱకు అవకాశమున్నది. చిన్నపెద్దతారతమ్యములకు ఇచట తావులేదు. ఆతడు సర్వాంతర్యామియై మనహృదయ బృందావనములను పరిపాలించితీరును. హరనాథుని ఆశ్రయము లభించినవారు ధన్యులు., వారు నిర్భయముగా హాయిగా జీవితశేషమును గడుపగలరు. హరనాథ ప్రభుసమర్పిత జీవనమతిమధురమని మీరు ఈ క్రిందిసంఘటన వలనతెలిసికొనగలరు- శ్రద్ధగా పఠింతురుగాక !

హరనాథుని అద్భుతలేఖలను ప్రపంచమునకు అందజేసిన ఆటలు బాబుతో హరునకు పరిచయమైనట్లు - తఱచు ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగుచున్నట్లు - ఠాకూరు అపుడపుడు వారియింటికవెళ్ళి వచ్చుచున్నట్లు పాఠకునకిదివఱకే తెలిసికొనియున్నారు.

## శ్రీహరనాథుని సర్వాంతర్యామిత్వము

అటలు బాబు ఠాకూరు సలహా ప్రకారము భార్యతోపాటు కృష్ణనామమంత్రమును స్మరించుచు - ఆయనను తమ గురు

వుగా భావించుచు - హృదయమున ధ్యానించుచు - ఒకవైపున రైల్వేగుమాస్తాగా పనిచేయుచునేయుండెను. ఇట్లుండగా తన యైహికజీవితములో చెలరేగినతుఫాను సుడిగుండములో నశింప పలసినవాడే !! ఠాకూరు సమయోచితముగాని అతని ఉద్ధరించుట చేతనే పతితుడు కాలేదు. ఆయన సర్వాంతర్యామి, భక్తవత్సలుడు-శ్రేయోఽభిలాషి అనుసత్యమును ప్రపంచమునకు తెలియజేయుటకై 1908 జనవరి హిందూఆధ్యాత్మిక పత్రికలో తనయనుభవము నిట్లు తెలియజేసినాడు.

"పాఠకులారా ! నాజీవితములో జరిగిన ఒకముఖ్య సంఘటన తెలియజేయుచున్నాను. హరనాథుడు నన్ను భగవత్సేవ చేయుచు పవిత్రజీవితమును గడుపుమని సలహా యిచ్చినాడు. నాశక్తికొలది ఆవిధముగానే జీవించుచుంటిని. ఒక శ్రీమంతురాలు సామాన్యపు బిచ్చగత్తెవలెనున్న యామెకు నేను ప్రయాణ విషయమున సహాయము చేసియుంటిని. నాటినుండి నాసహాయము విషయమై ఆమె చాల అభిమానము - గౌరవము చూపించెడిది. తరువాత నొకరోజున ఆమెనుండి కొన్నిబహుమతులు - ఒకలేఖ నాకు అందజేయబడినవి. ఆలేఖ ఆమె వ్రాసినదికాదు. ఆమె కుమార్తెయగు వితంతువు వ్రాసినది. ఆమె మొదట తల్లిపేరును సూచించుచు మిగిలిన లేఖను తన పేరుతోనే వ్రాసెను. ఆలేఖలో "తనతల్లి గొప్ప భాగ్యవంతురాలనియు - తానొక వితంతువుననియు - మన యిరువురికి మైత్రీబంధ మేర్పడినచో - ఆ యాస్తిపాస్తులు తనకే దక్క

గలవు" అని మృదు మధురముగా వివరించెను. ఒకవైపుధన వ్యామోహము - మఱియొకవైపు స్త్రీ భోగాభిలాష రెండును బాగుగా ఆకర్షించుటచే నేను తఱచు జాబులు వ్రాయుచుండెడి వాడను. ఆమెయు ప్రత్యుత్తరమిచ్చెడిది. చిట్టచివఱకు మా యుత్తర ప్రత్యుత్తరాలు నన్ను ప్రేమకలాపములోనికి దించినవి ఆమె తన్ను తన భవనమున కలసికొమ్మని వ్రాసినది. నేనందు లకై సెలవుపెట్టితిని. మాయాఫీసు యజమాని దానినిమంజూరు చేసినాడు.

నానిత్యజీవితమును ఒకకంట కనిపెట్టుచున్న ఠాకూరు నకీపని కిట్టదుగదా యని భయపడుచునే యుంటిని. అతనికి ఈ రహస్యమెట్లు తెలియును? అతనిని మోసగించి తనకుతానై వచ్చుప్రయోజనమును పొందుట మంచిదనిపించినది. అలవాటు ప్రకారము ఠాకూరునకు జాబువ్రాయుచు "ఒకముఖ్యమైన పని మీద ఊరువెళ్ళుచున్నాను. సెలవయిపోయిన తర్వాత ఇంటికి రాగలను" అని తెలియజేసితిని. వెంటనే ఆయన "నీవువెళ్లు టకు కారణమేమి?" అని ప్రశ్నించుచు లేఖవ్రాసెను. దానికి వ్రాసిన జవాబులో అసలువిషయము దాచి యేదోసాకును తెలియపఱచితిని. కాని నాయంతరాత్మ నాగురువీపనికి అంగీక రించుటలేదని సూచించునే యుండెను. నాయుత్తరమును అంది కొని హరనాథుడు వెనువెంటనే "నాయనా! అసలు విషయము చెప్పక నన్ను మోసగించుచున్నావు. నీవు గొప్ప ప్రమాదము నకు గుఱికానున్నావు. కాని నీవెంటనేయుండి రక్షించుకొం

దును" అని వ్రాసెను. ఆవాక్యములను నేను నిర్లక్ష్యము చేసి తిని. నామనస్సులో డబ్బు - కాంతయను రెండును నన్ను వరి పరి విధాల ఆకర్షించుచుండెను. ఇపుడు నేను కొన్నివందల మైళ్ళ దూరము పోవుచున్నానుగదా! ఆయనకీసంగతి ఏలాగున తెలియును? ఏలాగున నన్ను అనుసరించును" అనిభావించి అను కొన్నరీతిగా ఆమెయింటికి చేరితిని. తల్లి నన్నెంతగానో గౌర వించినది. నాకై ప్రత్యేకముగా నొకగది యీయబడినది. రెండు మూడు అంతస్తుల ఆభవనమున మేము ముగ్గురము - సేవ కులుతప్ప నెవ్వరునులేరు. చక్కని విందు నాకై యేర్పాటుచేసి నారు. ఆరాత్రి నిద్రపోవుగదిలోనికి ఆ వితంతువువచ్చి తన దైన్యస్థితిని ముచ్చటించెను. ఆమె నిజముగా చాల యౌవనవతి సౌందర్యవతి. తనకు తానైవచ్చి యాసుందరి మాట్లాడుచున్న పుడు స్వర్గమే నాయెదుటికి వచ్చినట్లయినది. నాశరీరము కొంత సేపు స్మృతితప్పిపోయినది. నన్నింతవఱకు కుమారునిగా చూచిన వృద్ధురాలికివిషయము తెలిసిన బాగుండునా? యని భయపడి తిని. ఎట్టకేలకు ఆమె ధైర్యముచెప్పిన తర్వాత అన్నితలుపులు మూసివేయబడినవా? లేదా? యని చూచి నిర్భయముగా నుండ వచ్చునని గదిలో ప్రవేశించితిమి. ఇంతలో ఒకపెద్దశబ్దముతో గాలివీచెను. రెండవ యంతస్తులోనున్న మాగదికిటికీలు తలు పులు 'టపటప' కొట్టుకొననారంభించెను. ఆందోళనతో నేను లేచి కిటికీవైపునకు దృష్టిసారించితిని.

ఆహా! యెవరో కాదు. హరనాథుడు ఆకాశపథమున గాలిలో కనిపించెను. ఆయన యిక్కడకు ఎట్లువచ్చెను? అని నాలో నేననుకొని "నీకిక్కడ ఏమీపనిలేదు, నిన్నెవ్వరు రమ్మన్నారు? ఇక్కడనుండి వెళ్ళి పొమ్మ"ంటిని. ఇంతలో ఆమె "ఎవ్వరితో మీరు మాట్లాడుచున్నార"ని. అడుగగా నేను "నీకెవ్వరును కన్పించుటలేదా?" యని ప్రశ్నించితిని. ఆమె వైపునకు నేను తిరిగితినో లేదో ఠాకూరు అదృశ్యమై పోయెను. మఱలనామె 'వారెవ్వర'ని ప్రశ్నించగా "నీ కంతయు తరువాత చెప్పెదను. లోగడ నీకు చెప్పిన మా గురువు వెంటనే తలుపు మూయు మం"టిని "నా గురువునకు నావంటి వానిమీద ఎంతప్రేమయో! పశు పక్ష్యాదులు కూడ ఆయన ప్రేమానందమును అనుభవించుచున్నవి" అనుకొనుచుండగా ఆ భవనమంతయు కూలిపడిపోవునా? అను సంచలనము-శబ్దము చెలరేగెను. దానితో సేవకులందఱు లేచిరి. తల్లి కుమార్తెను వెదకుచు వచ్చెను. ఎవరిగదిలో వారు పరుండితిమి. మా యిరువురికిని నిద్రపట్టలేదు. భయము-ఆందోళన-ఆశ్చర్యము నన్ను చుట్టుముట్టెను.

ఆహా !! ఈ దుర్మార్గునియందు నీకెంత ప్రేమయో కదా! అన్ని రహస్యములు నీకు తెలియునని యిపుడు గుర్తించితిని. నీకను సన్నలలో బ్రతుకు నేను పతితుడనగుచున్నందులకు నీవెంతపరితపించి తివో!! నీప్రేమకు బదులు తీర్చగలనా! యని నాలోనేను ఆలోచించు కొనుచుంటిని. తెల్లవారినది. నామనస్సు మాఱినది. ఆమె మనస్సు కూడ మాఱినది. తిరిగి యింటికి వచ్చితిని. తరువాత హరనాథుడు కనిపించినపుడు "ఆ యాశ్చర్యకరమైన సమయమున నన్ను పాడు

చేసినవారెవర"ని ప్రశ్నించగా ఆయన చిఱునవ్వుల నొలుకబోయుచు "ఇంకెవరు? శ్రీ కృష్ణుడే" అని సమాధానమిచ్చెను. అపుడు ''అది కాదు బాబా! నేనొకవుడు పంపిన చొక్కానే ధరించిన వారెవరు?" అనగా ఠాకూరు "నీవు నన్ను ప్రేమించుచున్నావు కావున నన్నన్ని చోట్ల చూచెదవు. ఇదియే ప్రేమకుగల లక్షణము "అని జవా బిచ్చెను."

చదువరులారా !

హరనాథుని ప్రేమ తత్త్వమెట్టిదో తెలియజేయుటకే నాందీ మహాశయుని స్వానుభవకథనమును తెలియజేసితిమి. తనవారు పతితులగుట సహింపలేని దీనదయాళువతడు. ఆ ప్రేమమూర్తిని వర్ణించుటకు వాఙ్మయమున గల మాటలు చాలవని చెప్పుట యతి శయోక్తి కానేరదు.

సామాన్యముగా రోగములు నయమగుట—ఉత్తమమార్గమున నిలువగల్గునట్లు చేయుట—అనేక దర్శనములన్నియు తనవలననే జరుగు చున్నను –అవియన్నియు కృష్ణుని కృపచే జరుగుచున్నవని చెప్పునే కాని హరనాథుడు-ఆ ప్రాముఖ్యము తనయందుంచుకొనడు.

రావల్పిండిలో మిలిటరీ అకౌంటెంటు ఆఫీసులో పనిచేయు రాధావల్లభసీలు తమ్ముడు కృష్ణదాసుసీలు శ్వాసరోగముచే బాధ పడుచు-ఠాకూరు సలహాపై కృష్ణనామమునుచేసి ఆరోగ్యవంతు డయ్యెను. రాధావల్లభసీలుగారి యింటిప్రక్కనేయున్న వారి యల్లుడు కూడ శ్వాసరోగముతో బాధపడుచుండెను. వారికి తన తమ్ముని

రోగము నయమయిన తీరునుచెప్పగా వారు ఠాకూరునకు జాబు వ్రాయుడని కోరిరి. దానికి హరనాథుడు "నా దగ్గఱ మహిమలు-శక్తులు లేవు. రాధావల్లభసీలు వంటి ఒకరిద్దఱు నాయందు మంచి ప్రేమ గలవారు నేనే యివన్నియు చేయుచున్నట్లు చెప్పుదురు ఈ విషయమును మఱియొకవిధముగా భావించరని కోరుచున్నాన"ని జవాబు రోగముతో బాధపడుచున్నవానికి వ్రాసెను. ఆ తరువాత రాధావల్లభునకొక జాబు ఠాకూరు వ్రాయుచు" కలకత్తాకు పోవు నా దృష్టిని భగవంతువైపునకు మీరు మఱల్చినారు. రోగములను కుదుర్చుటకు నేను డాక్టరును కాను. మాంత్రికుడనుకాను. మున్ముందీ రీతిగా చేయకుడు. మనిషికి కృష్ణుడిచ్చిన ఆయుర్దాయము నెవరైనను తగ్గించగలరా? పెంచగలరా? మీరు వ్రాసిన పొరుగువారి అల్లుడు 5,6 రోజులకన్న ఎక్కువగా జీవింపడు. మీరు చేయు ప్రయత్నములవలన ప్రయోజనములేదు. ఈ సంగతి వారికి చెప్పవలదు" అనితెలియజేసెను.

చదువరులారా !

హరనాథుని మాటలలోని చాకచక్యము చూచితిరా? ఆయన లేఖారచనములో నొక ప్రత్యేకతతోపాటు దివ్యత్వమున్నది. ఆ వాక్యములలోని యర్థము గంభీరముగా నుండుటయేకాక ఆలోచనామృతముగా నుండును. ఠాకూరు తెలియజేసిన ప్రకారము ఆ వ్యక్తి అన్నిరోజులలోనే మరణించినాడు. కృష్ణుడిచ్చిన ఆయుర్దాయమును ఎవ్వరును తగ్గించలేరు – పెంచలేరన్నమాట–ఎంతయుదాత్తమమైనది.

ఒకవైపుదైవశక్తిని గౌరవించుచు-మఱియొకవైపున ప్రారబ్ధమును అనుభవింపక తప్పదని సూచించు నీ వాణి హరనాథ భగవత్తత్త్వ మును నిరూపించుచున్నది.

హరనాథుడు సకుటుంబముగా అమీరాకడక్‌లోని గోపాల్జీ యింటిలో నివసించెడివాడు, ఆ యింటి కెదురుగా నున్న యొకచెట్టు మీద నివసించు 'గరుడపక్షి' ప్రతిదినము "కృష్ణా! కృష్ణా" యని యఱచుచుండెడిది. ఠాకూరు భక్తులకు" ఆపక్షి యెంతధన్యురాలో !! పరమ పవిత్రమైన కృష్ణనామమును స్మరించుచున్నది, తప్పక దీనికి ముక్తి లభించితీరును. ఈ సంసారబంధములనుండి విడుదల పొంద వలెననుకొన్నవారు శ్రద్ధగా కృష్ణనామమును స్మరించిన చాలును. వారు నిత్యానందులు కాగలర"ని హెచ్చరించెడివాడు. తే 20-10-1899లో హరనాథుని రెండవకుమారుడు కృష్ణదాసు జమ్మూలో జన్మించెను. హరనాథుడు నిత్యము ఆఫీసునుండి సాయం కాలము ఖీకరారణ్యములోనికి వెళ్ళి ఏకాంతముగా ధ్యానావస్థలో నుండి - ఏరాత్రికో యింటికి చేరెడువాడు. దివాన్ జానకీప్రసాద్ ఆయన యందెంతో భక్తిగౌరవములను జూపెడువాడు.

దీనజనోద్ధారకుని - అఖండప్రేమావతారుని - దివ్యమూర్తిగి గన్న భగవతీ సుందరీదేవి శివనారాయణుని సపర్యలనందికొనుచు 1903 మార్చి 5 వతేదీని దివంగతురాలయ్యెను. ఆ విషాదవార్తను వినగానే ఠాకూరు ఒక్కసారి కంపించిపోయెను. నవమాసములుమోసి తండ్రి తరువాత తండ్రియట్లు లాలించి పోషించి-తన్నింత చేసిన

తల్లి కనులకు దూరమయ్యెను గదా! యను నావేదన చెలరేగెను, శ్రాద్ధ కర్మకు రెండురోజులు ముందేవచ్చి అన్నగారితో కలసి ఠాకూరు శాస్త్రీయమగు శ్రాద్ధకర్మను నిర్వర్తించెను.

## పుత్త్రికాప్రదానము

తిరిగి కాశ్మీరునకువెళ్లుచు ఠాకూరు కుసుమదేవి, అనుకూల్. కృష్ణదాసు, రాయమతులతో హత్రసు జంక్షనులోదిగి అటలుబాబు గృహమునకువెళ్ళెను. అటలుదంపతులు - ప్రభుని రాకనుజూచి అమితానంద భరితులైరి. జగజ్జననీజనకులు - దయామయులు వారియింటికి అతిథులుగా విచ్చేసినారన్న వారి భాగ్యమే భాగ్యము !! ఈదంపతులు నవద్వీపములోని చైతన్య ప్రభుని ఆంతరంగిక భక్తదంపతులై యుందురు. పూర్వపుణ్యముండినగాని యిట్టియదృష్టము అందఱకు లభించునా ? ధనధాన్యము లుండవచ్చును, ఉన్నతపదవులుండవచ్చును. తామరతంపరగా సంసారసౌఖ్యము లుండవచ్చును. కాని భగవత్సేవ - భాగవతసేవలు ఏకొందఱికో తప్ప - అందఱకు ప్రాప్తింపనేరవు. అందుచేతనే మహాభాగవతము ''మాధవార్పితముగా మనని మానవుసిరి వనదుర్గ చంద్రికా వైభవంబ'ని ఘోషించినది.

ఠాకూరు సపరివారముగా వచ్చినాడన్న సంగతి తెలిసి భక్తులు చాలమంది అటలు గృహమునకువచ్చిరి. అదిరాత్రి సమయము. యథాప్రకారము ఇరుగుపొరుగువారి పిల్లలను

తనతొడపై కూర్చుండబెట్టుకొని ఠాకూరు అన్నముతినిపించుచు మధురాతిమధురమైన శైలిలో కృష్ణలీలలను అద్భుతముగా చెప్పదొడగెను. వినుచువినుచు భక్తులు ఆనందపరవశులైరి. అటలుదంపతుల మానసములు బృందావన వీథిలో సంచరింప దొడగెను. భోజనమైనది. ప్రభువు పడకకుర్చీలో కూర్చుండగా శారీమా. బీహారీ యిరువురు ఠాకూరు పదపద్మాలకు ప్రణమిల్లిరి, లేవలేకలేచిరి. వారికన్నులు దుఃఖాశ్రుపూరితములై యుండెను. వారికన్నీటి చాలులను చూచుసరికి హరనాథుని హృదయము ద్రవించిపోయెను. వెంటనే వారివైపు జాలిగాచూచి "మీకోరిక యేమి?" యనియడిగెను. వారు రెండుచేతులు జోడించి "బాబా! మాకొకబిడ్డను ప్రసాదింపుము''ని సవినయముగాప్రార్థించిరి. ఆ మాటలను విని ఠాకూరునవ్వి ''మీరుపుణ్యదంపతులు-కృష్ణునే మీరు కుమారునిగా బడసియున్నారు. సేవించుచున్నారు. ధన్యులు. భక్తమణులారా! ఆసౌఖ్యముకన్న సౌఖ్యమేమున్నది? అయినను మీకు ప్రాపంచికముగా నట్టిది లేదు." అనెను. ఆమాటలకు అటలుబాబు తృప్తిచెందెను కాని, శారీమా అసంతృప్త నయనాలతో ఠాకూరును చూడలేకపోయెను. వెంటనే రాయమతిని ప్రభువుపిలిచెను. ఆబాలికవచ్చెను. హరనాథుడు ఆమెను దగ్గఱకుతీసికొని శారీమాతో "అమ్మా! కృష్ణుడు ఈయమ్మాయి నొక్కదానినే నాకిచ్చినాడు. ఇదిగోయీ పుత్త్రికను నీకిచ్చివేయుచున్నాను. ఈబాలికను మీఅమ్మాయిగానే పెంచుకొనుము.' అనెను. పిమ్మట బీహారువైపుచూచి

"బాబా ! ఈ నాయభిలాషను తీర్చెదవా" యనియడిగెను. అటులు బాబు ఆనందమునకు అవధులు లేకుండెను. ప్రభునిపవిత్ర హస్తకమలాలచే ఈయబడు బహుమతి వలదనుటయా ? కూడదు. అని నిశ్చయించుకొనెను. శారీమా బీహారీ ముఖపద్మములు వికసించెను. అపుడు ఠాకూరు ఆబిడ్డను గాఢముగా కౌగిలించుకొని ముద్దిడి - ఆదంపతులకు మిక్కిలిప్రేమతో అందజేసెను. వారిరువురు ఆబాలికను చేతులలోనికి తీసికొని వారి జన్మ తరించినట్లు ఆకాశమందికొనిరి. ఈదృశ్యమును దూరము నుండి చూచుచున్న కుసుమదేవి దగ్గఱకువచ్చి శారీమానుచూచి "అమ్మా ! నేనీవిషయమును ఒప్పుకొనననని నీవేనాడును అనుకొనకుము. ఠాకూరు చేయు పనిని నేను ఏనాడునుకాదనను. ఈనాటి నుండి యీపిల్ల మీ అమ్మాయియే" అని గంభీరముగా వచించెను.

చదువరులారా !

చూచితిరా ! కుసుమహరనాథుల విశాలప్రేమపథము!! అది భావనాతీతమైనది. ఏకైకపుత్రికను కోరినదేతడవుగా ఈయగల వారెంతటి స్వార్థత్యాగులై యుండవలెనో! ఎంతటి కరుణారసప్రపూర్ణులై యుండవలెనో మన మూహించుకొనగలము. ధనమీయవచ్చును - విద్యాధనమీయవచ్చును - మేడలీయవచ్చును - మాడలీయవచ్చును. ఏమైనను ఈయవచ్చును. కడుపునపుట్టిన బిడ్డను ఒకరికి అప్రయత్నముగా - అయాచిత

ముగా నిచ్చి సంతోషపెట్టుట సంతోషించుట యనునది దైవీ ప్రకృతి తప్ప సామాన్యమానవ ప్రకృతి మాత్రముకాదు. ఈ సందర్భములో ఠాకూరొక భక్తునకిచ్చిన సందేశములోని "నాయనా! నీభార్యను నీబిడ్డలకు మాత్రమే తల్లియగునట్లుచేయుటలో గొప్పతనములేదు. ఆమెయితరులకు తల్లికావలెను" అనువాక్యమును ఆచరణలోపెట్టిచూపిన ఉదాత్తపురుషుడు - మహాత్యాగి-హరనాథుడు - ఆభర్తననుమించిన భార్యామణి కుసుమదేవి. ఆహా! యేమి యీదాంపత్యవైభవము!! అందచందములు - సిరిసంపదలు - సంతానమున్నంతమాత్రమున దాంపత్యముకాదు. ఇటువంటి మహాత్యాగము ఇతరుల ఆనందమునకై చేయగలవారిదే నిజమైన దాంపత్యము!! సంతానములేక "పిల్లలు - పిల్లలు" అని తపించిపోవు శారీమాహృదయమును యుగళమూర్తులిద్దఱును గ్రహించిరి. ఠాకూరుచేసిన త్యాగమును ఆమె సంతోషపూర్వకముగా సమర్థించెనేకాని వ్యతిరేకించలేదు. అనుకూల దాంపత్యమిదియేయని మిత్రులు గ్రహింపగలరు. ఈ మహోజ్జ్వలఘట్టములోమఱియొక ముఖ్యవిషయమును మనము కాదెవ్వరైనను అభినందించకుండ నుండగలరా? ఠాకూరు బ్రాహ్మణవంశీయుడు. నాందీమహాశయుడు శూద్రవంశజాతుడు. అనాదినుండి వచ్చుచున్న వర్ణభేదము హరనాథునివిషయములో నిర్లక్ష్యము చేయబడినది. ఎక్కడ నిజమైన ప్రేమయుండునో-అచ్చటి వాతావరణపరిస్థితులుగాని - వ్యక్తిత్వముగాని లెక్కకురావు. హెచ్చుతగ్గులు - దృష్టిలోనికిరావు. అటువంటిప్రేమ-నామసాధన వలన భాగవతశిఖామణుల సాంగత్యము వలన

లభించగలదు. కొండఎక్కినవానికి మెట్టపల్లములు సమాన ముగా కనిపించునట్లే భగవత్ప్రేమపర్వతమును అధిరోహిం చినవారికి లౌకికభేదములు అవలేశము కనిపించబోవు.

హరనాథుడు కుటుంబముతో కాశ్మీరు చేరుకొన్నాడు. అక్కడ నుండి ఠాకూరు రాయమతికి జాబు వ్రాయుచు "అమ్మా! రాయమతీ! ఎవరు కృష్ణనామమును చేయుదురో వారే యీ లోకమున గొప్పవారు. నీవు ఎల్లపుడు ఆ తీయని నామమును జేయుచుందువుగాక! క్రమ ముగా నీవు ప్రపంచమునకొక భూషణమవగుటయేకాదు; మంచి బోధకురాలవు కావలెను. మాతృభక్తిలోను నీవుమించవలసియున్నది. నీకీయబడిన తల్లిదండ్రులు నీకు గురు సమానులు. మా శిక్షణలో నీవు మఱియొకరీతిగా నగుదువని కాబోలు! కృష్ణుడు వీరికి నిన్నిచ్చి నాడు, కృష్ణుడు పుట్టినదొక చోట. పెరిగిన దొకచోట. కన్నతల్లిని మించిన యశోదపెంచినప్రేమ ఎవరు వర్ణింపగలరు? మాటి మాటికి మమ్ములను తలచుకోవలదు. మేము తల్లిదండ్రులుగా నుండుటకు అర్హులముకాము. మీ యమ్మ నాన్న లిద్దఱును ప్రేమమూర్తులు. వారికెటువంటి బాధకల్గింపకుము" అనునీవాక్యములెంత మహోన్నత ములుగా విశ్వప్రేమ ప్రభావంతములుగానున్నవో !!

కుసుమహరనాథులు మఱికొంతమంది భక్తులతో అమరనాథ గుహలను దర్శించివచ్చిరి.

## కృష్ణ నామమహిమ

జ్యోతీంద్రనాథరాయ్ కాన్పూరు E. I. రైల్వే అఫీసులోపని చేయుచుండెను. అతని ఆదాయమునకు మించిన ఖర్చు ఎక్కువగా

నుండెను. మనస్సు నిలుకడ లేక బాధపడుచుండగా-ఆతనికి రాధా వినోదనియోగి-అటలు బీహారీలు జాలిపడి ఠాకూరునుగూర్చి చెప్పిరి. ఆతడు హరనాథునకు జాబు వ్రాయుచు "బాబా! నిరంతరము నామము చేయుమనుచున్నావు. బాగున్నది. నా పరిస్థితి చాల ఘోర ముగానున్నది. ఆ పరిస్థితులు చక్కబడినచో తప్పక నామము చేయ గలన"ని తెలియజేసెను. ఆ మఱునాడు చదువుచెప్పుడని యొక విద్యార్థివచ్చెను. ఆతడింతో అంతో జీతమిచ్చును. వెంటనే హర నాథుడు "బాబూ! నీవునామమునందు ఆసక్తి చూపితివోలేదో-వెంటనే కృష్ణుడు ధనాదాయమును కలుగచేసెను. ఇక విచారమెందులకు? కృష్ణనామమును తీరిక దొరికనపుడెల్ల చేయుము. అదియేనీకు ఉత్తమ జీవితము నీయగలద"ని హెచ్చరించెను.

అనేక సాంసారిక యాతనలు పడువారందఱు హరనాథుని ఆశ్రయించిరి. వారి ముక్కుమొగము అంతకు పూర్వము తెలియక పోయినను-వారందఱికి సమయమునకు రక్షణ కల్పించుచు-మహిమ లను ప్రదర్శించుచు జరిపిన ఉత్తరప్రత్యుత్తరాలన్నియు అమోఘ భక్తిప్రేమ భావమణులవలె విరాజిల్లుచున్నవి.

## ధనమాహేమచంద్రఘోషు దంపతులు

ధనీమాహేమచంద్రఘోష్-దంపతులు ఠాకూరును ఎక్కువగా నమ్మిసేవించిరి. ఠాకూరు వారిమీద అపారప్రేమ కురిపించెను. వయసుమళ్ళిన ఆ దంపతులకు ఇచ్చిన సలహాయిది!!

"మీరు చాల విలువైనకాలమును ప్రాపంచిక విషయాలలో వెళ్ళబుచ్చిరి. ఇపుడు మీరు చివరి ఘట్టములోనున్నారు. ఈసమయములో కృష్ణుడు తప్ప రక్షించువారెవ్వరును లేరు. మీరు చేసిన తప్పునే చాలమంది చేసినారు. 'నేను' 'నాది' అను మమకారము పూర్తిగా విడువుడు. ధనమును మంచిపనులకే వెచ్చింపుడు, అన్న. వస్త్రములు లేనివారికి-దిక్కులేని వారికి తోడ్పడుడు. లౌకికమిత్రుల తోడి స్నేహమును పూర్తిగా విడిచిపెట్టుడు. అసూయమొదలైన దుర్గుణాలను మీ హృదయములో నుండనీయకుడు. ఈ జగత్తుమూడు రోజులుండి కాళీచేయావలసిన సత్రమునుమా! దీనిని నమ్మి జీవితపరమార్థమును జాఱవిడువకుడు. కృష్ణనామమును జేయుచు హాయిగా జీవింపుడు."

ఈ విధముగా పెక్కుసలహాలిచ్చుచు - నాస్తికులకుకూడ ఆస్తికత కలుగజేయుచు-అనేక రోగపీడితులను ఆరోగ్యవంతులను జేయుచు-పరమదుర్మార్గులను సజ్జనులుగా చేయుచు వారి ఆధ్యాత్మిక జీవితమునకు అండదండలుగా నుండుచు-ఠాకూరే మాకు సర్వస్వము-అను దృఢనిశ్చయమును పాదుకొల్పిన హరనాథుని అపారకృపావతారము నేమని వర్ణింపగలము? వేనకువేలు లేఖలు బాబా వ్రాసినాడన్నచో-ఆతనికి తీరిక యెక్కడిది? ఒకటి రెండుత్తరాలు వ్రాయుటకే మనము శ్రమపడిపోవుదుమే!! అట్టిచో తానొక 'పోష్టుమేను'గా కృష్ణసందేశలేఖలను నిర్విరామముగా శరపరంపరలుగా విశ్వమునకు అందజేసిన యీ విశ్వమోహనుని లీలలెన్నని వర్ణింపగలము? ఆకాశమునగల చుక్కలనైనను లెక్కింపవచ్చునుగాని - ఇసుకరేణువులనై

నను లెక్కపెట్టవచ్చునుగాని హరనాథుని బహిరంతస్తత్త్వాలను ఎవ్వరును-ఏయొకింతయు పలుకలేదు. ఒకమహాసముద్రమును-చిన్ని కాలువలో నిముడ్చుటవలె ఆ ప్రేమాధినాథుని మహోన్నతచరిత్రను చిన్నపుస్తకములో నిముడ్చుట అట్టిదేయగును. హరనాథుడు సర్వ ప్రదేశములయందు ప్రేమ పిపాసతో-పిచ్చివానివలె తిరిగిన సంగతు శ్రై జాగ్రత్తగా పరిశీలించినచో హరనాథుడు హృదయేశ్వరుడని బోధపడును। ఒకేసమయమున - ఇన్నిచోట్ల దర్శనమిచ్చుట సుండుట అంతయు ఆశ్చర్యము!! ఊహాతీతము!!

హరనాథునిచెంతకు లౌకికులు-ఉద్యోగులు-వేదాంతులు భక్తులు-దీనులు-పతితులు వచ్చుచుండెడివారు. వారికి మధురాతి మధురమైన శైలిలో కృష్ణతత్త్వమును-నామమహిమను-సాధక ధర్మములనుగూర్చి చెప్పెడివాడు. హరనాథుని దృష్టిపడినవారి జీవితాలలో-మనోమార్గములో అద్భుతమైన పరిణామము కాన వచ్చెడిది. క్రమముగా ఆయనచూపు చిత్ర విచిత్రములనుచూచి సందేహములుపోగా సుస్థిర భక్తి ప్రేమ పథాలయందు బాట సారులగుచుండిరి. తన యాత్మీయ భక్తులకు తన్నుగూర్చి చెప్ప వలదనియు నేను కీర్తి ప్రతిష్ఠలుగోరి యివి ప్రదర్శించుట లేదని-అందఱిని కృష్ణునివైపునకు మళ్ళించుటయే నాధ్యేయమని హెచ్చరించెడివాడు. వెన్నెల యెవ్వరితోనైనా మాట్లాడునా? చల్లనికాంతులను నలుదిశల గ్రుమ్మరించుటయే దాని స్వభా వము!! వసంతములోని మల్లీసుమములు తమ సువాసనావైభ వమునుగూర్చి చాటుకొనునా? కమ్మని నెత్తావులు చిత్తములలర

గుబాళించుట వాని నైజము!! గంగ-తన పవిత్రధారావేగశైత్య మాధుర్య మహిమలనుగూర్చి వెల్లడించునా! పరమ పాతకులనుసైతము-దర్శన-స్పర్శన-స్నానాది విశేషములచే పులకింపజేయుట-తరింపజేయుట దాని ప్రకృతి!! అట్లేఎంతనిగూఢముగానుంచుడని అందఱికి చెప్పినను-ఠాకూరు హరనాథుని ప్రేమతత్త్వమాధురి కస్తూరికా పరిమళమువలె విశ్వవ్యాప్తము కాజొచ్చెను.

స్వల్పకాలములోనే అటలుబాబు-హరనాథుని యథార్థస్థితిని కొంతలోకొంత గ్రహించెను. మనోవాక్కాయకర్మలతో ఆయనయే జీవిత సర్వస్వమని విశ్వసించెను. హృదయపారిజాతమును ప్రభునకు సమర్పించుకొనెను. హరనాథలేఖలలోని విపులభావ మహిమాదికములను తనలోతానే యోజించి యోజించి ఆనందభరితస్వాంతుడాయెను. పరమదుర్మార్గులు-పాపులు—ఏ ప్రయత్నము చేయకుండగనే భగవత్ప్రేమికులగునట్లు చేయు ఠాకూరు లీలా వైభవమునకు చకితుడాయెను. బాబా యను మతిని తీసికొని యాలేఖావళీ గ్రంథమునకు 'పాగల్ హరనాథ్' అను పేరిడెను. అందు ఠాకూరు జీవితమును సంగ్రహముగా పొందుపఱచి ప్రపంచమునకు అందజేసెను. మొదట బెంగాలీ లేఖలు 34 ప్రచురింపబడెను. అదే సంవత్సరము 51 లేఖలతో రెండవభాగము ప్రచురింపబడెను. 1,2 భాగములతో ఒకప్రతిగా వెలువడెను. 1910లో మూడవభాగము వెలువడినది.

హిందూ ఆధ్యాత్మికపత్రిక :-

బాబు శిశిరకుమారఘోష కలకత్తాలోని అమృతబజారు పత్రికాసంపాదకుడు. సహజముగా ఆధ్యాత్మిక విషయముల యందు ఆసక్తిగలవాడగుటచే భారతదేశమున చాలవఱకు పర్యటించెను. హరనాథుని అద్భుతలీలలు - ఆయన అఖండ కృపాతత్త్వమును గూర్చి తెలిసికొనెను. తాను తెలిసికొనిన హరనాథ తత్త్వరహస్యములనేకము తన పత్రికలో ప్రకటించెను. తరువాత ఈవిజ్ఞాని - హరనాథుని దర్శించెను. తాను విన్నవి - కన్నవి సత్యాతి సత్యములని నమ్మి తన 'హిందూ ఆధ్యాత్మికపత్రిక'లో 1907 డిశెంబరులో 9 పత్రికలలో ప్రచురించెను. దానితో ప్రేమావతారుని మహోన్నత స్థితి దేశము నాల్గుమూలల తెలిసెను. అటలుబాబు తన యనుభవములను ఈపత్రికలో వెలువఱచెను. ఇట్లుప్రచురించుట వలన ప్రజలలో మంచి సంచలనము కలిగెను. హరనాథుడు కాశ్మీరమున నుండుటచే అందఱును అక్కడకువెళ్ళి దర్శింపలేకపోయిరి. కొంతమంది లేఖలద్వారా సన్నిహితులైరి, భక్తులైరి.

ఠాకూరు అమరనాథమునుండి వచ్చెను. చుంచురానివాసి నందలాల్‌పాల్ - అటలుబాబు వలన హరుని విశేషములను

విని హరనాథుని దర్శించుటకు 1908లో కాశ్మీరు వెళ్ళెను. వచ్చిన నందలాలును ప్రభువు మిక్కిలి ప్రేమతో ఆదరించెను. అదేవత్సరము ఠాకూరు చుంచురాకువచ్చి నందలాలింటిలో బసచేసెను. నారాయణ చంద్రఘోష భాగవతచంద్ర మిత్రమున్నగువారు అచటనే ఆయనను దర్శించిరి. ఆయన చాలమంది మధ్యను కూర్చుండి యుండెను. బి. సి. మిత్ర అతనిని చూడగనే - కలకత్తాలో విద్యార్థిదశలోను భూతానంద స్వామి వద్దకూర్చుండినపుడు తాను చూచినట్లు భావించెను. N. C. ఘోష ఆయనను మొదటిసారి యిక్కడనే చూచెను. సామాన్యునివలె అందఱిమధ్యను కూర్చున్నహరుని గుర్తింపజాలకపోయెను. ఇంతలో ప్రభువు"దాదా-ఇపుడే కచేరీనుండి వచ్చినాడు. ఆయనకు కొంచెము తేనీరీయుడ"నెను. ఆమాటలనువిన్న నారాయణచంద్రఘోష తాను కచేరీనుండి వచ్చుచుండుటను గ్రహించిన మహానుభావుడని గుర్తించి ఆయనకు పాదాక్రాంతుడయ్యెను. హరనాథుని ముఖము ఎప్పుడోతాను చూచినట్లనిపించి ఘోషమహాశయుడు“ తామేకాలేజీలో చదివినార”ని ప్రశ్నించెను. ఠాకూరు “మన స్నేహమీనాటిదికాదు. జన్మజన్మలలో మనము కలసికొనుచునే యున్నాము. అందుచేతనే నాముఖము పరిచితముగా కనిపించుటలో ఆశ్చర్యములేద"నెను. ఇంతకన్నమఱియొక విచిత్రమేమనగా ఠాకూరు-ఘోష మహా

శయుని 'మేజ్‌దాదా' అని సంబోధించెను. అనగా మధ్యమ సోదరుడని యర్థము. ఘోషు - తమముగ్గురు సోదరులలో మధ్యవాడు. ఈరహస్యము ఈయనకెట్లుతెలిసినది. భూతభవిష్యద్వర్తమానములన్నియు ఈయనకు తెలియును కాబోలున"ని ఆశ్చర్యానందములలో మునిగెను. ఠాకూరు ఈతనినెప్పుడు 'దాదా' (సోదరుడు) అనిపిలుచుచు - ఆతనిభార్యను 'దీదీ' (అక్క) యని పిలిచెడివాడు. హరనాథునియెడ ఘోషునకు అమితమైన గౌరవప్రేమలు ఏర్పడెను. క్రమముగా ఈయన హరనాథభక్తులలో ప్రముఖుడాయెను. ఈయన 'శ్రీహరనాథలీలామృతము' 'శ్రీహరనాథతత్త్వము' 'హరగోపాలుని అద్భుత లీలలు' మున్నగు గ్రంథములను రచించెను. కలకత్తా భక్తులచే స్థాపింపబడి - ఠాకూరుప్రోత్సాహముచే నడుపబడిన 'శ్రీహరనాథతత్త్వ ప్రచారిణీసభ' వారు 'పాగల్‌హరనాథ్' 'ఉపదేశామృతము' అనుగ్రంథములను ప్రచురించినారు.

ఘోషుమహాశయుడు పలుచోట్ల ప్రభునితత్త్వమును గూర్చి ఉపన్యాసములు గావించుటయేకాక తత్త్వప్రచారిణీ సభవారి సేవలలో సంపూర్ణాసక్తితో పాల్గొని ప్రభుసేవగొప్పగా చేసిన ధన్యజీవి.

నందలాల్‌పాల్ ఉద్యోగానంతరము ప్రభుసేవచేసెను. ఇంగ్లీషులో ఈయన చక్కనిరచన చేయగలవాడు. భక్తులకోరి

కను అనుసరించి యీాయన బెంగాలీలోని పాగల్ హరనాథ్ గ్రంథమును చక్కగా ఆంగ్లీకరించెను. ఈయన రచించిన గ్రంథము 1910 లో తత్త్వప్రచారిణీ సభవారు ప్రచురించిరి. దీనిని బొంబాయి, గుజరాతు, తదితర ప్రాంతాలవారు చదివిరి. ప్రభుతత్త్వమీారీతిగా దేశము నాల్గుచెరగుల విస్తరించెను. ఈ గ్రంథ విక్రయమువలన వచ్చినధనము శ్రీహరనాథ - అనాథాశ్రమ స్థాపనము (పూరీ) నకై వినియోగింప బడెను.

'పాగల్ హరనాథ్' 3, 4 భాగములు ఆంగ్లీకరింపబడలేదు. కారణము నందలాక్‌పాల్ అనారోగ్యముగానుండుటయే!! ఇతరులెవ్వరును ఆ పనికి సాహసింపరైరి. కాని ప్రభులేఖావళి నాల్గుభాగముల నుండి కొన్నిముఖ్యమైన వాక్యములను తీసికొని విభిన్నశీర్షికలతో 'ఉపదేశము' అను పేర అంగ్లమున ప్రచురింపబడినది. ఈ గ్రంథము ప్రజల ఆదరణ పొందినది. భక్తులుకోరగా దీనిని చింతా దీక్షితులు గారు తెనిగించిరి.

ప్రభుని ఆంతరంగికభక్తుడగు 'సత్యచరణసేన్' బెంగాలీలో 'శ్రీ హరనాథ చరితామృతము'ను పేర గ్రంథమును వ్రాసెను. ఈయన-శివనారాయణుడు అనేక రహస్యవిషయములు చెప్పుటచేతను ప్రభుని డైరీప్రకారముగా రచించుటచేత ఈ రచనను హరనాథు డెంతయు మెచ్చుకొనెను.

1918 లో పూరీలో ప్రభుని జన్మోత్సవసందర్భమున సాంవత్సరిక పత్రికగా వెలువడిన 'మోహనమురళి' హరనాథ ప్రేమతత్త్వమును బాగుగా ప్రచారమొనర్చెను. ఇందు పాగల్ భాయి-రాంగోపాల్-భట్టాచార్య - ప్రియకుమార్ ఛటోపాధ్యాయ - తమాలినీవంటి భక్తుల గీతము లెక్కువగా ప్రచురింపబడెను. ఈ పత్రికాప్రచారము బి. సి. మిత్ర, వైద్యనాథముఖర్జీ డి. కె. దత్తుల ప్రోత్సాహమున జరిగెను.

వైద్యనాథముఖర్జీ మహాశయుడు 12 సంపుటాలుగల 'హరనాథస్మృతి' యనుపేరనొక గ్రంథము-భక్తులస్వానుభవములతో ప్రచురించెను.

చదువరులారా !

చూచితిరా! మఱ్ఱి విత్తనము చాలచిన్నది. దాని వృక్షము పెద్దదై-శాఖోపశాఖలతో విస్తరిల్లినట్లు — హరనాథ తత్త్వకల్పవృక్షము విశ్వవ్యాప్తమై-శాంతిశీతలచ్ఛాయలను ప్రేమమధురఫలములను మనకందజేయుచుండుట మీరు గమనించుచున్నారు.

తెలియనివారము తండ్రీ!
విలసిత మార్గమ్ముల నడిపించుచు, దిక్కై
నిలువవె! ధైర్యము సెప్పవె!
కలతలఁ బోఁద్రోసి మమ్ముఁగాపాడఁ గదే!

# గ ద్య ము

ఇది శ్రీమత్కుసుమహరవరప్రసాదిత మధురకవితావిభూషిత, భాషా విజ్ఞాత, వినయవిఖ్యాత, విశ్వబ్రాహ్మణాన్వయసంజాత, ఆదిత్యబ్రహ్మర్షి గోత్రపరిపూత, ప్రణవసూత్రవినీత, శ్రీనారాయణాంబా సత్యనారాయణాచార్యప్రథమసుత, చిన్మయబ్రహ్మకవి ప్రణీతంబైన శ్రీహరనాథ భాగవత మందలి సప్తమస్కంధము.

జ య శ్రీ కు సు మ హ ర

# శ్రీ హ ర నా థ భా గ వ త ము

## అ ష్ట మ స్కం ధ ము

శ్రీ కుసుమ మనోహర! లో
కైక ప్రేమావతార! యఘ సంహారా!
ప్రాకటనామ సుధాకర!
శ్రీకర: హరనాథ! భక్త చిత్తాధారా!

మధుర మోహనమూర్తి అయిన కృష్ణుడు చైతన్య స్వరూపుడై పురుషోత్తముడై యీ అనంత ప్రకృతిలో నిరంతరము రాసక్రీడ చేయుచున్నాడు. ఈ రాసక్రీడ ఆద్యంతాలు లేక ఎప్పుడు సాగుచునేయుండును. ఈక్రీడ మహోన్నతమైనది. మహాప్రకృతి-అఖండ ప్రేమానందదీప్తి అయిన రాధాదేవితో కృష్ణుడు ఎప్పుడు ఆడుచునేయుండును. ఈ క్రీడలోని రహస్యమేమిటో తెలిసికొనవలెనని బ్రహ్మ మహేశ్వరులు ప్రయత్నించి ప్రయత్నించి చివఱకు దీర్ఘాలోచనామగ్నులైనారు. ఆ క్రీడా రహస్య మొక్క కృష్ణునకే తెలియును. రసమనగా-వేదము-బ్రహ్మము అని అర్థము. సర్వత్ర నిండియున్న చైతన్యశక్తి-జగదారాధ్యమైన అనంత ప్రేమశక్తితో కలసి క్రీడించుటయే 'రాసక్రీడ' అనిపెద్దలు చెప్పుచుందురు. భక్తుల సాధనలో నీ స్థితి యెప్పుడోకాని రాదు. మనస్సు చక్కగా పరిపక్వమై-

కృష్ణతత్త్వము కేవలము-అఖండతత్త్వము-అదియేమన ఆరాధనా లక్ష్యముగా భావించి నిరంతరముచేయు మానసిక చింతనము-మననము - ధ్యానము-తపస్సే – ఆ సచ్చిదానంద మయమైన సుందరాకృతిదర్శనము-దానివలనకలుగు నానందమే రాసక్రీడా నందముగా చెప్పవచ్చును. మనలో 'హ్లాదినీశక్తి' యున్నది. అది దైవికసాధనము-ఉజ్జ్వలమైనపుడు వికసించును; పులకించును. ఆ తరుణముననే సాధకునిఒడలు జలదరించును. కన్నులు చెమ్మగిల్లును. హృదయము సంతోషభరితమగును. గొంతుక బొంగురువోవును. అంతర్నేత్రము (జ్ఞాననేత్రము) విశాల దివ్యదృష్టి సంపన్నమగును. ఆ కృపామయుని కటాక్ష మాలికలచె కనరాని-వినరాని వింతవింత మధుర దృశ్యములు కనిపించును. ఒకప్రక్క దివ్యనామగానము శ్రవణానందమును గలుగజేయుచుండగా-మఱియొకవైపు అంతర్వాణి - అనూహ్యమైన అన్వేషణ-ఆవేదన - ఆక్రందనము - మున్నగు సాత్విక లక్షణములతో నాయిక ప్రాణేశ్వరుని పొందదలచిన యొకానొక మనోహర ఖేల హృదయ బృందావనమున ప్రారంభమగును. సాధకుని చిత్తసంస్కారము-దయామయుని అనుగ్రహమును అనుసరించి మురళీరధ శ్రవణ సుఖముకల్గును. ఇదియంతయు హృదయాంతర్గతఖేల!! బాహ్యాడంబరములయందు = శారీరక వ్యామోహములయందు ఆసక్తి = అభిమానమున్నంతకాలము సాధకుడీ రమణీయక్రీడలో ప్రవేశింపలేడు. కేవలము అమాయికమైన-నిష్కామమైన-అమృతమయమైన ప్రేమభావనా లహరి

ఎవరి హృదయమున నిరంతరనామ ప్రవాహ వేగముతో పర వళ్ల ద్రొక్కుచు పరుగులెత్తునో—వారే ఈ రసమయ మధుర ప్రేమవిహారమునకు అర్హులు. ఈ సర్వమును ప్రభుపు లేఖలలో భక్తులకు నర్మగర్భితముగా బోధించినాడు.

విశ్వమోహిని - హృదయవిహారిణి - యగు కుసుమదేవి హరనాథుని చిత్తకమలమున ప్రవేశించినది. సంసారమే నేనని- వర్ణభేదములే నేనని ధనధాన్యములే నేనని అజ్ఞానములోపడి పొందవలసిన కృష్ణచంద్రుని పొందక యొకరకమైన పిచ్చివా రుగా తిరుగులాడు తన విశ్వసంతానమును అనుగ్రహింపుమని కోరినది. పుత్త్రవాత్సల్య రసమును కురిసినది. ఆచూపులో — ఆభావమాధుర్యములో - ఆ హృదయ స్పందనములో ఏమి ఆకర్షణ — సమ్మోహనశక్తి యున్నదో కాని ఠాకూరు 'తథాస్తు' నుటయే కాదు "మనమిరువురము కలసి స్వజనముతో క్రీడింత మ"ని హెచ్చరించినాడు. తల్లికి సంతానముపైగల ప్రేమను ఎవ్వరు వర్ణింపగలరు? దానికిఅదియేసాటి. అది సర్వోత్కృష్ట మైనది. వందనీయమైనది. అట్టిప్రేమానందమును అభినందిం చుచు జగద్వ్యాప్తమగు 'ప్రేమఖేల' ను ఇంతకు పూర్వముకన్న ఎక్కువచేసినాడు. ఏకాంతమును కట్టిపెట్టి సుస్వాంతముతో ఆర్తులను - పతితులను - దీనులను - భక్తులను నిజమైనప్రేమ మార్గమున నడిపింప అభయమీయసాగినాడు. హరనాథుని విశ్వప్రేమ శంఖారావము అంతటవినిపించ సాగినది. ప్రేమ

మురళీనాదమంతట వర్తించినది. ఆపిలుపు వినినవారు - ఆ మురళీగానమును గ్రోలనోచినవారు నిజముగా ధన్యులు !! ఈ మహోదయముననే ఎందరెందరో ప్రభువునకు ఆశ్రితులైరి. వారిని తనవైపునకు త్రిప్పుకొనుట కెంత అమూల్యమైన ప్రేమ ధనమును ఠాకూరు ధారపోసెనో మనము ఊహింపలేము. నిష్కళంకమైన = నిరుపమానమైన యీ ప్రేమభిక్షకై. ఆయన 'పొగలు' అయిపోయినాడు. ఆపర్యటన ఒకరాత్రి-ఒకపగలు కాదు. దినమున 24గంటలు నిరంతరము ఆసంచారము జరుగు చునే యున్నది. ఆయవకాశము-ఆకటాక్షము-ఆసమాగమము ఎవరికిదక్కునో ? ఎవరుచెప్పగలరు ? "నావారిని నేనే ఎన్ను కొందును." అన్నఠాకూరు సూక్తి గమనింపదగియున్నది. వివిధప్రాంతాలకు చెందినవారు వందలు వేలుమంది హరనా థుని చరణకమలముల నీడ, తలదాచుకొన్నారు. అందు కొందఱి పవిత్రచరిత్రలు (లీలలు) సంగ్రహముగా ఇందు పొందుపఱచబడినవి.

తమాలినీ దేవి :-

ఈమెభర్త శిరీషచంద్రదత్తు. మిడ్నపూరులో నొక వకీ లుగా నుండెను. ఈమె ఆదర్శగృహిణిగా కాలమును వెళ్ళ బుచ్చుచుండెను. హరనాథుని అపారకృపకు పాత్రుడైన రమా ప్రసాదఘోష ఈయమ్మ సోదరుడు. వీరిది ఒక అందమైన భవనము. ఈమెకు 20 సంవత్సరాలయినను నిండక పూర్వమే ముగ్గురుపిల్లలు కల్గిరి. ఇపుడు మఱల ఆమె గర్భవతియైనది.

7 మాసాలు నిండినవి. ఒకరాత్రి సుమారు 11 గంటల సమయమున ఆమె-నిద్రపోవుచున్న ప్రక్కనుండి నేలపైబడెను. తెలివితప్పి యుండెను. ఆసమయమున నొక లేడీడాక్టరువచ్చి ఆమెను పరీక్షించినది. చికిత్సజరిగిన యనంతరము ఆమెకు తెలివివచ్చినది. "ఏమీభయము లేద"ని డాక్టరుచెప్పెను. తమా లినీ క్రమముగా 9 వ మాసమున నొకమగపిల్లవానిని ప్రస వించినది. ప్రసవించిన నాల్గవరోజున ఆమెస్థితి పూర్తిగా తారు మారయ్యెను. శరీరము చల్లబడెను. శ్వాసఆడుటయే కష్టముగా నుండెను. ఎన్నియింజక్షన్లు — మందులిచ్చినను ప్రయోజనము శూన్యమయ్యెను. నాడి చాలా నీరసముగా కొట్టుకొనుచుండెను. చావుబ్రతుకులమధ్య ఆమె పెనుగులాడుచుండెను. డాక్టర్లకు చాలడబ్బిచ్చి చికిత్స చేయించుచుండిరి. ఇట్లుకొంతకాలము గడ చెను. ఒకరాత్రి ఆమె చచ్చిపోవుదునని తలంచెను. అదిచీకటి రాత్రి. ఒంటరిగా ఆమెమంచముమీద పరుండియుండెను. తోడెవ్వరునులేరు. అర్ధరాత్రియయ్యెను. ఇంతలో ఒకమూల నుండి "అమ్మా ! నేనువచ్చితివి. కన్నులుతెఱచి నన్నొకసారి చూడుము" అన్నమాటలు వినిపించెను. అవ్యక్తి మంచము దగ్గఱకు వచ్చెను. ఆదివ్యమూర్తి సౌందర్యము వర్ణనాతీత ముగా నుండెను, ఎంతసేపుచూచినను ఆమెకు తనివితీరలేదు. అపుడామె "బాబా ! నన్నీరీతిగా రక్షించుటకు వచ్చిన మీరె వ్వరో ! నేనెంతోకాలము బ్రతుకను" అనెను. ఆనూతనవ్యక్తి ఆమెతలను తనచేతితో నిమిరెను. ఆమెకు ఆస్పర్శలో మంచి

సుఖము కలిగెను. ఆయన "అమ్మా ! నీవింతలో చచ్చిపోవు. నీవుచేయవలసిన పనులెన్నో యున్నవి. నీవిపుడు అశుచిగా నున్నావు. అయినను నాశక్తికొలది ప్రయత్నించెదను" అనెను. వెంటనే ఆవ్యక్తిఆమెను చక్కగా స్నానముచేయించి పరుండ బెట్టి "ఇది బ్రాహ్మీముహూర్తము. నోరుతెఱువుము. మందు నోటిలో వేసెదను" అనెను. అపుడామె "తండ్రీ ! ఏమందు నాకిచ్చుచున్నావు" అనియడిగెను. ఆయన "అమ్మా ! ముందీ మందుతీసికొనుము. తరువాత నేనెవ్వరినో నీకుతెలియగలద" ని చెప్పుచు మందునోటిలోవేసి ఆయన అంతర్ధానమైపోయెను. తరువాత సూర్యకిరణాలు గదిలోప్రవేశించెను. ఆమెలేచి రాత్రి తనకు కనిపించిన వ్యక్తినిగూర్చి ఆలోచింపసాగెను. ఆమె రాత్రి చచ్చిపోవునని బంధువులందఱనుకొనిరి. కాని ఆయమ్మ చాలనీరసముగా నున్నను — ముఖకమలమున చిఱునవ్వులు తొణికిసలాడుచుండెను.

ఆమె బ్రతికి బయటపడినందులకు బంధువులు చాల ఆనందించిరి. వారు "అమ్మా! నీకు స్నానమెవరు చేయించిరి ? ఈబట్టలన్నియు పొడిగానే యున్నవి" అనియడిగిరి. తమాలిని జరిగినవిషయము వారికిచెప్పెను. లేడీడాక్టరువచ్చి పరీక్షించి "నీరసము తప్పమఱి యే రోగము లేద"ని చెప్పెను. ఆమెకు కల్గిన సంతోషమింతింతకాదు. రాత్రి కనిపించి రక్షించిన ఆ వ్యక్తి రూపము హృదయమున శాశ్వతముగా నిలిచిపోయెను. ఆ రక్షకుడు హరనాథుడే యని పాఠకులు గ్రహింతురుగాక!

హిందూ ఆధ్యాత్మిక పత్రికను చదివిన అమెరికా ప్రజలు చాలమంది హరనాథుని అద్భుతశక్తులనెంతయు కొనియాడిరి. అందులో కొందఱు ఈయన శక్తిని పరిశీలింపదలచి "శ్రీ హరనాథుడు—ప్రపంచము'' అను వ్యాసముతో నొకజాబు వ్రాసిరి. దానిని జూచిన తర్వాత ఠాకూరు "నాయనలారా! మీరు ప్రేమతో వ్రాసిన జాబందినది. మీరు జాబు వ్రాయునపుడు నేను మీ ప్రక్కనే యున్నాను.'' అని సమాధానమిచ్చెను. చూచుటకిది చిన్ని సంఘటన అయినను దీనినిబట్టి ఠాకూరు సర్వజ్ఞత్వము విశదము కాగలదు.

రాయిమతికి నరేష్ చంద్రము ఖోపాధ్యాయునితో కాల్నాలో ప్రభుని సన్నిధియందే 1906లో వైభవముగా వివాహము జరిగెను. అటలు బాబు దంపతులు అమ్మాయికి రు 500 ల కాన్కనొసంగిరి. పిమ్మట ఆదంపతులు పుణ్యక్షేత్రములను దర్శించుటకు వెళ్ళిరి.

మహేంద్రబాబు, యజ్ఞేశ్వరబాబు మఱికొంతమందికలసి కాశ్మీరులోని హరనాథుని దర్శించుటకు వెళ్ళదలచిరి. వారికి అటలుబాబు వలననే ఠాకూరు సంగతి తెలిసెను. అందులో నొక వ్యక్తి బాబాకు జాబువ్రాయగా ఆయన ఎంత చిత్రముగా సమాధాన మిచ్చెనో చూడుడు ! !

"మీ అబ్బాయి సంగతి మీరు తెలియపఱచిన తర్వాత నాకు హృదయ విదారకమైన బాధకల్గినది- నేనేమి చేయగలను?

కృష్ణుడొక్కడే. ఆపద్రక్షకుడు. మీపిల్లవాని నొప్పిని ఆయనయే నయము చేయగలడు. నేనింతకుపూర్వము అట్టి శక్తిని ఉపయోగించినట్లు తలంపను. నేనొక పనికిమాలిన వాడను. నా జీవితముకూడ నట్టిదే !! నేను గూడ వ్యాధిచే పీడింపబడుచున్నాను. ఎందుకైనను మంచిది. నిజమైన సాధువు అయిన అటలు బీహారీనాంధీ, హెడ్‌బుకింగ్ క్లార్కు హ్రస్ జంక్షను అద్రసునకు ఉత్తరప్రత్యుత్తరాలు జరుపుట మంచిది. అతడు కృష్ణునకు మిక్కిలి యిష్టుడు. అతడు తలచినచో మీకోర్కె నెఱవేరగలడు."

చదువరులారా ! ఆయన తన కుమారుని నొప్పినిగూర్చి ఠాకూరునకు జాబువ్రాసెను. ఆబాధను ఠాకూరు స్వీకరించుచు చిత్రముగా తాను పనికిమాలినవాడనని - అటలుబాబు — కృష్ణ కృపాపాత్రుడని - ఆయన సంకల్పించినచో అబ్బాయి బాధ తగ్గునని సూచించినాడు. ఆహా ! భక్తులు సంకల్పించినచో రోగార్తుల రోగములు నివారింపబడునట !! ఆయనకు భక్తు న్న ఎంతప్రేమాదరములో ! తనకన్న-వారే గొప్పవారన్న పభిప్రాయ మెంత అమోఘమైనది. హరనాథుని ప్రేమభాండాగారములో ఎటువంటి అనర్ఘమణులున్నవో మానవమాత్రులమైన మనము గ్రహింపగలమా?

తరువాత వారు అటలుబాబును కలియుటయు - పిల్లవాని నొప్పితగ్గిపోవుటయు వారియందు ప్రభుభక్తి యేర్పడుట జరిగినది.

ఒకసారి మహిమానిరంజన చక్రవర్తి ఠాకూరును హేంపూరునకు తీసికొనివెళ్ళెను. హరనాథుని వెంట నందలాల్ పాల్, వినోదవిహారీ గోస్వామి, అభయపాల్, సుచందకర్మాకర్, యాదవగంగూలీ, జ్యోతిషప్రసాదభట్టాచార్య, రాధావల్లభసీలు, రసికచంద్రదే, భాగవతచంద్రమిత్ర యుండిరి. కుమారబహాదూర్ కాశ్మీర్‌లో నున్న ఠాకూరునకు జాబులువ్రాసి యుండుటచే మిక్కిలి సన్నిహితుడాయెను. ఆయన ప్రత్యేక సుందరమగునతిథి గృహమున అందఱికి బసయేర్పాటు చేసెను. భక్తులు మాట్లాడుచుండగా అందుకొందఱు "బాబా! కృష్ణమురళీ గానమునుగూర్చి చెప్పగా వినగోరెదమ"ని యడిగిరి. ఆసందర్భమున ఠాకూరు చాల గంభీర ప్రసంగము చేసెను. అది చాల విస్తారముగా నున్నది. దాని సారాంశమునిచట తెలిసికొనగలరు. "కృష్ణమురళీ నాదమును గూర్చి తెలిసికొనదలచి నందులకు సంతోషము: ఆనాదమును వినుచు యమునానది - ఎదురుగా ప్రవహించినదట. పక్షులు - పశువులు భయంకర జంతువులు - ప్రాపంచికదృష్టిని మఱచిపోయి ఆగానమును గ్రోలుచు బొమ్మలవలె నుండిపోయినవి. మునులు హృదయములు సంచలింపగా తపస్సుచాలించి నలుదిక్కులను పరికించిరి. అరమోడ్పుకన్నులతో పులకించి ఆనంద పరవశులైరి ప్రకృతి తన్మయమైనది. ఇకగోపికలమాట చెప్పనేల? వారు ఆ లయకు అనుగుణముగా - ఆవెన్నెలరాత్రిలో - ఇసుకతిన్నెలపై మధుర మనోజ్ఞమైన నృత్యము చేయసాగిరి. చిత్రమేమన? ఆకృష్ణ

స్వరూపము వారి హృదయక్షేత్రములలోనే ముద్రితమైపోయెను. పైచూపులోకన్న లోచూపులో ఎంతోమాధుర్యమున్నదని వారు తలంచిరి.

శ్రీకృష్ణుని 'మురళి' వెదురుకఱ్ఱయే!! దానికి సప్తరంధ్రములు దొలిచిన తరువాతనే అది వేణువైనది. అందఱుదానిని ఊదినచో అంత మధురముగానుండదు. కారణము ప్రేమగల వారికదిమఱింత ప్రాణతుల్యముగా-పరమానందముగానుండును. ఇష్టములేనివస్తువులు-వ్యక్తులు తలచుకొనుటకైనను పేలవముగా కనిపింతురు. ఇష్టము (ప్రేమ)న్నవారివస్తువులనిన ఎక్కడలేని ప్రీతి-ఆసక్తి పెంపొందును. తల్లిదండ్రులమీద-భార్యమీద-భర్తమీద లేక పిల్లలమీదచూపు ప్రేమ లౌకికమైనది. అది హెచ్చుచు-తగ్గుచుండును. తల్లిప్రేమ యట్టిదికాదు. నిజము చెప్పవలెనన్న మాతృప్రేమలోనే మధుర మంజులమైన సంగీతమున్నది. సంగీతము రెండువిధములు. అందొకటి పైకి వినబడునది; రెండవది వినబడనిది. వినబడుటవలన కల్గు నానందము తాత్కాలికమైనది. ఏవియున్నను ఏవి లేకపోయినను తరుగని ఆనందమును కల్గించునదియే వినబడని సంగీతము. అది హృదయాంతరాళములనుండి ప్రేమోద్వేగముచే నుప్పొంగి పొంగి పొఱలి పాఱుచుండును. ఆసంగీతమే మురళీగానము!! మాయావరణమునుండి విముక్తిపొందినవారు మాత్రమే దానిని ఎప్పుడైనను వినగలరు. ఈ ప్రపంచమే నిజము-ఈ బ్రతుకే బ్రతుకని భ్రాంతిపడువారికి ఈనాదమెన్ని జన్మలనెత్తినను వినిపించదు.

శరీరమును-మనోబుద్ధులను హృదయేశ్వరునకు సమర్పించి-ఆయనకు హితముగా జీవితమును సంస్కరించుకోవలసి యున్నది. దానికితోడు ఆర్తి-ప్రేమోన్మత్తత ఎవరికి ఎక్కువయై వల్లభుని చూడవలెననెడు ఉత్కంఠ ఏర్పడునో అట్టివారికి ఆ మోహనమురళి వినిపించును. అంతలోనే వినిపించక మురి పించును. ఈ జీవజాలమునకు భర్త కృష్ణుడు. ఇక్కడ స్త్రీలు పురుషులను విచక్షణకు అవకాశములేదు. అతడు భోక్త-మనము భోగ్య వస్తువులము. ప్రాణేశ్వరుని తృప్తికై-ఆనంద మునకై తమ సుఖ సంతోషాలను-అభిరుచులను పరిత్యజింప గలవారే-ఆయనకై ఏమైనను త్యాగము చేయగలవారే కృష్ణ ప్రాప్తికి అర్హులు. భాగవతములోని మురళి వేఱు. ఈనాడు మిమ్మందఱిని ఒకటిగాచేయుచు - మీ సుఖదుఃఖాలలో భాగ మును పంచుకొనుటకై అహరహము తపించిపోవుచున్న ఈ పాగలుని మురళిలోని మాధుర్యమును క్రమముగా మీరెల్లరు ఆస్వాదింపగలరు.''

హరనాథుని కృపాకటాక్షమును పొందినవారిలో భాగవత చంద్రమిత్ర యొకడు. ప్రభుని సన్నిధిలోనే చాలకాలముండు టచే అనేక లీలలను-మహిమలను తెలిసికొనియుండెను. అట్టి ప్రేమావతారుని చెంగట నివసింపగల వారెంత భాగ్యశాలురో కదా!!

చించురానివాసి పూరీలో డిప్యూటీ మేజస్ట్రేటుగా పని చేయుచున్న దిననాథుని ఆహ్వానమును అంగీకరించి 1910లో

ఠాకూరు 40 మంది భక్త బృందముతో పూరీ ధామమునకు వచ్చెను. భాగవతచంద్రుడు హరనాథుని వెంటనేయుండెను. జగన్నాథుని రథయాత్రకు లక్షలాదిప్రజలువచ్చిరి. విడిది చేయుటకుఒక గదియైనను దొరకదయ్యెను. వసతి దొరకనివారు చెట్ల నీడలయందే విడిసిరి. అందలిఇండ్లు బంధుమిత్ర యాత్రికులతో క్రిక్కిరిసియుండెను. దారులన్నియు జనసమ్మర్దముచే కిటకిటలాడుచుండెను. రథోత్సవమునకు పూర్వమే పూరీవచ్చియుండుటచే ప్రభుబృందమువారికి వసతి దొరకెను.

ఇంతలో ప్రభునిసోదరి కమలయు, మేనకోడలగు వినోదిని యిర్వురును, హరనాథుడును భక్తబృందము జగన్నాథుని దర్శించుచున్న సమయములో దారితప్పిపోయిరి. మిగిలినవారందఱు బసకుచేరిరి. చీకటి గ్రమ్మకొనెను. వీథులలో గట్టిగా పేర్లుపెట్టి కొందఱు భక్తులు పిలువసాగిరి. పోలీసులు గాలించిరి. వారికి కూడ వారిజాడ తెలియలేదు. ఆసమయమున భాగవతచంద్రమిత్ర ప్రభుని పాదములకు ప్రణమిల్లి బాబా! నన్ను ఆశీర్వదింపుడు. నేను వెదకి వచ్చెదన"నెను. ప్రభువు అంగీకరించెను. మిత్ర - తన ప్రయత్నము తప్పక ఫలించునను ధైర్యముతో ఒకగంట ఆచీకటిలో వెదకెను. ఒకచోట వారిరువురు కనిపించిరి. వెంటనే ప్రభుని సన్నిధికి ఆయన వారిని తీసికొనివచ్చెను. అందఱు చాల సంతోషించిరి. హరనాథుడు మిత్రను గట్టిగా కౌగిలించుకొని "నీకు త్వరలో

రు 500ల ఉద్యోగము దొరకునుగాక" అని యాశీర్వదించెను భాగవతచంద్రమిత్ర మిలిటరీ అకౌంటెంటు ఆఫీసులో గుమాస్తాగా పనిచేయుచుండెను. ఠాకూరు మాటలు అతనికి ఆశ్చర్యముగాతోచెను. అంతపెద్ద యుద్యోగమువచ్చుట దుర్లభమనుకొనెను. ఈతని ఉన్నతోద్యోగికి ఈతడన్న చాలప్రీతియగుటచే డిపార్టుమెంటు పరీక్షకు చదువుమని ప్రోత్సహించెను. పరీక్షలో విజయముతోపాటు ప్రభుని ఆశీర్వాదము ప్రకారము రు 500 ల యుద్యోగము వచ్చెను.

చదువరులారా !

చూచితిరా! ఠాకూరు కృపావర్షము !! ఈసందర్భములో నొక ముఖ్యవిషయము తెలిసికొన వలసియున్నది. పూరీధామమునకు ప్రభువును, భక్తబృందమును రమ్మని ఆహ్వానించిన దీననాథుడు - వీరిలో కొంతమందికి కలరావ్యాధి సోకుట చూచి "మాయింట మీరెవ్వరును ఉండుటకు వీలులేద"ని శాసించెను. చేయునదిలేక అందఱును ప్రయాణమగు చుండిరి. ఠాకూరుతో కుసుమదేవి బయలుదేఱు సమయమున—దీననాథుడు "మీరింతవఱకు నివసించిన గదులన్నియు శుభ్రపఱచినగాని వెళ్ళుటకు వీలులేద"ని శాసించెను. అతడు హరనాథుని భక్తుడే!! అయినను దూరదృష్టి లేనివాడగుటచే అట్లొనర్చెను. అపుడు సహనవతి - భక్తకల్పద్రుమమైన కుసుమదేవి - మిత్ర - జ్యోతిబాబు - నీళ్ళుతెచ్చిపోయగా తాను ఆగదులను చీపురుతో

శుభ్రపఱచెను. అతని దూషణభాషణములకు కోపించి భాగవత చంద్రమిత్ర - అతనినికొట్టదలచెను. కాని అమ్మ "నాయనా! యెవరికోపము వారినే పాడుచేయున"ని హెచ్చరించెను. దుర్మార్గులని తెలిసి వారితో విరోధపడరాదు - కష్టములను సహించుటలో తప్పులేదని ఆయమ్మ మనకు ఆచరణ ద్వారా సందేశమిచ్చెను గదా!!

సొంతగృహము లేకపోవుటచేతనే ప్రభునకిట్టి యాతన-అవమానము కల్గినదని భావించి భక్తులెల్లరు పూరీధామములో ఒకమందిరమును కట్టించవలెనని సంకల్పించిరి. మఱికొందఱు ఆయన రిటైరయిన తర్వాత హాయిగా నుండవచ్చునని ఊహించిరి. హరనాథుని ఆరోగ్యము - క్రమముగా తగ్గజొచ్చెను. అప్పటికే ఆయనకీర్తి ప్రతిష్ఠలు దేశదేశాంతరాలలో వ్యాపించెను. అందుచే ప్రతిదినము అన్నిదిక్కులనుండి గుట్టలకొలది ఉత్తరాలు వచ్చుచుండెను. దీనితోపాటు ఎందఱెందఱో తమ పాపరోగభారములను ఠాకూరునకు సమర్పించుటచేత, ఆయా భారములను వహించక తప్పుటలేదు. పెద్ద కొండవలెనున్న కాశ్మీరమునసుండుటయా? లేక మిత్రులతోకలసి మైదానములలో నుండుటయా? యనునొక సమస్య - హరనాథునిలో చెలరేగెను, అందుచే ఠాకూరు భక్తులకు "పూరీలో సముద్రతీరమున నొకస్థలమును సంపాదించి యొక ఆశ్రమమును కట్టుడు. యాత్రకై వచ్చినపుడు నేను - నాభక్తులు ఇందు హాయిగానుండవచ్చున"ని తెలియజేసెను. అప్పటికపుడు

భక్తులు విరాళములిచ్చిరి. కలకత్తా తదితర పట్టణములలోని భక్తులుకూడ ధనమును సేకరించిరి. కాని యేమిలాభము? సముద్రతీరమున మొదటివరుసలో ఆశ్రమమునకు స్థలముదొరకదయ్యెను. ఠాకూరు వచ్చినడబ్బు చందాదారులకు ఇమ్మనిచెప్పగా భాగవతచంద్రమిత్ర కొంతకాలము నిరీక్షింపవలెననికోరెను.

ఠాకూరు పూరీధామమునుండి భక్తబృందముతో పూరీ ప్యాసింజరులో తిరుగు ప్రయాణము చేయుచుండెను. బాలసూరు వాస్తవ్యుడయిన రాధాచరణదాసు హరనాథుని ఆహ్వానించెను. భక్తబృందము "జై హరనాథ్ జై హరనాథ్" అనునినాదములుచేయుచుండిరి. కొందఱు ఠాకూరుపై కీర్తనలు ఆలపించుచుండిరి. ప్లాటుఫారము ప్రయాణికులచే క్రిక్కిరిసి యుండెను.

బర్మాపోస్టు ఆఫీసులో గుమాస్తాగా నుండి ప్రజలుమోసగించుటచే ప్రభుత్వమునకు కొంతడబ్బు కట్టవలసివచ్చుటచే ఆత్మహత్య చేసికొనుటకై పూనుకొన్న కిరోద్ చంద్రనాందీని ప్రభువే కాపాడెను. కాని తన్ను కాపాడిన వారెవరని అన్వేషించుచుండెను. ఆయన ప్రస్తుతము మయూరభంజ్‌లో స్టేషను మాష్టరుగా నుండెను. ఆప్లాటుఫారమున వినబడుచున్న అలజడిని బట్టి తానును హరనాథుడున్న రైలుపెట్టె దగ్గఱకువెళ్ళి అందఱివలె చూచుచుండెను. నాందీని చూచినవెంటనే హరనాథుడు" నాందీ! చాలసంవత్సరాల తర్వాత మనమిరువురము

కలసికొంటిమి. నేనునిన్ను గుర్తింపగలనుకాని, నీవు నన్ను గుర్తింపలేవు. బాలసూరులో మఱల నిన్ను చూచుటకు కుతూహలపడుచున్నాన"నెను. ఈమాటలలోని యర్థమును నాందీ వెంటనే గ్రహించలేకపోయెను. నాముక్కుమొగము తెలియని హరనాథుడేమి? నాపేరు తెలిసి మాట్లాడుటయేమి? మనమిరుపురము చాలకాలము క్రిందటకలిసినాము. ఇపుడు మఱల కలిసితిమి - అనుమాటనుగూర్చి ఆలోచించు చుండెను. మఱునటి రోజున నాందీ ఠాకూరు చెప్పినప్రకారము బాలసూరు వెళ్ళెను. ఆసమయమున ప్రభువు ప్రయివేటు రూములో కొంతమంది పెద్దవారితో మాట్లాడుచుండెను. నాందీ ఆప్రక్కనేయున్న వరండాలో ఠాకూరును కలియుటకై వేచియుండెను. వెంటనే ఆయన బయటికివచ్చి "నాందీ! బర్మా ఎందులకు విడిచిపెట్టితివి?" అని ప్రశ్నింపగా - నాందీ ఆమాటలకొక్కసారి చకితుడై తన్ను రంగూనులో కాపాడిన సన్యాసియే యీయనయై యుండునని తలంచెను. విషయము స్పష్టముగా గుర్తునకు చ్చెను. అప్రయత్నముగా నతని కనుగొలకులనుండి కన్నీటి ాలువలు ప్రవహింపజొచ్చెను. అపుడు ప్రభువు "నిశ్శబ్ద ముగా నుండుము. ఆనాటి ప్రమాదస్థితిని యిపుడు వెల్లడిచేయకుము. మనము తిరిగి కలసికొందమ''ని చెప్పుచు గదిలోనికి వెళ్ళిపోయెను. నాందీ - తనస్టేషనునకు తిరిగివెళ్ళెను. ఆరాత్రి స్వప్నమున ఠాకూరు ఆయనకు దర్శనమిచ్చెను. నాందీ - ఆ యసహాయస్థితిలో రక్షించిన మహానుభావుడే యీయన. ఆ

దయామయుని కృపవలననే తనజీవితమిట్లు సాగుచున్నదని గుర్తించెను. అతడు జీవితశేషమంతయు ప్రభుసేవలోనే గడపెను.

పాఠకులారా !

నారాయణ చంద్రఘోష మహాశయునిగూర్చి క్రిందట కొంచెము తెలిసికొని యున్నారు. అయినను ఈయనను ప్రభు వెంత చిత్రముగా ఆకర్షించెనో తెలిసికొనవలసి యున్నది.

ఘోషమహాశయుడు కలకత్తాకు సమీపమునగల గోవింద పురమున 1868 సం॥ రమున జన్మించెను. 1897 లో L. L. B పూర్తిచేసి 98 లో కలకత్తాలో న్యాయవాదిగా పని చేయుచుండెను. ఈయన చిన్ననాటినుండి మహాపురుషులను దర్శింపవలెనని కుతూహలపడెడువాడు. ఎందరెందరినో మహా పురుషులను దర్శించెను కాని తన హృదయము ఏమాత్రము ద్రవీభూతము కాదయ్యెను. వారిచ్చిన బోధనలను ఆచరణలో పెట్టవలెనను తలంపుకూడ నతనికి కలుగదయ్యెను. భాగవత చంద్రమిత్ర యీయన మేనల్లుడు. ఈయనకు మొదటిసారి నందలాల్ పాతింటిలో హరనాథుని దర్శనమైన సంగతి - ఇంతకు పూర్వము తెలిసికొని యున్నారు.

హరనాథునియందు భక్తిప్రేమలు గల్గినతరువాత ఈయన 1913 లో డోలాపూర్ణిమనాడు జరుగు 'కుసుమ కుంజాశ్రమ' ప్రారంభోత్సవమునకు బృందావనమునకు బయలుదేరెను. వెళ్ళు

నపుడు ఆయన సతీమణి బృందావనమునుండి కృష్ణవిగ్రహ మును తెండని కోరెను. ఈయుత్సవమునకు లెక్కకు మించిన భక్తులు వచ్చిరి. ఉత్సవమునకు వచ్చినవారి కందఱికి అటలు బాబు చక్కని వసతులను కల్పించెను. ఉత్సవదినమున గోకుల బృందావనమంతయు నూత్నశోభతో కలకలలాడు చుండెను. ఘోషబాబు వెంటరాగా ఠాకూరు నగర సంకీర్త నతో బృందావన వీధులలో నడచుచుండెను. గతచరిత్ర-లీలలు జ్ఞప్తికి వచ్చెనేమో హరనాథుని ముఖకమలము ప్రేమప్రపుల్ల మయ్యెను. వైఖరిలో గాంభీర్యము హెచ్చెను. మేడలపైనుండి ఎందఱెందఱో వ్రజగోపికలు-వసంతమును శ్రీ హరనాథునిపై చల్లనారంభించిరి. వారి ప్రేమాదరములను స్వీకరించితిననియు-సంతోషించితినని తెలుపునట్లు మందహాస చంద్రికలను వెద చల్లెను. అందఱును ఆ గోపాలదేవుడే మఱల నీరూపమెత్తి-పూర్వపు మిత్రులతో సరససల్లాపములు-లీలలు జరుపుచున్నట్లు భావించిరి.

తనభార్య కోరిన కృష్ణ విగ్రహమును కొనుటకై ఘోష బాబు బృందావనములోని అంగడికి వచ్చెను. అక్కడే తన మిత్రుడగు రాధావల్లభసీలు కనిపించినట్లయ్యెను. కాని యతడు కాడు. ఘోషబాబును జూచి "మీకేమి కావలెను?" అని ప్రశ్నింపగా ఘోష విషయమును చెప్పెను. వెంటనే అతడు తటాలున షాపులోనికి వెళ్ళి యొక సుందరాతిసుందరమైన గోపాలకృష్ణుని విగ్రహమును తెచ్చి ఘోషబాబునకిచ్చెను. ఆ

రీతిగా నిచ్చినవాడు హరనాథ ప్రభువన్నమాట అతని స్మృతిలో లేదు. కొంతదూరము వచ్చిన తరువాత ఆ నూతనవ్యక్తి అదృశ్యమయ్యెను. బసకు వచ్చిన తరువాత రాధావల్లభసీలు నెన్నియో సారులు బొమ్మనుగూర్చి యడిగెను. నాకేమియు తెలియదని ఆయన సమాధానమిచ్చెను. ఇంటికి వచ్చిన తరువాత ఆ సుందరమూర్తిని భార్యకిచ్చి జరిగిన లీలనుకూడ చెప్పెను. ఆ భక్తదంపతులు ఆ దివ్యమూర్తినే నిరంతరము ఆరాధించెడువారు. ఘోషు గొప్ప వైష్ణవ శిఖామణి.

కలకత్తాలోని శరత్ బాబు గృహమునకు ఠాకూరువచ్చి నపుడు ఘోషుబాబు అక్కడికి వెళ్ళి "బాబా! మా యింటికివచ్చి ఫలహారమును స్వీకరింపుడ''ని కోరెను. వెంటనే హరనాథుడు "దాదా! నీ యపేక్షకాని మీ యిల్లు నాయిల్లే! మీరిడుచున్న భోజన ఫలహారాలను నిత్యము తీసికొనుచునే యుంటిని సుమా!" అని సమాధానమిచ్చెను.

ఆ మాటలను గూర్చి ఆ భక్తమణి బాగుగా ఆలోచించెను. కడచిన లీలయంతయు భావమున తళుక్కున మెఱసెను. "గోపాలుడను—నేనే'' అని చెప్పుటకింత కన్న నిదర్శనమేమి కావలెను?

గోపాలునితో ఘోషుబాబు మాట్లాడును. హితమైన సేవలు చేయును. ఆరగింపు-పవ్వళింపు సేవలుచేయును. కుమార భావముతో హరనాథుని భార్యాయుక్తుడై సేవించెను. ఈతని

యింట హరగోపాలుడు పెక్కు కొంటెపనులను విచిత్రలీల లను ప్రదర్శించెను. మా వెంటనే ప్రభువున్నాడు-ఆ మహాను భావుని సాయములేనిదే యీ జీవితమొక్క క్షణము నడువదు. ఆయనయే తల్లిదండ్రులు, గురువు సర్వము ఆయనయే యని భావించి—మధుర ప్రేమాధినాథునకు జీవితమును అంకితమొన ర్చిన పుణ్యాత్ముడు ఘోష మహాశయుడు. ప్రభువు ఈయన కెన్నెన్నో అద్భుతలీలలను జూపించెను. వాని నన్నిటిని ఇచట వర్ణించుటకు అవకాశములేదు.

భాగవతచంద్ర మిత్రుని విషయమై పాఠకులు కొంచెమే తెలిసికొని యున్నారు. ప్రభువు ఆయనను ఎంతగా ప్రేమించి నది తెలుపుటకు ఒకటిరెండు సన్నివేశములు మాత్రమే తెలియ జేయ బడుచున్నవి.

1907 లో హిందూ ఆధ్యాత్మిక పత్రికలో ప్రభుని లీలలను గూర్చి ప్రకటించినపుడు మిత్ర వానిని చదివి ఠాకూరున కొక లేఖవ్రాసెను. ఆయన 'మహాపురుష' అని సంబోధిం చుచు జాబువ్రాసి యుండెను. అందు మిత్రగారి ప్రాపంచిక జీవిత సమస్యలను పేర్కొనుచు మిక్కిలి ఆత్మీయతతో బుజ్జ గించిన తీరు ప్రశంసనీయమై యుండెను.

ఒకసారి ఠాకూరు నందలాల్‌పాల్‌గారి గృహమునకు వచ్చెను. అక్కడనే ఆయనను మిత్ర దర్శించెను. కలకత్తాలో విద్యార్థిగానున్న హరనాథునకు-ఈ హరనాథునకు చాలవ్యత్యాస

మున్నట్లు ఈయన గ్రహించెను. అంతటి మహాత్ముడు సామాన్యునిగా నున్నందులకు సంతోషించెను. ఆ సమయముననే మానమున్నర సెలవు పెట్టి బాబాతో చాల ప్రాంతములలో పర్యటించెను. హరనాథుని అత్యద్భుత శక్తులను - మృదుమధుర బోధలను - అనుకాల్యప్రేమ వైభవమును జూచి మిత్ర - హరనాథునియందు మిక్కిలి ఆసక్తి గలవాడయ్యెను.

మిత్ర మిలటరీ డిపార్టుమెంటులో అకౌంటెంటుగా పని చేయుచుండెను. తరువాత బెంగుళూరులోని మిలటరీ లెక్కలను తనిఖీ చేయుటకు నియమింపబడెను. ఒక హొటలులో బస చేసెను. రెండురోజులు గడచినతరువాత కమాండెంటు - ఆయన మీద నేదో నేరమును మోపి అరెస్టుచేసి కోర్టువిచారణద్వారా - దానిని బుజువుపఱచుటకు సిద్ధపడెను. ఆ మధ్యాహ్నము ఒంటి గంటకు కోర్టు విచారణ జరుగును. తాను నిర్దోషియైనను - తన్ను సమర్థించు మిత్రులుగాని తెలిసినవారుగాని అచట లేరైరి. అన్యాయముగా పెద్దయధికారి యిట్లు చేయదలచినందులకు చాల చింతించుచు మిత్ర సోనాముఖిలోనున్న ఠాకూరునకు రిప్లయిపెయిడ్ టెలిగ్రామిచ్చెను. సా గం. 4 లకు హరనాథుడు తంతినిచ్చెను. అందు "నాయనా! నీవు గౌరవప్రదముగా విడుదల కాగలవు" అని యుండెను. ఆ వార్తనుచూచి మిత్ర చాల ఆనందించెను. సా గ 5 లకు॥ "మీరు నిర్దోషులు. మీపని మీరు చూచుకొనవచ్చున' ని కమాండెంటు చెప్పెను. అట్టి ఆపదనుండి రక్షించిన మహాత్ముడు బాబాయని లోలోపల మిత్ర ఎన్నెన్నో జోహారులు గావించెను.

ఒకసారి భాగవతచంద్రమిత్ర - అతని భార్యయిరువురు కుమారులు - ఒక కుమార్తె రోగగ్రస్తులైరి. వారికి బ్రతికెదమను ఆశలేకుండెను. మిత్ర కాశ్మీరులోనున్న హరనాథునకు తన స్థితినితెల్పుచు నొకటెలిగ్రామంపెను. దానికి బాబా "మిత్రా! బంకూరా జిల్లాలోని సోనాముఖివెళ్ళి మాగృహమున కొన్నాళ్ళుండుడు" అని సమాధానమిచ్చెను. వారు సోనాముఖి వెళ్ళిరి. మాతృశ్రీ ఒకగదిని ఖాళీచేసి వారికిచ్చెను. కుసుమదేవి మిత్ర - మూత్రమునుసైతము కుడిచేతితోనెత్తి - ఆతనిని ఆతని భార్యాపుత్రాదులను మిక్కిలి ప్రేమానురాగములతో నాదరించెను.

ఆహా! మాతృశ్రీ భక్తవాత్సల్యము అమోఘముగదా! హరనాథ ప్రభువు - మాతృశ్రీ తమయెడచూపిన ఆదరాభిమానములకు ముగ్ధుడై మిత్ర యావజ్జీవితము ప్రభుసేవలోనే గడపెను.

భక్తులెందఱో విమర్శించినను లెక్కచేయక మొదటిసారి తన గృహమునందే 1916లో ప్రభుని జన్మోత్సవమును జరిపిన భక్తాగ్రగణ్యు డీయనయే !!

1910 - 12 సం॥ రములలో ప్రభువు భక్తులకు వ్రాసిన పత్రావళిని బెంగాలీలో నాల్గుగ్రంథాలను ప్రచురించిన ధన్యజీవికూడనీయనయే !! అంతియేకాదు - ఈపత్రావళిలోని ఉపదేశరత్నాలను వివిధశీర్షికలతో "ఉపదేశామృతము" అను గ్రంథమును సమకూర్చిన మహనీయుడుకూడ నీయనయే !

'హరనాథ ఫ్రీయింగ్లీషుస్కూలు'ను స్థాపించి - దానిని కలకత్తా విశ్వవిద్యాలయమువారిచే రికగ్నైజు చేయించిన సేవా పరాయణుడు - మహాత్యాగి యీమహాశయుడే !! ఈ భక్తమణి మనకుతెలిపిన ఒకటిరెండులీలలు ఇచట తాము గమనించగలరు.

ఒకఉన్నతవంశమునకు చెందిన జమీందారు పిల్లలులేక చాలవిచారించుచుండెను. ఒకసందర్భమున ప్రభుని దర్శించి ఆదంపతులొక బిడ్డను ప్రసాదింపుమని మిక్కిలి భక్తిప్రేమలతో అర్థించిరి. వారి ఆవేదనను ఠాకూరు గ్రహించెను. ఆశీర్వదించెను. స్వల్పకాలములోనే వారు సంతానవంతులైరి.

ఒకసారి ఒకఆమె ఠాకూరు ఎదుట రోదనచేయుచుండెను. ఆమెను చూచి ప్రభువు "అమ్మా! రోజునిన్నుకొట్టుచున్న భర్తచనిపోయినకల్లు ప్రమాదమేమి?" అని యడిగెను. అయినను ఆతల్లి కుంటివాడగు తనభర్త ఆరోగ్యముగా నుండునట్లు దీవింపుడని కోరెను. "నీభర్తకేమి భయముండదు. కాని కుంటివాడుగా నుండక తప్పద"ని చెప్పెను. అట్లే ఆవనిత భర్త సుఖముగా నుండెను.

విజ్ఞాన శాస్త్రవేత్తల ఆలోచనలకు డాక్టర్ల ఊహలకు పండితుల తర్కవితర్కములకు శ్రీ హరనాథుడు అతీతుడు. ఆయన కేవలము ప్రేమపిలుపులకే లొంగిపోవును. ఎచట భగవన్నామము జరుగునో ఆచోట హాయిగా క్రీడించుచు వర్తించును. నామగానము ఆయనను పులకింప జేయును.

ఒకసారి ఠాకూరు బృందావనమునుండి హత్రసు జంక్షనునకు వచ్చెను. హఠాత్తుగా అక్కడినుండి రావల్పిండి చేరుకొనెను. ఏదో మఱచిపోయినవానివలె - ఏదో మధుర పదార్థమును సేవింపవలెనను నభిలాష ఆయన ప్రయాణపు వైఖరిలో కనిపించెను. నిజము చెప్పవలెనన్న లోకమునే మఱచెను. ఆయనవెంట నౌకరిద్దఱు వచ్చుచున్న సంగతి కూడ ఆయనకు తెలియదయ్యెను.

ప్రాణదానము

రావల్పిండిలో "కృష్ణసంకీర్తనోత్సవాలు" చాలవైభవముగా జరుగుచుండెను. భక్తులు హృదయపూర్వకముగా అర్చించుచుండిరి. సేవించుచుండిరి. ప్రేమభావనాపరంపరలతో హరినామమును చేయుచుండిరి. ఆనామగానము భూమ్యాకాశముల నడుమ అవ్యక్త మధురముగా వినిపించుచుండెను. మన నామప్రియుడు కాలికి గజ్జెలు కట్టుకొని లయానుగుణముగా భావమును అనుసరించి సుందరమగు నృత్యము గావించుచుండెను. పతిత దీనభక్తజనరక్షకుడు - ప్రేమావతారుడు ఆరీతిగా నృత్యము గావించుచుండుట అశేష భక్తజనులకు అపరిమితమైన ఆనందమును గలుగజేయుచుండెను. సాక్షాత్తు గోపాలుడేవచ్చి తాండవమాడుచున్నట్లనిపించెను. ప్రకృతి రమణి ఆయన నూపురధ్వనుల కులికి తానును లాస్యము చేయుచున్నదా? యనిపించెను. బృందావన వీథులవలె రావల్పిండి

అంతర్నేత్రములకు అగుపించెను. అదే సమయమున కొందఱు భక్తులువచ్చి 'బాబా ! ఆస్థమాతో బాధపడుచు నొక భక్తుడిక్కడ మరణించినాడ'ని చెప్పిరి. ఆదీనదయాళువువెంట వారు రాగా ఆ మృతదేహము దగ్గఱకువెళ్ళి దానిపైనున్న ఆచ్ఛాదనను తొలగింపుడనెను. వారట్లు చేసిరి. అపార కృపాకటాక్షములను ఆశవముపై ప్రసరింపజేయుచు "ఇతడెన్ని గంటల క్రిందట మరణించె"నని హరనాథ ప్రభువు ప్రశ్నించెను. ఆ మృతుని బంధువులు "ఇతడు నాల్గుగంటల క్రిందటనే మరణించినాడు. మనుష్యులు దొరకక పోవుటచే దహన సంస్కారాదులకై వేచియుంటిమ" ని చెప్పిరి.

ప్రభువు తనమృదుహస్తకమలముతో అతని ఫాలభాగమును స్పృశించెను. అతని దైన్యస్థితికి మిక్కిలి జాలిపడెను. ఏమగునోయని భక్తులెల్లరు తొట్రుపాటుతో నిశ్శబ్దముగా ఆవంక చూచుచుండిరి. ఇంతలో ఠాకూరు 'ఇతడు మరణింపడు. ఆస్థమా యితనిని ఈస్థితికి తెచ్చినది" అనుచుండగా నెమ్మది నెమ్మదిగా ఆ మృతుడు ఊపిరి పీల్చుకొనసాగెను. క్రమముగా కనులువిప్పెను. శరీరమంతయు చైతన్యవంతమాయెను. భక్తబంధువుల ఆనందము అవధులు దాటెను. "జైహరనాథ్ జైహరనాథ్" అను నాదములు దిక్కులపిక్కటిల్లెను. చచ్చినవాడు లేచి బాబా పాదపద్మములకు ప్రణమిల్లినాడు. అతనిని ఠాకూరు దీవించి - కాశ్మీరునకు తరలిపోయెను.

ప్రభువు శ్రీ పురము భక్తుల ఆహ్వానముపై వెళ్ళి వారిని ఆయారీతుల తృప్తిపఱచెను. ఆయన వచ్చుచున్నాడన్న సంగతి తెలిసినవారు - శరవేగముతో ఆయన దర్శనము నకు మృదుమధుర కృష్ణ భాషణములకై -తియ్యని చూపులతోకూడిన ఆశీర్వాదమునకై తండోపతండములుగా వచ్చుచుందురు. ఆయన ఒకచోటనే యున్నట్లు కనిపించుచున్నను-ఒకే సమయమున అనేకస్థలములలో-అనేకభక్తుల - ఆర్తులను సముద్ధరించుచున్నట్లు-వారికి స్వప్నములో-వాస్తవముగా దర్శనమిచ్చినట్లు వచ్చిన భక్తుల జీవితచరిత్రల వలన తెలియవచ్చుచుండెను.

మహాయతీంద్రులు - సిద్ధపురుషులు - హఠయోగులు - మఠాధిపతులు-ఆచార్యులు చాలమంది తమ ఆత్మోద్ధరణకు-ప్రజాకర్షణమునకే పాటుపడుచుండుట మనమెఱుగుదుము. కాని హరనాథప్రభువు తన విషయమును మఱచి-లోకమున అన్నివిధాల దిగజారిపోయిన దరిద్రులను-పతితులను-అభాగ్యులను-అనాథులను - నాస్తికులను-సంసారసాగర నిమగ్నులను-వారు కోరకుండగనే తానే వారిని ముందు తనవైపునకు త్రిప్పుకొని-తరువాత భగవద్భక్తి పథములో నడిపించుట చూడ ఈయన లోకబాంధవుడని - దయాసముద్రుడని తేటతెల్లము కాగలదు, పాఠకులారా! ఎట్టయెదుట గంగా ప్రవాహమునుంచుకొని దానియందు స్నానమాడి పవిత్రులు కాకపోవుట మన యపచారమే కదా !!

## అనుకూలచంద్ర బెనర్జీవివాహము

ఒకనెల సెలవుపెట్టి హరనాథుడు సోనాముఖి సకుటుంబ ముగా వచ్చెను. 1910 ఫిబ్రవరిలో కూచెధీలో సంతోష కుమారితో అనుకూలచంద్రుని వివాహము వైభవముగా జరిగెను. ఈ సందర్భములో ప్రభువొక చిత్రమైన లీలను ప్రదర్శించెను.

### అ ద్భు త లీ ల

రేపు కుమారుని వివాహమనగా సోనాముఖిలోనే యున్న బంధువు జమీందారైన నిత్యమాధవఘర్‌గారి యింటికివెళ్లి "మా అబ్బాయి వివాహమునకు రమ్మ" ని ఆహ్వానించెను. ఆజమీం దారు "బాబా ! చాలసంతోషము. నేను తప్పక వచ్చెడివాడనే. మోకాలివద్ద చిన్నచిన్న ఆపరేషన్లయినవి. అందుచే ఇంటిలో ప్రక్కమీద పరుండియే యుంటిని" అనెను. ఠాకూరు "బాబా ! మనము కలసి వెళ్ళవలసినదే !! నీకంత శ్రమగానున్నచో నిన్నుపల్లకీలో కూర్చుండబెట్టి కన్యాదాత యింటికి తీసికొని వెళ్ళెదను. దుస్తులను మార్చుకొనుము" ని ప్రేమోద్వేగముతో చెప్పెను. ఆయన హరనాథుడు గట్టిపట్టు పట్టియుండుట చేతను పల్లకియైనచో హాయిగా వెళ్ళవచ్చునని తలచి దుస్తులను మార్చు కొని సిద్ధముగానుండెను. ఠాకూరు మఱలవచ్చెను. జమీందారు "ఏది పల్లకి ?" అనిప్రశ్నించెను. "అయ్యా ! నేను పేద వాడను. పల్లకీ ఎట్లుతీసికొని రాగలనో చెప్పుడు. మీకుఎద్దు బండిని ఏర్పాటు చేయవచ్చును." అని ఠాకూరనగా – ఆ

భూస్వామి "ఎక్కడున్నది బండి?" అనెను. ఠాకూరు 'బండి బజారులో నున్నది. మనము అక్కడకు నడచివెళ్ళవలెను' అనెను. జమీందారు 'అమ్మబాబో! నేనొక్క అడుగైనను అవతల పెట్టలేను" అనిచెప్పెను. హరనాథుడు గంభీరముగా "అయ్యా ! మగపెళ్లివారందఱు కాలినడకను వెళ్ళదలచినారు. ఒక పేదవాడు మీకు బండిని ఏలాగున ఏర్పాటు చేయగలడో ఆలోచింపుడు. నేనుమీకు బండిని పిలిపించుట కష్టమే !! జమీందారులుగదా ! కాలినడకను వచ్చుట మర్యాదకు భంగమేమో" అని నవ్వుచుపలికెను. "బాబా ! బండిఅక్కఱలేదు. నేనును కాలినడకనే మీఅందఱితో వచ్చెదన" ని పెళ్ళివారితో ఆడుచుపాడుచు పెళ్ళికి వెళ్ళుటయేకాదు. అందఱివలె విందారగించి ఏప్రమాదము లేకుండ గృహమునకు తిరిగివచ్చెను.

మిత్రులారా ! చూచితిరా! మోకాలికి ఆపరేషన్లుచేయుటయేమి ? పెండ్లికి కాలినడకను వెళ్లుటయేమి ? అందఱితో సమానముగా తినుట — తిరుగుటయేమి ? అంతయు దయామయుడగు శ్రీహరనాథ ప్రభుని కృపావిలాసముగదా !

డా॥ నారాయణ గదాధరఫటక్

డాక్టరు నారాయణ గదాధరఫటక్ ఆలీఘర్ జిల్లాలో ఆరోగ్యశాఖాధికారిగానుండెను. ఆయన తఱచు ఉద్యోగరీత్యా ఊళ్ళు తిరుగుచుండుటచే ఒకసారి హత్రస్ జంక్షనులో అటలు బాబును చూచుట తటస్థించెను. ఆ సందర్భమున ఆయు

నకు అటలు మహాశయుడు హరనాథునిగూర్చి చెప్పి యుండెను. తాను ప్రచురించిన 'పాగల్ హరనాథ పత్రావళి'ని చదువుడని యిచ్చెను. ఆ డాక్టరుగారు ఆ గ్రంథమును చదివిన తరువాత ఠాకూరును జమ్మూ వెళ్ళి దర్శించవలెనని అభిలషించెను. ఆ సంగతి తెలిసి అటలుబాబు "హరనాథుడు ప్రస్తుతము అబ్బాయివివాహమునకు సోనాముఖి వచ్చినాడు. ఒకవేళ మా యింటికి వచ్చినచో తప్పక మీకు తెలియ జేసెదన''ని తెలియజేసెను. కుమారుని పెళ్ళి అయిన తరువాత జమ్మూ వెళ్ళుచు ప్రభువు తలవనితలంపుగా 1910 మార్చిలో హత్రసు జంక్షనులోదిగి నాందీ దంపతుల అతిథిగా నుండి వెంటనే వెళ్ళిపోయెను. నాందీ-ప్రభుని రాకను డాక్టరుగారికి తెలుపుట మఱచి పోయెను. తరువాత బాబాను చూడవలెననెడు ఆసక్తి అధికమగుటచే డాక్టరు నాందీని కలసి—తన్ను ఠాకూరునకు పరిచయము చేయుచు నొకలేఖ వ్రాసి యిమ్మని కోరెను. ఆటలు బాబు "ఆయన సర్వాంతర్యామి. నాలేఖ యక్కఱలేద" నెను. అయన కావలెననుటచే నాందీ లేఖను వ్రాసియిచ్చెను.

జమ్మూలో బాబావసతి గృహమున డాక్టరు బాబానుతొలి సారిగా దర్శించెను. ఆయననుచూచి ఠాకూరు "అటలుబాబు మిమ్ము తలచు తలచుచుందురుగదా!" అనెను.ఆ మాటలను-ఆ ప్రేమను తిలకించిన డాక్టరు ఆశ్చర్య చకితుడాయెను. సమాధానమేమియు చెప్పలేదు. నాందీ యిచ్చిన లేఖను బాబాకిచ్చెను.దానిని చదువకయే తనపెట్టెలో దానినుంచెను. చాల

సేపు వారిరువురికి సంభాషణ జరుగలేదు. ప్రభువు ఆయింటిలో ఒక్కడే నివసించుచు హోటలునుండి భోజనమును రప్పించు కొనుచుండెను. ఆ రోజున ఇద్దఱకు సరిపడు భోజనమును ప్రభువు తెప్పించియుండెను. వారిరువురును నిశ్శబ్దముగా ఒక చోట భుజించిరి. అపుడు బాబా "నాయనా! యీ యాహారము నీకిముడునో లేదో అనుకొనుచున్నాను" ఆ మాటలలోని అర్థ మును డాక్టరు వెంటనే గ్రహించెను. ఆయన చాలకాలమునుండి ఒక విధమైన అజీర్ణరోగముచే బాధపడుచుండెను. నిజమునకు ఆ పూట బాబాతో భుజించినపుడు ఆహారము వమనము కాలేదు. హితముగానే యుండెను. ఈ సంఘటన జరిగిన తరువాత ఆ డాక్టరునకు ఆయజీర్ణము తిరిగి జీవితముతో రానేలేదు.

భోజనమయిన తరువాత వారిద్దఱు కొంతసేపు విశ్రాంతి తీసికొనిరి. పిమ్మట ప్రభువు మాట్లాడదలచుచుండగా చుట్టు ప్రక్కలనున్న ఒకచెట్టునుండి ఒకశబ్దము వినిపించెను. ప్రభువు ఆనాదమును జాగ్రత్తగా వినుచుండెను. డాక్టరు వినుచుండగా ఒక పక్షి "కృష్ణభజో కృష్ణభజో" అనిఅఱచుచున్నట్లు గ్రహించెను. ప్రభుసన్నిధిలో పక్షికూడ కృష్ణనామము చేయుచున్నది గదా! అని డాక్టరు సంతోషించెను.

కొంతసేపటికి హరనాథుడు డాక్టరువైపు చూచుచు పర ధ్యానముగా నుండిపోయెను. కొంతసేపయిన తరువాత డాక్టరు "బాబా! తాము ఏదో ఆలోచనలోనున్నారు, నేనుదానిని తెలిసికో వచ్చునా?" అనెను. వెంటనే ప్రభువు "ఇపుడే కలకత్తావెళ్ళి

తిరిగివచ్చితిని" అనెను. ఆమాట ఆయనను ఆశ్చర్యసముద్ర మున ముంచెను. తనతోనింతవఱకీ గదిలోనున్న యీయన కలకత్తావెళ్ళుటయు, తిరిగివచ్చుటయూ? యను సందేహమా తనిని పీడింపజొచ్చెను. తత్క్షణమే ప్రభువు "బాబా! ఇక్కడ నుండి వెళ్ళునపుడు కలకత్తాలో, ఎంటల్లీవీథిలోనున్న రామ రాఖాల్ ఘోషు గృహమునకు వెళ్ళుము. నేనీరోజున అక్కడ నున్నదిలేనిది ఆయన నీకు చెప్పగలడ"ని సమాధానమిచ్చెను. డాక్టరు ఆ అడ్రసును జ్ఞప్తియందుంచుకొని బాబావద్దసెలవు తీసికొని తిరుగుప్రయాణములో కలకత్తావచ్చి ఆవ్యక్తిని ఆ వీథిలో కలసికొని "అయ్యా ఏప్రియలు 15వ తేదీని ఠాకూరు హరనాథుడు మీయింటికి వచ్చెనా?" అని ప్రశ్నించెను. ఘోషు బాబు" "ఈసంగతి మీకెట్లుతెలిసినది?" అని ప్రశ్నింపగా డాక్టరు "ఠాకూరే యీసంగతి చెప్పెన"నెను. అపుడు రామ రాఖాల్ఘోషు "ఇదియొక విచిత్రమైన సంఘటన. నేనుమా యింటిలో ఏకాహసంకీర్తనము జరుపదలచితిని. కాని యిరుగు పొరుగువారందఱు క్రైస్తవులు., మహమ్మదీయులు, వారు ఈ సంకీర్తనమును జరుపగూడదందురేమో?యనునాలోచన భయలు దేఱినది. నాకు ఏమీతోచక అకాశమువంక చూచుచుంటిని. బాబామొగము కనిపించినట్లగుటయేకాక ఆయన "నీఏర్పాట్లు నీవుకానిమ్ము. ఏవిధమైన ఆటంకములు ఏకాహమునకురావు" అని నన్ను ప్రోత్సహించుచు పలికెను. ఆనామయజ్ఞము ఏ విధమైన అభ్యంతరములు లేకుండ ప్రభుని కృపవలన జరిగి

సద'ని చెప్పగా డాక్టరు హరనాథుని సర్వాంతర్యామిత్వమును గ్రహించెను. ఆదయామయునకు లోలోపల ఎన్నో ప్రణామములు సమర్పించుకొనెను ఘోషబాబునుండి డాక్టరుసెలవుతీసికొని గృహమును చేరుకొనెను.

తనకుద్యోగమునిప్పించిన మహేశబాబు ఆరోగ్యము చెడెను. ఆయనకు ఠాకూరు ఈ రీతిగా "బాబా! ఒక సంవత్స రము కృష్ణనామమును చేసికొనుచు-ఆ యానందముతో మునిగి యుండుము. ఈ సెలవులలో ఒకసారి పూరీ ధామములోని శరచ్చంద్ర ప్రభలతో విరాజిల్లు జగన్నాథుని ముఖమండల మును తప్పక దర్శింపుము; నీకు శాంతి లభించును" అని సలహా యిచ్చెను.

పాఠక సోదరులారా! చూచితిరా!

ప్రభుని ఆశ్రిత పక్షపాతము. చాలమంది తమవారిని సంసారబంధములలోను - మాయలోను ముంచివేయుచుందురు. నిజమైనశ్రేయోఽభిలాషియగుట చేతనే మహేశబాబునకు జీవిత తరణోపాయమును హరనాథుడు సూచించినాడు.

ఎట్టిరోగములైనను - ఎంతటి కష్టములైనను – ఎట్టి ప్రమాదములైనను సాగలు హరనాథుని కృపగల్గినచో దూరమై పోవునను వార్త దేశదేశముల వ్యాపించెను. హరనాథుడు సకల జన జనమందారుడు-అభయప్రదాతయని-వివిధమతస్థులు కొని యాడ జొచ్చిరి.

ఆర్తజనసంరక్షణము

కటక్ మహానగరమున జ్యోతిష్‌బాబు అను జమీందా రుండెను. ఆయనకు అన్ని సౌఖ్యములు-సంపదలున్నవి. కాని ఆయన భార్య ఏదోరోగముతో చిరకాలమునుండి బాధ పడుచుండెను. ఆయన పెద్దపెద్ద డాక్టర్లచే చికిత్స చేయించెను. ఎవ్వరును "రోగమిది"యని నిర్ణయింపలేకపోయిరి. ఒకసారి చాల ప్రమాదస్థితిలో ఆయమ్మయుండెను. డాక్టర్లు చాల శ్రద్ధగా చూచుచుండిరి. ఆమె బ్రతుకునను ఆశ కానరాదయ్యెను. ఇంతలో పాగల్ హరనాథుడు అను సాధువు వచ్చెననియు చౌదరి బజార్-కటక్‌లోని గోపాలమందిరమున సంకీర్తనలో పాల్గొనుచున్నాడనియు - ఆయన నిరాడంబరము సిగరెట్లు కాల్చుచు-రోగులను పతితులను భక్తులను అనుగ్రహించుననని తెలిసి జ్యోతిష్‌బాబు మిత్రుడగు టహల్‌బాబుతో కలసి గోపాల మందిరమునకు వచ్చెను-కొన్నివేలమంది ప్రజలక్కడ గుమి గూడి యుండిరి. ఠాకూరు సంకీర్తనలోనుండెను. ఆసమయ మున జ్యోతిష్‌బాబు మనస్సు ఏమాత్రము స్థిరముగా లేకుండెను. భార్యకెట్లుండునా? అను నావేదన ఆయనను వేధించుచుండెను. దూరముగా నుండి బాబాకు నమస్కరించి ఇంటికి మిత్రునతో తిరిగివచ్చెను. భార్యరోగము చాల తీవ్రస్థితిలోనుండెను అయి నను జ్యోతిష్‌బాబు-టహల్‌బాబు ఇద్దరు చాందినీ చౌక్‌లో నున్న ప్రొఫెసరు గోపాలచంద్ర గంగూలీ గారింటికివచ్చిరి. వీరు వెళ్లుసరికి హరనాథుడు కుర్చీలో కూర్చుండి సిగరెట్టు నవి

లాసముగా కాల్చుచుండెను. మిత్రులిద్దరు ఆయనను చూచుచు నిలువబడి యుండిరి. ఇంతలో ప్రొఫెసరుగారితల్లి వచ్చి జ్యోతిష్‌బాబునుజూచి "మీరందరు నిలువబడి చూచుటకన్న పొగలు హరనాథుని పాదములకు ప్రణమిల్లుడు "అని హెచ్చరించెను. సవినయముగా జ్యోతిష్‌బాబు "అమ్మా! వీరెవరో మాకు తెలియదుగదా" అనెను. తటాలున ప్రభువు "అయ్యా! నేను డాక్టరునుగాను మంత్రవేత్తను కాను. పేదవారిని కనికరించువారిని కృష్ణుడు తప్పక కరుణించునని నేను చెప్పగలను. అన్ని సంగతులు చక్కగానే జరుగును'' అనెను. ఇంతలో ప్రొఫెసరు ప్రభువును భోజనమునకు రమ్మని పిలిచెను. ఆయన చేతులు కడుగుకొనుచు-తన గడ్డమును నీటితో తడుపుకొనుచు జ్యోతిష్‌బాబును. చూచి "నాయనా! ఇపుడేమి మందు తీసికొనుచున్నారు? కృష్ణప్రభువు మిమ్ములను కరుణించును గాక" అనెను.

ఠాకూరునకు భోజనము వడ్డించిరి. కాని ఆయనయొక్కడును ఎప్పుడును భుజింపడు. తనకై ఎదురుచూచువారికి పదార్థములను చిత్రవిచిత్రముగా విసరుచు పంచుచుండును. మిత్రులిద్దరు ఆయనప్రక్కనే కూర్చుండిరి. భోజనమైనది. వెంటనే జగదీశచంద్ర రాజుతో వెళ్ళుటకు బాబా సిద్ధముగానుండెను. ఆసమయమున జ్యోతిషబాబు "మాయిల్లు రైల్వేస్టేషనునకు దగ్గఱగా నున్నది. ఒకసారి మాగృహపావనము చేయుడనియు — రోగగ్రస్తురాలైన తనభార్యను చూడుడ'ని కోరెను. ఠాకూరు

అంగీకరించి కారులో కూర్చుండెను. కొన్నిక్షణములలో జ్యోతిష్‌బాబు ఇంటికి కారుచేరగానే హరనాథుడొక్క గంతుతో దిగి ఎవరిసాయము కోరకయే అతనిభార్య పరుండిన గదిలోనికి వెళ్ళెను. ఎవరైనను ఠాకూరును అడ్డగింతురేమో ! యను భయముతో జ్యోతిషబాబు చాలభయపడుచు వెళ్ళి సుస్తీపడిన భార్యను చేతులతోఎత్తి ఠాకూరుపాదములపై వ్రాల్చెను. ప్రభువు కొంతసేపు నిశ్శబ్దముగా నుండి "లక్ష్మీస్వరూపిణి వైన అమ్మా ! లే. కృష్ణునికృపచే నీరోగము నిమ్మళించును. అన్న వస్త్రములు లేక బాధపడు పేదవారిని కనికరింపుడు. మీయింటి నుండి అట్టివారు ఎవ్వుడును వట్టిచేతులతో పోవకుందు రనియే నేనుకోరెదను" అని గంభీరముగా భాషించి వెంటనే కటక్ స్టేషనునకు వచ్చెను. ఆయనను జ్యోతిషబాబు అనుసరించెను.

ప్రభువు కటక్ స్టేషను ప్లాటుఫారముమీద తిరుగు చుండెను. భక్తులు - మిత్రులు అతని చుట్టును గుమిగూడు చుండిరి. ఆస్టేషను మాష్టరు యూరోపియను. ఆయన భార్య అక్కడనే యున్నది. ఠాకూరును చూడగనే ఆమె భర్తతో హరనాథుని చూపించుచు "రాత్రి మనయేసుప్రభువు నాకు కనిపించెనని మీకు చెప్పితినిగదా, ఆయనయే ఈయన" అని పలికెను. ఆమాటలను విన్న ఠాకూరు 'అమ్మా ! నీవు క్షేమముగా నున్నావుగదా ! మఱల మిమ్ములను చూడదలచు చున్నాను. పేదలను కనికరింపుడని - కృష్ణుని మఱవకు డనియే మిమ్ము కోరుచున్నాను' అని పలికి ట్రయినునెక్కి పెట్టెలో

కూర్చుండెను. జ్యోతిష్‌బాబు ప్రభు పాదములకు సాష్టాంగ నమస్కారము చేసెను. అపుడు బాబా "సందేహింపకుము. తిన్నగా ఇంటికివెళ్ళునరికి మాయమ్మ భోజనమునకు సిద్ధముగా నుండును. డాక్టర్లందరు తబ్బిబ్బు కాగలరు. కటకపుర ప్రజ లందరును అమ్మను దర్శించుటకు రాగలరు. మీదివ్యభవనమున కృష్ణుడు ఇటుపైన చక్కగా ఆడుకోగలడు' అని చెప్పుచుండగా రైలు కదలెను. బాబాకు అందరు నమస్కరించిరి. జ్యోతిష్ బాబు ఇంటికిచేరి చూడగా ఆమె అన్నము తినుటకు సిద్ధముగా నుండెను. జ్యోతిష్‌బాబునకు ఆ దృశ్యము అత్యాశ్చర్యముగా నుండెను. తన కన్నులను తానే నమ్మలేకపోయెను. భార్యను చూచి ఆయన 'ఈస్థితి నీకెట్లు వచ్చినది' అని యడిగెను. అపుడాయమ్మ "ఇన్నాళ్ళనుండి తిండిలేని నాకు భగవంతుడే స్వయముగా అన్నమును తినిపించినాడ" నెను. ఆయన "అదె ట్లని" ప్రశ్నింపగా ఆ తల్లి 'ఆయన స్వర్గమునుండి దిగి వచ్చెను' 'అమ్మా! ఏలాగున నున్నావు. నీరోగము పోయినద'ని హెచ్చరించెను. ఆయన ఎవరోకాదు భగవంతుడే' అనుకొన్నాను. ఆకలి ఎక్కువగా నుండుటచే వంటవానిని పిల్చి అన్నము వడ్డింపుమంటిని. వంటవాడు అన్నము పెట్టు టకు భయపడెను. నేను గట్టిగా గద్దించుటచే అన్నము వండి పెట్టుచున్నాడు .... ఇంతలో మీరువచ్చినార" ని బదులు చెప్పెను. ఆయన యెట్లున్నాడో చెప్పుమని భర్త కోరగా ఆమె "ఆయన ఎవరోకాదు పాగలు హారనాథుడే"యనెను.

ఆదంపతులు ప్రభుని ఆర్తజనరక్షణమునకు భక్తి శ్రద్ధలతో అంజలి ఘటించిరి.

ఒకరథోత్సవమునకు ఠాకూరు భక్తబృందముతో పూరీ ధామమువచ్చి ఒకవిశ్రాంతి భవనమున విడిసెను. కుసుమకుమారీ దేవి-తమాలినీదేవి-సదానంధబాబా - ఠాకూరుతోవచ్చిరి. రథోత్స వము ప్రారంభమయ్యెను. జగన్నాథుడు రథముపై ఊరేగుచు వచ్చుచుండెను. దేవాలయమునకు దగ్గఅగానున్న భవనముపై అంతస్తుపైనున్న తమాలినీతో బాబా "అమ్మా! అదిగో చంద్రుని వలె ప్రకాశించు స్వామి సుందరముఖము !! తనివిదీర దర్శిం పుమ" ని చెప్పెను. తమాలినీదేవి - కుసుమదేవి ఇరువురు రథమువైపునకే చూచుచుండిరి. ప్రజలు తండోపతండములుగా రథముచుట్టు నడచుచుండిరి. ఇంతలో చిత్రముగా ఠాకూరున్న భవనమునకు దగ్గఅగావచ్చి రథమాగిపోయెను. ఎందఱువచ్చి త్రోసినను = ఒక్క అంగుళమైనను ముందునకు కదలదయ్యెను. ఇదంతయు తమాలినీకిమిక్కిలి వింతగాతోచెను. బాబాసలహాపై సదానందబాబాతో మఱి కొంత మందితో తమాలిని - రథమును గట్టిగా చేతులతో త్రోసెను. దానితో రథము ముందునకు సాగెను. కాని తమాలిని రోడ్డుమీద పడిపోయెను. ఆమెమీద ప్రజలు పడిరి. ఆమె తెలివితప్పి పడెను. ఇంతలో ప్రభువు వచ్చి ఆమె ముఖముపై నీళ్ళుచల్లెను. దానితోఆమెకు స్పృహ వచ్చెను. అంతకుపూర్వము తనకుగల్గిన శ్రమ ఠాకూరు కర స్పర్శ తగులగానే మాయమైపోయెను. చాలసేపు స్పృహదప్పి

యున్న సమయమున ఠాకూరు దగ్గఱగావచ్చి "మంత్రమును తీసికొందువా ?" అనిఅడిగెను. "ఇప్పుడు మంత్రమా !" అని ఆమె జవాబుచెప్పెను. ఈ సంఘటన జరిగిన కొన్నినెలల తరువాత ప్రభువు ఆమెస్వప్నమున కనిపించి మంత్రోపదేశ మును చేసెను. ఆనాటినుండి ఆమంత్రమును ఆమె జపింప జొచ్చెను. స్వప్నమున ప్రభువు మంత్రమిచ్చిన రోజు తర్వాత మఱి నాల్గురోజులకు వారియింటికి సదానంద బ్రహ్మచారి వచ్చి ఆమెవలదన్నను మంత్రమిచ్చెను. ప్రభువిచ్చిన మంత్రము - ఆసాధువు ఇచ్చిన మంత్రమొకటే !! ఆహా !! ప్రభుని సంక ల్పము నిర్విఘ్నముగా కొనసాగునుగదా ! యని భక్తమణియగు తమాలినీదేవి భావించినది. ప్రభుని కృపావృష్టికి పులకించినది.

## చందనగరమునకు ఠాకూరు ఆగమనము

ప్రభువు సోనాముఖి యందుండగా తమాలినీదేవి ప్రభువును చందననగరమునకు రావలసినదనియు అచట కృష్ణసంకీర్తన గోష్ఠులలో పాల్గొనవలసినదని కోరుచు జాబు వ్రాసెను. ఆ యాహ్వానమును అంగీకరించుచు - తాను వచ్చుచున్నట్లు ఎవరి నైనను చందననగరు స్టేషనులో నాకై వేచియుండుటకై పంపు మని జాబువ్రాసెను. ఆభక్తురాలు ఆలేఖను ఎన్నోసారులు చదువుకొని ప్రాణదాత - భక్తరక్షకుడైన ప్రభుని పరమపవిత్ర చరణసరోజాలను దర్శించుకొనగల భాగ్యములభించుచున్నందు లకు ఆశుభక్షణము లెపుడువచ్చునా! యని ఎదురు చూచు చుం

డెను. చందననగరనివాసి ప్రభుని మేనమామయగు రమా ప్రసాదఘోష ఆనందమునకు మేరయే లేకుండెను.

చందననగరములో 'సంకీర్తనగోష్ఠులు' జరుగు మందిరము పచ్చనిమామిడాకుతోరణాలతో అలంకరించిరి. బాటలన్నియు పరిశుభ్రపఱచిరి. ఆనగరపౌరులు ఠాకూరు హరనాథుని తిలకించి పులకించవలెనని ఉవ్విళ్ళూరుచుండిరి. వీథులలో అక్కడక్కడ అరటిస్తంభములను అందముగా కట్టిరి. బాటలపై గంగాజలమును - మంచిగంధపునీటిని చల్లిరి. చందననగరము గోపాలునిరాకకై నిరీక్షించుచున్న మధురానగరమువలెతోచెను. ఠాకూరువచ్చు ట్రయిను చందననగరు స్టేషనులో ఎంతోసేపు ఆగదనియు 'బందేల్' స్టేషనులో ఎక్కువసేపు ఆగుటవలన ప్రభుని గుర్తించుటకు వీలుండునని తారాప్రసాద్ బందేలుస్టేషనునకు వెళ్ళెను. తారాప్రసాద్ చిత్రపటములలోను - స్వప్నములలో తప్ప ప్రత్యక్షముగా ప్రభువును చూచియుండలేదు. ప్లాటుఫారము మీద తారాప్రసాద్ నిలువబడి చూచుచుండెను. పాగల్ హరనాథుడు తిన్నగావచ్చి తారాప్రసాదునుజూచి "దాదామహాశయా" అని గాఢముగా కౌగిలించుకొని - ''మీరింతశ్రమపడి ఇక్కడకు రావలెనా? మీయిల్లు నాకు తెలియదా?" అని మృదుమధురముగా భాషించెను. ప్రభువు తారాప్రసాద్ గృహమున అడుగుపెట్టెను. మందమలయపవనములు మంచి అవకాశము దొరకెగదాయనిభావించి కాబోలు పారిజాత సుగంధముతో ప్రభుచరణ పద్మములనొత్తి

తనివిదీర నభిషేకించి మురిసిపోయియినవి. రమాప్రసాద్ తరువాత - పాదములకు ప్రణమిల్లినాడు. వెంటనే బాబా "మామయ్యా! నేను జ్ఞాపకమున్నానా?" అని చిఱునవ్వుతో పలుకరించెను.

బాల్యమునుండి అనేక ప్రమాదములనుండి ఉద్ధరించి - నిరంతరము అకారణదయారసము తనపై వర్షించు ప్రభునితో రమాప్రసాద్ చాలసేపు మాట్లాడెను. తమాలినీదేవి - ప్రతిక్షణము ప్రభు సేవయందే నిమగ్నురాలై యుండెను.

కృష్ణ సంకీర్తనమును భక్తులు మిక్కిలి శ్రావ్యముగా చేసిరి. ఆనామానంద డోలికలలో ప్రభువు ఓలలాడుచు - ఆనందాశ్రువులను రాల్చుచు - భక్తులను కౌగిలించుకొనుచు - కఠిన పాషాణములవంటి హృదయములయందును ప్రేమ నదీ ప్రవాహములను సృష్టించెను. అనురాగ తరంగిణులలో ఈదులాడుచు సుందరమగు నృత్యగానములు చేసెను. పొగలుని రాజ్యములో అందఱును పొగలు భాయీలయిపోయిరి. తాకూరు ఒక్కొక్కప్పుడు సంకీర్తనమును ఆపి భావావేశముతో కృష్ణ కథా కథనము చేయును. ఒక్కొక్కప్పుడు ముందు జాగ్రత్తకై సాధన ధర్మములను కొన్నిటిని ఈ రీతిగా బోధింప దొడగెను.

'జీవితములో చేసిన మంచిపని అంతయు ఒక్కమాట వలన పాడయిపోవును. ఎవ్వరును అటువంటి వాక్పారుష్యమునకు పాల్పడకుందురుగాక ! బయట, లోపల, మనస్సులోను -

మాటలోను చేతలలోను ఒక్కవిధముగానే యుండవలెను. ఇతరులను మోసపుచ్చుటకై భగవన్నామమును వేషముగా ధరించకూడదు. వినయమును ప్రదర్శించుచు జీవహింస చేయరాదు. హృదయములోకాని, ఊహలలోకాని ప్రాణులకు హింస కలుగజేయవలెనను కోరిక కూడదు. శ్రీకృష్ణుని పొందుటయే జీవిత పరమావిధిగా పెట్టుకోవలెను''

''నామస్మరణ మఱవకు. భోజనము చేయుచున్నను విశ్రమించుచున్నను శ్రీకృష్ణుని మధురనామమును నీహృదయ రత్నముగా చేసికొనుము. అతడు కరుణానిధి. నీవతనిని ఏమియు నడుగనవసరములేదు. నీమనస్సు తెలిసికొని కావలసిన సుఖము శాంతిని నీకు దయచేయగలడు. నిరంతరము అనేక విధములైన క్రొత్తసుఖములను అనుభవించగలవు."

"కురూపి - రోగి - అయిన పిల్లను పెళ్ళిచేసికొని ఎవ్వరును ఇంట్లో పెట్టుకొనని విధముగానే దుర్మార్గుడు - స్వార్థపరుడు - వక్రబుద్ధిగలవాడు - కృతఘ్నుడు అగు మనిషిని కృష్ణుడు తనకుటుంబములోనికి చేర్చుకొనడు. స్ఫటికమువలె నిర్మలముగాను, ధ్రువునివలె విశ్వాసముగానుండుము. అప్పుడు శ్రీకృష్ణుడు నిన్ను తన హితునిగా ఆత్మీయునిగా, ప్రేమించును. మనస్సులు పవిత్రముగాను, నిష్కపటముగా నుండునుగాక! మీామనవలెనే ఇతరులుగూడ భావించుచుందురని మనము గుర్తింతుముగాక ! శ్రీకృష్ణుడు మన మనస్సులకున్న ఆవరణమును తొలగించి వానిని సరళమార్గమునకు తీసికొనిపోవునుగాక !"

"ఎంతతెలివైన విద్యార్థియైనను పరీక్షాకాలములో కంగారు పడకతప్పదు. అట్లే ఎంతగొప్ప వారైనను భూమి (పరీక్షాస్థానము) మీద పుట్టినపుడు అప్పుడప్పుడు సంచలింపక భయపడక తప్పదు. తెలివైన విద్యార్థివలె ఈపరీక్షలో బాగుగా కృతార్థుడవు కావలెనని - మంచికీర్తిని సంపాదించవలెనని శ్రీకృష్ణుడు ఆశించుచుండును."

"హరిభక్తులకు సాధ్యముకానిదేదియు లేదని నేను ఆంతటవినుచున్నాను. అందుచేతనే చెప్పుచున్నాను. మనస్సుతో మాటలతో కర్మలతో వారిని సేవించి, వారిఆశ్రయము కోరుటయే కాక సేవనుకూడ అభిలషింపుము. చిన్నవారు - గొప్పవారు అనుసందేహము పెట్టుకోవలదు. భక్తులు - భక్తులుకారను అనుమానము నీకుకూడదు. ఆవిధముగా చేసిన కొలదికాలములోనే నీకు శాంతి చేకూరును. కష్టసాధ్యుడగు శ్రీకృష్ణుని పొందుటవలన నీదుజీవితము ధన్యమైనదని భావించగలవు. అతనిభక్తుల అనుగ్రహమునకు నీవు పాత్రుడవై యున్నంత కాలము శ్రీకృష్ణుడు - మాటవినకపోయినను అంతభయము లేదు. ఎందువలననగా అతనికి కోపమువచ్చినచో భక్తులు నిన్ను రక్షించగలరు. కాని భక్తులకుకోపము వచ్చినపుడు అతడు కూడ - ఏమిచేయలేడు. అతనికి చాలశక్తులున్నవన్న మాటనిజమే కాని, తనభక్తుల విషయములో వానిని అతడు ఉపయోగించడు."

చందననగరములోని ఉత్సవములు ప్రభు సన్నిధిచే నూత్నశోభతో చెలువొందెను. ప్రజలు నామదర్శనానందము లలో తేలియాడిరి. ఇట్లు 2, 3 రోజులు గతించిన తరువాత ఠాకూరు కలకత్తాకు బయలుదేఱెను. ట్రయిను వచ్చుటకు సిద్ధముగా నుండెను. రమాప్రసాద్ "బాబా! నీవెప్పుడు తిరిగివచ్చెదవు" అని ప్రశ్నించెను. ఠాకూరు "కృష్ణుని దయయున్న తిరిగి రాగలను" అని చెప్పెను. రమాప్రసాద్ "ఈమాటల కేమి గాని-నీవెప్పుడు వచ్చెదవు? మఱల ఎపుడు కమ్మగా ప్రసంగించెదవో చెప్పుమ"ని లాలనగా అడిగెను. హరనాథుడు గంభీరముగా "నేను నీకు దగ్గఱగానే యున్నాను. నీవెప్పుడు పిలిచిన-అప్పుడే నన్ను చూడగలవు" అని చెప్పి ట్రయిను లోనికి వెళ్లి కూర్చుండెను. రమాప్రసాద్ వక్షస్థ్సలమంతయు కన్నీటి ధారలతో తడిసిపోవుచుండెను. కనుదమ్ములు ప్రేమోద్విగ్నములై యుండెను. అతనిని చూచి ప్రభువు కూడ చంటి పిల్లవానివలె ఏడ్వదొడగెను. రమాప్రసాద్ చేతులనుగట్టిగా పట్టుకొని "తిరిగి వచ్చెదను. కృష్ణ నామమును చేయుము. ఇక ఏడ్వకుము. ఇంటికి వెళ్ళుము. నామమును మఱవకుమ"ని హెచ్చరించుచుండగా రైలు కదలెను. మిగిలిన భక్తులు-తండ్రిని విడిచిన బిడ్డలవలె బెంగటిల్లి దిక్కులు చూచుచు "ప్రభువుతో గడపిన క్షణములెంత అమూల్యమైనవి. చంద్రుడులేని రాత్రి వలె మన బ్రతుకులు నిజముగా మాయాంధకార బంధురములు. మఱల నిట్టి యదృష్టము దొరకునా?" అని పరిపరి విధముల

భావించుకొనుచు అడుగులు తడబడుచుండగా నడువలేక నడువ సాగిరి.

రమా ప్రసాద్ పెన్నిధిని గోల్పోయిన పేదవలె చీకటి తెరలలో గృహోన్ముఖుడాయెను.

చదువరులారా!

చూచితిరా! ప్రభుని లీలావైభవము!! ఎంత వ్రాయ దలచినను అంతులేకున్నది. ఆయన తత్త్వము అట్టిది. ఆయన ఆశ్రయమంత గొప్పది. ఆ మధురనామములో అంత శక్తి-మాధుర్యమున్నవి. ఆ ప్రభువే మన జీవితేశ్వరుడు.

నీకై యర్పించెదు వి
ద్యాకమనీయార్ధ జీవితంబులు ధన్యం
బై కలిమి వహించుఁగదా!
నీ కృప మాపైఁగురియుము నిర్మలమూర్తీ!

## గద్యము

ఇది శ్రీమత్కుసుమహర వరప్రసాదిత మధురకవితా విభూషిత భాషావిజ్ఞాత, వినయవిఖ్యాత, విశ్వబ్రాహ్మణాన్వయసంజాత, ఆదిత్య బ్రహ్మర్షి గోత్రపరిపూత, ప్రణవసూత్రవినీత, శ్రీనారాయణాంబా సత్యనారాయణాచార్య ప్రథమసుత, చిన్మయబ్రహ్మకవి ప్రణీతంబైన శ్రీహరనాథ భాగవతమందలి అష్టమస్కంధము.

జయ శ్రీ కుసుమహర

# శ్రీ హరనాథ భాగవతము

## నవమ స్కంధము

శ్రీ దీనజనావన! ది
వ్యాదర్శవిభూషణ! హృదయనికేతన! ప్రే
మోదిత భావన! ఠాకూర్
నాథా! సన్నుత హరిహరనాథా! నాథా!

అష్టాదశపురాణములలో - భాగవతాది గ్రంథములలో భగవంతుడు భక్తులవిషయమై ప్రదర్శించిన అద్భుతశక్తులు - లీలలు చాల పరిమితముగా కనిపించును. కలియుగము పాప భూయిష్ఠమని తెలిసి దీనిని నామయుగముగాచేసి - అందఱిని భగవంతుని వైపునకు త్రిప్పవలెనను ఆకాంక్షతో శ్రీహర నాథ ప్రభువు అనేక ప్రదేశములలో చూపిన అద్భుతశక్తులు_ లీలలు -వర్ణనాతీతములుగా నున్నవి.. అసంఖ్యాకములుగా నున్నవి. వానినన్నిటిని ఒకచోచెప్పుట కష్టసాధ్యమైన విష యము. ఒకటిమాత్రము యథార్థము. పాఠకసోదరులింతవఱకు ప్రభునిగూర్చి చాల విషయములు తెలిసికొనియున్నారు. ఏ స్కంధమున - ఏమూలను పరికించినను ఆయన ప్రేమామృత వృష్టి - దీనజనరక్షణము - ఆశ్రితపరిపాలనము - సామాజిక

శ్రేయోవిధాయక కార్యములే కనిపించును. హరనాథతత్త్వము-సర్వతత్త్వసారమని మీరు మున్ముందు గుర్తింపగలరు.

రమాప్రసాద్ ఘోషనిన ప్రభువునకు చాలఇష్టము. ఒకసారి ఠాకూరు చందననగరములో ఒకవారము రోజులున్నపుడు రమాప్రసాద్ - ఇంటిదగ్గఱగానున్న సరస్సులోని చేపలను బట్టుచుండెను. హరనాథుడు కాళ్ళుచేతులు కడుగుకొని ఒక ఏకాంతప్రదేశమువ కూర్చుండి ప్రకృతిని తిలకించుచుండెను. కొంతసేపయిన తరువాత బాబా రమాప్రసాదును చూచి "నేనును చేపలనుపట్టెదన"ని గాలపుకఱ్ఱచేత పుచ్చుకొని చేపలనుపట్టుటకై ప్రయత్నించెను. ఒక్కచేపకూడ పడలేదు. ఎట్టకేలకు రమాప్రసాద్ "బాబా! ఒక్కచేపనుగూడ పట్టలేకపోయితివిగదా" అనిపరిహాసముగా పల్కెను. ఇంతలో ఒడ్డునచచ్చిపడియున్న చేపను నీటిలోనికివేసి ఠాకూరు "మామా! చూడు చచ్చియెండిపడియున్న చేప - ఏలాగుననున్నదో" అని చమత్కారముగా ననెను. రమాప్రసాద్ దగ్గఱకువచ్చి చూచెను. అంతవఱకు చచ్చిపడియున్న చేప జలములో హాయిగా ఈదులాడు చుండుట చూచి ఆశ్చర్యపోయెను. మఱియొకరోజున వీరిరువురును తోటలో మాటలాడుచు కూర్చుండిరి. రమాప్రసాద్ కఱ్ఱను మామిడిపండున్నదని చెట్టుకొమ్మలపైకి విసరుచుండెను. అతని చిలిపిచేష్టలనుచూచి ప్రభువు "మామా! మామిడిపండ్లురాని కాలమునమామిడిపండ్లుదొఱకునా" అనెను. రమాప్రసాద్ "బాబా నేను! ఏదోకొమ్మను పండును జూచితిని. నీవునమ్మిననమ్ముము.

లేకపోయిన నేనేమి చేయుదును?'' అనెను. అపుడు ఠాకూరు అతనిచేతిలోని కఱ్ఱను తీసికొని అటునిటు పైకిచూచి ''ఇదిగో! ఒకేపండు ఈదగ్గఱ కొమ్మమీదనే కనిపించెను. నీకన్నులకు కనిపించనేలేదు. చూడుము"నెను. రమాప్రసాద్ చూడగా 'పండు' నిజముగానే యుండెను. ఇంతలో ప్రభువు దానిని నేలపై పడునట్లు కొట్టెను. పండునేలమీద పడగావే-రమప్రసాద్ దానిని పట్టుకొనిపోయి శుభ్రముగా కడిగి ముక్కలు కోసి పళ్ళెములో నుంచిప్రభునిరాకకై ఎదురుచూచుచుండెను. ఇంతలో ప్రభువక్కడికివచ్చి ఒకముక్క నోటిలోవేసికొని-"ఏమితీపి ఎంతరుచి అందఱికి పెట్టుము" అని చెప్పెను. ఇంతలో ఠాకూరు తాతగారక్కడకు వచ్చిరి. ఠాకూరు "కాలముకాని కాలములో మామిడిచెట్టు నాకొక పండునిచ్చినది" అని మురిసిపోవుచు పలికెను. అప్పుడు తాతగారు ''ఎంతవిచిత్రమెంతచిత్రము.!! బాబా! అకాలములో మామిడిపండును తినిపించిన ఘనతనీకే దక్కినది. దీనిజన్మ చరితార్థమైనద"ని వ్యంగ్యముగా పొగలు హరనాథుని ఘటనాఘటన ప్రావీణ్యమును మెచ్చుకొనెను.

భూతానంద ముఖర్జీ

భూతానందముఖర్జీ — ఉపేంద్రనాథముఖర్జీ సోదరుడు. ఈతడు హరనాథుని అంతరంగిక భక్తులలో ముఖ్యుడు. కొన్నాళ్ల 'అగర్‌పడ' సాధనాశ్రమమునకు - కార్యదర్శిగా నుండెడివాడు. తనసోదరునితో కలసి యీభక్తుడు 1911 లో

ప్రభుదర్శనమునకై సోనాముఖి వచ్చెను. భూతానందుడు ప్రభువునకు దగ్గఱగానేయుండి నిర్విరామముగా సేవ చేయుచుండెడివాడు. తనజీవిత శేషమంతయు ప్రభుని జన్మస్థలముననే గడపెను.

అనంతకుండము ప్రక్కనేయున్న తోటలోని మొక్కలను - చెట్లను కాపాడుచు - వచ్చినభక్తులను ప్రేమానురాగములతో వారిమూటలను సామానులను తలపైనిడుకొని- ప్రభుమందిరమునకు చేర్చెడివాడు. వచ్చెడుభక్తులకు సర్వసదుపాయములను సమకూర్చెడివాడు. ఇంటిలో ప్రక్కలువేయుట మొదలుకొని ఏపనిచెప్పినను సంతోషముగా చేసెడివాడు. తమయిండ్లకు పోవునపుడు - వారిసామానులను పెట్టెలను ప్రీతిపూర్వకముగా స్టేషనునకు తీసికొనివెళ్లి వారు-బండియెక్కువఱకు వారినిఅంటిపెట్టుకొని యుండెడివాడు. అతని పలుకు పలుకున ప్రభుభక్తి చిప్పిలుచుండెను. ప్రభుని కృపావైభవమును కొన్నిపాటలలో కమ్మనిగొంతుతో పాడెడివాడు. ఎట్టివారైనను ఆతనిఆదరమునకు - మాటలకు - పాటలకు - భక్తిప్రతిపత్తికి వశీభూతులగుచుండిరి. అతనిని విడిచివెళ్ళుటకు భక్తులు చాల పరితపించెడివారు. వారితోపాటు ఈభక్తుడును ఏడ్చెడివాడు. ఆహా! యేమి ఆతని భక్తితాత్పర్యములు!! ఏమిసేవావైశిష్ట్యము!! అతనిని "వీరహనుమాన్" అని గౌరవప్రేమలతో అందఱు పిలిచెడివారు. నిరంతరము ప్రభుపంచాక్షరిని జపించెడివాడు. ఎవ్వరేమి చెప్పినను దానిని ప్రభుసేవగా భావించి - మిక్కిలి శ్రద్ధాభక్తు

లతో చేసెడివాడు. సోనాముఖిలో ప్రభువున్నంత కాలము ఈయన ఠాకూరు సేవా కార్యక్రమములలో నిమగ్నుడై యుండెడివాడు. నిజమైన ప్రభు కృపాతరంగాలలో ఈదులాడెడివాడు. పంచ ప్రాణములతో తాను సేవించిన ప్రభుని నిర్యాణము తెలిసి - భరించలేక కత్తితో గొంతుకను కోసికొనెను. కాని చనిపోలేదు.

అహా భూతానందుని భక్తివైభవమెంత గణనీయమైనది !! భూతానందునకు ప్రభువిచ్చిన హితోపదేశములు :-

"నీవు నిరంతరము కృష్ణనామమునుచేయుము. అన్ని సౌఖ్యములుకల్గును."

"కృష్ణుడు నీ వాడై యుండగా ఈ ప్రపంచమునుగూర్చి యేమాత్రము భయపడకుము."

"కృష్ణుడనిన ప్రేమాదరములు లేనివారి స్నేహమును మానుము. నిజము చెప్పవలెనన్న వారే నీకు శత్రువులు."

"ఈ ప్రపంచమొక కారాగారమే!! కొందఱకిది విశ్రాంతి గృహము. నీ భావననుబట్టి యిది కనిపించుచుండును. దీనినుండి విముక్తుడవు కావలెనన్న కృష్ణప్రేమయే శరణ్యము."

"నామస్మరణ వలన 'నీవు-కృష్ణుడు' అను నిద్దఱును ఒక్కటయ్యెదరు గాక."

"దొరికిన దానితోనే తృప్తి పడుము"

## తమాలినీదేవి మృత్యువు నుండి రక్షింపబడుట

తమాలినీదేవి సుమారు 3మాసములు మెదడునకు సంబంధించిన రోగముతో మంచము పట్టెను. నానాటికి ఆమె నీరసించి పోవుచుండెను. డాక్టర్లు చేయు చికిత్స నిరుపయోగమనిపించెను. కాని ప్రభువు లీలారూపమున ప్రతిదినము ఏదో సమయమున వచ్చి తన చేతులతో ఆమె తలను రుద్ది వెళ్ళెడివాడు. ఇతరులకీ సంగతి తెలియదు. 1912 ఫిబ్రవరి ఆఖరు వారములో నొకనాడు హఠాత్తుగా హరనాథప్రభువు ఒక కుర్చీలో ఆమెకు దగ్గఅగా కూర్చుండి "అమ్మా! ఈ వేళ కాదు. నేను ఊరకనే ఇక్కడ కూర్చుంటిని. ఈవేళ బుధవారము. ఎల్లుండి శుక్రవారము. ఆరోజున నీవు వెళ్లిపోక తప్పదు.'' అనెను. ఆ మాటలు విని ఆయమ్మ "ఈ సమయములోనా?" అని జాలిగా అనెను. అప్పుడు "తల్లీ! నేనేమి చేయగలను! నిత్యానందుని సంకల్పము నిత్యానందునికే తెలియును. అతని యిచ్ఛ నెఱవేరితీరున"ని చెప్పెను. ఆమాటలను అక్కడనున్నవారు చాలమంది వినిరి.

ఆనాడు ఠాకూరు ప్రయాగలోనుండి తమాలినీదేవి తండ్రియగు తారాప్రసాదునకు (మిడ్నపూరు) "తండ్రీ! వేగిరముగా బయలుదేఱుము. అమ్మ యింక బ్రతుకద"ని టెలిగ్రామిచ్చెను. దానితో కుమార్తెను చూచుటకు ఆయన మిడ్నపూరువచ్చెను. ఆమెకు చాల చికిత్సలు జరిగెను. లాభము లేకపోయెను. శుక్రవారము వచ్చెను. ఆమె మరణించినట్లు భావించిరి.

మేడమీాదను కొంతమంది భక్తులు భజనచేయుచుండిరి. ఆమె శరీరముపై వలువను కప్పిరి. తెల్లవారినది. శ్మశానమునకు తీసికొనిపోవుటకు వచ్చినపుడు ఆమె తండ్రి శరీరముపైనున్న వలువను దీసి చూడగా శ్వాస కొట్టుకొనుచుండెను. కొంతసేపటికి తెలివివచ్చి కన్నులు విప్పిచూచెను. ఆమె పునర్జన్మ ఎత్తినందులకు భర్త—బంధువులు ఆనందించిరి. యమభటులు ఆమెను తీసికొని పోవుచుండగా ప్రభువు వారిని అదలించి తన్ను రక్షించినట్లు తరువాత ప్రభుని అద్భుత లీలను ఆభక్తురాలు వివరించెను.

ఆమఱునాడే ప్రభువుదగ్గఱనుండి యొక లేఖవచ్చెను. అందు 'తాతయ్యా! నిత్యానందుని కృపవలన అమ్మ బ్రతికినది. ఆమెను మానవు లెవ్వరును రక్షింపలేరు. ఆయన కృపకు సాధ్యము అసాధ్యమనునదిలేదు' అని వ్రాయబడి యుండెను.

రక్షించినది తానైనను అంతయు నిత్యానందుని కృపయనుట మన ప్రభుని మాయామానుష నాటకమని పాఠకులు గ్రహింతురుగాక ! ముందు తమాలినీదేవి తండ్రికి "అమ్మ యిక బ్రతుకదు" ని టెలిగ్రామిచ్చి మఱల "బ్రతికినది" అని తెలియజేయుటలో ఆమెను యమకింకరులు తీసికొనిపోక తప్పదు. మృత్యు ముఖమునన్నదని చెప్పుట - టెలిగ్రాములోని భావము. అంతటి మహోపద్రవపరిస్థితులలో నున్నవారినైనను నేను తప్పక కాపాడి తీరెదనను అభయమిచ్చుట రెండవ లేఖలోని అభిప్రాయము.

ఠాకూరు హరనాథుని లేఖను చదివి అందఱును అవందించుచు ఆయనను 'ప్రాణరక్షకుడు - ఆపదుద్ధారకుడ'ని కీర్తించిరి. మఱల కొన్నాళ్ళకు తమాలినీదేవి సుస్తీపడెను. స్థలము మార్చిన మంచిదని ఆమెను చందననగరమునకు తరలించిరి. జమ్మూలోనున్న ఠాకూరు ఆ తల్లికొక కవితా రూపకమైన లేఖ వ్రాసెను. అందిట్లుండెను.

'ఎంట నానందము గల్గునో !
యెంటదాఁచుము నన్ను హృదయాధీశ్వర ! యె
చ్చట నైనన్మఱవకుమా !
స్ఫుటముగ నాకీవె సకలమో భువనేశా !'

'ఒకనాఁడీవె నగలతోఁ
బ్రకటగతి నలంకరింప భాసిల్లితి, స్వా
మి ! కలకలలాడు చిఱున
వ్వైకానరాదిపుడవియిఁక వేడ్కఁగొలుపునా?'

'నేనై మిఁన్నాలయినను
మానినికీవ మురిపెంబు మదిఁగూర్పవలెన్
మానితమగు మనప్రణయ
శ్రీ నీదయలేక యింత సిద్ధించునొకో?'

"బాగోగులు నీవిచ్చిన
వేగద ! నాదనునది కనిపించదు, నేని
శ్లైగడపెద నొంటరిగా
యోగము పండినపుడు సుఖమొదవక యున్నే ?'

'పతిచూపించెడు ప్రేమో
న్నతిఁబట్టి వధువు గరువమున సుఖించునుగదా !
సతతము నీసేవాంచిత
మతినై మనుటయె ప్రమోదమై యొప్పఁజుమీ !!'

' ఓ ప్రభూ ! నిన్నెఁట మఱవకుందుఁగాక !
నీవ జీవితలక్ష్యమై నెగడుఁ జుమ్మి !
నిన్నుఁ గలియఁగఁదలఁచుచు నీపదంతి
యిల్లె పిచ్చితనముఁ దపించుచుండు'

ఈకవితలో ప్రభువు 'రాధాభావము' ను వెల్లడిచేసినాడు. తమాలినీ దేవికి ఇట్లువ్రాయుటలో ఆమె ఆరాధనకు - సాధకుల సాధనకు విశిష్టభావకల్పన చేయుటయేప్రభుని ఆశయమైయుండ వచ్చును. కవులచే పలికించి - వినోదించు విశ్వకవిరాజు ఆయనయేకదా !!

డాక్టరు. యు. సి. కంభోజ్లా అనుభవము

ఈయన వైద్యకళాశాలా విద్యార్థిగా నున్నప్పటినుండి చిన్నతనమునుండి మతవిషయములయందు ఆసక్తిచూపెడి వాడు. విద్యార్థిజీవితములో క్రమముగా నాస్తికుడాయెను. ఈయన తన పినతండ్రిదగ్గఱ నర్మదాశంకర్ గుజరాతులోనికి అనువదించిన 'పాగలు హరనాథ పత్రావళి'ని జూచి దానిని చదివెను. అందు ప్రభువు ప్రదర్శించిన అద్భుతలీలలను — ఆయనకు భక్తులయెడగల అనురాగ చిహ్నములైన లేఖలను పరిశీలించి

నపుడు ఏదో చెప్పతరముగాని అనుభూతి ఆయనకు కల్గెను. వెంటనే ఆ పుస్తకములోని బాబాఫొటోను కత్తిరించి దానినిఒక అట్టకు అంటించి - దానిపై దీపకాంతులను ప్రసరింప జేయుచు కృష్ణనామము చేయుచుండెను. ఆ నామస్మరణ - పరీక్ష నెగ్గుటకై చేయుచుండెను.

ఠాకూరు హరనాథుడొక విచిత్రమైన వేదాంతికావచ్చును ఇతని సహాయమున భవిష్యజ్జీవితమును నడుపుకోవచ్చునను దృష్టితో ఆయన అడ్రసును తెలిసికొనదలచెను. కాని ఆపుస్తకములో "తన అడ్రసును గుప్తముగా నుంచవలెననియు - తెలుపుట వలన ప్రజలు గుంపులు గుంపులుగావచ్చి తనశాంతిని భంగపుచ్చెదర"ని ఠాకూరే తెలిపియుండెను.

కొంతకాలము గడచిన పిదప బాబాను కలసితీరవలెనను కాంక్ష అతనిలో హెచ్చెను. ఈ విషయము తనమిత్రుడగు 'వ్యాసన'కు తెలియ జేయగా - ఆయనయు ప్రభువును చూడవలెనని అభిలషించెను. ఒకఆదివారము ఆయనను కలసికొనవలెనను తపనతో బయలుదేరిరి. హాస్పటలుదాటి నాలుగడుగులు వేయుసరికి - హాస్పటలు సేవకుడొక జాబును తెచ్చి కంభోజ్జాకిచ్చెను. ఆలేఖను ఠాకూరు హరనాథుడు సంస్కృతమున వ్రాసియుండెను. అందు "తన్ను కలియుటకై ప్రయత్నించవలదనియు- చక్కగా వెళ్ళను కొనసాగింపు''మని సలహా యిచ్చినట్లుండెను. ఆయుత్తరమును చదివి కంభోజ్జా

చాల ఆశ్చర్యపరవశుడయ్యెను. ఆయన అద్భుత లీలలను ప్రదర్శించుననని పుస్తకములో వ్రాసిన విషయము యథార్థమని నమ్మెను. అంతియేకాక తాను ఠాకూరును ఇంతకు పూర్వము చూడలేదు. ఠాకూరునకు నాఅడ్రెసెట్లు తెలిసినది? ఇదిగొప్ప అద్భుతలీలయని భావించెను. ఇంతకు ఆయన వ్రాసిన లేఖలను చదువుట ఒక్కటియే యీ లీలకు కారణమై యుండునని యూహించెను. తరువాత ఆ మిత్రులిద్దఱిండ్లకు చేరిరి. వ్యాస్ ఇంటికివచ్చి చూచుసరికి ఒకలేఖ హరనాథునినుండి వచ్చి యుండెను. వ్యాస్ తండ్రిపేరు - వీథిపేరు - అడ్రసు ఆ లేఖ కుండుటయేకాక - విషయము - సంస్కృతమునందుండెను. ఈ సంగతిని కంభోజ్లాకు చెప్పగా ఇరువురు ప్రభుని అసాధారణ మహిమకు అచ్చెరువందిరి. ఠాకూరును ఏలాగునసైనను కలసి కొనవలెనని మిత్రులు గట్టిగా అన్వేషింపసాగిరి, కాలచక్రము పరిభ్రమించుచునే యుండెను. కాని ఠాకూరు అడ్రసు తెలియ లేదు.

కంభోజ్లాకు వివాహమయ్యెను. ఆయన ఠాకూరు ఫొటోనిచ్చి దీనిని పూజామందిరమునసుంచి భార్యను పూజింపు మని చెప్పెను. ఆమె యట్లు చేయుచు ఇంటియందే యుండెను. కంభోజ్లా వైద్యకళాశాలలో చదువుచుండెను. కంభోజ్లా ఉన్న యూరిలో కలరా వ్యాపించెను. అతని భార్యకుకూడ కలరా సోకి నది. చాలతీవ్రమగు సుస్తీలో నుండుటచే తల్లిదండ్రులు కబురం పిరి. కంభోజ్లా యింటికివచ్చి భార్యస్థితిని చూచి "భయపడకుము.

పాగలు హరనాథనామమును స్మరించుచుండు. ఆయన నీదగ్గఱకు రాగలడ" ని చెప్పెను. తరువాత వాంతులు తగ్గి నిద్రపట్టెను. తెల్లవారిన తరువాత దగ్గఱకు వెళ్ళగా ఆమె "కలలో పాగలు హరనాథుడు నాప్రక్కదగ్గఱకు వచ్చి ఏదో భస్మమును నానోటిలో వేసెను. ఇపుడు నాకేజబ్బులేద''ని సంతోషముతో చెప్పెను. కంభోజ్లా ఆనందము అంబరమంటెను. ఆహా! హరనాథుని కృపారసమెంత అద్భుతమైనది, ఎంత అనంతమైనది. ముక్కు మొగము తెలియని వారిపైకూడ ఆయనకుగల దయాదాక్షిణ్యములు అపూర్యములని భావించెను. ఆ దంపతులు ఆ నాటినుండి ప్రభువును మిక్కిలి భక్తి విశ్వాసములతో ఆరాధింపసాగిరి. తరువాతకూడ ఠాకూరు ఆతని భార్యను అనేక ప్రమాద పరిస్థితుల నుండి కాపాడెను.

'పాగలుహరనాథపత్రావళి" (4వ భాగము) గ్రంథము - దేశమునాల్గుమూలలలోనివారు చదువనారంభించిరి. తెలిసిన వారిని - తెలియనివారిని ఆలేఖలు మిక్కిలి ఆకర్షించుచుండెను. ఆలేఖలు-ప్రభువునకు భక్తులపైగల అపారప్రేమకు నిదర్శనములు. అవి లౌకికముగా ఆధ్యాత్మికముగా భక్తులకు ఆశాజ్యోతులుగా నుండును. వానిలో నొకటి రెండు లేఖల లోని యుపదేశములను మీరు చదివియందలి పరమార్థమును ఊహించుకొనగలరు.

"నోటితో తియ్యని కృష్ణనామమును స్మరించుచు - హృదయమున ఆమధురమూర్తిని ధ్యానించుచుండుటచే మీరు పవిత్రులగుటయేకాక లోకముకూడ పవిత్రమగును."

"ఎవరైనను - నిన్ను 'నీవెవ్వరవు' అనిప్రశ్నించి నపుడు వెంటనే "నేను శాశ్వతుడయిన కృష్ణునిదాసుడ"నని బదులుచెప్పుము.

"ధనేషణ - దారేషణ - పుత్రేషణ — అనుతాపత్రయ ములు మిమ్ముబాధించుటలేదా!" యని యెవ్వరైనను ప్రశ్నించి నచో "నేనుకృష్ణదాసుడ నగుటచే వానిమాటయే మఱచిపోయితి" నని పశ్చాత్తాపముతో - హృదయపూర్వకముగా సమాధాన మిమ్ము"

"భగవంతుని శక్తియే స్త్రీ. ఆమె నిన్ను సంసారబంధ ములనుండి విడుదల కానీయదు. కాపున నీవు పురుషోత్తముని ఆశ్రయించి బంధవిముక్తుడవు కావలసియున్నది."

"హృదయపూర్వకమగు భక్తితో కృష్ణునిభజింపుము"

"కృష్ణభక్తి సంపూర్ణముగా నీకు అబ్బినంతవఱకు అందఱిని గౌరవించవలసినదే.'"

"నామ సంకీర్తన వలన కల్గు బ్రహ్మానందము - యోగ జ్ఞానమార్గములలో లభించనేరదు."

"నీహృదయమును ఎల్లపుడు సంతోషముగా నుంచు కొనుము.''

"జీవితములో ఒక్కనికి ప్రభునామమునందు ఆసక్తి నీవుకలుగజేయ గల్గితివేని నిత్యానందుడు - నిన్ను ఉన్నత స్థితికి తెచ్చి మంచిశాంతిని కలుగజేయును.''

"నీవు కాఱుచీకటిలోనే నామమును చేయుచుండుము. క్రమముగా విశాలప్రపంచపు వెలుగులో హాయిగా జీవితము గడుపగలవు."

"నామస్మరణ - ఉపవాసములు - మ్రొక్కుబడులు నియమనిష్ఠలు మొదలైన సిద్ధాంతాలకు చెందినదికాదు. నిజము చెప్పవలెనన్న అది వేదములకు కూడ అతీతమైనది. ఏయితర నిబంధనములు దానిమహిమను. తగ్గించలేవు."

"భారతదేశమున అంతట హరినామమును చేయుటకు నేనుశక్తిహీనుడను. అసమర్థుడనని తెలిసికొనుము. నీవు మాత్రము ప్రపంచము నాల్గువైపుల దానిని ప్రచారముచేయుము. గొప్ప యానందమును పొందగలవు."

"సాధుపురుషులను కలసికొన్నంత మాత్రమున కర్మ బంధములు తొలగిపోవు, కృష్ణునికి విధేయుడవై - అతని ఆజ్ఞను పరిపాలించుచున్నచో అన్నిబంధములు తెగిపోవును"

"నీవు నామమును జేయుచుండుము. అదియేది వ్యమంత్రము. అతని ప్రేమపూర్వకమగు పిలుపు నీకెదురగును."

"ఏకాంతమునకు పోయి హరినిగూర్చి ఏడ్వుము. అట్లు చేయుటవలన నీ హృదయభారము తగ్గును"

"భగవన్నామశ్రవణము - స్మరణములను నీటిని నిత్యముపోయుచున్నచో భక్తిలత క్రమముగా పెరిగిపెద్దదై - ఆనందమను ఫలపుష్పముల నీయగలదు."

"జీవితములోని వ్యక్తులందఱు పాత్రధారులుగా భావించి-భోగవిలాసము లన్నియు మాయగా భావింపుము. ఆనాడు నీవొక రాజువలె స్థిరముగా ఒకచోటినుండి యీ నాటకములోని తమాషాను చూడగలవు. ఈ సూత్రమును ఎవరు ఆచరణలో పెట్టెదరో వారే ధన్యులు."

"వేదాంతి-పాపాత్ముడు ఇద్దఱును సర్వశక్తిమంతుడగు ప్రభునిదృష్టిలో ఒక్కలాగుననే యుందురు. వారి యిరువురి పాత్రలు ప్రపంచనాటకమునకు అవసరము."

"మీరందఱును నా జీవితప్రతినిధులు. మీరు ఆ రీతిగా ఉన్నతస్థితిలో పవిత్రులై యుండవలెననియే కోరుకొందును."

"పేదవాడనయిన నాకు గౌరవము-అగౌరవము రెండు ఒకటే!! నీవు నన్ను బిచ్చగానివలె భావించినచో నేనట్లే నీ యెదుటికివచ్చి నిలిచెదను. నన్ను ఠాకూరుగా కాని, కుక్కగా కాని చూచినను సంతోషమే!! ఏదెట్లైనను నన్ను మధ్య మార్గమున విడిచి పోకుడు."

మిత్రులారా! ఈ మధురసూక్తులను మాటిమాటికి మననము చేసికొనుచుండినచో ఠాకూరు కృప తప్పక కల్గును.

ఒక రథోత్సవ సందర్భమున పూరీధామమున-ఆశ్రమ నిర్మాణము ప్రారంభమాయెను. మాయికూడ త్రవ్వబడినది. మంచినీరు పడినది. అదిమంచి ఆరోగ్యప్రదముగా నుండెను.

ఆ సమయమున భక్తుల సమూహమును మధ్య కూర్చుండిన ప్రభువు-

"జలమయమైన సముద్రతీరమున నుయ్యిత్రవ్వుట అవసరమైనది. సముద్రములోని నీరు పెద్ద జంతువులకు, నూతిలోని నీరు మనవంటి చిన్న జంతువులకు పనికివచ్చును. ఇక్కడ విశేషమేమనగా సముద్రోదకము మనకు దాహమును తీర్చదు; ఆరోగ్యమునీయదు. మన తినూలోని నీరు రెంటిని తీర్చగలదు. అందుచేతనే మనము సముద్రతీరముననే నుయ్యిని త్రవ్వవలసి వచ్చినది.

ఈ వాక్యములో చాల నిగూఢార్థము ఇమిడి యున్నది.

సముద్రమును సంసారముతోను నూతిని భగవత్సాధనతోను ప్రభువు పోల్చినాడు. సంసారజీవితమున మనమెంత సంపాదించినను-ఎంతహాయిగా భోగములను అనుభవించుచున్నను అందు శాంతియనునది సున్న. మీదుమిక్కిలి దాని లన మృత్యువునకు దగ్గఱివారమగుదుము. భార్యాపుత్రాది గాపమైన సంసారమును నమ్ముకొన్న వారికి నిరాశయే మిగు ును. పెద్దజంతువులకు సముద్రజలము పనికివచ్చుననగా-కొందఱు జన్మతః పాపపంకిలముతో - అహంభావముతో జీవించువారికి అదియే శరణ్యము. దానివలన వారు జనన మరణచక్రములో బడి నలిగిపోవుచుందురు. చిన్నదయ్యును నూయి-దానినీరు దాహమును దీర్చుటకు-ఆరోగ్యమును గూర్చు

టకు ఉపయోగపడును. అట్లే మనము చేయుసాధన చిన్నదే యైనను-దానిని సంసార (సముద్రతీర)మునందే యుండి చేయ వలెను (త్రవ్వవలెను) సంసారములోని వస్తువులు (వ్యక్తులు)- ఎంతో అందముగా-అమూల్యముగా పెద్దసముద్రమువలె కని పించును. కాని దానివలన మనకు ప్రయోజనమే మాత్రము లేదు. నిరంతరము హృదయ పూర్వకముగా మనకుగల స్థితిలో చేయుచున్న ఆధ్యాత్మికసాధన—భగవదార్తి అను దాహమును- శాంతియను ఆరోగ్యమును కల్గించునని భావము.

హరనాథుని సూక్తులు సామాన్యులకు సామాన్యముగా తోచును. ఆధ్యాత్మికాసక్తి గలవారికి గంభీరముగా-మనోహర ముగా ఉపదేశాత్మకముగా స్ఫురించును. పైని ప్రభువు చెప్పిన వాక్యములోని పరమార్థమును గ్రహించుచు భక్తులు ఆలోచనలో మునిగిపోయిరి.

ఇటీవల ప్రభువు సిమ్లావెళ్ళి అచ్చటి భక్తులకు అనేక రీతుల ఆనందమును చేకూర్చెను. వారందరును పూరీలో ఆశ్రమమున్నట్లే బృందావనమున నొక యాశ్రమము నిర్మించ వలెనని తలచిరి. ఇంపీరియల్ సెక్రటేరియటులోని సభ్యుల రు1700లు విరాళముగానీయ సంకల్పించిరి. వారే బృందావ:. మున రు 1300 లు ఖరీదుచేయు భవనమును కొని ఆశ్రమ ముగా చేయదలచిరి. అటలు బాబు రిటైరయి బృందావనముననే యుండుటచే-ఆ ప్రాంతము దొంగభయముతో కూడినదని

నిర్ణయించి మధురకు వెళ్ళు త్రోవలో 'బాంకేబిహారీ' దేవాలయ మునకు దగ్గఱగా రు 2300 లకు ఒక భవనమునుకొని అద్వాన్ను కూడనిచ్చెను. ఈయభిప్రాయమునకు సిమ్లాభక్తులు అంగీకరించలేదు. కాని వారు వసూలుచేసిన రు 1700 ధనమునిచ్చిరి. దానికి "హరనాథ కుసుమకుంజ"-ఆశ్రమమని ప్రభువు నామకరణము చేసెను. ప్రభువు ఆయాశ్రమమధ్య మున కూర్చుండి చక్కని ప్రసంగములు గావించెడువాడు. బహుప్రాంతాలకు చెందిన భక్తులు వచ్చి అందు నివసించెడి వారు. కొన్నాళ్ళు బృందావనమున నుండి ప్రభువు కుసుమ కుమారీ దేవితో తే 22-11-1912 దీని అంబాలాచేరెను. అక్కడ రెండురోజులుండి మాతృశ్రీని అచటనే యుంచి తాను ఆఫీసు పనిమీద జమ్మూచేరెను. అక్కడినుండి ఠాకూరు-సోనా ముఖిలోని సుచంద్ కర్మాకరునకు ఒక లేఖలో "చాలరోజుల తరువాత నిత్యానందుడు అడవి పక్షినైన నాకు-అడవిలో విశ్రాంతిని కలుగజేసెన"ని తెలుపుటయేకాక-తనకు వచ్చిన పత్త్రాలను డాక్టరుబాబును జాగ్రత్తగా నుంచుమని చెప్పుమని తెలియజేసెను.

పెద్దసెలవుమీద జమ్మూవిడుచుచుండుటచే ప్రభువు-సుచంద్రునకట్లు జాబు వ్రాసెను. భక్తులను కలసికొనుటయే ఆయనకు పరమానందము. ఉద్యోగ జీవితము వెగటుగానుండె నని దీనివలన మనము గ్రహింపవచ్చును.

## కామేశ్వరీబాయిని ప్రభువు రక్షించుట

కటకములో నరసింహారావు నాయుడు గొప్ప ధనవంతు లలో నొకడు. వారి ఏకైక పుత్రికయే కామేశ్వరీబాయి. ఈమె భర్తయే సత్యనారాయణరావు. ఆమె పుట్టింటనున్నపుడు 1912 డిసెంబరు లో చాలసుస్తీచేసెను. గొప్పగొప్పడాక్టర్లు చికిత్సచేసిరి గాని ప్రయోజనము లేకపోయెను. కటకములో సివిలుసర్జనుగా నున్న దేవేంద్రనాథ ముఖర్జీగారిని పిలిచిరి. ఆయన హరానాథ భక్తులు. వారెన్నో విధములగు చికిత్స చేసిరి. రోగమేమాత్రము నయముకాలేదు. కామేశ్వరీబాయితల్లి డాక్టరుగారితో "అయ్యా! తామెందఱినో మందిచ్చి బ్రతికించి నారు. నాకుమార్తెను బ్రతికించలేరా ? " అనెను. ఎంతో దీన ముగా మాట్లాడిన ఆమెకు డాక్టరు "అమ్మా! మీ అమ్మాయి కెన్నివిధాల చికిత్స చేయవలెనో అన్నివిధాల చేసితిని. ప్రాణ దానముచేయు శక్తినాకులేదు. మీరంతగా కోరినచో ఒకఉపాయ మున్నది" ఆమాటలనువిని ఆమె "ఆయుపాయమేదో చెప్పుడు. ఎంతటి త్యాగమునకైనను మేముసిద్ధమే" అనెను. డాక్టరు "పాగలు హరనాథుడను మహాత్ముడున్నాడు. ఆయనను నేనెఱుగుదును. ఆయన కరుణించిన పక్షమున మీ అమ్మాయి తప్పక బ్రతుకగలద" ని చెప్పెను. వెంటనే రప్పింపుడ"ని ఆయమ్మపలికెను. డాక్టరు "అమ్మా! ఆయన ఒకచోటనుండడు. మొదట సోనాముఖికి టెలిగ్రామిచ్చుట మంచిది. తరువాత వారిని రప్పించవచ్చున"ని జవాబిచ్చెను. వారికోరిక ననుసరించి

డాక్టరు "బాబా! నాయుడుగారి కుమార్తె మరణావస్థలో నున్నది. ఆమెను తమ చరణములవద్ద నుంచుచున్నాము. ఎటులైనను రక్షింపుము" ని ప్రార్థించుచు బాబాకు టెలిగ్రామిచ్చెను. సోనా ముఖిలోనున్న ప్రభువునకది అందెను. మఱునాడు "భయము లేదు. శ్రీకృష్ణుని దయవలన నాయుడుగారికుమార్తె క్షేమముగా నుండగలద" ని సమాధానమును ప్రభువుపంపెను. కాని ఆ టెలిగ్రాము రెండురోజులైనను అందదయ్యెను. డాక్టరు నిరాశ పడెను. ఇంతలో సత్యనారాయణరావు డాక్టరుగారిదగ్గఱకు వచ్చి వెంటనే కామేశ్వరీబాయిని చూచుటకు రావలెను. ఆమెకు కలలో బట్టతల - గడ్డమున్న బెంగాలీబాబు కనిపించి తీర్థమిచ్చి నీకిక ఆరోగ్యము కల్గునని చెప్పెనట. ఆమెకిపుడు తెలివివచ్చిన దని' చెప్పెను.

ఆపుడు డాక్టరు పరమానందమును పొంది కలలోకని పించినది పాగలుహరనాథుడే" అని పలికి వారిగృహమునకు వెళ్ళెను. కామేశ్వరీబాయినిచూచి "శ్రీహరనాథుని కృపవలన కామెకు జబ్బుపోయినది. కాని నీరసముగానున్నది" అనెను. తర్వాత కొన్ని హరనాథలీలలు వారికిచెప్పి తనవద్దనున్న బాబా పటమును ఆమెకు చూపించెను. దానిని చూడగానే ఆమె "డాక్టర్జీ! రాత్రినాకలలో కనిపించి ఆరోగ్యము గల్గునని చెప్పిన వారీయనయే" అనెను. అమ్మాయి బ్రతికినందులకు సంతో షించి నాయుడుగా రేలాగునలైనను హరనాథుని తనయింటికి తీసికొనిరావలెనని డాక్టరును కోరెను. అయన అట్లేఅనెను.

వెంటనే రు 150 లు ప్రభువునకు M. O. చేయబడెను. ఠాకూరు కొన్నిరోజుల తర్వాతవచ్చి ఎవరి సహాయములేకయే కామేశ్వరీబాయి యున్నగదిలో ప్రవేశించెను. వెంటనే కామేశ్వరీబాయి "బాబా! నీవేకదా! నన్ను రక్షించితివ"నెను. బాబా 'ఇపుడు నీకు నిమ్మళముగానున్నదా" అనెను. ఆమె తెలుగులోను ప్రభువు బెంగాలో మాట్లాడుచుండిరి. అయినను ఒకరి భావము మఱియొకరికి తెలియుచుండుట అచ్చటివారికి ఆశ్చర్యమునుగూర్చెను. ఇంతలోఆమె "ఆకలిగానున్నద"నెను. ఆమె తల్లి"ఇంతఉదయమునవేఏమి యులేద"నెను. ప్రభువురాత్రిచేసిన 4 రొట్టెలను ఆమెచే తినిపించెను. పాఠక మిత్రులారా! చూచితిరా! ఘడియ - క్షణములో మరణించుటకు సిద్ధముగానున్న ఆమె 4రొట్టెలను తినుట - ఆరోగ్యముగానుండుట శ్రీహరనాథుని అద్భుతలీలయేకదా !! కామేశ్వరీబాయి తండ్రిగారికి హరనాథుడు నరసింహమూర్తిగా దర్శనమిచ్చెను. కామేశ్వరీబాయి - ప్రభువుచెప్పినట్లు - ఐశ్వర్యము నశించిపోయిన దైన్యస్థితిలో కూడ అచంచల భక్తివిశ్వాసములతో ప్రభుని సేవించి తరించినది.

పాఠకమిత్రులారా ! చూచితిరా ! ప్రభుని కృపా విశేషము !! వేనకువేలమందిని అయన మృత్యువునుండి కాపాడినాడు. నిత్యదారిద్ర్యముచే -ఏదిక్కులేక బాధపడువారికి సుఖజీవితమును ప్రసాదించినాడు - తన్నునమ్మినవారిని ఉన్నతోన్నత మార్గములలో నడిపించుచున్నాడు. క్రొత్తక్రొత్త

యూహలకు రూపకల్పన చేయుచున్నాడు. ఆహా! దీనదయాళూ! నీత్యాగనిరతికి - నీయాశ్రిత వాత్సల్యమునకు వదివేల వందనములు.

దేవాసు బరోడా మహారాజులుసైతము నీదివ్యత్వమును గుర్తించి సమయోచితముగా రాజలాంఛనములతో నిన్నుసత్కరించి చరితార్థులైనారు. బ్రహ్మాదులచే పూజింపబడు నీకు ఈ సత్కారములొక లెక్కయా?

ఒకనికి రామునిగా, మఱి
యొకనికిఁ గృష్ణునిగ, నొకనికుజ్వలశివున
ట్లొకనికిఁ గ్రీస్తుగ, నల్లా
ప్రకటగతింగనఁబడితివి ప్రభుహరనాథా!

## గద్యము

ఇది శ్రీమత్కుసుమహరవరప్రసాదిత మధురకవితా విభూషిత, భాషా విజ్ఞాత, వినయవిఖ్యాత, విశ్వబ్రాహ్మణాన్వయ సంజాత, ఆదిత్య బ్రహ్మర్షి గోత్రపరిపూత, ప్రణవసూత్రవినీత, శ్రీనారాయణాంబా సత్యనారాయణాచార్య ప్రథమసుత చిన్మయబ్రహ్మకవి ప్రణీతంబైన శ్రీహరనాథ భాగవత మందలి నవమస్కంధము.

---

జ య శ్రీ కు సు మ హ ర

# శ్రీ హ ర నా థ భా గ వ త ము

## ద శ మ స్కం ధ ము

శ్రీ మన్నామ! యశోదా
శ్యామా! దానజనవర్జితావ్యయధామా!
కోమలహృదయలలామా!
నామానందప్రియతమ! నా దైవతమా!

### పాఠక సోదరులారా !

మనము తొమ్మిది సోపానములను దాటి పదవ సోపానము నకు చేరితిమి. చెఱకుగడను ఎచట తిన్నను మధురముగా నుండునట్లే మధురప్రేమమూర్తి చరిత్రమును ఎచట పఠించినను అదంతయు మనస్సునకు అపరిమితానందమును సమకూర్చుచుండును. శరీరము నకు ఒక రకమైన ఆహారమందీయవలెను. మనస్సునకీయ వలసి నది ఆధ్యాత్మికాహారము, సద్గ్రంథపఠనము, వృద్ధసేవ, భాగవత సమాదరణ, దీనపతిత దరిద్రజన పోషణ, నిరంతర భగవన్నామ స్మరణ-మున్నగునవి యన్నియు-మనస్సునకు – ఆత్మకు మంచి ఆరోగ్యమును కలుగ జేయుటయే కాక ఉత్తమజన్మములనిచ్చి-ఉజ్జ్వల సాధనలను ఫలింపజేసి పురుషోత్తముని జేర్చుచుండును. పుష్టికర మైన పదార్థములను తిని-సుగంధాదిలేపనములను పూసికొని శరీరము

నెంత పెంచినను ప్రయోజనము శూన్యము. ఇది యెప్పటికైనను మట్టి పాలు కావలసినదే!! ఈ సంగతి అందఱికి తెలియును. కాని యీ మానవజన్మలోని గొప్పతనమును ఏమాత్రము గుర్తింపక అందఱితో పాటు ప్రాపంచిక సుఖలాలసులై జీవించుచుందురు. వారు తమ బ్రతుకులో ఏదో సంతోషమును పొందితిమని మురిసిపోవుచుందురు. మృగతృష్ణలో లేడి పొందగల దేమియు లేనట్లే సంసారజీవులకు చివఱకు మిగులునది నిరాశ-దుఃఖమే!! యుక్తాహారవిహారములతో శరీరమును కాపాడుకొనుచు-దీని సహాయమున కృష్ణుని-లోకముయొక్క సేవచేసి తరించుటయే జీవితలక్ష్యము. ఈ విషయమును దృష్టిలో నుంచుకొని మనము జీవించుటకు ప్రధానకారణమైన ప్రభువును ఈ జన్మలోనే పొందవలెనను అభిలాషతో-ఆర్తితో-అన్వేషణతో సాధనను కొనసాగించవలసియున్నది.

అంగడిలో చాల వస్తువులుండును. అన్ని కొనితెచ్చుకొనవలెననియే యుండును. కాని నీ దగ్గఱనున్న ధనమును బట్టియే కావలసిన వస్తువులు లభించును. చేతిలో ధనమున్నదిగదా! యని పనికిమాలిన వస్తువులను కొనుట వలన జీవితావసరము తీఱదు సరిగదా! కష్టించి సంపాదించిన ధనము వ్యర్థమగను. ఈ విశాల విశ్వమున చాల వస్తువులు-వ్యక్తులున్నారు. గతజన్మలలోని సుకృత దుష్కృత ఫలము-అను ధనమును అనుసరించియే-ఆస్తి-భార్యా పుత్త్రబంధు మిత్రులు-బ్రతుకుతెరువు ప్రాప్తించును. మానవజీవితము ఎంత అందచందాలను వెదజల్లుచుండునో—అంత మోసము చేయుచుండును. ఇది నీటి బుడగ కన్న గాలిపటము కన్న నీళ్ళకుండ కన్న చాల క్షణిక

మైనది. దీని స్వభావము తెలిసి-ఉన్నంతకాలములోనే దీనినే మంచి పనులకు ఉపయోగించుకొనుట వివేకి లక్షణము, నామ ధనమువలన కృష్ణుడే లభించుచుండగా- ఈ నాడుండి రేపు మనలను వంచనచేయు వస్తువులను-వ్యక్తులను కొనుట—నమ్ముకొనుట తగని పని. యోగములు-జపతపములు-ఉపవాసములు-అర్చనలు మొదలైనవి పెక్కు భగవత్సేవలో మనము చూచుచున్నాము. వీనిలో సర్వశ్రేష్ఠమైనది నామ సాధనయే-అహర్నిశలు కృష్ణునియందు ప్రేమానురాగములను పెంచుకొనుచు చేయవలసి యున్నది. అదియే నిజమైన ప్రేమబృందావనికి చేర్చునని బోధించిన కలియుగ భగవన్నామ ప్రచారకుడు మన శ్రీ హరనాథ ప్రభువు. ఇతర దైవములవలె కాక ఈస్వామి మన భారములను తన భుజస్కంధములపై వైచుకొని-కంటికి రెప్పవలె వడి కాపాడుచుండును. ఎప్పటికపుడు మన అవసరములను దీర్చుచుండును-మాయను తొలగించి కర్తవ్యమును బోధించుచుండును. నిజముగా మనమెంత అదృష్టవంతులము!! ఆయన రక్షణలోనున్న మనమెంత సుకృతవంతులము.

అందరివలె విద్యాభ్యాసము చేసి-ఉద్యోగముచేసి-సాటి మానవ లోకమునకు భగవన్నామామృత మాధుర్యమును-చవిజూపి-సంసార కష్టములనుండి ఉద్ధరించిన ఆదర్శ గృహస్థయిన శ్రీహరనాథుడు 1913లో కాశ్మీరులో ఉద్యోగ విరమణముచేసి-సకుటుంబముగా సోనాముఖి చేరుకొనెను. తన అవతార కార్యమును విశ్వమంతట ప్రచారము చేయగల శుభతరుణ మాసన్నమయ్యెను.

అనాదినుండి వైష్ణవక్షేత్రముగా = ప్రభుని జన్మ భూమిగా పేరెన్నికగన్న సోనాముఖిలో 1922 జనవరి 5వతేదీ నుండి కొన్నిరోజులు జరుగు ఆనందమేళోత్సవమునకు దేశము లోని పలుప్రాంతములనుండి భక్తులు వచ్చిరి. భిన్నభిన్న జాతులు - భాషలు - ఆచారములుగల వారందఱు ప్రభుని సేవకై తహతహలాడ జొచ్చిరి. అనేక వనములలోని పువ్వులు అన్నియు కృష్ణుని మెడలో పూలదండగా అమరినట్లు - పిల్ల కాల్వలు ఉపనదులు - నదులు - సరస్సులన్నియు సాగరుని చేరునట్లు భిన్నమనస్తత్వాలుగల స్త్రీపురుషభక్తులు - హరనాథ ప్రభుని ముఖచంద్రుని తిలకింప నువ్విళ్లూరుచుండిరి. అనంత కుండమున స్నానము గావించువారు కొందఱు - ప్రభువునాటిన ఫలవృక్షములను చూచుచు = ఇవియెంతపుణ్యము చేసికొన్నవో యనుచుండగా ప్రక్కవారు ఇవి వృక్షములుకావు. మహర్షులు. అనిచెప్పగా ఆశ్చర్యపడుచుండిరి. భక్తబృంద మెక్కువగా వచ్చియుండుటచే అనంతకుండ సమీపమునగల తోటలోనే ఆనందమేళోత్సవమును ఏర్పాటుచేయబడినవి. ఠాకూరు కుటుంబ సభ్యులు మిక్కిలి ప్రేమాదరములతో ఫలహారముల నంద జేసిరి. నిరాడంబరులు - పరిపూర్ణప్రేమమూర్తులైన యుగళ మూర్తులు ఉన్నతాసనములను అలంకరింపగా - భక్తులందఱు వారి పాదపద్మముల సన్నిధిని భక్తిప్రేమ బద్ధాంజలులై కూర్చుండిరి. కొంతసేపు సంకీర్తనజరిగినది. వివిధప్రాంతాల నుండి ఎన్నెన్నో శ్రమలకోర్చి వచ్చిన భక్తులను జగజ్జననీ

జనకులు - అమృతమయ వీక్షణములను ప్రసరింపజేయుచు - అభయప్రదానము చేసిరి. ఉప్పొంగిన ప్రేమాతిశయముతో ప్రభువు "మిమ్మందఱిని ఒక్కచోట ఒక్కసారిగా చూడగలుగు చున్నందులకెంతో సంతోషము కలుగుచున్నది. జీవులకు కృష్ణుడే పరమాశ్రయము. అతనిని విడిచి బ్రతుకుట రసహీనము. నిరుపయోగము. మిగిలన సాధనలు మీకెందులకు? నేను చెప్పుచున్నాను. వినుడిదియే చక్కని మార్గము."

వలలు గట్టుమీద వదలివేసి నీటిలో మునిగియున్నచో-చేపలు దొరకనియట్లే - యోగములు - తపస్సు ఎంతచేసినను-నామస్మరణపై నమ్మకము లేనియెడల మీరు కృష్ణుని పొందలేరు. హరినామమునే లంగరు (ఆశ్రయము) గా పెట్టుకొనుడు. నేడో - రేపో తప్పకుండ అతనిని పొందగలరు. సందేహము లేదు. పేరు తెలిసియుండిన పక్షమున ఒకవస్తువును వెదకి పట్టుకొనవచ్చును. పేరు తెలియనపుడు ఆ వస్తువు కన్నుల యెదుట నున్నను తెలిసికొనలేరు. గోలోక రత్నమగు శ్రీకృష్ణుడు భిక్షుక రూపముతో నవద్వీపమునకు వచ్చి బాష్పములు కనులనుండి స్రవించుచు చెక్కిళ్ళపై ఇంకిపోవుచుండగా అందఱికి 'నామస్మరణ చేయుడు. నామమునుండి ప్రేమజనించును. ప్రేమమయుడైన కృష్ణుడు నీవాడు కాగలడు' అని బోధించినాడు.

మాయయొక్క ఐహికరాజ్యములో నీ జీవితమును - ఆత్మను లగ్నము చేయకుడు. ఆ రాజ్యమునుండి మీ జీవితమును-

ఆత్మను తీసివేసి శ్రీకృష్ణుని పాదపద్మములదరి వానిని పెట్టుడు. అప్పుడు అన్నివేళలయందు మీరు పూర్తిగా విచారరహితులు కాగలరు." అని మృదుమధురముగా భాషించెను. మాతృశ్రీ చిఱునవ్వులు వెదజల్లుచు తన విశ్వవిశాల పుత్త్రవాత్సల్యమును ప్రసరింపజేసెను. ఆ భక్తమండలికి సోనాముఖి - బృందావని వలె తోచెను. అందలి గడ్డిపరక సైతము - చాల సుకృతము నోచికొన్నదానివలె ఆ దివ్యమూర్తుల కనుల యెదుట మురిసి పోయెను.

రాకూరు భోజనమునకై కూర్చుండినపుడు - తండ్రి చుట్టు పిల్లలు గుమిగూడునట్లు భక్తులందఱు కూర్చుండిరి. ఎవరికి ఏపదార్థ మిష్టమో - ఎవ్వరేమని భావించుచుందురో దానికి తగినట్లు — అయాపదార్థములను విసరుచు - నవ్వించుచు కవ్వించుచు - సరసోక్తులను గ్రుమ్మరించుచుండెను. ప్రభు సమక్షమున హెచ్చుతగ్గులులేక అందఱు సమాన ప్రేమాదరము లను పొందుచు జీవితములు ధన్యమైనట్లు భావించిరి.

విశ్రాంతి సమయమున ప్రభువు తమకు చూపిన లీల లను ఒకరికొకరు చెప్పుకొనుచు భక్తులు నిద్రావిశ్రాంతులను మఱచిపోయినారు. ఒకే ప్రేమసూత్రముచే బంధింపబడినవారికి భాషలు - స్థితిగతులు అడ్డురావయ్యెను. అందఱును సేవా దృష్టితో - వినయశీలముతో - విడివడని అనురాగముతో గడ పిరి. ఆ మధురమగు ఆనందమేళోత్సవము బ్రహ్మానందమును

గూర్చినది. సామాన్య బంధుమిత్రులు చూపు ప్రేమకు - భక్తులు చూపు ప్రేమకు ఎంత వ్యత్యాస మున్నది? అని తమలో తాము భావించిరి. ఉత్సవములు ముగిసినవి. ప్రేమమయులగు కుసుమ హరనాథులకు దూరమై మాయామేయమగు ప్రకృతిలో పడిపోవుచున్నామే అను భయవిహ్వల దృష్టితో భక్తులు వారిని విడువలేక విడువలేక పసిపాపలవలె వెక్కి వెక్కి ఏడ్చుచు -ఎట్ట కేలకు తిరుగి మొగము పెట్టిరి.

కృష్ణుని మురళీగానము పశుపక్ష్యాదులను పరవశింప చేసినదని విందుము. ఠాకూరు ప్రేమ మురళీగాన లహరిలో - రాగద్వేషములను మఱచి ఒక్కటిగా — ఒక్కమనస్సుతో - ప్రేమానురాగములతో-ఒక్క కుటుంబముగా మసలుట యను వది యొక ప్రత్యేకత !! పిచ్చియాసుపత్రిలో అందఱును పిచ్చివారే !! పాగలు హరనాథుని ఆశ్రయించిన వారందఱు పాగలు భాయీలే !!

తరువాత కటక్ పూరీధామములలో జరిగిన ఉత్సవాలలో ప్రభువు పాల్గొని భక్తులకు మహదానందమును గలుగజేసెను. 'గర్బేతా' నగరములో కట్టబడిన యాశ్రమమునకు ప్రభువు ప్రారంభోత్సవము చేసెను.

పిమ్మట మిడ్నపూరు జిల్లాలో రాధానగరమున్నది. అది యొక చిన్నగ్రామము. అక్కడనున్న భక్తులు ఆశ్రమ మును నిర్మించి దానిని ప్రారంభించవలసినదిగా ఠాకూరును

కోరిరి. ఆ యుత్సవము 1922 ఏప్రియలు 16న జరుపబడినది. ప్రభునిచే ఆశ్రమము ప్రారంభించబడెను. ఉత్సవములకు వివిధప్రాంతములనుండి భక్తులు వచ్చిరి. నిమతోలాలో రాత్రి వేళ భాగవత ప్రవచనముచేయు సంస్కృతము - బెంగాలీలో మంచి పండితుడగు "రామగోపాలభట్టాచార్య" ఆయుత్సవము నకు వచ్చెను. హరనాథుని భక్తులు స్నానము చేయకయే ఫలహారములను - భోజనములను జాతిభేదములేక కలసి మెలసి సోదరులకన్న మిన్నగా ప్రేమానురాగములతో తినుట యనునది ఆ పండితుడు చూచెను.

రామగోపాల పండితుడు తనలో "హరనాథుడొక క్రొత్త మతమును సృష్టించినట్లున్నది. ఈతడు తన్నుదైవముగా భావించుచు నటించుచున్నాడు. ప్రజలు మూఢులు. వేషము - తీయనిమాటలను చూచి మోసపోవుచుందురు తాయిరప్పలను దేవుడని కొలుచువారు కొందఱుందురుగదా !! ఇదంతయు కపటనాటకమువలె కనిపించుచున్నది" అని భావించెను.

ఆయుత్సవమున వసంత కుమార ముఖోపాధ్యాయుడను గాయకుడు తబలాపై వాయించుచు - ఆడుచు - పాడుచు భక్తులను ఆనందపఱచు చుండెను. ఠాకూరు తలయూపుచు - భావ పారవశ్యమును అనుభవించుచుండెను. రామగోపాలునకు వసంతకుమార భట్టాచార్యునకు పూర్వస్నేహముండెను. ఆ గాయకునితో ఆపండితుడు నెమ్మదిగా "భావదేహము రావలె

నన్న జన్మసంస్కార ముండవలెను. లేదా ఠాకూరు అనుగ్రహ ముండవలె"నని చమత్కారముగా మాట్లాడుటను గ్రహించి ప్రభువు అతనిని ఉద్దేశించి "తండ్రీ ! భక్తులు భావవేషమును గొప్పగా భావింపరు. తమ మనోధనములను స్వామికిఅర్పించు టయే వారిలక్ష్యము. జపతపములు - యోగములు - యాగము లన్నియు - సాక్షాత్తు సేవాయజ్ఞమగు నామభజనకు సరిగా వ"నెను. ఆమాటలను విన్నతర్వాత రామగోపాల పండితునిలో మార్పువచ్చెను. క్రమముగా ఆయన హరనాథ భక్తాగ్రగణ్యు డయ్యెను,

ఆ యుత్సవమునకు ప్రభువొక్కడే వచ్చెను. యుగళ మూర్తుల దివ్యదర్శనము చేయవలెనని చాలమంది భక్తులు వచ్చిరి. మన్మోహినీ దాసియను భక్తురాలు "మీతో అమ్మను తీసికొని రాలేదా ? మీయిద్దఱిని దర్శించవలె ననుకొంటి మ"నెను. వెంటనేహరనాథుడు "ఆమెఇక్కడనేయున్నది. ఆమె నాలోనే యున్నది. నేను ఆమెలో నున్నాన" నెను.

ఉత్సవములోని భక్తులందఱికి ఆశీస్సులందజేయుచు "ఈ యాశ్రమ వాతావరణమెంతో మనోహరముగా నున్నది. ఇది చిన్నగ్రామమైనను భక్తిప్రేమలకు నిలయమైన వ్రేపల్లెవలె కనిపించుచున్నది. ఇక్కడివారందఱు పేదలైనను - ప్రేమకు మహారాజులను మించిన మహారాజులు. ఇక్కడి సన్నివేశము లను చూచి మా తారాప్రసాద్ నిజముగా తన్నుదానే మఱచి పోయినాడ" ని ప్రసంగించెను. పేరే రాధానగరము. దానికితగి

నట్లు అందఱు అమాయిక ప్రేమతో ప్రభువును — భక్తులను సేవించి తరించినారు. వారు పేదవారా ? భక్తిప్రేమలు లేనివారే దీనులు, పతితులు, పేదలు.

వరాహనగరములో ప్రభుని జన్మోత్సవము :-

1922 జూలైలో వరాహనగరమున శరచ్చంద్రదేగారి తోటలో ప్రభుని జన్మదినోత్సవమును జరుపుటకు భక్తులు నిశ్చయించినారు. ఆతోట పవిత్రగంగాతీరముననే యుండెను. ఈయుత్సవమునకు భక్తరత్నమగు భాగవతచంద్రమిత్రుడు సారథ్యము వహించెను. ఆయుత్సవములో పాల్గొనుటకు బొంబాయి - మద్రాసు మున్నగు అనేక నగరములనుండి భక్తులు వచ్చియుండిరి. చాలమంది భక్తనారీమణులు గూడవచ్చిరి. భక్తులకు వలసిన సౌకర్యములు చక్కగా సమకూర్చబడెను. జన్మోత్సవపూజ - పుష్పాంజలి - దరిద్రనారాయణ సమారాధన మున్నగునవి - యీయుత్సవము జరిగిన 7 రోజులలోను నిర్వహింపబడెను.

"రాధేగోవింద! రాధేగోపాలా" అను పవిత్ర నామ యజ్ఞము ఇరువది నాల్గుగంటలు జరిగినది. జన్మజన్మలలోని పాపపంకిలముచే కళావిహీనమై - స్వయంప్రతిభను గోలుపోయిన భక్తుల హృదయవీణను - చక్కగా తుడిచి - శ్రుతి చేసి - భావపారవశ్యముతో నిమీలిత నేత్రుడై మీటుచుండుట చేతనోయేమో! పూర్వమెన్నడును లేని ఆవేశముతో — గంగా నది గట్లను త్రెంచుకొని పొంగిపొరలెను. భక్తుల సుకుమార

భావనలు గంగాభవాని కెరటాలపై నాట్యమాడసాగినవి. మాటి మాటికి తపింపజేయు సంసారవాసనలు ఆప్రాంతమున కలికాని కైనను కానరావయ్యెను. స్త్రీ పురుషులు తమవ్యక్తిత్వములను మఱచిపోయి ఒకానొక మధురాతిమధుర పదార్థమును భుపించు చున్నట్లు - జన్మజన్మలలోని ఒకానొక ప్రాణమిత్రుని కలసి కొనినట్లు - కలలుపండినట్లు-అపూర్వమగు ఆనందమును అను భవించిరి. పిల్లనగ్రోవిపాటవినిపడగెత్తి లాస్యమొనర్చు ఆదునా గుబామువలె - గంగావాహిని - తన చపలత్వమును కట్టిపెట్టి- నామయజ్ఞ సంగీతమాధురిని ఆస్వాదించుచు నిలిచిపోయినదాయ న్నట్లు కనిపించినది. "హరకుసుమ హరకుసుమ" సువర్ణాక్షర మంత్రసంయుక్తమైన నామభజనము శ్రవణానందముగా నొన ర్చుచు తారప్రసాద ఘోషు. అజయ్, భూజానంద మున్నగుభక్తులు యుగళమూర్తులకు సంప్రీతిని గూర్చిరి. హృదయసామ్రాజ్య మును కేవలప్రేమసౌందర్యముచే అలంకరించి పులకించు ప్రభువు ఆక్షణములలో చిద్విలాసమూర్తిగా అందఱకు దర్శన మిచ్చెను. కనుసన్నలలో లోకములను పోషించుచు – అపార మాతృవాత్సల్యమును వర్షించుచు కుసుమదేవి రాధాదేవిగా - సాక్షాత్కరించెను. కామ్నారు వాస్తవ్యులైన పరేశ్‌నాథబాబు, యాదవబాబు అను వృద్ధనర్తకులు - ఆడుచు పాడుచు పాగలు హరుని మెప్పించిరి. పాలసముద్రములోని అలలు - సుడులు- బిందువులు - అన్నియు స్వాదుమధురములైనట్లే - మంచిగం ధపుచెట్టులోని ఆకులు - పువ్వులు – కొమ్మలు - రెమ్మలు

అన్నియు అవ్యక్త సుగంధములనే వెదజల్లునట్లు-సాక్షాత్ప్రేమ బృందావనరాజ్య పరిపాలకులు చెంగటనున్నపుడు - ప్రేమానందభావనలకేమిలోపముండును?

జ్యోతిర్మయబెనర్జీ ఠాకూరు చరణకమలములను దర్శించవలెనని 'అరేరియా' నుండి కలకత్తా వచ్చెను. అది ఉదయం గం.10ల సమయము. ఎంత ప్రయత్నించినను మూడు సారులు స్టీమరెక్కలేక పోయెను. ప్రభువును చూడగల భాగ్యమబ్బునోలేదోయని తరితపించసాగెను. నిరాశపడెను. మొత్తము మీద మధ్యాగ 12 లకు వరహనగరము చేరెను. ఈలోపున నందోత్సవము' అద్భుతముగా జరిగెను. అందు భక్తులు పాలు - పెరుగు - వెన్న - మీగడలు ఒకరిపైనొకరు విసరుకొనుచు - నందవ్రజములోని గోపాలురవలె క్రీడించిరి. జ్యోతిర్మయుడు ఆవేడుకను చూడలేకపోయెను. మీదుమిక్కిలి ఎన్నోశ్రమదమాదులకోర్చి - నలిగి నలిగి వచ్చిన ఆభక్తుని ఆవేదన ఠాకూరు అక్కడ లేకపోవుటతో మఱింత హెచ్చెను. వియోగము - హృదయార్తిని మఱింత రగల్చును గదా! శ్రీహరనాథుడు భక్తుల యిండ్లకు వెళ్ళి తిరిగివచ్చెను, నిరాశానిస్పృహలతో క్రుంగిపోయిన జోతిర్మయుని రెండుచేతులతో పైకెత్తి ప్రభువు గాఢముగా కౌగిలించుకొనెను.

చల్లని వెన్నెల జల్లులవంటి చిఱునవ్వుల జల్లులతో మహాగ్రీష్మమున మండుటెండలో కాలిపోవుచున్న ఆ భక్తుని

సంతప్త హృదయమును ఒక్కక్షణములో శ్రీహరనాథుడు ప్రశాంత పఱచెను. జ్యోతిర్మయుని నయన పద్మములు ప్రేమ జ్యోతిర్మయ కాంతిరేఖలతో వికసించినవి. ఆ మరుసటి రోజు ఉదయమున 'నగరసంకీర్తన' యుత్సవ స్థలమునుండి దక్షిణేశ్వరము వఱకు భక్తులు జరిపిరి. ఆనగర సంకీర్తన దృశ్యమెంతయో రమణీయముగా నుండెను. "హరగోపాలుడు నావాడు" "హరగోవిందుడు నాహృదయేశ్వరుడు" "వనమాలి నాహృదయ వనమాలి" "కుసుమ మనోహరుడు నామనఃకుంజవిహారుడు" అనుభావములతో ఈ ప్రపంచముతో మాకేమిపనియన్నట్లు - భక్తులు నృత్యగానము లొనర్చిరి. అందొక భక్తుడు నాల్గుబాటల నడుమ భావానుగుణముగా అభినయించుచు నొక చక్కని గీతమును ఆలపించెను. ఆగీతములో

"ప్రభూ! నీవెక్కడికి పోయితివో కాని నామనస్సు నీకై పరితపించి పోవుచున్నది. జీవితమార్గమున సుఖమను మాటయే లేకపోయెను. నావారనువారు ఈ లోకమున లేరు. నీవే సర్వమని ఆ వెన్నెలరాత్రిలో - లతానికుంజము చెంతనేకల జాతి వలకపై కూర్చుండి - నన్ను సందిటబట్టినపుడు గద్గద స్వరముతో నీవే నాప్రాణేశ్వరుడవని యంటిని. వెంటనే నీవును నాజీవిత ధనము నీవేయన్నపుడు నీనెంత యుప్పొంగిపోయితినో! నీకేతెలియును. ఈ పగలంతయు ఈ యెండలోనే నిల్చియుంటిని. పక్షులు గూండ్లకు చేరుచున్నవి. కాఱుచీకట్లు అలము కొన్నవి. నేను నీ తీరమునకు రావలెనన్న యీ మధ్య

"పాడు యమున" అడ్డుగా రాకాసివలె కనిపించుచున్నది. అన్నెము పున్నమెఱుగని యీ ముద్దరాలిని కాపాడుకోవలసిన బాధ్యత నీకు లేదా? ఒంటరిగా విడచుట నీకవమానముగాదా ! నీకృప చిక్కరాదా? ఇట్లు ఏడ్పించుట నీకు మర్యాదయా!" అనుభావముండెను. కలకత్తా పౌరులు ఈ భావము ను మననము చేసికొనుచు కనులు, చెవులప్పగించి భక్తబృందము నకు నమస్కరించిరి.

తిరిగివచ్చిన భక్తులనుజూచి ఠాకూరు "మీరుచాలదూరము వెళ్ళి యుందురు. కాళీమందిరమున సంకీర్తన జరిపినారా?'' అని ప్రశ్నించెను. భక్తులపుడు ''బాబా ! మేము కాళీదేవాలయము నకు వెళ్ళలేదని నీకెట్లు తెలిసిన ద''ని యడిగిరి. "అరెరే ! నేను మీనగర సంకీర్తనను విడిచి యెక్కడనో యుంటినను కొన్నారా ! నేనుఎల్లప్పుడు మీతోనేయుందు న"నెను. ఈ మాటలనువిన్న జ్యోతిర్మయుడు తనలో "ఏమి యీ ప్రభుని సర్వవ్యాపకత్వము!! ఒకేసమయమున భక్తులయింట క్రీడించుచు మఱియొకవైపున నగరసంకీర్తనలో పాల్గొనుచు మఱియొక వంక నాకు స్టీమరు సమయమునకు దొరకకుండ చేయుచు - ఆడుచున్న యీ యాట అత్యద్భుతము !! బ్రహ్మాదులైనను హరనాథుని ఖేలను అర్థముచేసికొనగలరా ?" అనుకొనెను.

నగర సంకీర్తన యనంతరము పూజ – హారతి కార్య క్రమము లైనవి. భక్తులందఱికి ప్రసాదమును పంచిపెట్టిరి. రెండుగంటలకు పేదలకు అన్నదానము జరుగవలసి యున్నది

చాలమంది పేదలు బారులుతీర్చి కూర్చుండిరి, అందఱకు వడ్డించు చుండిరి. మఱికొంతమందికి అన్నము పెట్టవలసి యుండగా పదార్థము లయిపోయినవని తెలిసి వడ్డించువారు మౌనముద్ర వహించిరి. ఈసంగతితెలిసి ఠాకూరు హఠాత్తుగా వంటయింటి దగ్గఱకువచ్చి విషయము తెలిసికొని "మీరేమి బెంగపడ నక్కఱలేదు. మఱల వంట ప్రారంభింపుడ" నెను. ఆ మాటలను విని భక్తులు "ఇపుడువంట ప్రారంభించిన కనీ సము రెండుమూడు గంటలకుగాని పదార్థములు తయారుకావు గదా !! యేమి యీప్రభుని విలాసమ"ని భావించి - ఠాకూరు చెప్పినప్రకారము వంట ప్రారంభించిరి. మహాశ్చర్యము !! పది నిముసములలో పదార్థములు పక్వమైనవి. అందఱికి వడ్డింప బడినవి. భక్తులు 'ప్రభువు అక్షయమగు అన్నప్రదానము చేసి నందులకు ఆనందించిరి.

సాయంకాలమయ్యెను. జ్యోతిర్మయబాబు - కిశోరిబాబు బాబా చరణముల కెఱగి "తండ్రీ ! మేము మాయిండ్లకువెళ్లెద మనిరి. వెంటనే ప్రభువు "నన్నువిడచి మీరేలాగున వెళ్ళ గలరు ? మీకును నాకును వియోగమనునది లేనేలేదు. మనము ఒకరిని విడిచి మఱియొకరము జీవించలే మ"ని సమాధాన మిచ్చెను.

ఆరాత్రి "హరనాథుని జీవితనాటక కార్యక్రమను ఏర్పాటుచేయబడెను. భాగవతచంద్రమిత్ర దానికి దర్శకత్వము

వహించెను. అటులుబిహారీనాంది - నాటకప్రదర్శనకు తోడ్ప
డెను. అనివార్య కారణములచేత ఆనాటకప్రదర్శనము జరుగ
దయ్యెను. ఆసందర్భమున ప్రభువు "ఈ ప్రపంచమునకు అధి
నేతయగు వానివేషముతో నటించుటకు ప్రయత్నింపకుడు.
మనఃపూర్వకముగా ఆతనిసేవను భయభక్తులతో చేయుడు.
అపుడు సత్ఫలితమే కల్గును, మీ సేవాధర్మము ఎప్పుడును
నిరాడంబరముగను - చిత్తశుద్ధిగలిగినదై యుండవలెను."
అని యుపన్యసించెను.

చదువరులారా! చూచితిరా! ప్రభుని సందేశము!
తనయెదుట తన నాటకప్రదర్శనము చేయుట - ప్రభున
కిష్టములేదు. తాను ఎప్పుడును నిరాడంబరుడుగా నుండుటకే
యిష్టపడును. మనమందఱము:చిన్నపని చేసి ఊరువాడ ప్రచా
రము చేసికొందుము. మనకు కీర్తిప్రతిష్ఠలు కావలెను. ఆయ
నకు అక్కఱలేదు. ఆడంబర జీవితములో సుఖశాంతు
లున్నట్లు కనిపించును. కంచుకాగడాపెట్టి వెదకిచూచినను
అందు తృప్తియుండనే యుండదు. తానుకేవలము త్యాగపూరిత
మైన - సేవాభరితమైన జీవితమును గడపెను. దానినిచూచి
మనమట్లే ప్రవర్తించుట మంచిది. ఆడంబర జీవితము —
అహంభావమునకు నిదర్శనము !! హరనాథుడు మొదటి
నుండియు వేనకువేల ప్రజాసమూహమును కోరలేదు. హృద
యము గలవారిని కొలదిమందినే కోరి పిలిచినాడు. వారితో
క్రీడించినాడు. ఆనందించినాడు. మనతో విహరించుచునే

యున్నాడు. హృదయ సంస్కారము లేనివారు చాలమంది యున్నంతమాత్రమున భజన - సంకీర్తనాదులు శోభించవు. హృదయేశ్వరుని తప్పక పొందవలెనను ఆర్తిగలవారు ఒక్క-టిద్దఱి హృదయచైతన్య స్ఫూర్తిచే - అందఱిలో భగవత్ప్రేమ వాతావరణము అప్రయత్నముగా తాండవించును. అట్టిభక్తుల తోడి సంకీర్తనలు - సంభాషణలు - సావాసములు సంసార తరణోపాయములు !" ఆరాత్రి 'హరిశ్చంద్ర' నాటక ప్రదర్శనము జరిగినది. వచ్చినవారందఱును సంతోషించిరి.

ఈ జన్మోత్సవమున హరనాథుడు తన విశ్వసందేశమునిట్లు అందజేసినాడు,

"మనము ఆడు ఆట ఆద్యంతములు లేనిది. ఇది శాశ్వతమైన క్రీడ. అన్ని యాటలలోను ఇది సర్వోత్కృష్టమైనది. జన్మజన్మలలో మనమీరీతిగానే కలసిమెలసి ఆడుకొనుచునేయుందుము."

"ఈ శరీరమును విడిచినను మిమ్ము మాత్రము విడువ జాలను. నన్నుగూర్చి మీరు ఆందోళన పడకుడు. మీరే నా తల్లి దండ్రులు. ఆప్తులు కూడ !!"

మీ పాప భారములను నా తలపై పెట్టుడు. వానిని మోయుటకు సిద్ధముగా నున్నాను."

"నా హృదయ ధనమగు ప్రేమనే మీకిచ్చుచున్నాను. దానిని మీరు ప్రేమ పూర్వకముగా శ్రద్ధగా గ్రహింపగలరని యాశింతును."

"మీప్రేమ తప్ప నాకితరములైనవి అక్కఱలేదు."

"నేను చెప్పినది గుర్తింపగల రోజొకటి తప్పకవచ్చును. కాని కొంతకాలము గతించి పోయిన మాట యథార్థమే!"

మఱునాడు ప్రభుని దగ్గఱ సెలవు తీసికొని వెళ్ళవలసి వచ్చినందులకు అందఱు చింతించుచుండిరి. భక్తబృందము మధ్యను ఉన్నతాసనమున ప్రభువు కూర్చుండి యుండెను పుట్టిల్లు విడిచి యత్తవారింటికి బలవంతముమీద వెళ్ళు ఆడుపడుచువలె భక్తులు కనులనుండి అశ్రుధారలు స్రవించుచుండగా ఒక్క యడుగు ముందునకు వేయలేక ప్రభుని పాదసరోజముల చెంతనేయుండిరి. అపుడు హరనాథ ప్రభువు "మీరందఱును చకోరపక్షులు. శీతల చంద్ర కిరణామృతమును సంపూర్ణముగా త్రాగియున్నారు. గంగా తరంగిణి-తెల్లని నురగలు గల తరగలతో మిమ్ములను జూచి ఉప్పొంగి ఈ భవనపు పునాదులను ఒరిసికొని పాఱుచున్నది." అనెను. ఆ మాటలలోని చంద్రుడు ఆకాశములోని చంద్రుడు కాదు. గోపాల చంద్రుడు కాదు. మఱి ఎవరనుకొన్నారు? హరనాథ చంద్రుడే!! కలకత్తా నగరములోని గంగకాదు పొంగి ప్రవహించునది. హరనాథుని కృపామృత గంగ-ఏ హద్దులను లెక్కింపక-సర్వజీవులను తరింపజేయుటకై ఉప్పొంగుచున్నదని దీనిలోని భావము.

చిత్రముగా తన వ్యక్తిత్వముని దాచుకొన్నను దాగునా?"

హరనాథుని అవతారక్రీడ యెంత అగమ్యమైనదో అంత మహోదారమైనది.

ప్రభుని పాదములకు ప్రణమిల్లి పరేశనాథుడింటికి వెళ్ళుటకు సెలవడిగెను.

ప్రభు :- నాయనా ! నీవే స్టేషనులో దిగెదవు?

పరేశ :- గంగానదిని దాటి బేలూరులో దిగెదను.

ప్ర :- మఱి యెక్కడ దిగెదవు?

ప :- గుడస్‌లో దిగెదను.

ప్ర :- ఎన్ని గంటలలో ఇంటికి చేరెదవు?

పరే :- మధ్యా 2-3 గంటలకు.

ప్ర :- 'ఎండ తీవ్రముగానున్నది. పరేశా. ఈ మామిడి పండును తీసికొనుము' అని అతనికిచ్చెను. ఇక్కడ జరిగిన విశేష మేమనగా పరేశనాథుడు-ప్రభుని దగ్గఱగానున్న మామిడిచెట్టు పైని పండ్లనుజూచెను. వానిలో నొక పండును తనకు ప్రభువు ప్రసాదముగా ఇచ్చిన బాగుండు న''ను కొనెను, అనుకొన్నట్లే మామిడి పండును ప్రభువు అతనికిచ్చెను. హరనాథుడు మన మనోరథములను ఎఱిగిన దయామయుడ''ని అతడనుకొన్నాడు. ఈ రహస్యమును తెలిసికొన్న వారు అచ్చెరువందిరి.

అదియే సందర్భమున దేవేంద్రనాథముఖర్జీ-అతని భార్య మాయామయి ప్రభుని దర్శింపవచ్చిరి. ప్రసంగవశాత్తు హరనాథుడు "నాయనా! ఒకే చెట్టు ఎఱ్ఱని పచ్చని పువ్వులను పూయునా?

దేవే :- ప్రేమావతారుడు నా కనుల యెదుటనే యున్నాడు. ఈ ప్రశ్న ఆయుననే అడుగుచున్నాను.

హర :- సామాన్యమానవులు కర్మఫలములను అనుభవించు టలో చాల బాధపడుచుందురు. ఊహాతీతమైన ప్రేమగల శ్రీకృష్ణుడు- ఆ కర్మఫలములకు విరుద్ధముగా-ప్రకృతితత్త్వమునకు వ్యతిరేక ముగా కొన్ని అద్భుత చర్యలను ప్రదర్శించును. సరియైన భక్తి విశ్వాసములు గల భక్తులు-ఇట్టి చిత్రములను చూచి మా ప్రభువు నకు మాయందెంత ప్రేమయోయని ప్రశంసించుచుందురు. ఇదే విధ ముగా మన రామకృష్ణ పరమహంస ప్రకృతికి భిన్నముగా ఒక సాయం సమయమున దక్షిణేశ్వరాలయములో ఒక తెల్లగులాబీచెట్టు- తెల్లని ఎఱ్ఱని గులాబీలను పూచిన దృశ్యమును భక్తులకు చూపించి- యిదంతయు అమ్మ విలాసమని హెచ్చరించినాడు, ఇంతకు నేను చెప్పునదేమనగా మీరు నిజాయితీగా-మంచిసాధకులుగా నున్నపుడు మీరు ఏనాడును ఊహింపని సన్నివేశములను ప్రభువే ప్రదర్శించును.

ఆ మాటలలోని భావార్థమును ఆలోచించుకొనుచు దేవేంద్ర నాథ ముఖర్జీ-మిగిలినవారు పరమానంద భరితులైరి.

ఆతరువాత ఒకఫకీరు - ఠాకూరునకు కొంచెము దూర ములో నుండి ఆయన కృపావిలాసములను జాగ్రత్తగా పరి శీలించుచు - సమయముచూచి ప్రభుని పాదములకు నమస్క రించెను. అతడింతో అంతోసాధనచేసి అనేకశ్రమలకు గురి యయ్యెను. ఆతనిగురువు ఆతనికేర్పడిన సమస్యలను పరిష్క రించలేకపోయెను. మనశ్శాంతిలేక బాధపడుచున్న ఆఫకీరును దగ్గఱగా రమ్మని - ఆతని గురువుపేరుచెప్పి - ఆయనయిప్పు డెక్కడ ఉన్నాడ"ని ఠాకూరు అడిగెను. తన గురువుపేరీయన

కెట్లు తెలిసినది? ఈయన మహానుభావుడగుట యథార్థమని విశ్వసించెను. ఇంతలో ఒకవ్యక్తి "ఈయుగమున మంచిసాధన యేమి" టని ప్రశ్నించెను. ప్రభువు గంభీరప్రసన్నవదనముతో "నాయనా! ఈయుగమున రాధాకృష్ణనామస్మరణమే అన్నిసాధనలలోను శ్రేష్ఠమైనది. ఆనామమహిమ అపారమైనది. కొంతమంది ప్రతిఫలాపేక్షతో సాధనచేసి - అదిఫలించనపుడు నాస్తికులగుటయో - ఆమతమును విడిచి మఱియొక దానిలో చేరిపోవుచుందురు. మంచివిశ్వాసమును భగవంతునియందు కలుగచేయగలదేనిజమైనమతము. అన్నిమతముల సారాంశమొకటియే!! భగవత్ప్రేమను మఱచి - చేయుసాధనలన్నియు నేల విడిచినసాములు. ఈకారణముననే కొందఱు భ్రష్టులైపోవుచుందురు." అని మృదుమధురముగా భాషించెను. ఆసారాంశము తనకు చక్కగా అన్వయించుటచే ఆ మహమ్మదీయ సోదరుడు పశ్చాత్తప్తుడై - బాష్పపూర్ణనేత్రుడై ఏడ్వనారంభించెను. ఆతనిని ఠాకూరు బాహుపంజరమున గట్టిగా బంధించెను. ఆఫకీరు మున్నెన్నడట్టి యానందమును చవిచూచియెఱుగడు. భక్తులందరితోను అతడు ప్రసాదమును స్వీకరించెను., ఆనందించెను.

పాఠకసోదరులారా !

ఈఫకీరు తరువాత కొంతకాలమునకు ప్రభునిదర్శించి తనకుగల్గిన సమస్యలు - ఆపదలు ప్రభునికృపవలన తొలగిపోయినవనియు - తన్ను ఉద్ధరించిన దయామయుడు ఠాకూరే"

యని స్తుతించుచు తనకృతజ్ఞతాభి నందనలను ప్రభునకు సమ ర్పించుకొన్నాడు. ప్రేమాధినాథుని ప్రేమ ఎవరిపై ఎపుడు కురియునో ఎవరు చెప్పగలరు?

## నిత్యనిరంజనసేన్ (పాగలుభాయీ)

ఈయన ఆయుర్వేదశాస్త్రమును అభ్యసించిన విజ్ఞాని. ఇతడు అనేకములైన ఆధ్యాత్మిక సాధనలను చేయు సందర్భమున క్రీ. శ. 1902-1903 లో ఒక సాధువు కనిపించి హితోపదేశము చేసెను. జీవితము గతించుచున్నను ఆయనకు - ఆసాధుపురుషుడు చేసిన దివ్యమైన బోధ - మాటిమాటికి హృదయమున స్ఫురించుచునే యుండెను. ఎపుడా సాధువును దర్శింతునని నిత్యనిరంజనుడు చాల సాధు సమావేశములలో అన్వేషించెను. కాని ఆ సాధువు కానరాడ య్యెను. అతడేమయ్యెనో !! యీ జన్మలో ఆ మహాత్ముని సందర్శన భాగ్యము కల్గునా? యని తపింప జొచ్చెను. ఈయ నను అందరు 'పాగలుభాయీ' అని పిలిచెడివారు. ఇతడు కలకత్తాలో 'శ్రీకృష్ణ' యను మాసపత్రికను నడుపుచుండగా ఒకనాడితని మేనమామ 'కవిరాజ' సత్యచరణసేన్ వచ్చి పాగలు హరనాథుడను సాధువు కలకత్తాలో 54 మనిక్తోలా వీధిలోని ఒక భక్తుని యింటికివచ్చినట్లు చెప్పగా విని యెంతో సంతో షించెను. కాని ఆసమయమున తీవ్రమగు జ్వరమాతనిని పీడించుటచే ఠాకూరును దర్శించలేక పోయెను. ఒకవిశేషము

చదువరులకు ఇపుడు తెలియజేయవలసి యున్నది. ఈ నిత్య నిరంజనుడు సహజకవియు మంచిగాయకుడు. మేనమామ ఠాకూరును గూర్చి చెప్పిన క్షణమునుండి ఆతని హృదయము హరనాథుని వైపునకే పరువులెత్త సాగెను. మంచము మీదనే యున్నను అతడు పాగలు హరనాథుని కృపనుగూర్చి కొన్ని గీతములను రచించి పాడుకొనుచు ఎనలేని ఆనంద వీచిక లలో నీదులాడు చుండెను. ఒకనాడు తన మధుర గీతికలను బాబాకు వినిపించవలెనని కుతూహల పడుచుండెను. కొన్ని రోజులు మాత్రమే కలకత్తాలోనుండి ప్రభువు సోనాముఖి వెళ్ళి పోయెను. అసలే యితడు పాగలుభాయీ. దానితోపాటు కవి-గాయకుడగుటతో ఆపాటలను పాడుచు ఈలోకమునే మఱచెను. ఇంతలో కాలచక్రము ఆఱుమాసాలను దాటిపోయినది.

తరువాత ఠాకూరు శరచ్చంద్రడే యింటికి వచ్చినట్లు మన నిరంజనుని మేనమామ చెప్పుటతో మనపాగలు కవికి పట్టరాని ఆనందము - ఆవేశము కలుగజొచ్చెను.

54 మనిక్తోలా వీధిలోని శరచ్చంద్రుని గృహము భక్త మండలిచే కిటకిటలాడుచుండెను. ఆ సమయమున ఎట్లో వీలు చూచుకొని పాగలు భాయీ తిన్నగా ప్రభుని చరణ సరసీరుహ ముల కడ సాష్టాంగముగా ప్రణమిల్లెను. చాలకాలము క్రిందట దూరదేశము వెళ్ళి తిరిగివచ్చిన కుమారుని చూచిన తండ్రివలె ఆశాకిరణ ప్రసారితములగు లోచనములతో అతనిని దగ్గఱకు లాగుకొని ప్రభువు గట్టిగా కౌగిలించుకొనెను.

ఆ మధురమహనీయ క్షణములలో ఆతడు మూగవాడయి పోయెను. 20 సంవత్సరాల క్రిందట తనకు లీలగా కనిపించి-సందేశమిచ్చిన సాధువు-ఈయన-ఒకలాగుననే యుండుటను అతడు గమనించెను. అతనికి మఱియొక వ్యత్యాసము కన్పించెను. ఆయన కేశములు నల్లగా నుండెను. ఈయన కేశములు వయస్సు కారణమున తెల్లబడెను. ఆయన ఎఱ్ఱని అంగీ ధరింపగా ఈయన ధూమ్రవర్ణ వస్త్రములను ధరించినాడు. మొత్తము మీాద ఇరువురి కంఠస్వరములు సమానముగా నుండి అతి శ్రావ్యములై యుండుట పరిశీలించెను. ఇంతలో ప్రభువు ఎవరినో అక్కడినుండి లేచి పొమ్మను మాటలు వినిపించెను. ఠాకూరు నిశ్శబ్దముగా నుండుమనునట్లు పాగలుభాయీ వైపు చూచి కరసంజ్ఞ గావించెను. పాగలుభాయీ మనస్సును మఱియొకవైపు మళ్లించుటకై "ఓ మూర్ఖుడా!! ఏదో దయ్యమునిన్ను ఆవేశించినట్లున్నది. లేకపోయినచో అటువంటి పాటలు నన్ను గూర్చి వ్రాయవు. ఉన్నది లేనట్లు లేనిది ఉన్నట్లు వ్రాయుటలో నాకు తగిన తమ్ముడవౌదువు" అనెను. ఆ మాటలను విని తాను పాటలను వ్రాసిన సంగతి ఈయన కెట్లు తెలిసినది? ఆహా!! యీాయన అతీంద్రియ శక్తి - గణనాతీతమైనదని తనలో తాను శ్లాఘించుకొనుచు - ఆ గీతములను రచించిన కాగితములను వెదకుటకు ఇంటికి వెళ్ళెను. అమోఘమైన భక్త్యావేశములో అల్లిన కీర్తనలను మఱల మఱల పాడుకొనుచు 'పాగలుభాయి' నిజమైన 'పాగలు భాయీ'గ తరించెను.

తన ఆత్మీయుల ఆధ్యాత్మికాభివృద్ధితోపాటు సంసారములోని యోగక్షేమములను తండ్రివలె తల్లివలె గురువువలె మిత్రునివలె బోధించు ప్రభుని ప్రేమ తత్త్వమునకు హద్దులు లేవు. ఎన్నోసారులు మృత్యువుతో పోరాడినపుడు కాపాడి-మధురాతి మధురమైన తన సాహచర్యమును ప్రసాదించి-కంటికి రెప్పగా తమాలినీదేవిని ఆదరించిన ఘట్టములను తలచు కొన్నపుడు ఎట్టివారికైనను గగుర్పాటు కలుగకుండునా? వెచ్చని కన్నీరు స్రవించకుండునా? నవమాసములుమోసి-అష్టకష్టములు పడి కండను కొండను జేసిన తల్లిదండ్రులను కుమారులే లోకమున చూచుటలేదు. అట్టి పరిస్థితిలో శరీర బంధువులను మించి యింతగా ప్రేమించుస్వామి మనకు లభించుట కోటి జన్మల పుణ్యము గదా !!

ఒకసారి తమాలినీదేవి సంసారబాధలతో దుఃఖించు చున్నపుడు ఠాకూరు ఈ రీతిగా జాబు వ్రాసెను.

"ప్రియమైన అమ్మా !

నీ యింటిబాధ్యతలు నానాటికి పెరిగిపోవు చున్నవని నాకుతెలియును. ప్రభువే అన్ని సంగతులను చూచుకొనును. నీవెందులకు బెంగ పెట్టుకొందువు? ఆయనను తృప్తిగా స్మరించుకోగల నదవకాశమున ఆయనయే నీకీయ గలడు. ఏ తగవులు లేక 'ఉమ' పెండ్లి విషయము ఒక నిర్ణయానికి రాగలవని ఆశించుచున్నాను. ఆ కొంచెము బాధ్యత

తీటి పోయినచో నీవు హాయిగా నుందువు. కాని తర్వాత మీ అబ్బాయి 'నాటు'నకు పెండ్లిచేయవలసి యుండునేమో!! తల్లీ!! యీ లోకమునకు వచ్చిన వారెట్టి వారైనను ఏచింతలేక బ్రతుకుట సాధ్యముకాదు."

## ధర్మారావు నాయుడుగారిపై ప్రభుని కృపావృష్టి

చదువరులారా !

ఆంధ్రదేశమున హరనాథభక్తులలో మంచి క్రమశిక్షణ-నామమునందు మంచి ఆసక్తి – సత్ప్రవర్తనము - సహజమైన ప్రేమను వ్యాపింపజేసిన భక్తరత్నమగు నందవరపు ధర్మారావు గారిని గూర్చి సంగ్రహముగా తెలిసికొన గలరు.

వీరు గోపాలపురము వాస్తవ్యులు. సబురిజిష్ట్రారుగా పనిచేయుచు నిరంతరము ప్రభునామ పంచాక్షరిని జపించుచు సంసారమున అంటియు నంటని కర్మయోగి. ఉదయ సాయంకాలముల యందు మాతృదేవతకు నమస్కరించి-ఆ తల్లి ఆశీస్సుల నందిన భాగ్యశాలి.

ప్రభువు బరంపురములోని కామేశ్వరమ్మను చూచుటకు వచ్చినపుడు ఈయనకు వారిదర్శనము లభించినది. నాటినుండి వీరిరువురిమధ్యను ఉత్తరప్రత్యుత్తరాలు జరుగుచుండెను. ఒకసారి ఠాకూరును చూచుటకై సోనాముఖి వెళ్ళినపుడు ఈయన శ్రీ హరనాథుని హృదయమధ్యమున బాలగోపాలుని దర్శించెను. నాటినుండి హరగోపాలుడు బృందావన గోపాలుడను

దృఢవిశ్వాసము వీరికి ఏర్పడినది. 1922 లో 'తెల్లకుష్ఠు' అను చర్మవ్యాధి ఈతని క్రిందిపెదవిపై అంకురించెను. ఎన్ని మందులుపుచ్చుకొన్నను హెచ్చెనే కాని తగ్గలేదు. చిట్ట చివఱకు ప్రభుని పాదధూళిని అనంతకుండములోని తీర్థముతో కలిపి ప్రభునామమును చేయుచు మచ్చలున్నచోట పూసెను. ఒకటి రెండురోజులలో ఆచర్మవ్యాధి మటుమాయమయ్యెను. మఱియొకసారి తలవెంద్రుకలు రాలిపోవుటచే బట్టతల యేర్ప డెను. రెండవసారి ప్రభుచరణ ధూళిని అనంతకుండ జలముతో తలకురాసెను. ఎన్నితైలములు - మందులు వాడినను తగ్గని 'కేశక్షయము' సంపూర్ణముగా తొలగిపోయెను. ఈభక్తమణి ఒకసారి ప్రభువుతల తనతొడపైపెట్టి గాఢముగా నిద్రించు చుండ ఈయన మనసులో తనకుడిచేతివ్రేలు వంగకుండుటను గూర్చి అడుగదలచెను. ప్రభువు హఠాత్తుగాలేచి "నాయనా! ఒకసారి రెండుసార్లు ఏదైనను కోరవచ్చును. ఎల్లప్పుడు నీవు కోరుట మంచిదికాదు" అని మందలించెను. ప్రభుని ఆదేశప్రకా రము తరువాత కుడిచేతివ్రేలు వంగక - వ్రాయుటకు చాల కష్టముకల్గినను నాయుడుగారు ప్రభుని నయము చేయుమని కోరలేదు.

జీవితశేషమును రాధామధుర భావముతో ఈయనగడపు చుండెడివాడు. ఏకధారగా కన్నీటిని కార్చుచు - ప్రభు భక్తు లను కౌగిలించుకొనుచు అందఱిని ఒకదగ్గఱకు ప్రేమానురాగ ములతో నామమహిమను గూర్చి బోధించుచు దివ్యజీవితమును

నడపిన పుణ్యశాలి యీయన !! ఈయనను తాకినంతమాత్ర మున ఎట్టివారికైనను భగవత్ప్రేమ - ఆనందాశ్రువులు అప్రయత్నముగా వచ్చెడివి. ప్రియునిపొందుటకై అహోరాత్రములు తపించు ప్రియురాలివలె ఈయన తపించుచుండెడి వాడు. ఈయన అడుగుజాడలలో పెరిగి పెద్దవారైన భక్తులు ఈనాడు ఆంధ్రదేశమున జాతిరత్నాలుగ విరాజిల్లుచున్నారు. ఏకోరిక లేక సహజ ప్రేమభావనతో - అఖండ నామజప దీక్షతో జీవిత మును చరితార్థము చేసికొన్న భక్తాగ్రగణ్యుడు ధర్మారావు గారు.

భూతనాథుని సన్న్యాస దీక్షావిరమణము

భూతనాథుడు ఒకసారి బాబాకు లేఖవ్రాయుచు "తాను సన్యాసమును స్వీకరింపనున్నట్లు తెలియజేసెను. వెంటనే మృదుమధురభాషలతో ఆయనకు :

"భూతనాథా ! నీలేఖనుచూచి చాలవిచారించితిని. ఏకాంత ప్రదేశములకు వెళ్ళినంత మాత్రమున నీమనస్సు నీచెప్పుచేత లలో ఉండదు. ముందు 'నాది' యను నభిమానమును పోద్రోలి నీమనస్సును చక్కని దేవాలయముగా చేసికొనుము. నీవు మంచి పనులను చేయుటయేకాక నీభార్యచే చేయింపుము. మీరిరువురు కృష్ణుని పొందుట యనుదీక్షను ఎట్లయినను పూర్తిచేయవలెను. వేషమునుజూచి లోకము మోసపోయిన మోసపోవచ్చును గాని కృష్ణుడుమోసపోడు. ఆయన చక్కని మధురభావన – త్యాగ

మయ జీవితముగల వారిని ఎక్కువ ప్రేమించును. సహధర్మ చారిణి యగు నీభార్య సహకారముతో నీబిడ్డలకు మాత్రమే కాక ఇతరులకు అండదండలుగా నుండవలసి యున్నది. కృష్ణునియందు మనస్సును స్థిరముగా నిలుపగలవారందఱును సన్న్యాసులే !!" అని జాబువ్రాసెను. భూతనాథుడు అటుపైన ఉత్తమ గృహస్థుగానే జీవితమును గడపెను.

ప్రభువు పిమ్మట నాగపూరు - బృందావనము వెళ్ళి అక్కడి భక్తులకు హృదయానందమును కలుగజేయుటయే కాక మధురమైన యుపదేశములనిచ్చి యాశీర్వదించెను.

చదువరులారా !!

భాగవతకల్పవృక్షశాఖలు నానాటికి వృద్ధికాజొచ్చినవి. ప్రభుని నందనవనమందు పారిజాతమువలె పరిమళించిన యొక భక్తనారీమణి 'యశోదామా'ను గూర్చి తెలిపికొనుడు.

కృష్ణుని కన్నకుమారునిగా భావించి - పోషించి - లాలించి ఆనందించినది యశోద!! కలియుగమున శ్రీహర నాథుని కన్నకుమారునిగా భావించి మాతృవాత్సల్యమన్న ఇటులుండవలెనని ఆయమ్మ నిరూపించినది. ఈమె జన్మ స్థలము 'బంకూరా'. భర్త మణీంద్రముఖోపాధ్యాయుడు. ఈయననే తరువాత నందబాబని పిలిచెడివారు. ఈయన జార్సుగూడా స్టేషనులో ఛీఫ్‌స్టోరుకీపరుగా పనిచేయుచుండెను. అసిస్టెంటు స్టేషను మాష్టరుగారగు నాగేంద్రనాథుని వలన హరనాథుని దివ్యచరిత్రను ఈదంపతులు వినిరి.

ఒకనాటి రాత్రి ఆమె గాఢముగా నిద్రపోవు చుండెను. స్వప్నములో ఒక దివ్యతేజోమయమూర్తి కనిపించెను. ఆమె చుట్టును కాంతిరేఖలు పండువెన్నెలవలె వ్యాపించుచుండెను. ఆయమ్మ నెమ్మదిగా వారి పూజామందిరము చెంతకు వచ్చెను. యశోదమా "మీరెవర" ని ప్రశ్నించెను. ఆయమ్మ మేలిముసుగు ధరించినదై చేతివ్రేలితో పూజాపీఠమునగల ఠాకూరు పటమును చూపించుచుండెను. యశోదమా తన దృష్టినంతయు ఠాకూరుపై కేంద్రీకరించెను. చిత్రమేమనగా ఆ పటములోనుండి అయిదేండ్ల బాలుడు పైకివచ్చెను. ఆ బాలుడు క్రమముగా హరగోపాలు డయ్యెను. ఠాకూరును కరసంజ్ఞచే చూపించిన ఆవనితామణి - ద్వారమును తెఱచి దగ్గఱనే కల పుష్కరిణిలో అంతర్థానమయ్యెను.

మిత్రులారా! అట్లు అంతర్ధానమైనవారెవరను కొన్నారు? మీరు ఊహించుకోగలరు. ఆమెయే జగన్మాత కుసుమదేవి. బాల్యావస్థలో "ఈయన మీతండ్రి - ఇతడు నీ సోదరుడు - ఈమె నీచెల్లెలు" అని సూచించునది తల్లియే!! జిలిబిలి పలుకులను తొల్దొల్త శిశువునకు ఉగ్గుబాలతో అందజేయునది తల్లియే!! అంతవఱకు జన్మాంతర మాయచే బాలగోపాలుని మఱచి పోయిన మన యశోదకు - పుత్రరత్నభాగ్యమును అందజేసిన తల్లి కుసుమ తల్లియే !!

పురుషులెంత చదివినను - ప్రజ్ఞావంతులైనను - సంపాదన పరులైనను ప్రయోజనములేదు. వారిని తోడునీడవలె నంటి

పెట్టుకొనియుండు ధర్మపత్నుల సత్ప్రవర్తనవలన - సదాచారము వలన - త్యాగము వలన భర్తలు ఉత్తమ జీవనులుగా రాణింపగలరు.

ప్రాపంచిక భోగవిలాసముల వైపునకైనను - ప్రభుని వైపునకైనను మళ్ళించగలది స్త్రీయే !! ఆ మహిళామణులను ప్రభువు మాతృమూర్తులుగా గౌరవించుటయేకాదు. వారు భక్తి మయ మందిరమునకు ఆశాజ్యోతులమని భాషించినాడు. ఈ విధముగా యశోదమా హరగోపాలుని కుమారునిగా భావించి తరించినది. ఈ పుణ్యదంపతులకు ప్రభువు చూపిన లీలలు - రక్షణలు వేనకు వేలున్నవి. ఈ యశోదా నందుల పవిత్ర భక్తి ప్రేమలచే హరనాథ భాగవతము ఆరాధనీయ మైనది.

జపములచేతను - తపములచేతను — యోగాభ్యాసాదుల చేతను - ఉపవాసములచే లభించని హరగోపాలుడు యశోదా నందులకు నిర్మలమైన - నిరుపమానమైన ప్రేమానురాగములకు లొంగిపోయినాడు. ఒకనాడు నందవ్రజములో యశోదానందు లేరీతిగా గోవిందునిపెంచి ఆనందించినారో మనకు తెలియదు గాని పందొమ్మిదవ శతాబ్దియుత్తరార్థమున - యశోదానందు లనియెడు భావన గల భక్తదంపతులు - ఈబాల హరనాథుని పోషించి భావనా బలముతో జీవించిన ఘట్టములు నేడునుచూడ గలము. గతజన్మలలో తన్నుకుమారునిగా భావించిన నారీమణు లను హరనాథుడేదోవిధముగా మాతృమూర్తులుగా సంపాదించు

కొన్నాడు. భావనలేని అర్చన నిష్ఫలము. ఆ భావన శుద్ధ ప్రేమరసోజ్జ్వలము కావలెను. ప్రాపంచికపు కోర్కెలతో నిండిన హృదయములలో కృష్ణుడు నివసింపడు. మృదుభావ భరితములైన హృదయ కమలములయందు ఆయన నర్తించును; సంతోషమును ప్రవర్షించును. హరనాథభక్తలోక మున-స్త్రీలు బాలవఱకు హరగోపాలుని కుమారునిగాలాలింతురు. గోరుముద్దలుచేసి - పెరుగుతోనో - మీగడతోనో వెన్నతోనో ఆ ముద్దులయ్యకు తినిపింతురు. మాబాబు తినుటలేదని - పటిక బెల్లమో శర్కరయో తెచ్చి ఆముద్దను దానితోమేళవించి ఆపాట-యీమాట - ఆకథచెప్పుచు బువ్వను తినిపింతురు. జోలపాడెదరు. తల్లి నిత్యము తన చంటిబిడ్డను వేయికన్నులతో ఆదరించి పోషించునట్లే తల్లులుగూడ తన్ను ఆభావనలో - ఆవేదనతో - గారవించవలెనని ఆయన అభిప్రాయము. మీదు మిక్కిలి ఈబాలుడు అందఱి బిడ్డలవలె దగాచేయడు. కన్ను మూసినను-తెఱచినను - ఏదియేమైనను అంటిపెట్టుకొనియుండు పెద్దబిడ్డ !! మఱియొక గొప్పవిశేషము. మనము ఏడ్చిన ఈ బాలుడును ఏడ్చును. నవ్విన నవ్వును. ఏమియులేదన్నచో జాలిచూపులతో దైన్యముతో మన దయాదాక్షిణ్యములకై ఎదురు చూచుచుండును - ఆబాలుడే మన హరగోపాలుడు. ఈయన మాతృలోకమును పునరుద్ధరించెడుతీరులు - మహావేదాంతసూక్తి సారమణులుగా తోచును. కోటీశ్వరుల యింటికోడలియై - హంస తూలికాతల్పములపై పవ్వళించిన సుకుమారియై జీవించిన విమ

లామా బొంబాయి వాస్తవ్యులు భగవాన్‌దాస్‌మోడీగారి ధర్మ పత్ని. ఈదంపతులు మొదటినుండియు కృష్ణభక్తులు. వీరు ఎందఱెందఱినో సాధుసన్న్యాసులను సందర్శించిరి. 1915లో విఠలదాసు మెహతా అను హరనాథభక్తుడు గుజరాతీభాషలో హరనాథతత్త్వము - లేఖలు ప్రచురింపబడిన "పాగలు హర నాథలేఖావళి" గ్రంథములను తక్కువధరకు అందఱికి అమ్ముచు ప్రభుతత్త్వ ప్రచారముచేయుచుండెను. ఆపత్రావళిని భగవాన్‌దాసు చదివి మహానందమును అనుభవించెను. మాటి మాటికి "కృష్ణునామము చేయుము" అనునీతడు కృష్ణభక్తుడై యుండునని భావించెను. ఏపనిచేయుచున్నను - ఆలేఖలులోని సూక్తులు హృదయమును కదలించుచుండెను. ఆయనను ఎట్లయినను దర్శించవలెనని ఆయన ఆకాంక్షించెను. ఎట్టకేలకు ఒకరివద్ద అడ్రసు తీసికొని ఠాకూరునకు జాబువ్రాసెను. వ్రాయుటయే తడవుగా ప్రత్యుత్తరము వచ్చినది. అందు "సమయము రాగానే మీకు కనిపించెదను. అంతవఱకు రాధా కృష్ణనామము చేయుడ"ని వ్రాసెను. నాటినుండి భగవాన్‌దాసు ఆనామమును శ్రద్ధగా జపించుచుండెను.

ఆతరుణమున బాబా - కుటుంబ భక్తపరివార సహితముగా బొంబాయిలో మెహతాగారి యింటికివచ్చెను. అచట భగవాన్‌దాసు ఠాకూరునుజూచి ఆనందించెను. "మీవంటిపుణ్యాత్ములను చూచుటవలన ధన్యుడనైతిని" అని ప్రభువనెను. ఆమాటలకు ఆయన "ఈయనహృదయ మెంత విశాలమైనదో

కదా !" అనుకొనెను. క్రమముగా ఆయనకు ప్రభునియందు ఆసక్తి పెరిగెను. సోనాముఖిలో ఠాకూరునకెదురుగా ఈయన కూర్చుండి యుండెను. తేరిపాఱి చూచునరికి ఠాకూరునకు బదులుగా కృష్ణదర్శనమయ్యెను. ఇంటికివచ్చి యీవిషయమును విమలకు తెలియజేసెను. ఆమెయు ఠాకూరునందు అపారమైన భక్తిప్రేమలను జూపనారంభించెను. తరువాత ప్రభువు ఆమెను కన్నతల్లిగా భావించెడివాడు. ఆయమ్మయు మధురపదార్థములను మీరా వలె అనురాగభావనతో ఆరగింపజేసెడిది. ఆనందించెడిది. ఈ దంపతులకు ప్రభువు ఎన్నెన్నో లీలలు చూపినాడు. తనదయాళుత్వ మిట్టిదని నిరూపించుకొన్నాడు.

విమలామాకు ప్రభువువ్రాసిన లేఖలలోని కొన్నివాక్యములు – ఆభక్తనారీమణి ఉత్కృష్టతను వెల్లడించును.

"నీవు ప్రేమకు ప్రతిరూపమవు."

"నీవు ప్రపంచములోని చాలమందికి ఆదర్శనారివి కాగలవు."

"ఎల్లప్పుడు నీతోనేయుందును. అట్లే నేను నీచెంతనే యున్నట్లు భావించెదవు."

"అమ్మా! నీవు నా యశోదవు. నేను హరగోపాలుడను. ఈరీతిగా నా యవతారములలో ప్రేమించుచుందుము."

"నీకు నచ్చినట్లు నన్ను అలంకరించుకోవచ్చును. నేను నీకుమారుడను."

అత్రొబారి జన్మోత్సవము

మైమన్ సింగ జిల్లాలోని అత్రొబారిలో **1923** జూలైలో ప్రభుని జన్మోత్సవము జరుపబడెను. ఈ యుత్సవము మిగిలిన యుత్సవాలన్నిటిలోను ఉత్కృష్టమైనదని చెప్పవలసియున్నది. ఇందు లెక్కకుమించిన హైందవులు-మహమ్మదీయ భక్తులెందఱో పాల్గొన్నారు. ఈ యుత్సవములను రసమోహన రాయ్, హరేంద్ర నారాయణ, రజనీకాంతకార్ యామినీనాథ చౌదరి, సతీశచంద్రరాయ్ మున్నగువారు చక్కగా నిర్వహించిరి. భక్తమణియగు ధర్మారావు నాయుడు ఒకరోజు ముందుగా వచ్చి 54 మనిక్తోలావీథిలోని శరచ్చంద్రుడే యింటిలో విడిది చేసెను. దేశములోని నాల్గుమూలలనుండి భక్తులు వచ్చిరి. వచ్చిన వారందఱు కలియుగ సులభ ప్రసన్న మూర్తులు-దయామయులైన శ్రీ కుసుమహరుల దివ్యచరణ సరోజాలను సందర్శింప నువ్విళ్ళూరుచుండిరి. సూర్యోదయ మయ్యెనని - అంతవఱకు గాఢాంధకారమున క్రమ్మియున్న పద్మినీ కాంతలు వియోగకారాగారమునుండి విముక్తిచెంది-శతపత్రములతో వల్లభునకు స్వాగతాంజలిని పట్టుచుండెను. ఉత్సవవేదిక-చక్కగా అలంకరింపబడెను. భువనములనేలు వారు-వచ్చుచున్నారుగదా! యని వసుంధర సర్వాలంకార శోభితయై-మధురమోహనమూర్తియై-నూత్న కుసుమమాలా విరాజితయై-పూజ యొనర్ప సిద్ధముగా నున్నట్లు కానవయ్యెను. వాటలకిరు ప్రక్కల తోరణములు వ్రేలాడుచుండెను. ప్రేమాను

రాగాలకు నెలవులైన తల్లులు భక్తి వెల్లువలవలె చేతులతో పూలదండలను-మంగళనీరాజనములను పట్టి ఎదురు చూచుచుండిరి.

శరత్‌బాబు-ధర్మారావు నాయుడు గార్లిరువురును హౌరా స్టేషనునకు కారుమీద-యుగళమూర్తులను తోడితెచ్చుటకు వెళ్లిరి. కొన్ని క్షణములలో రైలు స్టేషనునకు వచ్చెను. వెంటనే రెండవక్లాసు పెట్టెనుండి హరనాథుడు పసిబాలుని వలె ప్లాటుఫారముమీదికి దూకెను. వెంటనే భక్తులు ప్రభుని మెడలో పూలదండలు వేసి పాదాభివందన మాచరించిరి. శరత్‌బాబు-ధర్మారావునాయుడు-మాతృశ్రీ కుసుమదేవి చరణ కమలాలకు నమస్కరించి మెడలో పుష్పమాలికలను వైచిరి. ప్రభువు విరామములేని ప్రయాణముల వలన బాగుగా అలసి యుండెను. నడువలేక పడచుచుండెను. ప్రభుని కుటుంబము-భక్తులు అందఱు-శరత్‌బాబు ఇంటికి కొన్ని క్షణములలో కారుపై నెక్కి వచ్చిరి. జగన్మోహనదాసు-భగవాన్‌దాసు-విమలామా మతికొందఱు కలకత్తానుండి తదితర పట్టణములనుండి వచ్చిరి.

శరత్‌బాబు - ఆతని సతీమణి మాతృశ్రీకి కుటుంబ సభ్యులకు మేడపై అంతస్తును-ఠాకూరునకు భక్తులకు క్రింది భాగమును విడిదిగా ఇచ్చిరి. వారి ఆతిథ్యములో ఆదరణ-ప్రేమానురాగాల్లు తాండవించుచుండెను. ఆరోజంతయు ప్రభువు

పసిబాలునివలె తల్లులతో ఛలోక్తులాడుచు తన అపారప్రేమను ప్రదర్శించెను. పసందైన విలువైన విందు చేయబడినది.

నీరసముగా-పేలవముగానున్న ప్రభుని వైఖరినిజూచి భక్తులు లోలోపల "మా బాగునకై నీ సర్వస్వమును ధారపోసి జలమంతయు వర్షించిన మేఘునివలె కారుణ్య పయోనిధివలె దీనముగా కనిపించుచుంటివా?" అని పరితపించసాగిరి. వారందఱు వినుచుండగా "నేను ఈలోకమును విడిచివెళ్లవలసి వచ్చినచో మీరేమి చేసెదరు?" అనిమృదువుగా తాకూరనెను. "ఆయశుభము తొలగిపోవును గాక"-యని అంతరంగములలో అందఱు పలవించిరి. మఱికొంతమంది "బాబా! నీవట్లు చేసెదవా" అనిరి. ప్రభువు "నేనెప్పుడును ఆరీతిగా చేయన"నెను. కొంతసేపు ఆగి గంభీరముద్రతో "నాయనలారా! మీరు నరకమునకు వెళ్లినను మిమ్ము విడిచిపెట్టను. అక్కడికివచ్చి మిమ్ము ఉద్ధరించియే తీరెదన"నెను.

వందలకొలది భక్తులు ప్రభుని దర్శించుచుండిరి. తెలియని ఆవేదనతో ఆర్తితో ఏడ్వనారంభించిరి. ఆప్రభునకు-భక్తులకు గల సంబంధమెట్టిదోకాని-ఆ చరణకమలాలకు-ఆ వీక్షణామృత ప్రసారమునకు - ఆ మధుర భాషణములకు దూరము కాలేక పోవుచుండిరి. సాయంకాలము అయిదు గంటలయ్యెను.

ఆ రాత్రి త్రయినులో బయలుదేరి ప్రభువు-మిగిలిన వారు-తెల్లవారు సరికి ఈశ్వర గంజిస్టేషనునకు చేరిరి. అక్కడవేచియున్న భక్తులు యుగళమూర్తులను దర్శింప ముందునకు వచ్చిరి.

ఆ యా రీతుల వారిని సంతోషపఱచి ప్రభువు-మాతృశ్రీ-భక్తబృందము బ్రహ్మపుత్రానదిని స్టీమరుపై దాటిరి. కాని తీరముచేరుటకు పూర్వము ఒక పెద్ద తుపానువచ్చెను. బ్రహ్మపుత్ర-ప్రభువును దర్శించుటవలన-కల్గిన ఆనందమునకు అవధులు లేవని చెప్పుటకు కాబోలు విజృంభించెను. వాయువు సర్వేశ్వరునకు జయజయ నినాదములు వినిపించదలచినట్లు మర్మరధ్వనులతో సర్వత్ర వ్యాపించెను. స్టీమరులోని వారందఱు భయవిహ్వాలులై యుండిరి. ఆ విషమపరిస్థితిలో స్టీమరు నదిలో మునిగిపోవునను కొన జొచ్చిరి. ఠాకూరు "నా బిడ్డలారా! భయపడుటవలన ప్రయోజనము లేదు. ఈ భయము-సంసారభయముకూడ ఒకలాగుననే యుండును. హృదయ ...ర్వకముగా హరిని కీర్తింపుడు. ఆ...యే మనలను రక్షింప...డు" అనెను. ఆ మాటలు పూర్తియైన కొన్ని క్షణములలో ...కృతి ప్రసన్నవదన...ది.

అందఱును అ...త్రోబారీ చేరిరి. ఉత్సవ వేదికను సమీపించిరి. భక్తులకు చక్కని విడిది యేర్పాటు చేయబడెను. ... గం॥ 11 లకు భోజనములు జరుగుచుండెను. భక్తులమధ్య ధర్మారావు కనిపించకపోవుటచే ప్రభువు "అతనిని వెదకు

డ"ని రి. భక్తులు ఒకచోట నిద్రపోవుచున్న ధర్మారావునుతీసికొని వచ్చిరి. బాబా ప్రక్కనే ధర్మారావు కూర్చుండగా పిల్లవానికి అన్నము ను తినిపించునట్లు ప్రభువు ఆయనకు ముద్దలు నోటి కందించెను.

అది వర్షాకాలము. ఆకాశము మేఘావృతముగా కనిపించెను. ఎటచూచినను జలమయములైన మైదానములు-పొలములు-నామస్మరణామృతముచే తడిసిన భక్తుల హృదయముల వలె తోచెను. ఆ సాయంకాలమున సంకీర్తనము భావయుక్తముగా జరిగెను.

మఱునాడు జన్మోత్సవము. ఆకాశము నిర్మలముగా నుండెను. భక్తులందఱును యుగళమూర్తులకు ప్రణామము గావించిరి. మహాపూజ జరిగెను. అదే సమయమున పూరీ నుండి జ్యోతిష్‌బాబు టహలుబాబు టెలిగ్రామిచ్చిరి. అందు "బాబా! ఈ సమయమున పూరీలో మా పూజలందికొనుచున్నావు. అత్రొబారీలో పూజాకార్యక్రమము ముగిసెనా? "అనియుండెను. అందఱు వినుచుండగా "నేను పూరీలోను ఉన్నాను" అని సమాధానమిచ్చెను. ఆ మధ్యాహ్నసమయమున ప్రభువొక గదిలో నిద్రపోవుచుండెను. కార్యకర్తలు లోపలికి ఎవ్వరిని పోవలదనిరి. తారాప్రసాద్ ఘోషు తమాలినీ మఱికొందఱు లోపలికి వెళ్ళిచూడగా హరనాథుడచట లేడు. జగన్నాథుడే కనిపించెను.

భక్తులందఱును "జై హరనాథ జై జగన్నాథ" అని గానముచేసిరి.

విశ్వప్రేమ భరితములైన చూపులతో - ఆశీస్సులతో భక్తులను సమాదరించిన యుగళమూర్తుల విశాల కృపాభావమును వేనోళ్ళ కొనియాడుచు మంగళము పాడిరి. ప్రభువు అందఱిని ఉద్దేశించి సందేశములనిట్లందజేసెను.

"పిచ్చివాని ఆట పిచ్చివారికే తెలియును."

"నా జీవితము సీలువేయబడిన గ్రంథము."

"ఈ యాట అనంతమైనది. ఈ యాటలోని రహస్యమెవ్వరును గ్రహింపలేరు."

"నన్నుగూర్చి తెలిసికొనవలెనని తపించుటకన్న హరి నామమున అమూల్యమైన కాలమును వినియోగింపుడు."

"మీయందఱికై నేను ఉన్నతోన్నతమైన గోలోక ధామమును విడిచి వచ్చితిని."

ఈ మరు భూములలోఁ బ్రే
మామృత వాహినులు పాఱునటు సేయఁగదే!
నీ మధుర కీర్తన సుఖం
బీ మనువునఁగూర్చుచు మురిపించఁగదోయీ!

## గద్యము

ఇది శ్రీమత్కృష్ణమనోహరవరప్రసాదిత మధురకవితావిభూషిత, భాషా విజ్ఞాత, వినయవిఖ్యాత, విశ్వబ్రాహ్మణాన్వయసంజాత, ఆదిత్యబ్రహ్మర్షి గోత్రపరిపూత, ప్రణవనూత్రవినీత, శ్రీనారాయణాంబా సత్యనారాయణాచార్యప్రథమసుత, చిన్మయబ్రహ్మకవి ప్రణీతంబైన శ్రీహరనాథ భాగవతమందలి దశమస్కంధము.

---

జయ శ్రీ కుసుమ హర

# శ్రీ హరనాథ భాగవతము

## ఏకాదశ స్కంధము

శ్రీయుత ! ప్రేమైక యశ
శ్శ్రీయుత ! భాగవతహిత ! ధరిత్రీనేతా!
శ్రేయస్సంధాత! నవా
ధ్యాయఫలవిరాజిత ! మహిమాంచితచరితా !

దశేంద్రియములు చాల చపలములైనవి. ఐహికసుఖము లనే అవి ఎప్పుడును కోరుచుండును. వానికి రాజుమనస్సు. రాజశాసనమును బట్టి సేవకులు పనిచేయునట్లే ఇంద్రియములు ఆయా సుఖానుభవములను అనుభవించుచుండును. ఈజగత్తే పరిణామశీలము గలది. దీనిని నమ్మినవారెవ్వరుమ జీవితపర మార్థమును సాధించలేకపోయిరి. సృష్టి స్థితి లయములకు మూలకారణుడు - జీవితేశ్వరుడయిన పరమాత్మయందు పది యింద్రియములను చేర్చుటను ఉపవాసమందురు. భగవంతుని సన్నిధినే నేనున్నానను భావనయే ఉపవాసము. ఈముఖ్యవిష యమును మఱచి - ఆరోజంతయు భోజనముచేయకుండుటయే యుపవాసమని చాలమంది భావించుచుందురు. యోగికి, భక్తు నకు, సాధకునకు యుక్తాహారవిహారములు చాల అవసరము. విశ్వజగన్నాటకకర్త మనహృదయ మందిరమాలయందే

యుండి సర్వసాక్షిగానున్నాడనియు - సర్వకర్మలను ఆయనకు సమర్పించి తానొక నిమిత్తమాత్రుడుగా జీవించుటయే భక్తుని లక్షణము.

కలియుగజీవులు మిక్కిలి సోమరులు - స్వార్థపరులు - వాక్శూరులని తెలిసిన హరనాథుడు-తనవారిని అతి చిత్రముగా ఆకర్షించి - ప్రేమాస్త్రముచే వారి హృదయములను వశపఱచు కొనును. భగవత్సేవకు అనువైన వానినిగా వారి ఇంద్రియము లను - మనస్సును అదుపులో నుంచుచుండుట యనునది హర నాథుని ప్రత్యేకకృప. అష్టాంగములను సాధించి - అమనస్క యోగమును సమార్జించి జితేంద్రియుల మనుకొన్న గొప్ప తపోధనులు-జ్ఞానులు - ప్రకృతి వికటనాట్యమునకు ముగ్ధులై తమ కర్తవ్యమునే మఱచిపోయిరి. అట్టిపరిస్థితిలో కలియుగ మెక్కడ? భగవద్ధ్యానము చేయుట ఎక్కడ? ఈయుగమున కూడ అతి సులభముగా ప్రభువును పొందవచ్చునవియే హర నాథుడు బోధించినాడు. బోధించుటయేకాదు - తన్ను శరణు గోరినవారి భారములను తానే వహించి వారి యిహపరలోకము ము చక్కగా తీర్చి దిద్దుచున్నాడు. తన అసాధారణ కృపా క్షముచే జీవుల పాపపంకిలమును కడిగివేసి — అందు అమూల్యములైన ప్రేమబీజములను నాటి - అందుండి ఆధ్యా త్మిక సుఖజీవితలతా నికుంజములను సృష్టించుచున్నాడు. నిజము ఆలోచించినచో - నాస్తికులు - భ్రష్టులు - సంశయ

గ్రస్తులు - దుర్మార్గులైన వారెందరెందరో ప్రభుని అపార ప్రేమవలన చిత్రముగా భాగవతశిఖామణులైనారు.

పాఠక సోదరులారా !

ఇంతవఱకు హరినాథునిచే ఆకర్షింపబడినవారు సంపూర్ణముగా సజ్జనులుకారు, సాధకులుకారు. అయినను వారిని ఆదరించి — సంసార రహస్యమును నచ్చజెప్పి - కృష్ణుని మహిమను వివరించి - అంతయు తానే చేయుచున్నను - కృష్ణుని కృపవలన అంతయు జరుగుచున్నదని చెప్పుచు - తనబిడ్డలను అహంభావ పిశాచికి ఏమాత్రము గుఱికాకుండ ఎప్పటికప్పుడు కాపాడుకొనుచున్నాడు. ఈ రక్షణ ఈ వాత్సల్యము - ఈ శరణాగత పరిపాలనదీక్ష మనకెక్కడను గానరావు. ఆయన సర్వవేద సారముగా - సకలసాధనసారాంశముగా - భవసాగర తరణోపాయముగా - ఆనంద నిధానముగా చెప్పినది నామ స్మరణయే !!

నామస్మరణ యనిన చులకనగా కనిపించును. యజ్ఞములు - అర్చనలు - అభిషేకములు - పూజలు మున్నగువాని వలన ఘనత గొప్పప్రయోజన ముండునని ప్రజలనుకొనుచుందురు. మనఃపూర్వకముగా చేయని సాధనవలన ఎవ్వరును ఏనాడును తరించుట జరుగనేరదు. గంగలో స్నానము చేసిన వారే పరిశుభ్రతతో చిత్తశాంతితోను నుండగలరు గాని చేయని వారికి ఆలాభములు సిద్ధించునా? ప్రభువు నామస్మరణకు అంత

ప్రాధాన్య మిచ్చుటను గూర్చి కొంచెము ఆలోచించినచో అందలి విశిష్టత మనకు విదితము కాగలదు.

భగవంతునకు కోటి నామములున్నవి. ఏనామముతో పిలిచినను ఏరూపముతో కొల్చినను ఆయన దర్శన మిచ్చును. కాని దానికి విశ్వాసము కావలెను. కొంతమంది యాంత్రికముగా అన్నియు చేయుదురు. కాని అందు విశ్వాసము లోపించును. ప్రభువు నామమును దివ్యమంత్రమని వర్ణించినాడు. ప్రియా ప్రియుల సమాగమమునకు ఒకమధ్యవర్తి కావలెను. అట్లే ప్రభువునకు మనకు విడివడని ఆత్మీయ బంధుత్వమును - ప్రేమానుబంధమును గూర్చుటకీ నామమంత్రమే సహాయ పడును. నామస్మరణ అనగా దేవుని పిలుచుటయే !! పిలుపు ప్రేమగల తావులలో వేఱుగా నుండును. ఆ ప్రేమ ప్రాపంచిక బంధములకు అతీతముగా వ్యక్తిని నడిపించి తీరును.

వేదశాస్త్రములను చక్కగా చదివి - ఇతరులకు శ్రావ్యముగా చెప్పగల పండితుడు సైతము అందఱితోపాటు ప్రాపంచిక భోగానుభవ ప్రవాహములో కొట్టుకొని పోవుచున్నాడు. తనకున్న జ్ఞానమేమైనది? ఆచరణలో అదృశ్యమైనది. ప్రభువు నాహృదయమందే యున్నాడు. ఆయన పెక్కు చిక్కులలో చిక్కుపడిన జీవిత నౌకను - తిన్నని నదీమార్గమున నడిపించు చున్నాడు. నాకు తెలియకుండ నా జీవితావసరములను తీర్చు చున్నాడు. పాటుపోటు లున్నను - విశ్వాసమును నిలుపుచు కాపాడుచున్నాడు. ఆయనయేలేని పక్షమున నాజీవితము -

ఎడారియే - నిర్గంధ కుసుమమే - చిల్కలేని పంజరమే !! ఆ స్వామికి అన్నివిధాల ఋణపడి యున్నాను. ఆయన తోడి మైత్రి - ఆయనతోడి ఆటలు - పాటలు - ఆయనతోడి వల పులు - తలపులు నిజముగా ఎంతమనోహరము లైనవి !! ఆయనను పిలువక — తలచక బ్రతుకలేను. నాసర్వము ఆయ నయే!! అనుభావన-కృతజ్ఞత ఈనామస్మరణలోని అంతర్యమని పాఠకులు గ్రహింతురుగాక !

పదినిముసములు నామస్మరణ అయిన తరువాత - మనస్సు దానిని మఱచి మఱియొక లౌకిక దృశ్యముల వైపునకు పోవుచుండును. క్రొత్త క్రొత్త యాకర్షణలకై పెనుగులాడు చుండును. అట్టిచో దానిచే నామము చేయించుట - కోతికి చదువు చెప్పుటయే !! ఈ విషయమున శ్రీ హరనాథు డొక మాట చెప్పియున్నాడు. మడిమైల - స్థలము - అను విచక్షణ లేకుండ నీవు నామముచ్చరింపవచ్చును. మొత్తముమీద సంకీర్త నలో కూర్చున్నప్పుడు నీమనస్సుచు ప్రభుని సుందరమూర్తి పైని - గుణగణములపైని నిలుపుము. అది సహజముగా చంచలమైనది. కావున అటు నిటు తిరుగుచునే యుండును. కాళ్ళు పీకిన తర్వాత అదంతటదియే స్వస్థానమును చేరును. నిర్విరామముగా పట్టుదలగా నీసాధన చేయుచున్నచో - ఒక నాడు నీమనస్సు చలనములేని సరస్సువలె -వాయుసంచల నము లేని దీపకళికవలె స్థిరముగానుండుట జరుగునని ఆయన రహస్యమును వివరించినాడు.

నిరంతర నామస్మరణ చేయుటవలన — మాయాదేవత మనలను తాకుటకే భయపడును. అంతర్వాణి అన్నివిషయము లను బోధించుచుండును. ఏది యేమైనను నాప్రభువే నాకు శాశ్వత సుఖసంపదలు అను ధైర్యము - సంతోషము కల్గుచుండును. నాహృదయ బృందావనిలో నిత్యము ఆనంద మురళినూదుచు నిత్యచింతన రాసక్రీడను జరుపుచు నన్నునవ్విం చుచు - ఏడ్పించుచు - పడిపోయినచో లేవనెత్తుచు—ప్రేమభావ మును పట్టలేక కౌగిలించుకొనుచు - నీకష్టసుఖములునావి నీవు కనిపించకపోయినచో ఒక్కక్షణము జీవింపలేనని భాషించు నీస్వామిని మఱచుట ఎంత అపచారము!! ఎంత అన్యాయము!! ఎంత అకృత్యము!! ఎంత అజ్ఞానము !! ఆయనయే నేను - నేనే ఆయన యనుభావన - ఎంతమధురమైనది !! ఎంత అద్వైతానంద ప్రదమైనది !! బండను దొలిచియొక అందమైన ప్రతిమను తీర్చిదిద్దు శిల్పివలె ఈహరనాథుడు ఎందులకు పనికి మాలినవారిని కోరి - ప్రేమించి తన అద్భుతప్రేమ శక్తివలన అసామాన్యవ్యక్తులుగా భక్తి ప్రేమలముద్దలుగా - నిజమైన జ్ఞాన నిధులుగా - వైష్ణవులుగా తయారుచేయుచున్నాడు. తన ఆదర్శములు - మధురభావనలు - హరనాథ భక్తులలో కాని పించును. హరనాథతత్త్వము విశ్వమతమే !! భగవత్ప్రేమ తత్త్వమే !! అందాలచందమామ అందనివాడయినట్లే - సుమ ధుర నదీనదములు అందనిపొత్తయినట్లే - మందశీతల మలయపవనములు అందనివైనట్లే ప్రభువు అందనివాడు. జీవ

జాలమంతయు ఆయునదే!! ఈ దృష్టితో జీవితములను ప్రభు సమర్పితములుచేసి - నిశ్చింతగా - మందహాసరేఖలతో - విశ్వప్రేమానందముతో మధురక్షణములను వెళ్ళబుచ్చు హరనాథభక్తులు నిజముగా ధన్యులు!! తక్కువకాలములో ఎక్కువ ఫలము!! పెద్దశ్రమలేకయే ఫలప్రాప్తి. ఆఫలము చిన్నది కాదు. తఱుగు విఱుగులేని - పోలికలేని నిత్యానంద మధుర ఫలము.

హరనాథుడు గొప్పఆటగాడు. ఈయాట మనయాటగాదు. తానెవరో తెలియకుండ నాడుఆట. విషయము తెలిసినతరువాత ఆకర్షణ సన్నగిల్లును. తెలియనపుడు ఆకాంక్ష - ఆవేదన క్షణక్షణము పెరుగుచుండును. కృష్ణబృందావనములో ఆనందమేతప్ప ఇతర తాపత్రయము లుండవు. అచటికి చేరవలెనన్న ప్రేమకావలెను. ఆప్రేమ భగవన్నామము వలననే కల్గును. మీరేమియు చేయనక్కఱలేదు. నామమును పెదవులపై తాండవించునట్లు చూచుకొనుడు. చిత్రముగా మిమ్ములను అక్కడికి చేర్చెదను. నాకు ఆబృందావన మార్గము బాగుగాతెలియును. ఈ యాటలో స్త్రీపురుషులందఱును పాల్గొనవచ్చును. మనకు కని విని యెఱుగని ఆనందమును గూర్చు ప్రియాతిప్రియుడొక డున్నాడు. ఆయనను మీకు సన్నిహితునిగా చేయుటకై మీ చుట్టును తిరుగుచున్నాను. నామాటవినుడు. నాయోగ్యతా యోగ్యతలను గూర్చి ఆలోచింపకుడు. ర ం డు. అని ఆయనపిలుచుచుండును. ఎట్లు ఆడవలెనో - ఏమిచేయవలెనో ఆయనయే

మనకు బోధించును. ప్రేమ బృందావనికి బాటసారులమైన మనకు ఆ ప్రేమలోని మాధుర్యమును విలువను ఆయనయే చూపగలడు. ఆయనచూపించు ప్రేమ పదువాల్గు భువనముల లోను దొరకదన్నచో మఱియొకచోట దొరకుననుకొనుట తెలివి తక్కువతనము !! స్పెషలుట్రయిను అన్నిస్టేషనులలో ఆగదు. దానికి కావలసిన గమ్యమును చేరువఱకు ఒకచోనిలువదు. ఆ ప్రయాణములో ఎవ్వరికిని నియమములు - నిబంధనలులేవు. ప్రేమయే ఆకలిదప్పులు, సర్వము. అటువంటి ట్రయినులో మనల నందఱిని ప్రయాణికులుగా చేసి తనువును మనువును మఱచిపోవునట్లు చేయు నామగానలహరిలో మునుంచుచు తేల్చుచు- అపుడపుడు కనిపించుచు - హెచ్చరించుచున్న యీ నాయకు డెవరు? ఇతరుల జీవితములతో మనజీవితాలనుపోల్చిచూచినచో- మనప్రయాణము - ఉన్నతపథములలో సాగుచున్నది. అది ఏకాదశ గోపుర ప్రాంతము కాబోలును !!

కటక్ లోని నామయజ్ఞము

1923 సెప్టెంబరు 22వ తేదీని కటక్‌లో ప్రభుని నామయజ్ఞము జరుపబడినది. భగవంతునకు భగవన్నామము నకు భేదము లేదు. నిజము చెప్పవలెనన్న నామము దేవునికన్న గొప్పది. లోకకల్యాణమును కల్గించుచు - ఆత్మోన్నతిని కలుగజేయునదియే యజ్ఞము. యజ్ఞములు - ఐహికములు - పారలౌకికములని రెండురకములు. తమతమ కోరికలను నెఱ

వేర్పుటకు చేయబడునవి ఐహికములు. ఆ ఫలములు తాత్కా లికములైనవి. భగవంతుడే నిత్యుడు. ఆయనను పొందుటయే యావత్ప్రపంచ జీవులు సుఖించుటయే లక్ష్యముగా గలవి. పార లౌకికములు. మాయలోమున్గి తేలువారికి కర్తవ్యమును-ఆనంద మును కలుగజేయుటయే కాక జీవులకు నిజమైన జీవితగమ్య మగు ప్రభువును అందజేయు యజ్ఞమే నామయజ్ఞము. కలియుగ పాపజీవులను ఉద్ధరింపగలదే యిది. వేలువందలున్నవిగదా! యని మురిసిపోవుటలో సుఖములేదు. క్షణికములైన భోగ విలాసములకు వెచ్చించుటయు తెలివిగాదు. నామ ధనము మానవజన్మను తరింపజేయుటయే కాక సోదర మానవులకు ఉత్తమప్రశాంత స్థితిని కలుగజేయును. నామ యజ్ఞమంత పవిత్రమైనది: మహామహిమాన్వితమైనది. కాని భక్తివిశ్వాస ములులేక - ప్రభువును పొందవలెనను ఉద్వేగము-ఆలోచన లున్నను అందలి ఫలితము మనకు దక్కదు. గంగా జలమును తెచ్చుకోదలచినవారుమంచిపాత్రలను (పాత్రతలను) సంపాదించు కోవలెను. మిగిలిన పనులన్నియు చూచుటకు మనప్రభువున్నాడను ధైర్యముతో చాల మంది భక్తులు కటక్ చేరిరి. యుగళమూర్తులను కనులార తిలకించిరి; మనసార సేవించిరి. చిత్రమేమనగా క్రొత్తవారిని - ప్రాతవారిని అందఱిని కుసుమహరులు ఒకేవాత్సల్యరసమయ వీక్షణ ములతో పరికించిరి. భక్తులు తమ జన్మలు తరించెనని సంతో షించిరి.

ఆ యుత్సవమునకు ఆంధ్రభక్తరత్నమగు ధర్మారావు గారితో బొలిసెట్టి కృష్ణమూర్తి వి. రంగారావుగార్లు వచ్చిరి. ఆ యుత్సవమునకు ప్రియకుమార ఛటర్జీ పర్యవేక్షకులుగా నుండిరి. ఉదయము శ్రీ కుసుమహరులకు మహాపూజ జరిగెను. పూజా సమయమునవారిమూర్తులు— కార్తీకచంద్రుని శీతల కిరణ పుంజములను వెదచల్లుచుండెను. ఎంత చూచినను తనివి తీరకుండెను. రెండుగంటలు పూజ జరిగిన పిమ్మట ప్రభువు ప్రసంగించుట ప్రారంభించెను. దూరతీరాలనుండి వచ్చిన భక్తులు—మిగిలిన వారందఱు వారి దివ్య విగ్రహము లపై దృష్టి సారించియుండిరి. ధర్మారావు సోదరుడు ప్రభుని పాదపద్మముల చెంతనుండెను. ఇద్దఱు ప్రొఫెసర్లు ఎదుటనే యుండిరి.

"ఆప్తులారా!! ప్రపంచమును ఆడించునది ప్రేమ. ఆప్రేమయే సర్వజీవులకు ప్రాణాధారమై యున్నది. ఆ ప్రేమయే కృష్ణప్రభువు. ఆయనను పొందవలెనన్న—ముందుగా ఈర్ష్య-గర్వము-కోపము మున్నగు దుర్గుణములను విడిచి పెట్టవలె. మాయకు దూరమగుటకు ప్రాపంచిక జీవులతోడి సంబంధమును మానసికముగా తగ్గించుకోవలె. ప్రభువునే పంచప్రాణములుగా చూచుకోవలె. ఆనాడు మీరు ప్రేమ సామ్రాజ్యములో చేరగలరు. అందలి ఆనందమును వర్ణించు టకు మాటలులేవు. ఆ ప్రేమశక్తియే మిమ్మందఱిని ఇక్కడకు తీసికొని వచ్చినది. ప్రేమతత్త్వమునకు పునాదియైన నామ మును ఏనాడును మఱవకుడు."

ఈ ప్రసంగము ప్రొఫెసర్లను చక్కగా ఆకర్షించినది. ధర్మారావు అమ్మపాదాలకు నమస్కరించి-ప్రభుని పాదము లకు ప్రణమిల్లబోయెను. ఠాకూరు తటాలున తన పాదములను మంచముపై పెట్టుకొనెను. చేయునదిలేక ధర్మారావు వెళ్లి పోవుచుండెను. వెంటనే ప్రభువు ఒక తామరపూవును ఆయన వీపునకు తగులునట్లు విసరెను. ఆసంగతి కృష్ణమూర్తి సోదరుడు చెప్పగా ఆయన దానిని కనులకు అద్దికొని ఏకాంత ముగా ఏడ్చుచుకూర్చుండెను. నిరంతరనామజపము—ధర్మా రావును ప్రభువునకు అంత సన్నిహితునిగా చేసినది. ఆభక్త మణి జీవిత శేషమును మధురప్రేమలోనే ఆయన గడిపెను.

కృష్ణమూర్తి సోదరునకు ప్రభువు-లేఖలలోని కొన్ని విశేషములను గూర్చి ముచ్చటించెను. పూజ అనంతరము యుగళ మూర్తుల ఫొటోతీయబడెను. ఆచిత్రపటములే భక్త మందిరములయందు ఈనాడు పూజలందికొనుచున్నవి !!

మాతృశ్రీ అచటినుండి పూరీధామమువెళ్ళి జగన్నాథుని దర్శించెను. తే 2-10-23 దీని శరత్‌బాబు ఇంటివద్ద జరిగిన గోష్ఠిలో ప్రభువు భక్తిజ్ఞానములను చక్కని ఉదాహరణలతో నిట్లు బోధించినాడు.

"భక్తి — ఆత్మజ్ఞానమును కలుగజేయును. ఒక పేద పిల్లను శ్రీమంతుడు పెండ్లియాడెనను కొందము. అత్త మామలు - ఆపిల్లకు తమ కుటుంబ పద్ధతులనుచెప్పి ఆప్రకార

ముగా నడుచుకొమ్మని చెప్పుదురు. పుట్టింటివారు కడుబీదవారు. వారిమాట యెత్తకు. వారినిమఱచిపోయి యిక్కడ సంసారము చేయుమనుచుందురు. ఆ అమ్మాయికి జన్మనిచ్చిన తల్లిదండ్రు లను మఱచిపోవుట కష్టమనిపించును. పుట్టిన ఊరన్నను - కన్నవారన్నను ఆమెకు ఎక్కడలేని ప్రేమ. వారికి తాను దాచిన వస్తువులను అత్తవారికి తెలియకుండ ఇచ్చి ఆనందించును. అట్లని అత్తమామలను భర్తను మఱచిపోదు. అట్లే భక్తుడు కూడ తన ఐహిక విషయములయందు మక్కువ చూపుచు - భగవంతుని - భక్తులను మెప్పించుటకై ప్రయత్నించును. తన జీవిత ధ్యేయము - గమ్యము ప్రభువేయని క్రమముగా గుర్తించును.

శ్రీమంతుల యింటపుట్టిన అమ్మాయిని ఒకపేదవాడు పెండ్లాడెనను కొందము. తనపుట్టింటివారినే గొప్పచేసి అత్త వారింటివారిని చిన్నగా చూచును. పుట్టింటివారు గొప్పవారను దృష్టితో అత్తవారిని ఆమె చిన్నపుచ్చుచుండును. కొన్నాళ్ళకు గాని ఆయమ్మకు భర్త అనిన గౌరవము స్థిరపడదు. ఈ రీతి గానే భక్తుడు క్రమక్రమముగా ఆత్మజ్ఞానమును పొంది ఐహిక - ఆధ్యాత్మిక జీవితాలలోని ప్రాముఖ్యమును గుర్తించును. అయి నను భక్తుడు భగవంతునియందే ఆధారపడి యుండును. జ్ఞాని తన జ్ఞానసంపత్తిని తలచుకొనుచు నిర్గుణుడగు పరమేశ్వరుని పొందగోరును. నిజము చెప్పవలెనన్న భక్తి పరిపుష్టమైనపుడు- అది సుస్థిరమైన జ్ఞానముగా వెలుగొందగలదు" అని వివరించెను.

సోనాముఖిలోని ఆనందమేళోత్సవము :-

అనేక ప్రదేశములకు వెళ్ళుట — ఎడతెగని లేఖా రచనముల వలన ప్రభుని ఆరోగ్యము బాగుగాలేకుండెను. అయినను ఆనంద మేళోత్సవమునకు వలసిన ఏర్పాట్లన్నియు జరిగెను. యాదవేంద్రనాథ గంగూలి - రసమోహన్ మున్నగువారెందఱో ఆయుత్సవమునకు వచ్చిరి. సంకీర్తన - మహాపూజ మున్నగు కార్యక్రమములు జరిగినవి. యాదవేంద్రనాథ గంగూలికి 63 సం॥రములు; ఆతనిభార్యకు 47 సం॥ రములు. వారిమిత్రుడగు రసమోహన్ చమత్కారముగా "బాబా ! మామిత్రుడు యాదవేంద్రునకు ఒక కుమారుని ప్రసాదించిన బాగుండు న"ని అనెను. వెంటనే ఠాకూరు "కృష్ణుని అనుగ్రహమున్నచో ఇది యంత కష్టమైన పనికాదు. తప్పక ఈతనిభార్య ఒకకుమారుని కనగలద"నెను.

ప్రభుని అభయమిచ్చినట్లే వయసుమళ్ళిన ఆదంపతులకు పుత్త్రసంతానము గల్గెను.

దేశము నాల్గుచెఱగులనుండి వచ్చిన భక్తులందఱును అనంతకుండ సమీపమునగల ఉద్యానవనమున విడిసియుండిరి. రేపు ఆనందమేళోత్సవ మనగా ఆరాత్రి వివిధ ప్రాంతాలనుండి వచ్చినవారొకచో చేరి యిట్లు ముచ్చటించుకొనసాగిరి.

ఆంధ్రభక్తుడు :— ప్రియసోదరా ! మీదేయూరు ?

బెంగాలీభక్తుడు :— మాది కలకత్తా.

ఆ. భ :- మీరు ప్రభుని భక్తులెట్లయినారు ?

బె. భ :- నేనొకసారి ప్రభుని నామమువింటిని. అంతియే. తరువాత ఒకసారి చనిపోవునంతటి సుస్తీచేసినది. మృత్యువును పొందబోయి - ఆరాత్రి ప్రభువు అభయమిచ్చినాడు. నాటినుండి మేమందఱము ప్రభువునే నమ్ముకొంటిమి. మీరేలాగున ప్రభునివిశ్వసించిరి?

ఆ. భ. :— మాది విజయవాడ. మా ఆస్తిపాస్తులన్నియు పోయినవి. 'నా' అనువారెవ్వరులేక అల్లాడిపోవు సమయమున - ఏడ్చుచు నిద్రపోయితిని. స్వప్నమున యుగళమూర్తులు దర్శనమిచ్చి "నీకు భయములేదు. మేమున్నాముగదా" అన్నారు. నాటినుండి మాకుటుంబ సమస్యలు క్రమముగా చక్కబడినవి. ఆయనయే మా బాధ్యతలను చూచుకొనుచున్నట్లు - మాకు గట్టినమ్మకము గల్గినది.

గుజరాతీ భక్తుడు :— సోదరులారా! మమ్ములను అమ్మ బాబాలు అతివిచిత్రముగా ఆకర్షించినారు. 7 సం|| రముల క్రిందట నాభార్యకు తీవ్రమైన జ్వరమువచ్చినది. చావు బ్రతుకులమధ్య పెనుగులాడుచుండగా మాతృశ్రీ - మేలి ముసుగుతో దర్శనమిచ్చి ఆమెనోటిలో ఏదోమందు వేసినది. అంతియే. నాభార్య ఆరోగ్యవంతు రాలయి

నది. నాకేకాదు మాకుటుంబ సభ్యులందఱికి ప్రభు నామమే జీవనాధారము.

ఆ. భ. :— తమదేయూరు ?

మహమ్మదీయ భక్తుడు :- మాది కటక్. ఒకచోట హరనాథ నామమును విన్నాను. అదెంతో మధురముగా చెవులకు మనస్సునకు ఆనందమును కల్గించినది. నాటినుండి ఆ నామమునే చేయుచున్నాను. హరనాథుడు - అల్లాయే. మిమ్మందఱిని చూచినపుడు నాకు కల్గు నానందము వర్ణనాతీతము.

క్రైస్తవభక్తుడు :— మాది బొంబాయి. నాచదువు సాగలేదు. ప్రయోజకుడను గాకపోయితిని. ఒకవర్తకుని స్నేహము లభించినది. ఆయన హరనాథభక్తుడు. ఆయన మంచి తనము - త్యాగము — ఆదరణ - నన్ను ప్రభునిభక్తు నిగా చేసినవి. ప్రభునామములో ఎంత మాధుర్య మున్నది!!

పార్సీభక్తుడు :- మాది సూరత్. ప్రభుని నామము చేయుచుం డగా నాలోని - సంశయాలు తొలగిపోయినవి. ఒక తృప్తి ఏర్పడినది. నామనస్సులోని బాధలను - కోరిక లను ప్రభువు ఎప్పటికపుడు తెలిసికొని సహాయపడు చున్నాడను విశ్వాసమేర్పడినది.

మద్రాసు భక్తుడు :- మాది కోయంబత్తూరు. కొంతసేపు సుబ్రహ్మణ్యుడు-మఱికొంతసేపు గణపతి - దుర్గలయందు భక్తిగల నాకు - ఒక్క ప్రభునియందే మనస్సులగ్నమైనది. ఏపనిచేసినను - ఆయన సాయములేనిదే బ్రతుకు నడువదని గ్రహించితిని.

ఈరీతిగా వారు చాలసేపు సంభాషించుకొనుచు - ఒక తండ్రి బిడ్డలవలె అరమరికలులేని ప్రేమానురాగాలతో ఆరాత్రి-నిద్రపోయిరి.

ప్రభువు భక్తులనందఱిని ఆయారీతులుగా పలుకరించుచు - సమాదరించుచు - కౌగిలించుకొనుచు ఆశీర్వదించుచు - వారిజీవితములోని సంఘటనలను చెప్పుచు. వారిని ఆనందడోలల నోలలాడించెను. శీతలతరుచ్ఛాయలక్రింద పచ్చికయే ఆస్తరణముకాగా వ్రేపల్లెలో గోపాలురమధ్యనున్న కృష్ణునివలె ప్రభువు కనిపించెను. వారితో "నాయనలారా ! జీవితరంగమున అహంభావము ఎవ్వరికిని కూడదు. గడ్డిపోచకన్న మేము తక్కువవారమను భావన కావలసియున్నది. మధురమైన నామమును చేయుచు - ప్రేమతరంగాలో నీదులాడుచు సంసారమును చేయుడు, అన్నియుసుగమములు కాగలవు" అనిబోధించెను. ప్రభుని పొందవలెనన్న అపేక్షగలవారందఱు ఒకచోచేరి ఆనందించుటయే ఆనందమేళోత్సవము. ఈయానంద మేళోత్సవము అతివైభవముగా ముగిసినది.

ధర్మారావు సోదరుడు ప్రభువునకు లేఖవ్రాయుచు "బాబా! యీసంవత్సరము మాప్రాంతమున జన్మోత్సవము జరుప దలచుచున్నాము. తామిందులకు అంగీకరింప వలసి నదిగా" కోరెను. ప్రభువు దానికి సమాధానము వ్రాయుచు "నీ సంకల్పము మంచిదే!! జరుపబోవు నీయుత్సవమునకు ఆడం బరమక్కఱలేదు. అంతమంది భక్తులు సుఖముగా నుండుటకు వీలగు వసతిని కల్పింపుడు" అని తెలియపఱచెను. ఉత్సవము ఆంధ్ర ప్రాంతమున జరుపదలచినందులకు ఠాకూరు ఎంతో సంతోషించెను. ఇంతలో ప్రభుని మనుమరాలు 'మెంకు' వివాహముවිషయమై ఆలోచన ప్రారంభమైనది. తేదీ నిర్ణయింప బడలేదు. ఇది యిట్లుండగా కలకత్తాలోని తత్త్వప్రచారిణీ సభలో కొన్ని వివాదములేర్పడెను. ఆసందర్భమున బాబా భాగవతచంద్రమిత్రునకు చక్కని సలహానిచ్చుచు లేఖలు వ్రాసెను. మంకూకు 1924 మార్చి 11న వివాహముజరిగెను.

## నాగపూరు జన్మోత్సవము

నాగపూరులోని కొందఱు భక్తులు ప్రభుని జన్మదినోత్సవ మును జరుపవలెనని నిశ్చయించిరి. మాతృశ్రీ ప్రభువు - కొందఱు భక్తులతో కరగ్పూరువఱకువచ్చి - అక్కడి నుండి బొంబాయి మెయిలెక్కుటకై సిద్ధముగా నుండిరి. ఆట్రయినులో కలకత్తా భక్తులుండిరి. వారందఱు యుగళమూర్తుల పాదధూళిని శిరసావహించిరి. అందఱు ట్రయినులోకెక్కిరి. ఆరైలుపెట్టె పెళ్ళివారిపెట్టెవలె కనిపించు

చుండెను. సుగంధద్రవ్యములు - పూలదండలు, మధురపదార్థములు ఎటచూచినను కనిపించుచుండెను. రైలుగమనమునకు అనుగుణముగా ప్రభునామసంకీర్తనము భక్తులు చేయదొడగిరి. పిల్లగాలులు బాబాను పలుకరించు చుండెను. నామప్రియులైన మాతృశ్రీ - ప్రభుముఖారవిందములు చక్కని మందహాసరోచిస్సులతో వికసించియుండెను. ఆసన్నివేశము జీవితములో మఱవరానిదనిపించెను. నాగపూరుస్టేషను రైలుబండిచేరెను. అందఱు ఉత్సవశాలకు వెళ్ళిరి. కార్యకర్తలు దివ్యమూర్తులను పుష్పాలంకృతులను గావించిరి. నాగపుర పౌరులా సమయమున భక్తిప్రపత్తులను ప్రకటించిరి.

బారిసాలనుండి అక్షయ కుమారగుప్త - కుటుంబము ఆయుత్సవమునకు వచ్చిరి. మిద్నపూరునుండి తమాలినీదేవి- వారి అమ్మాయి వచ్చిరి. 1924 జూలై 1వ తేదీని ఉత్సవము ప్రారంభమైనది. భక్తులకు,బాబాబృందమువారికి టీ-ఫలహారము లీయబడినవి. ఈ యుత్సవములో గుజరాతీలు, బెంగాలీలు,మహారాష్ట్రీయులు - ఆంధ్రులు - తదితరులందఱు పాల్గొనుట ఒక ప్రత్యేకత!! వచ్చిన భక్తులు ప్రభునిదర్శనముచేసికొనుచు-ఆనందించు చుండిరి. ఆసాయంకాలము సంకీర్తన జరుపబడెను. మఱునాడే జన్మోత్సవము. బొంబాయినుండి విఠల్‌భాయి సత్. బల్ మెహతా వచ్చుటతో కార్యకర్తలకు ఆనందోత్సాహములు అధికమయ్యెను. దామోదర కంచిమహారాజను మంత్రవేత్త - పండితుడు - శ్రీకుసుమ హరనాథుల దివ్యనామము మహా

మంత్రమని-తనకుగల శాస్త్రజ్ఞానముతో ప్రసంగించగా అందరు సంతోషించిరి. మహాపూజ జరుగునపుడు ఠాకూరు మూర్తిత్వములో గౌరాంగుని మహాభావము సాక్షాత్కరించెను. అమ్మ చిఱునవ్వులో జగన్మాతృత్వము తాండవించెను. ఆ సందర్భములో ప్రభువు ఇచ్చిన కొన్ని సందేశములు :-

భారతదేశమున - తదితర ప్రాంతాలలోనున్న తల్లి దండ్రులారా !

"మీరు గృహస్థులుగానేయుండి తీయని కృష్ణనామమును చేయుచుండుడు. సన్న్యాసి కన్న గొప్ప ప్రయోజనమును పొందగలరు."

"మన ప్రియతమ నిత్యానంద గౌరాంగులు తమ అఖండ ప్రేమ రసవాహినులను ప్రవహింపజేసి పశుపక్ష్యాదులను తరింప జేయుచున్నారు."

"నామమును చేయుచున్నచో-నీవన్నియు చూడగలవు. నామస్మరణయే ప్రధానమనుకొనుము. మిగిలిన దృశ్యములు - స్వప్నములు ..లీలలు అవంతటవియే నిన్ను పలుకరించును."

"అందఱును తమతమ బరువు - బాధ్యతలను నాకప్పగించి హాయిగా చేతులెత్తి హరిగానముచేయుడు."

"నేను పిచ్చివానివలె మాట్లాడుచున్నట్లుండును. బాగుగా యోచించినచో నామాటలు చక్కని అర్థముకలవై యుండును."

ఎందరెందరో అజ్ఞాతవ్యక్తులు ప్రభుని భక్తులగుటయు-వారు ప్రభుని దర్శించుకొనుట జరుగుచుండెను. అదే విధముగా ఆంధ్రదేశమునుండి వెళ్ళిన పోలిసెట్టి రామదాసు సోదరునిచూచి "నాయనా! ఉపదేశామృతమును తెనుగులోనికి అనువదింపజేసి దానిని తెలుగు దేశమున ప్రచారము చేయుమ"ని హెచ్చరించెను. ప్రభుని ఆజ్ఞానుసారము దానిని తెనిగింపజేసి యావదాంధ్రమున ఈయన ప్రచారముచేసెను.

రామదాసు సోదరుడు బాల్యమునుండియు భక్తిశ్రద్ధలు గలవాడు. వీరి తండ్రిగారు కూడ ప్రభు భక్తులే!

చిన్నతనముననే పండరీపురమువెళ్లి-అక్కడనే సన్యాసిగా నుండవలెనని భావించగా తండ్రిగారు-తన కుమారుని ఇంటికి రప్పింపుమని బాబానుప్రార్థింపగా రామదాసుగారు-ఆ ప్రయత్నమునుమాని యింటికివచ్చిరి. కొందఱు మిత్రులు బాకూరు మహిమనుగూర్చి చెప్పగా విని ఈయన తే 8-6-1922 దీని మొదటిసారిగా దర్శించెను. ప్రభువు ఈయనను మిక్కలి ప్రేమాదరములతో చూచుటయే కాదు; మాతృశ్రీయు వాత్సల్యామృతమును వర్షించెను. భోజనసమయమున ప్రభువు-భక్తుల మనస్సులోని సంకల్పమును బట్టి చిత్రవిచిత్రములైన చేష్టలు చేయుచుండును. ఒకవైపు ప్రభువు భుజించుచు-ప్రసాదమును అందటి విస్తరాకులలోనికి విసరుచుండెను. అట్టి ప్రసాదమును పుచ్చుకొనుట కిష్టపడక-"ఆయన సర్వాంతర్యామియైనచో ఆ ప్రసాదమును ఆయన పంచునుగాక" అని

ఆయన సంకల్పించుకొనెను. కొన్ని క్షణములలో ఒక వ్యక్తి వచ్చి అందఱితో పాటు ప్రభుప్రసాదమును రామదాసు విస్తరిలో వడ్డించెను. ఆయనలోని సందేహము తీఱిపోయెను.

ఈయన మంచి పట్టుదలగల భక్తమణి. సబురిజస్ట్రారు ఆఫీసులో గుమాస్తాగా పనిచేయుచు భద్రాచలము బదిలీయయ్యెను. శ్రీరాముని దేవాలయమువలె - ఈపర్వతాగ్రమున ప్రభుని మందిరముండవలెనని సంకల్పించి-అహోరాత్రములు తపించి-శ్రమించి చిట్టచివఱకొక సుందరదేవాలయమును నిర్మింపజేసెను. ఒకనాడు రామకృష్ణాకృతులను ధరించి పిమ్మట కలియుగ జీవులను కాపాడుటకై అవతరించిన శ్రీ కుసుమ హరనాథుల చరణ కమలములను అర్చించియే పవిత్రగౌతమి ముందునకు సాగిపోవుచున్నది. రామదాసు సోదరుడు అచంచల భక్తి విశ్వాసములచే హరనాథ భక్తలోకమున ఖ్యాతి గాంచినాడు.

హరనాథ ప్రభువు బగల్పూరు వెళ్లి అక్కడిభక్తులను ఆనందపఱచి బృందావనమునకు వచ్చెను. బొంబాయి కలకత్తా బృందావన భక్తులు ప్రభుని రాకకెంతో సంతోషించిరి అమ్మతప్పక వచ్చి తీరవలెనని సోనాముఖి కెలిగ్రామిచ్చిరి. ఆ మఱునాడు మాతృశ్రీ బృందావనమును చేరుకొనెను. యుగళమూర్తుల సమాగమము చూచి దరినేకల యమునానది సంతోష పారవశ్యమున పరవళ్ళుద్రొక్కెను. మయూరములు వచ్చిన వారు రాధాశ్యామసుందరులే యని శ్యామవర్ణ భాసురములైన.

పురులను విప్పి నాట్యమాడినవి. లోకకల్యాణమూర్తుల దర్శన సమయమున మంగళతూర్యారవములు చేయవలెనని కాబోలు శుకశారికాకోకిలా భృంగములు చక్కనిగాన సభను గావించినవి. భక్తులు భావావేశముతో కుసుమ హరనామ సంకీర్తన చేసి ఆనందాశ్రువులను రాల్చిరి.

తరువాత ప్రభువు రాధానగర మహోత్సవములో పాల్గొనెను. మాతృశ్రీ అనారోగ్యకారణమున సోనాముఖి చేరుకొనెను. ప్రభువు జకీరా-హౌరా భక్తులకు దర్శనమిచ్చి కలకత్తాలోని మహాప్రసాద మహోత్సవమునకు హాజరయ్యెను. పిలిచిన భక్తుల ఆహ్వానమును కాదనక ఇంటింటికి తన దివ్య సందేశమును అందజేయుచు-ఒక్కక్షణమైనను విశ్రాంతికోరక దేశదేశముల పర్యటించెను. సోనాముఖిలో శ్యామసుందర సేవకైవచ్చి కడుభక్తిశ్రద్ధలతో ఠాకూరురాణి - ఠాకూరులు శ్యామసుందర సేవను గావించిరి. పాఠకులారా! చూచితిరా? ఒకరిచే పూజలందికొనుటయేకాదు; మానవ సమాజమును ఉద్ధరించుటకై వారు ఆదర్శభక్తదంపతులుగా గడపిన ప్రతిసన్నివేశము గణనీయమైనదే!! వయస్సు మళ్ళినను-శక్తి లేకపోయినను వారు మహాపూజ అగువలకు-దరిద్ర నారాయణసేవ అగువలకు వచ్చి మంచినీళ్ళయినను స్వీకరించెడివారు కారు. ముందు భాగవతసేవ-యేపరిస్థితిలోనైనను జరిగి తీరవలసినదే!! మాటలలోను - చేతలలోను-ఊహలలోను-చూపులలోను-అపారవినయప్రేమ మాధుర్యముల నొలుకబోసి మానవజాతికి

నూత్నజీవితమును ప్రసాదించిన యీ కృపావతారుల మహాభ్యుదయమును యీ చిన్నారి లేఖిని వర్ణింపలేక మౌనము వహించుచున్నది. ధర్మారావు రామదాసు సోదరులు-గోపాలపురముగాని కాకనాడగాని వచ్చి భక్తుల వేడుకను తీర్చవలసినదని ప్రభువునకు జాబులు వ్రాసిరి. ఠాకూరు కలకత్తాలోని తత్త్వప్రచారిణీ సభావ్యవహారములు ఇతర కార్యక్రమములుండుటచేత వారికి సమాధానమీయలేదు.

పూరిలో షష్టిపూర్త్యుత్సవము :-

1925 జూలై 2న అనాథాశ్రమ రజతోత్సవము జరిగెను. పూరీ స్టేషనునుండి అశ్వశకటములపై యుగళమూర్తులను ఆసీనులనుచేసి ఊరేగించుచు ఆశ్రమమునకు తోడ్కొని వచ్చిరి. రత్నాకరుడగు సముద్రుని పయోధారలచే ప్రేమ రత్నాకరులైన యుగళమూర్తులకు భక్తులు మహాభిషేకము గావించిరి. వేదమంత్రముల పఠనము జరిగెను. భారతదేశములోని నాల్గుదిక్కులనుండి భక్తులు ప్రభుని షష్టిపూర్త్యుత్సవమునకు శుభాకాంక్షలందజేయుచు-భక్తలోకమును సముద్ధరించు యుగళ మూర్తులకు జయమగుగాక!! భక్తిప్రేమలంతట ప్రచారమగును గాక"యని సందేశములను అందజేసినారు. చక్రవర్తులకు చక్రవర్తియైన ఠాకూరు చెంగట మహారాజ్ఞీవైభవముతో కుసుమదేవి దేదీప్యమానమగు తేజస్సుతో వెలుగొందుచుండెను. రాధానగరనివాసియగు రామగోపాల భట్టాచార్య పండితుడు సశాస్త్రీయముగా మహాపూజ నిర్వర్తించెను. ఆ దివ్యమూర్తులను

తిలకించుచు-ఇంతటి భాగ్యము నాకేలబ్బినదని పూరీధామము ఉప్పొంగినది. భక్తనరనారీజనము కన్నులు-జన్మ కల్గినందు లకు మురిసిపోయినది.

ప్రభుని సందేశము :-

"నేనెవరినో నాకే తెలియును. నాకే తెలియనప్పుడు నా సంగతి యితరులకెట్లు తెలియును?"

"మీరే నా ప్రాణము; మీరే నా సర్వస్వము కూడ."

"మీరే నన్నీ లోకమునకు తీసికొనివచ్చినారు. మీరు లేక నా యునికి యిచట అసాధ్యము."

"ఈ పూరీధామముగాని ఇందలి ప్రజలుగాని నాకు క్రొత్తగా కనిపించుటలేదు."

"ఈ రహస్యమును ఇకదాచలేను"

"ఈ నా ఆట ప్రపంచమంతట వ్యాపించియున్నది."

"నా నిర్యాణానంతరము 'హరనాథ' నామమందెట్టి శక్తిగలదో మీరే గ్రహింపగలరు."

పాఠకసోదరులారా !

ప్రభుని విశ్వరూపమును దర్శించుచునే యున్నారు. ఆంధ్రభక్తులలో ఉత్తమసాధకుడు - సహజవినయశీలి - మృదుమధుర హృదయుడు హరనాథ భక్తరత్నమగు మర

కాని సంపెంగరావుగారిని గూర్చిగ కొంచెము తెలిసికొందురు గాక!

సంపెంగరావుగారు చిన్ననాటినుండి ఆధ్యాత్మికచింతన గల్గి - సాధుపురుషులను దర్శించుచు - జీవితము తరించు మార్గములను అన్వేషించుచుండువారు. ప్రథమమున సన్న్యాసమును తీసికొనవలెనని ఉబలాట పడుచుండగా మిత్రులు ఠాకూరును గూర్చిచెప్పగా విని 1922 డిసెంబరు 31వ తేదీని సోనాముఖిలో జరిగిన ఆనందమేళోత్సవమునకు వెళ్లిరి. సుమారు 4, 5 వందలభక్తులు పలుప్రాంతములనుండి హాజరైరి. బొంబాయి కోటీశ్వరులు = సామాన్యభక్తులతో కలసి మెలసి భుజించుట ఈయనకు ఆశ్చర్యమును గూర్చెను.

ఇంటినుండి బజారునకు వెళ్ళుచున్న ఠాకూరు పాదపద్మములపైబడి "బాబా! నేను పాపిని. నన్ను రక్షింపుము" అని బిగ్గరగా ఏడ్చుచు ఈయన దైన్యముతో నుండగా బాబా "పాపములేదు లేలెమ్మ"ని హెచ్చరించుచు - కరపంకజముతో శిరమును నిమిరెను. పిమ్మట ప్రభువు అటనుండి కదలెను. ఆ కరస్పర్శ మస్తకమునకు తగిలినతోడనే-అపారమైన పరితాపాగ్ని చెల్లారిపోవుటయేకాక ఆనందము కల్గెను.

ఆ మఱునాడు ప్రభువు భక్తులమధ్యను ఆసీనుడై ప్రసంగించుచు "ఆలోచనలలో సన్న్యాసము - చూపులలో సన్న్యాసము చేతలలో సన్న్యాసము అదియే నిజమైన సన్న్యాసము.

మఠములలో నిర్జనప్రదేశాలలో నివసించుచున్నను - ఆ నిగ్రహములేనిచో నిష్ప్రయోజనమ"ని గంభీరముగా పల్కెను. ఆ మాటలు సూటిగా సంపెంగరావుగారికే అన్వయించెను. ఈయన సన్న్యాసదీక్ష విరమించుకొనెను. జీవితభ్రమణములో అనేక పరిణామములు కల్గినను - ఈయన నేటివఱకు అచంచల దీక్షతో - ఆదర్శ భక్త జీవితమును గడపుచు - హరనాథభక్త వనములో నెత్తావులను వెదజల్లు సంపెంగపుష్పముగా చెలువొందుట గమనింపదగి యున్నది.

## మాంఘీరు జన్మోత్సవము

మాంఘీరులో సబుజడ్జీగానున్న నరేంద్రనాథ చక్రవర్తి-ప్రియకుమారభటోపాధ్యాయుల ప్రోత్సాహముతో ఈ యుత్సవము 1926 జూలై 2న జరిగెను. మాంఘీరు బీహారు రాష్ట్రములోనిది. వేలకొలది భక్తులీయుత్సవమున పాల్గొనిరి. దీనదయాళువులు - నిత్యకల్యాణ మూర్తులైన యుగళ మూర్తుల మహాపూజ వైభవోపేతముగా జరిగెను. ప్రస్తుతము గానము చేయబడు "జై హరనాథజై కుసుమకుమారిజై" అను నామము అప్రయత్నముగా వినిపించెను. ఆ పవిత్ర నామము నచ్చోటనే ప్రారంభమయ్యెను. ప్రేమసముద్రుడైన ప్రభువు - ఈ సమయమున ఇచ్చిన సందేశములివి :—

"నా శరీరములోని చివరి రక్తబిందువును సైతము మీకై ధారపోసితిని.''

"ఈ యుత్సవ సమయమున నాపాదముల నంటకుడు"

"ఒక పెద్ద తుపాను నాహృదయ కుహరమున చెలరేగినది."

"ఈవిశాల విశ్వము నా క్రీడారంగము. అనాదిగా ఈ ప్రదేశమున ఆడుచునే యున్నాను. మఱి ఎంతకాలము ఈ దాగిలి మూతలు?"

"మీరందఱును మాటలచేతను ఊహలచేతను - పనుల చేతను సాధనచేతను నా గౌరవమును కాపాడగలరనియే ఆశింతును. సంపూర్ణముగా మీరు పవిత్రులుగా నుండవలెను."

బారిసాల్ల ఆశ్రమ సందర్శనము

1926 ఆగష్టు 30 వ తేదీని ప్రభువు ఈ యాశ్రమమును సందర్శించెను. ఆయాశ్రమమునే "హరకుసుమ కుంజ మ"ను చుండెడివారు. ఇది రెండంతస్తుల భవనము. దేశదేశముల నుండి భక్తులు వచ్చిరి. అందఱును యుగళమూర్తులను తనివోవ దర్శించిరి. మహాపూజయైనది. వాత్సల్య పరిపూర్ణ నేత్రములతో భక్తులను యుగళమూర్తులు ఆశీర్వదించిరి. తమ్ము ప్రభువు - మాతృశ్రీ ఎక్కువగా ప్రేమించుచు - రక్షించుచున్నారను భావనతో - మధురసంకీర్తనమును భక్తులు చేసిరి. ఆ యుత్సవ కార్యకర్తలు ఏ లోపము కలుగకుండ - ప్రతిక్షణము జాగరూకతతో నిర్వహించిరి. అంతమంది భిన్న భిన్న మనస్తత్త్వాలు వర్గాలకు చెందినవారు ఒకచోట కలియుట

రామయ్యగారి ఆనందమేమని వర్ణింపగలము? భక్తమనోఽ
భీష్టములెఱిగిన దయామయుడని గుర్తించి - తనజీవితమును
ప్రభువునకు ధారపోసెను. ప్రభుని ప్రశస్తపాదపద్మములు శిర
మున సోకుటచేత - ఆయన మధురకవియైనాడు. రామచంద్రు
నకు త్యాగరాజువలె హరనాథునకు సీతారామయ్యగారు భక్తి
ప్రేమరస ప్రపూర్ణములైన కీర్తనలను రచించి గానమొనరించి-
తరించినారు.

సీతారామయ్యగారి గీతములు - భక్తిప్రేమ భావరస
గుళికలై భక్తజనులను భావనాలోకములకు గొంపోవుచుండుట -
పరమానంద మొనగూర్చుచుండుట - ప్రభుని కృపావిశేషమే
తప్ప వేఱుగాదు. "కఱ్ఱపిల్లిచేత ఎలుకలను పట్టింతున"ను
ప్రభునివాక్యములీ విషయముననేకాక - ఇతరభక్తుల జీవితముల
యందును అన్వయించును. ఏవిధమైన బలము - యోగ్యత -
ప్రయత్నము లేక పోయినను తనకుతానై వారిని ప్రేమించి -
లాలించి - నూతన జీవితమునే ప్రసాదించి అద్భుతకార్యము
లను ఆయన చేయించుచుండును. శీతల చంద్రకిరణ స్పర్శచే
చంద్రకాంతములు స్రవించునట్లే — జలధరగర్జన మాలించి
మయూరి పురివిప్పి నాట్యమాడునట్లు - భాస్కరకర ప్రసా
ముచే పద్మిని వికసించి పులకించునట్లు శ్రీహరనాథుని కృపా
కటాక్ష ప్రసారముచే - కఠినకర్కశ హృదయ పాషాణములు
నీరైపోవును ........ పతితజన హృదయములు పల్లవించి -
పుష్పించును. మోడుబాఱిన జీవితములు నవ వసంత
విలాస విలసితములగును.

ఆహా ! ప్రభుని యవతారము దీనజనోద్ధరణైక ప్రభావ భరితముగదా !!

ఇక ఆదూరి సత్యనారాయణబాబు ప్రభునిదర్శించిన నాటినుండి శరీరాత్మలను సమర్పించి- జీవితమంతయు బ్రహ్మ చర్యమును పాటించి యుత్తమ భక్తజీవితమును గడవెను.

ఈ భక్తరత్నము ప్రభునితో సోనాముఖివెళ్ళి అక్కడి నుండి ఠాకూరు అనుమతిగైకొని తల్లితోకాశీకి పోయెను. దారిలో చేతిలోని డబ్బు పోయెను. ఎట్లెటో కాశీచేరిరి. అక్కడికి వెళ్ళిన తరువాత ఈతడు రోగపీడితుడాయెను. అజబ్బు- క్రమక్రమముగా విషమించెను. మరణించెను. తల్లిగోలున ఏడ్చుచుండెను. మూడుగంటల తర్వాత చిత్రముగా సత్యనారాయణబాబు కన్నులుతెఱచెను. పైకిచూడగా శ్రీ కుసుమహర నాథులు అభయహస్తములతో ఎదురుగా దర్శనమిచ్చిరి.

ఆహాహా ! యుగళమూర్తుల ఆశీర్భాగ్యముచే అతనికి పునర్జన్మ వచ్చెను. ఆ సందర్భమున సత్యనారాయణబాబు ప్రభునితో "ప్రభూ ! మఱల సోనాముఖి పోవలెననియున్నద"నెను దానికి బదులుగా "నీవు సోనాముఖి పోవచ్చును. కానినీవు నన్ను చూడజాలవు. మీతల్లినిమాత్రమే చూడగలవ"నెను. ఈ రీతిగా ప్రభువు తనయంతర్ధాన విషయమును సూచించెను.

సత్యనారాయణబాబు - మాతృశ్రీని ఎనిమిదేండ్ల కుమారీ భావముతో సేవించుచు - నిరంతరము పవిత్రనామమును

జేయుచు శేషజీవితమును సోనాముఖిలోనే గడపి - భక్తరత్నముగా అస్తమించెను.

శరీరసౌఖ్యము మఱచి పిలిచిన చోటికెల్ల వెళ్ళి తన సాన్నిధ్యముచే వారికి బ్రహ్మానందమును సమకూర్చుచు ప్రభువు-ఆనందనిధి-త్యాగమూర్తి అను బిరుదములకు సార్థక్యము కూర్చుచుండెను. 1927 మే 22వ తేదిని కృష్ణదాసును పిలిచి "నాయనా! నా శరీరము మా తల్లినుండి దూరమగుచున్నదని" చెప్పెను. ఆ వాక్యములోని ఆంతర్యమును కృష్ణదాదా గ్రహింపలేకపోయెను. తాకూరు జ్ఞానము తెలిసినది మొదలు జీవితాంతము వఱకు తన తల్లియెడ అపారభక్తి గౌరవములను ప్రదర్శించెడు వాడనుటకు ఈ వాక్యమే నిదర్శనము. తల్లి యనగా జన్మభూమిగదా!! సోనాముఖిని భౌతికముగా విడిచి వెళ్ళిపోవుచున్నానని అభిప్రాయము.

అది తే 25-5-1927వ తేదీ బుధవారము. ఆరోజు తెల్లవారుజాము గం॥ 3లకే ప్రభువు లేచిపోయెను. ఆ బ్రాహ్మముహూర్తమున తండ్రిగారు కట్టించిన శివాలయమునకేగి దర్శనముచేసికొనెను. తిరిగివచ్చి ఏకాంతమందిరమున నిశ్శబ్దముగా మంచముపై రెండుచేతులు తలమీద నుంచుకొని విశ్రాంతి తీసికొనసాగెను. ప్రభువునకు నీరసముగా నున్నదని బంధుమిత్రులు వచ్చిరి. వారితో "నా శరీరము మనస్సు బాగుగా అలసిపోయినవి. మీయెదుట అందఱికన్న ఎక్కువ

కాలముంటిని. ఈ శరీరమును విడువదలచితిని" అనెను. దగ్గ
అనే యున్న మేనమామ కుమారులతో "వెంటనే గడ్డము
మీసములకు క్షురకర్మ చేయించుకొనుడు. ఈ పనియిపుడు
చేయని పక్షమున ఏలల పదిరోజుల తర్వాతగాని సాధ్యముకా
ద"నెను. తనపినతండ్రి కుమారునితో ప్రభువు "మీరే విష
యమున చింతింపవలదు. ఇంటిలో గుగ్గిలము తప్ప అన్నియు.
నున్నవి. మంచిగంధపుచెక్కలు ఇంటిలోనే యున్నవి తోటలో
అనంతమండమునకు ఈశాన్యదిశను నా దహనక్రియను
నిర్వర్తింతురుగాక" అని హెచ్చరించెను. తరువాత ముఖ్యు
లైన ఆంతరంగిక భక్తులు అయిదుగురు-ఆరుగురికి లేఖలు
వ్రాసెను.

ఉ గం॥ 11 లకు టీయు ఫలహారము తీసికొనెను.
మధ్యా గం॥ 12 ల నుండి గం॥2ల వఱకు తైలాభ్యంగనముజరి
గెను. సాయంకాలమగుచుండగా కృష్ణదాదాను పిలిచి "నాయనా!!
ఈ మంచమును ఇక్కడ నుండి తీసివేసి పరుపును నేలపై
వేయుము" అనెను. ఆమాటలను విని కృష్ణదాదా నేలపై ప్రక్కను
వేసి పరుపును మేడపైకి తీసికొని వెళ్ళెను. ప్రభువు ప్రక్కమీదను
నిద్రవోయెను. మాతృశ్రీ-కృష్ణదాదా-అనుకూలు - కోదండ్రు -
గురుదేవుడు - విషాదచ్ఛాయలు మొగములయందావరింప దగ్గ
ఱకు వచ్చి చేరిరి. సా॥ గం॥ 6 లకు ప్రభువు బొత్తిగా నీరస
ముగా నున్నాడని డాక్టరుచే ఇంజక్షను ఇప్పించిరి. బాబా ఆ
చికిత్సకు అంతగా ఇష్టపడలేదు - కాలమును - పంచభూతము

లను సృష్టించిన ప్రభువు - కొన్ని క్షణములలో కాలమునకు పంచభూతములకు వశమగుటకు సిద్ధముగా నున్నట్లు తోచెను. కృష్ణదాసును 'పాలు' తెమ్మనెను. ఆతడు పాలుతేగా ఒక్కచుక్క మాత్రము గుటకవేయలేక గుటకవేసెను. మాసీమా యిచ్చిన తాంబూలమును వేసికొనెను. ప్రక్కను చక్కగా వేయుమని కృష్ణదాదాతో చెప్పి ఆ ప్రక్కపై పరుండెను, ఎడమవైపునుండి కుడివైపునకు తిరిగెను. బాబా పదపద్మములను పట్టుచు కృష్ణదాసు కూర్చుండెను. ఏమిముందు జరుగునో తెలియక అందరు ఆశ్చర్యముతో ఆందోళనతో భయముతో నిరీక్షించు చుండిరి.

రాత్రి 9 గం॥ లైనది. నెమ్మదిగా ఇంగ్లీషు పద్యమును తాకూరు చదివినట్లయినది. ఆ భయంకర క్రూరక్షణాలు - విశ్వప్రేమమూర్తిని - దీనదయాళువును - భక్తరక్షకుని - అమృతమూర్తిని పొట్టను బెట్టుకొన్నవి. సర్వప్రాణేశ్వరుడీ లోకమును భౌతికముగా విడచుచున్నందులకు కాబోలు - ప్రకృతి - ఝంఝామారుత సంచలనమున నేలను కూలిన వృక్ష లతికలతో - ఆకస్మికముగా కురిసిన వానజల్లులకన్నీటి ధారలతో తనయనంత విచారమును వ్యక్తము చేసినది. అనంత కుండము బావురుమన్నది. సువర్ణముఖీధామము వెలవెలబోయెను. ఆకాశము కారుమబ్బులతో నిండెను. విశ్వమునకు ఎప్పటి కప్పుడు దివ్యదీప్తిని - శక్తిని, రక్తిని ముక్తిని ప్రసాదింపగల మాతృశ్రీకుసుమ కుమారీదేవి ప్రగాఢ మౌనముద్రాంకితయైవల్లభ దుస్సహవియోగఖిన్నయై - దీర్ఘాలోచనా పరవశయై - శోకదేవతగా తోచెను. "ప్రభువు చర్మచక్షువులకు దూరమైనాడు. నన్ను చూచి ఆయన గుణగానము చేయు డ"న్నట్లు - సమాధి మంది

రము నేటికిని మనకు బోధగావించుచున్నది. సోనాముఖిని దర్శించుటకు వెళ్ళిన భక్తులను ఆవాతావరణము సంతోష విషాదచ్ఛాయలతో పలుకరించుచుండును.

నిర్యాణదినమున ధర్మారావుగారికి ప్రభువు లేఖను వ్రాయుచు

"ప్రియమైనతండ్రీ - ప్రస్తుతము నాదేహస్థితి - నిన్ను మఱల చూడలేదనియే తెలుపుచున్నది. ఈఖేల ఎపుడు పూర్తియగునది ప్రభునకే తెలియును. ఏదెట్లయినను ఆందోళన పడకుము" అని తెలియజేసెను.

రామదాసుగారికి ఠాకూరు మామిడిపండ్లను పంపుమని జాబువ్రాసెను. ఆపండ్లు శ్రీహరనాథుని శ్రాద్ధదినమున కందినవి. ఈ సంఘటనలు ఎంత అద్భుతమైనవి!

చదువరులారా !

ఇంతవఱకు ఆమహానుభావుని భాగవత స్కంధముల లోని వివిధ విశేషములను ఆస్వాదించినారు., ఆనందించినారు. అయ్యో! ఆప్రభువు ఈజగత్తున లేడేయని విచారింపబని లేదు. వియోగసమయముననే నిజమైనప్రేమ అతిశయించును. కంటికి శరీరము దూరమైనపుడు — ఆవ్యక్తియందొకానొక గౌరవాదరములు పెరుగును. తనప్రేమఖేలలను నిరాఘాటముగా నిరుపమానముగా ఆడుటకే ప్రభువు భౌతికజగత్తును వీడెనని గ్రహింతురుగాక !

ఈనాడును ప్రభువు - స్వప్నములో - జాగ్రదవస్థలో ఎందఱెందఱికో దర్శనమిచ్చుచునే యున్నాడు.. మాట్లాడుచునే

యున్నాడు. భక్తులుచేయు ఆధ్యాత్మిక కార్యక్రమములను తిల కించుచునే యున్నాడు. ఆశీర్వదించుచునే యున్నాడు. భక్తుల గృహములలో పాలు - మీగడ - వెన్నలను మధురపదార్థము లను, హృదయములను అపహరించుచునేయున్నాడు.

అద్భుతసంఘటనలు

(1) 1928 జూలై 3వ తేదీని పూరీలో మాతృశ్రీ-యశోదమా శరచ్చంద్రదే భార్య, మఱినలుగురు స్త్రీలు కూర్చుండి యుండగా బాబా - కాలికిజోళ్ళు తొడుగుకొని గొడుగు వేసికొని పూజాసమయమున ఆశ్రమద్వారము నుండి వచ్చినట్లు - అందఱు దర్శించిరి.

(2) హౌరాలో పి. సి. గంగూలీగారు ఇంటలేనపుడు - ప్రభువు తిన్నగా వారియింటిలోని కుర్చీపై ఆసీనుడై ఆయన భార్యను 'టీ' ఇమ్మనగా ఆయమ ఎంతో ఆందోళనపడి-టీతయారుచేసి ఈయగా - టీని త్రాగి అదృశ్యుడై పోయెను.

ప్రారబ్ధమ్ముల చే సం
సారక్లేశములఁజిక్కి శ్రమపడు మమ్మే
తీరున సముద్ధరింతువొ!
తారుణ్యవిరామ ! కుసుమ తారకనామా !

## గద్యము

ఇది శ్రీమత్కుసుమహరవరప్రసాదిత మధురకవితావిభూషిత, భాషా విజ్ఞాత, వినయవిఖ్యాత, విశ్వబ్రాహ్మణాన్వయ సంజాత, ఆదిత్య బ్రహ్మర్షి గోత్రపరిపూత, ప్రణవసూత్రవినీత, శ్రీనారాయణాంబా సత్యనారాయణా చార్య ప్రథమసుత చిన్మయబ్రహ్మకవి ప్రణీతంబైన శ్రీహరనాథ భాగవత మందలి ఏకాదశస్కంధము.

జయ శ్రీ కుసుమహర

# శ్రీ హరనాథ భాగవతము

## ద్వాదశ స్కంధము

శ్రీ విద్యాభవనా ! శో
భావహజీవన ! కృపారసామృత సదనా !
పావన చరణా ! చిన్మయ
భావన ! మహిమాధురీణ ! పతితోద్ధరణా !

పండినపండు రాలకతప్పదు. పూచినపూవు మట్టినిగలియక తప్పదు. పుట్టినజీవులు గిట్టకమానరు. కాని బ్రతికినంతకాలము తనలాభమునకై — కుటుంబక్షేమమునకై ప్రాకులాడుటలో గొప్పతనములేదు. తనకున్నను లేకపోయినను అన్నవస్త్రములు లేక అల్లాడువారిని - దుర్మార్గులై సంఘములో గౌరవము నోచుకొనని వారిని - కర్మఫలముచే దుర్వ్యసనములకు చిక్కినవారిని మనోవాక్కాయ కర్మలచే ఉద్ధరించుటకు ప్రయత్నించ వలెను. అట్టి మానవజీవితమే చరితార్థమైనది. కొంతమంది - తనవంశమును గూర్చి కుటుంబమునుగూర్చి, ప్రజ్ఞావిశేషములనుగూర్చి పొగడుకొనుచుందురు. ఏమియుపెట్టక ఆదరించకున్నను ధనధాన్యములు గలవారిని స్తుతించుచుందురు. మనమందరము ఈనాడుండి నశించిపోవలసినవారమే !! ఆ రహస్యము తెలిసికూడ ఈ స్తోత్రపాఠము

లెందులకో !! సర్వమునకు మూలమైన ప్రేమానురాగాలకు కూడలియైన - గౌరవాదరములకు ఆస్థానమైన - మధురమైత్రీ బంధమునకు పేరుమోసిన ప్రభువునే ఆశ్రయించవలెను, పొగడవలెను. సేవించవలెను. సాలెపురుగు గూడుకట్టుకొని అందులోనే నశించిపోవునట్లు - ఆకర్షణీయమైన సంసారములోపడి - మన శక్తిసంపదలను గుర్తింపలేక భ్రష్టులమగుచున్నాము. అన్నిసాధనలలో నామసాధనయే గొప్పదనియు — ఆ సాధనచేయక విలాసముగా జీవించువారు తమచేతులతో తాము విషము త్రాగినవారగుచున్నారనియు - ఈసాధకులకు బ్రహ్మవిష్ణుమహేశ్వరులకు లభించని బ్రహ్మానందము లభించునని ప్రభువు బోధించియున్నాడు. ఉత్తమ మానవజీవితమునకు పరమాదర్శముగా నుండునట్టి నడవడిని ప్రకటించియున్నాడు. ఆయన తత్త్వమెఱిగిన వారందరును ఉదయమున లేచినవెంటనే "త్రోవచూపరా హరా ! తొలగిపోకురా" అని దీనముగా ప్రేమపూర్వకముగా తమ బాధ్యతలను ఆప్రేమాధినాథునకు సమర్పించుకొనుచున్నారు. ఆయన సారథ్యము వహించి భక్తులను సుఖతమ మార్గాలలో నడిపించుచున్నాడు. ఆధ్యాత్మిక ప్రవృత్తి వారిలో పాదుకొల్పుచున్నాడు.

ప్రేమస్వరూపిణి - మృదుమధురభాషిణి - భక్తజన చింతామణి యగు కుసుమదేవి విచారగ్రస్తురాలైయుండగా "పిల్లలను కాపాడవలసిన బాధ్యత తండ్రికన్న తల్లికే ఎక్కు

వగా నుండును. ఈయవతారమున నేనెక్కువ కాలము నీతో కలసి సంతానమును కనిపెట్టుకొనుచు వచ్చితిని. ఇటుపైన నీవే వీరిని రక్షింపవలసి యున్నది. ఈమాటలు ఇంతకు పూర్వము నీకుచెప్పియుంటిని" అనుమాటలు మాత్రమే విని పించినవి. సంభ్రమాశ్చర్యములతో మాతృశ్రీ నాల్గువైపుల చూచెను. ఎవ్వరును కనిపించలేదు. ఆమెకు పట్టరాని దుఃఖో ద్వేగము కల్గెను. కన్నీరు కాల్వలై ప్రవహించెను. కొంతసేప టికి తేరుకొని "ప్రభుని శాసనమును – జీవితశేషమున నెఱ వేర్చవలసినదే" అని నిశ్చయించు కొనెను,

ప్రభువు తన నిర్యాణమును గూర్చి ఠాకూరురాణికి ముందేచెప్పెను. వారిరువురికి తమకారణజన్మ విశేషములు తెలియును. కారణజన్ములు – సామాన్యులవలె విచారింపరు. తాము వచ్చిన పనిని పూర్తిచేయుటయే వారికి పరమలక్ష్యమై యుండును. ప్రభునిసూచనప్రకారము ఆమె భక్తరక్షణకు సిద్ధ పడెను. ఇదంతయు తమనాటకములోని ఘట్టమే యని వారికి తెలియును. మిగిలిన బంధువులు మిత్రులు – గ్రామస్థులేదో అనుకొన్న అనుకొనవచ్చును గాని తన్ను నమ్మిన భక్తులా విధముగా ఏనాడును భావింపరు. ఇదంతయు మాయావిలాస మని చదువరులు గుర్తింతురుగాక!

మాతృశ్రీ – ఆదర్శగృహిణిగా గడపినతీరు చూచి నపుడు అదంతయు లోకోద్ధరణమునకే యనిపించును. ప్రభువు

కాశ్మీరు వెళ్ళుచు "మాఅమ్మకేలోపములేకుండ సేవింపుమ"ని శాసించినపుడు 'అట్లే' యని ముగ్గురుపిల్లల తల్లియగు వలకు సోనాముఖిలోనే యుండి యత్తగారిని సేవించి ఆమె మన్నన లను అందికొన్నదీ సాధ్వీశిరోమణి. ఏకాంత జీవనము - సాధు సమాదరణ - సర్వమానవ సమానత్వము మున్నగు వానిని భర్తతోపాటే ఈమె నిర్వహించి మెప్పొందినది. 'హర నాథ భాగవతగ్రంథము'ను నడిపించునది ఆమెయేయైనను నిమ్మకు నీరెత్తినట్లు తన అఖండశక్తిని బహిర్గతముచేయలేదు. ఇట్టి సుగుణవతీ సాహచర్యము వలననే ప్రభువు ఆదర్శదాం పత్యమును గూర్చి – ఉత్తమగృహిణీ లక్షణములను గూర్చి చక్కగా చెప్పగల్గినాడు. ఈయన వెల్లడించిన 'భార్యాతత్త్వము' ప్రపంచమునకొక మేలుకొలుపనుట సత్యము. కాశ్మీరు నుండి రాకూరు అమ్మకు వ్రాసినలేఖలోని విశిష్టతను గమనింపుడు.

ప్రియతమా!

నీవు గౌరవార్హురాలవు. అయినను నేనెన్నడును నిన్ను గౌరవింపలేకపోయితిని. నీవు ఎల్లపుడు నన్ను గూర్చియే ఆలోచించుచుందువు. నిరంతర చింతనము వలన - ఒకానొక దినమున నేను - నీవు ఒకటైపోయెదమేమో!! నీవు మహాశక్తి వంటి దానవు. హృదయ పూర్వకముగా నన్ను దీవింపుము. నావలె పై భావమును భావించువారు శివుని వంటివారు.

నిన్ను తెలిసికొనుట నావలన కానిపని. నీవు వాత్సల్య రూపిణివి. నీహృదయ తత్త్వమును ఎవ్వరికైనను తెలియ

నిచ్చితివా? నిజస్వరూపమును దాచుకొని - మాయారూపముతో ఈలోకమును సమ్మోహితమగునట్లు చేయుచున్నావు, అంతయు నీకు కరతలామలకమే !! నేను నీచేతిలోని కీలుబొమ్మను, నీచర్యయే నాచర్య !!

నీవెవరవో నాకెఱిగింతువా! అనుక్షణము నన్నే స్మరించుచుండుటచేత ధన్యురాలవు. నీవు నాప్రాణాధారమవు. జగచ్చైతన్యశక్తివి. నీవే నీశక్తులను ఎఱుగుదువు. నీహృదయాంతరలీలను విరమించినచో ప్రళయమే సంభవించును. నీ యాగ్రహమునకు గుఱియగు వారికి శాంతియనునది సున్న. మనకీ దాంపత్య బంధమే లేకుండినచో తలవంచి పదివేల పర్యాయములు ప్రణమిల్లి యుందును."

మిత్రులారా !!

ఠాకూరు ఠాకూరురాణిలోని మహోన్నతిని ఎట్లు ప్రకటించినాడో చూడుడు !! పురుషుల డాబుదర్పములకు - మన శ్శాంతికి - సాధనసంపత్తికి - బంధమోక్షములకు భార్యలే కారణము. ప్రకృతి పురుషులే రాధాకృష్ణులు. తనప్రేమఖేలా విహారములో ఆమె కృష్ణుని మించిపోవును. ఆయమ్మ క్రీగంటి చూపుల సన్నలనుబట్టి మన వనమాలి సంచరించును, వినోదించును, వికసించును, విలపించును, వారిద్దఱికి బింబప్రతిబింబ న్యాయమున్నది. అందుచేతనే హరనాథప్రభువు మహాప్రకృతి అయిన మాతృశ్రీ విషయమై భక్తలోకమునకు వెల్లడి చేసినాడు.

బాహ్యవేషమునుబట్టి మోసపోవు లక్షణముగల మనకీ మాటలు వెన్నెల బాటలు !! రత్నాల మూటలు !!

"భక్తశిఖామణులు అమ్మనుగూర్చి చెప్పినమాటలు"

"హరనాథునిగూర్చి తెలిసికొన దలచినవారు ముందు శ్రీ కుసుమకుమారీదేవిని ప్రార్థింపవలసి యున్నది. ఆమె యందు చిన్నచూపుగలవారు ప్రభువును ఏనాడును తెలిసికొన లేరు. ఆమె ప్రభుతత్త్వమును దెలుపు మణిదర్పణము"

'నారాయణచంద్ర ఘోష'

"పెంచిపెద్దచేసి ప్రేమయనునది తెలిసికొనగలవయస్సు వచ్చినపుడు తల్లి బిడ్డలను తనయొద్ద నుంచుకొనక భర్తృగృహమునకు పంపును అట్లే కుసుమతల్లి సర్వవిధాల పోషించి - ఉత్తమప్రేమను గఱపి ప్రేమాధినాథుని చెంతకుపంపును.

'జ్యోతిస్‌చంద్ర విశ్వాస్'

"ప్రభువు ఎన్నెన్నోసారులు మాతృశ్రీకి మంగళహారతి నిచ్చుట మేము చూచితిమి. హారతిపట్టునపుడు ఆయనముఖ పద్మము - నిరుపమాన భక్తిప్రేమ భావములతో కలకలలాడు చుండెడిది. జగత్ప్రభునిచే హారతులను స్వీకరింపగల ఆమె పరాశక్తిగాక మతెవ్వరై యుందురు ?

'తమాలినీదేవి'

"హరనాథుని పొందవలెనన్న ప్రేమ కావలెను. ఆ ప్రేమాధిదేవత శ్రీ కుసుమదేవి. ఆమెను సేవించి దానినిమనము పొందవలసి యున్నది."

'ప్రఫుల్ల చంద్ర గంగులీ'

"నీవులేక హరుడు లేడు. మామధ్య అనంతలీలలను పదర్శించు ప్రభుని ప్రేమఖేలకు నీవేప్రాణమవు."

'ధర్మారావునాయుడు'

"జగదేక శక్తియగు కుసుమతల్లి జాడలను గుర్తించుట మనవంటి అల్పబుద్ధులకు సాధ్యముకాదు. శిరమువంచి ఆతల్లి పాదపద్మములను అశ్రుధారలతో అభిషేకించుటయే సర్వో త్తమము."

'మేడూరి శ్రీరామమూర్తి'

"ఆయమ్మ చరణముల నంటుటచేతనే నాజీవితము ఆనందమయ మైనది."

'ఏచూరి వెంకటరామయ్య'

"భువనమోహన సుందరమగు రాధారాజ్ఞీస్వరూప మును శ్రీకాకుళములోను —— గడ్డములేని ప్రభుని ముఖ మండలమును కాకినాడలో ఆమెయందు చూచితిని."

'పోలిశెట్టి రామదాస

"నేను ఆమెయందున్నాను. ఆమె నాయందుగలదు మాయిరువురికి భేదము లేనేలేదు.

"నన్ను హరనాథుడని పిలువకుము. కుసుమహరనాథు డని పిలువుము"

'శ్రీ హరనాథప్రభువు

"కుసుమదేవియే హృదనాథుడు"

యశోదమ్మా అనిన ప్రభునకు అపరితమైన ప్రేమ. ఎంతమందితో కలసిమాట్లాడు చున్నను ఆమె పిలుపువినగనే తటాలునవచ్చి ఆ మాటలాలించి వెళ్ళెడివాడు. ఒకసారి యీ భక్తురాలు సోనాముఖి వచ్చి అమ్మతో తన మానసికవేదన చెప్పుకొన దలచెను. మాతృశ్రీ వరండాలో చాలమంది భక్తు లతో మాట్లాడుచుండెను. దగ్గఱగా వెళ్ళి యీామె కుసుమదేవిని పిలిచెను. "నా పిలుపు వినగానే ప్రభువు వచ్చెడివాడు. అమ్మా! నీవేల వినవు? అని కన్నీరు పెట్టుకొనుచు ప్రక్కగదిలో నిలువబడెను. ఇంతలో ఒక చిత్రమైన లీల జరిగెను. అమ్మ గదిలోనికి వచ్చి ఆమె వెనుక రెండడుగుల దూరమున నిలిచి యుండెను. యశోద–తన పిలుపును గ్రహించి అమ్మవచ్చి నదిగదా! నా మనసులోనిమాట చెప్పెదనని అనుకొనుచుండెను. మాతృశ్రీ ఎదురుగా నిలిచి దగ్గఱగా నవ్వుచుండెను. ఆ భక్తు ురాలు ఆపాదమస్తకము పరికించిచూచెను. ఆశ్చర్యము!! ఆమె ముఖము–కన్నులు–తాకూరువిగా ఆమెకు కనిపించెను. జగజ్జనని నవ్వుట మానివేసెను. ఆ సమయమున యశోద తన రహస్యమును కన్నతల్లికి తెలియజేయగనే మనస్సులోని వ్యథ మాయమయ్యెను.

కాకినాడలో సత్యలింగం నాయకరుగారి సత్రములో ప్రభుని జన్మోత్సవము జరిగెను. ఆమఱునాడు భోజనానంత రము మాతృశ్రీ పాదపద్మములను చాచి - ఎడమచేయిని

భూమిపైనుంచి రాధారాజ్ఞివలె సవిలాసముగా తాంబూలమును సేవించుచు చుండెను. బెంగాలీలు చక్కగా గానముచేయుచుండగా ఒకభక్తుడు భక్తిపారవశ్యమున నృత్యము చేయుచుండెను. అప్పుడు ఆతల్లి ముఖారవిందము జగన్మోహనమై యుండెను. రామదాసుగారు జనని చరణసేవ గావించుచు - ఒకసారిఅమ్మ ముఖమండలమువంక చూచెను. ప్రభువవలె తాంబూలము నమలుట - చిఱునవ్వుతో కనుబొమ్మల నాడించుట ఆయనచూచెను. ఆశ్చర్యచకితుడాయెను. ప్రక్కనేయున్న ఆదూరి సత్యనారాయణ బాబుతో "చూచితివా !! గడ్డమొకటి లేదుగాని అంతయు ఠాకూరు ముఖపద్మమే" అనిచెప్పెను. ఆయనయు ఆదృశ్యమును చూచెను. ఇరువురును మాతృశ్రీ అద్భుతలీలా వైభవమునకు అంతరంగముతో ఆనందించిరి.

మహాప్రకృతియే తనయిచ్ఛానుసారము స్త్రీ పురుష మూర్తులను ధరించుచుండును. ఆమెయే హరనాథరూపమును దాల్చి విశ్వలీలావిలాసములను ఎన్నిటినోప్రదర్శించినది. ఆ దివ్యతత్త్వమే - ఠాకూరు తరువాత కుసుమకుమారిగా అసంఖ్యాకములగు లీలలను ప్రదర్శించుటయేకాక ప్రభువు చేయగామిగిలిన అవతారకార్యమును నిర్వర్తించినది.

అద్భుతలీలలు

1950లో మాతృశ్రీ పూరీధామమునకు వెళ్ళుచు ఖర్గపూరులో దిగెను. అక్కడ అమ్మను చూచుటకు భక్తులు తం

దోపతండములుగా వచ్చిరి. అందు 'జంగ్‌బహద్దూరు' అను సిఖ్ఖుమతస్థుడు (B.N.R. ప్యాసింజరుగైడ్) అమ్మకు కొంచెము దూరముగా నిలువబడియుండెను జగజ్జనని కృపాకటాక్షమును ఆతనిపై ప్రసరింపజేసెను. వెంటనే అతడు "అమ్మా! అమ్మా" అను కేకలువేయుచు - హృదయము ద్రవీభూతమగుటచే శరీరజ్ఞానము లేకుండెను. అతనిని భక్తులు ఒకగదిలో నుంచిరి. పిమ్మట ఆయన అమ్మతో పూరీవెళ్ళెను. తిరుగుదలలో ఠాకూరురాణిని తనయింటికి తీసికొనివచ్చి "తల్లీ!! మాయమ్మ ఏనాడో నాకుదూరమైనది. నన్నుకాపాడవచ్చిన తల్లివి నీవే"యని ఆతిథ్యమిచ్చి సాగనంపినాడు.

## యుగళమూర్తుల ఆకర్షణ ఒకేరీతియైనది

1936లో విశాఖపట్నములో మాతృశ్రీ వారు వచ్చినపుడు దేశదేశములనుండి అనేకులువచ్చి అమ్మను దర్శించుకొనుచుండిరి. విజయనగరము కాలేజీలో ఇంగ్లీషు ప్రొఫెసరుగా పనిచేయుచున్న మేడూరి శ్రీరామమూర్తిగారు అమ్మపాదపద్మములకు ప్రణమిల్లెను. వెంటనే అమ్మ "నాయనా! నీ చేతులెంత చల్లగానున్నవి" అనెను. ఆమాటవినిన తోడనే ఆయనకు భావావేశము వచ్చెను. కన్నులు మూతలుపడెను. తానెక్కడ నుండెనో తెలియదయ్యెను. కొంతసేపు సమాధ్యవస్థలో నుండి తేరుకొనెను. పిమ్మట ఆయనను దగ్గఱకు లాగుకొని కుమారునివలె లాలించెను.

నాడు మొదలు శ్రీరామమూర్తిగారు మంచిభక్తులై - ప్రభు తత్త్వమును పెక్కు ప్రదేశాలలో ఇంగ్లీషులో ఉపన్యసించెడి వారు. ఎన్నెన్నోవ్యాసములు గ్రంథములు వ్రాసి మాతృశ్రీ మహాత్మ్యమును అంతట వెదచల్లినధన్యజీవులు వీరు.

కరీంనగర్ జిల్లాలోని "మంతెన" గ్రామమున 'రామయ్య' యను పురోహితుడు 1955 లో ఏకైక పత్రిక-పూర్ణగర్భవతి యగు శ్రీదేవితో-కాశీవెళ్ళెను. అక్కడకొందరివలన మాతృశ్రీ మహిమలను గూర్చి తెలిసికొని తనకుమార్తెతోపాటు 1955 లో సోనాముఖికి ప్రయాణమయ్యెను. రైలుబండి మొగలు షరాయి దగ్గరకు వచ్చెను. ఏదోపనిమీద ఆమె ప్లాటుఫారము మీదికి దిగెను. తరువాత బండి ఎక్కలేక పోయెను. రామయ్య గారు కుమార్తెతోపాటు స్టేషనులోనుండి పోయెను. ఆమె ప్రసవ వేదన పడుచుండెను. సమీపమునగల సత్రముతో చేర్పించి - మంత్రసానికై వెదకిరి. కాని ఎవ్వరును దొరకలేదు. శ్రీదేవి - రాజేశ్వరీదేవిని నిరంతరము ఆరాధించెడిది. ఆమె మనస్సులో "అమ్మా! నిన్నే నమ్మికొన్నదానను. అపరాధము మన్నించి కాపాడుమ"ని ప్రార్థించెను. చేయునదిలేక రామయ్యగారు "కుసుమహర" నామమును జపించుచుండిరి. ప్రసవవేదన అధికమయ్యెను - అది నిశీథసమయము. తెల్లని వస్త్రమును ధరించిన ఒక ముదుసలి అక్కడికి వచ్చెను. ఆ మూర్తియందు దివ్యత్వము ఉట్టిపడుచుండెను. గదిలోనికి వెళ్ళి శ్రీదేవిపై కృపారసము వర్షించెను. కొన్ని క్షణములలో శిశురోదనము

ఒప్పించెను. ఆనూతనవ్యక్తి కలకల నవ్వుచు రామయ్యగారి దగ్గఱకువచ్చి "ఆడుపిల్ల కలిగినది నాపేరు పెట్టుము." అని చెప్పి అంతర్ధానమైనది. ఈలీలవలన రాజరాజేశ్వరీదేవియే మాతృశ్రీయని ఆపదలోనున్నవారిని కాపాడుటయే తన ధ్యేయమని గుర్తించ గలము.

తాతా నగరులో యన్. కె. రాయి ఉక్కు ఫ్యాక్టరీలో ఉన్నతోద్యోగముచేసి రిటైరయిన శివభక్తుడు. జపతపములనిన మిక్కిలి మక్కువ యెక్కువ. ప్రతిసంవత్సరము శివరాత్రి సందర్భమున 10 రోజులు కఠినమగు నుపవాసము చేయుచు శివపూజ గావించెడువాడు. రాత్రి జాగరణ చేయుచుండెడివాడు. ఉపవాసములు - జాగరణ చేయుటచే శరీర మలసెను. ఒక రాత్రి నిద్రలో ఒకదివ్య ప్రేమమూర్తి కనిపించి "నాయనా! ఇది కలియుగము. జపతపములు ఆచరించుటలో చాల శ్రమయున్నది. శరీరబలము సన్నగిల్లినది. అందఱిని తరింపజేయు గలది భగవన్నామమే!! జీవితకాలము స్వల్పము గావున త్వరపడుమ' నెను. ఎవరో తనకట్లు చెప్పుచున్నదని రాయి పట్టించుకొనలేదు. మఱుసటి శివరాత్రి సమయమున ఆయమ్మ యిట్లే చెప్పెను.

ఆసంవత్సరము తాతానగరములో అమ్మ జన్మోత్సవము చేయ భక్తులు నిశ్చయించిరి. ఆసంఘమునకు రాయి గారిని కార్యదర్శిగా నుండుడని కోరిరి. అందులకీయన అంగీకరించెను. జన్మోత్సవ దినము వచ్చినది. అమ్మ బాబాల ఫొటో

లను అలంకరించిరి. గృహద్వారములకు మామిడాకు తోరణ ములు — జెండాలుకట్టిరి. భక్తులు చాలమందివచ్చిరి. ఇంతలో మాతృశ్రీ పటమును కార్యదర్శిగారగు రాయిబాబు దర్శించెను. ఆమాతృమూర్తియే శివరాత్రి సందర్భమున రెండుసార్లుదర్శన మిచ్చి హితోపదేశము చేసినదని గుర్తించెను. అనారోగ్యకారణ ముచే ఠాకూరురాణి తాతానగరు రాలేదు. ఉత్సవము ముగిసిన తరువాత రాయిబాబు సోనాముఖివెళ్ళి అమ్మను దర్శించెను. ఆ ప్రేమమూర్తి రాయిబాబు కన్నకుమారునిగా ఆదరించెను. ప్రభుని విగ్రహమొకటి ఇచ్చి దీనిని నిత్యము ఆరాధించుచు - ఒడలుమఱచి నామస్మరణ చేయుచుండు మ"ని చెప్పిపంపెను. నాటినుండి ఆతనిలో మంచిమార్పువచ్చెను. తాతానగరులో తన యింటను ఆప్రతిమను నెలకొల్పి నిత్యము సంకీర్తనముచేయుచు భక్తులను ఆదరించుచు ఆదర్శభక్తుడయ్యెను. చూచితిరా ! మాతృశ్రీ కరుణారసము !!

ఈవిధముగా వ్రాయదలచినచో లీలలు లక్షోపలక్షలు న్నవి. మంచిసహనముతో నీగ్రంథమును పఠించెడు మీకు కుసుమ హారులయందు మంచిభక్తిప్రేమలు నెలకొన్నవనియే భావించుచున్నాము.

మాతృశ్రీకి భక్తులు పాదపూజచేయునపుడు - నిశ్చలయై గంభీరప్రేమభావ ముద్రాంకితయై - రాధామూర్తియోయన జగ న్మాతయోయన దర్శనమిచ్చెడిది. ఎదుటివారి మనస్సులో ఏభావ

మున్నదో వెంటనేచెప్పి వారిసందేహములను తీర్చెడిది. లక్షాధి కారిని - భిక్షాధికారిని ఒకేలాగున చూచెడిది. నిజముచెప్పవలె నన్న మన యుగళమూర్తులు భక్తులను - తమ పుత్రులకన్న మిన్నగా ప్రేమించెడివారు వృద్ధురాలైనను అమ్మ పూజాసమ యమున నవలావణ్యవతిగా ప్రేమమూర్తిగా జగన్మాతగా సాక్షా త్కరించెడిది. ఆర్తులను దీనులను భక్తులను ఒక్కచూపులో— ఒక్కమాటలో - ఒకస్పర్శలో — అతివిచిత్రముగా రక్షించిన అద్భుతసన్నివేశములు వర్ణనాతీతములు.

'కుసుమహర' నామము జపించినకొలది ఆమంత్రము రామమంత్రమగును. ఆమంత్రము ప్రణవమంత్రమే!! హృద యములను అవలీలగా కరిగించి - మనసులోని రాగద్వేషము లను పోద్రోలి—నూతన జీవితమును ప్రసాదించి - యిహపరము లను సమకూర్చి తరుగోవని బ్రహ్మానందమును ఈమహామం త్రము ప్రసాదించును. ప్రభువు తనమాయానాటకమును బహిర్గ తము కాకుండుటకై "కృష్ణుని స్మరింపుము"ని హెచ్చరించెను. సర్వదేవతలు - సర్వశక్తులు - యుగళమూర్తులయందే మూర్తీ భవించియుండగా - అన్యులను ఆశ్రయింపవలసిన పనిలేదు. ఒకసారి మీహృదయ మందిరములకు ఆదయామయులను ఆహ్వానింపుడు - నిరాడంబరముగా సేవింపుడు - స్మరింపుడు- తరింపుడు మనము ఏమి ప్రయత్నము చేయకుండగనే-అయా చితముగ లభించుచున్న ప్రేమానందమును చేతులార జారి విడచుట భావ్యముగాదు.

చదువరులారా !

లోగడ శారీమాతమాలినీదేవి - యశోదాదేవి - కామేశ్వరీదేవి - విమలామా మున్నగు భక్తనారీరత్నములను ప్రభువు మాతృమూర్తులుగా గారవించిన మధుర సన్నివేశములను కొంచెము చవిచూచి యున్నారు. ప్రభునిచే నాడును - నేడును - ఎన్నుకొనబడిన భక్తులను గూర్చి - తల్లులనుగూర్చి వర్ణింపవలెనన్న వ్రాయవలెనన్న ఆదిశేషునకైనను దుష్కరమే యగును. మఱియొక మహిళాపారిజాతమునుగూర్చి తెలియపఱచుట విధ్యుక్తధర్మమై యున్నది. ఆ తల్లియే పాలకొల్లు సుబ్బమాంబగారు. ఈమెను పాలకొల్లు తల్లియని భక్తులు పిలిచెడివారు. ఈమె యల్లావఝ్ఝల సత్యనారాయణబాబుగారి ధర్మపత్ని. వీరిది పాలకొల్లు. పాలకొల్లు సుబ్బమాంబగారని అందఱు పిలుచుచుండెడివారు. ఈ దంపతులు ప్రభుని నామము చేసికొనుచు జీవించెడివారు. తరువాత ప్రభువు బాలగోపాలునివలె ఆయింట అద్భుతలీలలను ప్రదర్శించెను. సమాధి స్థితిలో నుండగా ప్రభువుఆ తల్లిని సర్వతీర్థములకు తీసికొనివెళ్ళి మఱల తీసికొని వచ్చెడివాడు. సుబ్బమాంబగారు పూజామందిరమున నివేదనకై యుంచిన వెన్న - మీగడ పాలు - మిఠాయి మొదలైన పదార్థములను స్వయముగా వచ్చి ప్రభువు ఆరగించెడివాడు. ఆరగించినట్లు వ్రేళ్ళజాడలు కనిపించెడివి. "నాయనా ! గోపాలా" అని ఆ తల్లి ఆర్తితో పిలిచిన వెంటనే మన లీలామయుడు ఆచోట పలురకములైన అద్భుత లీలలను జూపుచుండుట పరిపాటియయ్యెను. దేశదేశముల

ఈ వార్త వ్యాపించెను. ఒక్కొక్కప్పుడు ఆమెచేతినుండి ఘుమ ఘుమలాడు ప్రసాదము - కుంకుమ - పువ్వులు వచ్చెడివి. అవియన్నియు భక్తులకు పంచిపెట్టెడిది. ప్రభువు బాల గోపాలునిగా వచ్చినపుడు ఆమె స్తన్యము నిచ్చిన దృశ్యము ఎందరెందరో చూచియున్నారు. ఆమెకు సంతానములేదు. భక్తవత్సలుడు - సర్వేశ్వరుడే కుమారుడై యుండగా వారికి చింతయేముండును? ఈ రీతిగా ప్రభుని కృపచే ప్రేమానందముతో జీవించి ఆమె ప్రభునిలో లీనమయ్యెను.

## మాతృశ్రీ సూక్తిముక్తావళి

"ఈ ప్రపంచమంతట ప్రేమయే వ్యాపించి యున్నది."

"తల్లి ప్రేమయే యీ విశ్వమును పోషించినది, పోషించుచున్నది, పోషింపగలదు."

"మీరే నా సర్వమగుటచేత నాజీవితముమీరై యున్నారు."

"మీరెల్లరు ఒక కుటుంబములోని సభ్యులవలె హృదయపూర్వకముగా కలసి మెలసి యుండుడు."

"గతమును గూర్చి విచారింపకుడు. ప్రస్తుతమున్న దానితో తృప్తిపడుడు."

"మీరు - మీ కుటుంబము ప్రభునికే సమర్పణ కావలెను. నిరంతరము నామము చేయుచుండుడు. మధురమైన ప్రేమభావముతో జీవింపుడు".

## ఆంధ్రలోకమును ఆకర్షించిన విశాఖపట్నము మాతృశ్రీ జన్మోత్సవము

ఆంధ్రదేశమున ప్రముఖ పారిశ్రామిక కేంద్రము-మహా నగరమైన విశాఖపట్నములో తే 14-12-1936 దీని అమ్మ జన్మోత్సవమును జరుపుటకు సన్నాహములు జరుగనారంభించెను. ఆసాయంకాలమునకు ఠాకూరురాణి-అంతరంగిక భక్తులు-పరివారముతో విచ్చేసిరి. నగరమధ్యమునగల 'టర్నరుసత్రము'న గొప్ప సభావేదికను-బహురమణీయముగా నిర్మించిరి. సా॥ గం. 6 ల నుండి గం. 9 ల వఱకు మాతృశ్రీని కారుపై రాజవీథుల యందు ఊరేగించిరి. పలురకాల మంగళవాద్యములు ఘోషించెను. తెలుగుదేశములోని వివిధ ప్రాంతములనుండి వచ్చిన భక్తులు కన్నుల కఱవుదీఱ జగదంబను దర్శించిరి. తమభక్తి ప్రపత్తులను నివేదించుకొనిరి. విశాఖపుర పౌరులు సర్వమంగళకు మంగళహారతులు పట్టిరి. తనకడుపునబుట్టి భువనేశ్వరుని చేపట్టి - సకలబ్రహ్మాండములను కాపాడుతల్లి తనయింట నడుగు పెట్టినందులకు సముద్రుడు - ఉత్తుంగతరంగ హస్తములను పైకెత్తి నాట్యముచేయసాగెను. ఎందఱెందఱో భక్తులు అమ్మకు పాదపూజలుగావించిరి. జీవితసర్వస్వము సమర్పించినట్లు ఎన్నెన్నో కానుకలను సమర్పించిరి. 15, 16 తేదీలలో వ్రతములు - పూజలు - ఉపన్యాసములు - సంకీర్తనలు నేత్రపర్వముగా శ్రవణానందముగా జరిగెను. పూజా మహోత్సవసమయములలో అమ్మ రాజరాజేశ్వరివలె — అన్నపూర్ణవలె — శ్యామలవలె రాధామహారాజ్ఞివలె—వేయి నేటికి జగదీశ్వరివలె దర్శన మిచ్చెను. భక్తుల మనోరథములను కల్పవల్లియై కటాక్షించెను. నేలయీనినయట్లు వచ్చిన ప్రజానీకము జగముల

నేలు కన్నతల్లిని తిలకించి, పులకించిరి. ఆయావంద సమ్మేళ నము వివిధదేశ - నగర - వర్గ భక్తుల ప్రేమానురాగము లను సమన్వయముచేయు ఆనంద నందనోద్యానముగా పరిఢవిల్లెను. P. W. D. డ్రాఫ్ట్సుమన్‌గా పనిచేయుచున్న ఈమని గంగా ధరముగారు తెలిసితెలియని అమాయక నృత్యముచేయు చుండగా మాతృశ్రీ దగ్గఱకుపిల్చి "బాగున్నది నీ నృత్యము. నీజీవితము ధన్యము మాన్యము కాగలద"ని తల నిమిరి ఆశీర్వ దించెను. ఈయన వయసు మళ్ళినను నేటికిని ప్రభునామము జరుగుచోట కాళ్ళకు గజ్జెలు గట్టుకొని భావ లయానుగుణముగా - అభినయముచేయుచు గంటలకొలదిచేయు నృత్యము మాతృశ్రీ వరప్రసాదమని చదువరులు గ్రహించెదరుగాక!! ఈభక్తమణి ఎవ్వరేమనుకొనుచున్నను లెక్కచేయక - "తాను - ప్రభువు" అను దృష్టితో "హరనాథభక్తహనుమాన్" అను బిరుదనామ ముతో వర్ధిల్లుచున్నారు.

ఈమహోత్సవముననే మంచి ఆధ్యాత్మికవేత్తయగు శ్రీమంథా గణేశ్వరరావుగారు అమ్మచరణసరోజాలకు ప్రణ మిల్లగా అమ్మగా సాదరముగా వారి తలదువ్వి పుత్రునివలె ఆశీర్వదించెను. జగజ్జనని పవిత్రహస్తస్పర్శ లభించినందులకు తార్కాణగా మిగిలిన జీవితమంతయు గడ్డముమీసములతో 'గణేశఋషి' యను పేరుతో జీవిత భాగధేయమును జీవితేశ్వరు లకు సమర్పించెను. అంతియేకాదు. ఈయన ప్రస్తుతము దువ్వాడ కుసుమహరనాథాశ్రమమున్న తోటను ప్రభుసేవకై 1941లో ధారాదత్తముచేసి మహాత్యాగి యనిపించుకొనెను. గణఋషి జీవితమును ఈయాశ్రమ కుటీరమునగడపుచు - భోజనసమయమునకు వచ్చిన భక్తులకు స్వహస్తములతో వంట

చేసి కడుపార భోజనము పెట్టిన మధుర క్షణములు మఱవరానివి. పిమ్మట ఆంధ్రవిశ్వ విద్యాలయము ఇంగ్లీషు ప్రొఫెసరు శ్రీ M. V. N. సుబ్బారావు గారు ఈయాశ్రమ నిర్వహణమును రూపొందించిరి.

పాఠక సోదరులారా !

కలియుగ సులభ ప్రసన్నమూర్తుల మధుర లీలాభాగవత సౌధమును పరికించుటయేకాదు. అందలి మహిమోన్నత వైభవ విలాసములను తిలకించినారు. ఆదయామయుల క్రీగంటిచూపులచే మీ జీవితములు - అనురాగప్రేమలతో సుఖవంతములగును. ద్వాదశ గోపురాగ్రభాగమున విశ్వప్రేమ విధాయిని- భక్తజనపావని - హృదయ సంజీవనియైన మాతృశ్రీ కుసుమదేవి శ్రీ చక్రపూజా విరాజితయై - ముక్తికాంతయై - గోలోకధామ రాధామహాదేవియై - హృదయ సింహాసనస్థ దివ్యభావనా మూర్తియై అల్లదే! ప్రకాశించుచున్నది. మనలో ఒకానొక చైతన్యమును వెదచల్లుచున్నది. అమ్మయనుగ్రహమును నోచుకొన్నవారు. అన్నియునోచుకొన్నవారే !! ఉన్నదానితో తృప్తిపడుచు - తను ధనములను యుగళమూర్తులకు సమర్పించుచు నామానందమున నోలలాడుచు - సంసారరహస్య మెఱుగుచు భక్తిజ్ఞాన వైరాగ్య తత్త్వమోక్షములకు మూలకందమైన హరనాథ భాగవత పుణ్య కథాశ్రవణ సంతృప్తులై ధన్యులయ్యెదరని యాశింతుము.

ప్రభుని అర్ధాంగలక్ష్మిగా - ప్రేమ బృందావన రాజ్యలక్ష్మిగా భక్తులహృదయ సామ్రాజ్యములనేలి - హరనాథుని అఖండావతార భారమును నిర్వర్తించిన మాతృశ్రీ తాతానగ

డులో తే 14-8-1956దీ మధ్యాహ్నము గం॥ 2-30 ని॥లకు భక్తులందఱు సంకీర్తన చేయుచుండగా - చిరకాల పతివియోగ ఖేదమును తొలగించుకొనుటకై గోలోకధామమును చేరుకొన్నది. తన సర్వస్వము - ప్రేమజ్యోతి అయిన ప్రాణేశ్వరి చెంగటకు రాగానే శ్రీహరనాథుడు సముదంచిత ప్రణయభావగాంభీర్యముతో ఆలింగనము చేసికొనెను. కొన్ని మధుర క్షణములు విశ్వర్ధములై ప్రకృతిపురుషుల సమాగమమును జ్ఞప్తికి దెచ్చెను. గోలోకవాసులు అమృతమయ నామగాన నృత్యములచే యుగళమూర్తుల అవతార క్రమము మఱపించిరి. "భక్తలోకమునకు జయమగుగాక!" అను మధురవాణి అంతర్వాణియై వినిపించెను.



నీ భాగవత కథామృత
మే భక్తులు గ్రోలనేర్తురిహపర లక్ష్మీ
వైభవములంది నీకృప
నీభవ భీతిదొలఁగి తరియింతురు గాతన్.

గద్యము 

ఇది శ్రీమత్కుసుమహరవరప్రసాదిత మధురకవితావిభూషిత, భాషావిజ్ఞాత, వినయవిఖ్యాత, విశ్వబ్రాహ్మణాన్వయసంజాత, ఆదిత్యబ్రహ్మర్షి గోత్రపరిపూత, ప్రణవమాత్రవినీత, శ్రీనారాయణాంబా సత్యనారాయణాచార్యప్రథమసుత, చిన్మయబ్రహ్మకవి ప్రణీతంబైన శ్రీహరనాథ భాగవతమందలి ద్వాదశస్కంధము.

— సంపూర్ణము —

20-6-50.